## సదాశివ సమారంభాం


గురు దక్షిణామూర్తి


గురు వేదవ్యాస మహర్షి


గురు శుక మహర్షి


గురు నారద మహర్షి


గురు వాల్మీకి మహర్షి


గురు శ్రీకృష్ణ

## శంకరాచార్య మధ్యమాం


గురు దత్తాత్రేయ


గురు బాబాజి


గురు గౌతమ బుద్ధ


గురు ఆదిశంకరాచార్య


గురు రామానుజాచార్యులు


గురు జ్ఞానేశ్వర్


గురు రవిదాస్


గురు కబీర్ దాస్


గురు చైతన్య మహా ప్రభువు


గురు నానక్


గురు రాఘవేంద్ర స్వామి


గురు వీరబ్రహ్మేంద్ర స్వామి


యోగి వేమన

## అస్మదాచార్య పర్యంతాం


గురు త్రైలింగ స్వామి


గురు లాహిరి మహాశయ


గురు రామకృష్ణ పరమహంస


అమ్మ శారదా దేవి


గురు వివేకానంద


గురు సాయిబాబా


గురు అరబిందో


గురు రమణ మహర్షి


గురు యోగానంద


గురు భక్తివేదాంత ప్రభుపాద


గురు మళయాళ స్వామి


గురు విద్యాప్రకాశానందగిరి


గురు చంద్రశేఖర పరమాచార్య

## వందే గురుపరంపరాం..







“ఉచిత గురుకుల విద్య ఫౌండేషన్” ద్వారా విలువలు, నైపుణ్యాలతో కూడిన విద్య ఉచితంగా + సులభంగా + ఆకర్షణీయంగా + నాణ్యతతో కూడి అందించే సేవా కార్యక్రమంలో బాగంగా ఈ పుస్తకాన్ని భారత ప్రభుత్వపు వెబ్ సైట్( డిజిటల్ లైబ్రరీ అఫ్ ఇండియా) నుంచి సేకరించి అందిస్తున్నాము. ఇందుకు మేము వారికి కృతజ్ఞత తెలియచేసుకుంటున్నాము.

సాయి రామ్ వారి సేవల విస్తరణలో బాగంగా ఈ ఫౌండేషన్ స్థాపించబడినది. ఈ స్వచ్ఛంద సంస్థ ద్వారానే అన్ని సేవలు అందించబడును. ఇటువంటి పుస్తకాలు మీరు వ్రాసినట్లయితే (లేక) సేకరిస్తే మాకు తెలియచేయండి. మేము ప్రతి విద్యార్థికి ఉచితంగా అందేలా చేస్తాము, తద్వారా ఉన్నత విలువలు, నైపుణ్యాలు కలిగిన విద్యార్థులను మన దేశానికి అందించవచ్చు. మాతో కలిసి నవ భారత నిర్మాణ కార్యక్రమంలో పనిచేయుటకు, భాగస్వామ్యం అగుటకు ఆసక్తి ఉంటే సంప్రదించగలరు.

ఈ గ్రంధాలను ఉచితంగా ఆన్ లైన్ లో చదువుటకు, దిగుమతి(డౌన్లోడ్) చేసుకొనుటకు గల మార్గాలు:

1) భారత ప్రభుత్వపు వెబ్ సైట్: http://www.new.dli.ernet.in
2) ఉచిత గురుకుల విద్య ఫౌండేషన్ వెబ్ సైట్ : www.freegurukul.org
3) సాయి రామ్ వెబ్ సైట్ : https://sites.google.com/site/sairealattitudemanagement
4) మొబైల్ ఆప్: Free Gurukul

గమనిక: భక్తి,జ్ఞాన,ధర్మ ప్రచారార్ధం ఉచితంగా eBook రూపంలో భారత ప్రభుత్వపు డిజిటల్ లైబ్రరీ సహాయంతో ఇవ్వడం జరిగింది. ఇది లాభార్జన దృష్టిలేని ఉచిత సేవ. ఈ సేవలో అంతర్జాలంలోని(ఇంటర్నెట్) లైసెన్సు / కాపీరైటు అభ్యంతరాలు లేనివి అనుకొన్న పుస్తకాలను గ్రహించటం జరిగినది. అనుకోకుండా ఏవైనా అభ్యంతరకరమైనవి ఉన్నచో మాకు తెలుప మనవి, వాటిని తొలగించగలము అని మనవి చేసుకొంటున్నాము.

Website: www.freegurukul.org Mobile App: Free Gurukul email: support@freegurukul.org
Facebook: www.facebook.com/freegurukul Help Line / WhatsApp: 904 202 0123

“ మన లక్ష్యం: విలువలు, నైపుణ్యాలతో కూడిన విద్య అనేది ఉచితంగా + సులభంగా + ఆకర్షణీయంగా + నాణ్యతతో కూడి అందరికి అందించబడాలి “

ఉచిత గురుకుల విద్య ఫౌండేషన్ – Free Gurukul Education Foundation

సర్వం పరమాత్మ పాద సమర్పణమస్తు

భారత ప్రభుత్వపు వెబ్ సైట్ - డిజిటల్ లైబ్రరీ అఫ్ ఇండియా

http://www.new.dli.ernet.in

Digital Library of India: Inc ×

www.new.dli.ernet.in

# Digital Library of India

Hosted by: Indian Institute of Science, Bangalore in co-operation with
CMU, IIIT-H, NSF, ERNET and MCIT for the Govt. of India and 21 major participating centres.

Home | Vision | Mission | Goals | Benefits | Content Selection | Current Status | People | Funding | Copyright Policy | FAQ | RFP

Books Journals Newspapers Palm-Leaves (Manuscripts)

Title: Ramayanam
Author:
Year: to
Subject: Any Subject
Language: Telugu
Scanning Centre: Any Centre

Clear | Search

Presentations and Report
Statistics Report
Status Report
Feedback | Suggestions | Problems | Missing links or Books

Click here for PDF collection
DLI MIRROR at IUCAA Data Center PUNE

DLI

For the first time in history, the Digital Library of India is digitizing all the significant works of Mankind.

Click Here to know More about DLI New!

| Books | Journals | Newspapers | Manuscripts |
|---|---|---|---|
| Rashtrapati Bhavan<br>CMU-Books<br>Sanskrit<br>TTD,Tirupathi<br>Kerala Sahitya Akademi | INSA | Times of India<br>Indian Express<br>The Hindu<br>Deccan Herald<br>Eenadu<br>Vaartha | Tamil Heritage Foundation<br>AnnaUniversity NEW! |

Title Beginning with.

A B C D E F G H I J K L M N O P Q R S T U V W X Y Z

Author's Last Name

A B C D E F G H I J K L M N O P Q R S T U V W X Y Z

Year

1850-1900 | 1901-1910 | 1911-1920 | 1921-1930 | 1931-1940 | 1941-1950 | 1951-

Subject

Astrophysics | Biology | Chemistry | Education | Law | Mathematics | Mythology | Religion | For more subjects...

Language

Sanskrit | English | Bengali | Hindi | Kannada | Marathi | Tamil | Telugu | Urdu

# అతి విశిష్టం ఈ దానం!

స్వామి వివేకానంద

"దానాలలోకెల్లా ఆధ్యాత్మిక విద్యాదానం చాలా శ్రేష్ఠమైంది! దాని తరువాతిది లౌకిక జ్ఞానదానం, ప్రాణదానం, అన్నదానం" అని వ్యాసమహర్షి చెప్పారు.

మన ఆధ్యాత్మిక జ్ఞానం భారతదేశ హద్దులలో నిలిచి పోకూడదు. లోకమంతటినీ ఆవరించాలి! ఇలా లోకవ్యాప్తమైన ధర్మప్రచారాన్ని మన పూర్వులు చేశారు. హైందవ వేదాంతం ఎన్నడూ ఈ దేశం దాటి పోలేదని చెప్పేవారూ, మతప్రచారార్థం తొలిసారిగా, పరదేశాలకు వెళ్ళిన సన్న్యాసిని నేనే అని చెప్పేవారూ, తమ జాతిచరిత్ర నెరుగని వారే! ఇలాంటి సంఘటనలు ఎన్నోసార్లు జరిగాయి. అవసరమైనప్పుడల్లా, భారతీయ ఆధ్యాత్మిక జ్ఞానప్రవాహం వెల్లువలా లోకాన్ని ముంచెత్తుతూ వచ్చింది.



రాజకీయ ప్రచారాన్ని రణగొణధ్వనులతో, యోధులతో సాగించవచ్చు. అగ్నిని కురిపించి, కత్తిని ఝళిపించి, లౌకిక జ్ఞానాన్నీ, సంఘనిర్మాణ విజ్ఞానాన్నీ విరివిగా ప్రచారం చేయవచ్చు. కానీ ఆధ్యాత్మిక జ్ఞానదానం కళ్ళకు కనిపించకుండా, చెవులకు వినిపించకుండా కురుస్తూ, రోజా పువ్వుల రాసుల్ని వికసింపజేసే మంచులాగా నిశ్శబ్దంగా జరగవలసి ఉంది. భారతదేశం నిరాడంబరంగా, లోకానికి మళ్ళీ మళ్ళీ చేస్తూ వచ్చిన దానమిదే!

మిత్రులారా! నేను అవలంబించే విధానాన్ని తెలియజేస్తాను వినండి. భారతదేశంలోనూ, ఇతర దేశాల్లోనూ మన పారమార్థిక ధర్మాలను బోధించడానికి తగినవారుగా మన యువకుల్ని తయారు చేయడానికై భారతదేశంలో కొన్ని సంస్థలను నెలకొల్పాలి! ఇప్పుడు మనకు కావలసింది బలిష్ఠులు, ఐవసంపన్నులు, ఋజువర్తనులు, ఆత్మ విశ్వాసపరులు అయిన యువకులు. అలాంటి వారు నూరుమంది దొరికినా, ప్రపంచం పూర్తిగా పరివర్తన చెందగలుగుతుంది!!

ఇచ్ఛాశక్తి తక్కిన శక్తులన్నిటి కన్నా బలవత్తరమైంది. అది సాక్షాత్తూ భగవంతుని దగ్గరి నుండి వచ్చేదే కాబట్టి దాని ముందు తక్కినదంతా లొంగిపోవలసిందే. నిర్మలం, బలిష్ఠం అయిన 'ఇచ్ఛ' (సంకల్పం) సర్వశక్తిమంతమైంది. దానిలో మీకు విశ్వాసం లేదా? ఉంటే మీ మతంలోని మహోన్నత ధర్మాలను ప్రపంచానికి బోధించడానికై కంకణం కట్టుకోండి. ప్రపంచం ఆ ధర్మాల కోసమై ఎదురుచూస్తోంది. అనేక శతాబ్దాలుగా ప్రజలకు క్షుద్రసిద్ధాంతాలు నేర్పడం జరిగింది. వారు వ్యర్థులని ప్రపంచమంతటా బోధలు జరిగాయి. ఎన్నో శతాబ్దాల నుండి వారు ఈ బోధనల వల్ల భయభ్రాంతులై, పశుప్రాయులైపోతున్నారు. తాము ఆత్మస్వరూపులమనే మాటను వినడానికైనా వారెన్నడూ నోచుకోలేదు. "నీచాతినీచుడిలో కూడా ఆత్మ ఉంది. అది అమృతం, పరమ పవిత్రం, సర్వశక్తిమంతం, సర్వవ్యాపకమైనది" అని వారికి ఆత్మను గురించి చెప్పండి. వారికి ఆత్మవిశ్వాసాన్ని ప్రసాదించండి. ❖

మూలం: శ్రీ రామకృష్ణ ప్రభ - ఫిబ్రవరి 2014

# శ్రీ మలయాళ సద్గురు గ్రంథావళి

## పదకొండవ సంపుటము

## ఉపదేశామృతము

ప్రకాశకులు :

**శ్రీవ్యాసాశ్రమ వజ్రోత్సవ సంఘము**

**శ్రీవ్యాసాశ్రమము**

చిత్తూరు జిల్లా, ఆంధ్రప్రదేశ్

2001

శ్రీ వ్యాసాశ్రమ వజ్రోత్సవ
సంఘ ప్రచురణ - 2001 సం
ప్రతులు : 1000

ప్రతులకు :-
మేనేజరు - శ్రీవ్యాసాశ్రమము,
వ్యాసాశ్రమం పోస్టు, (వయా) ఏర్పేడు,
చిత్తూరు జిల్లా, (ఆం ప్ర), 517 621
ఫోన్ నెం 08578- 68528

ముద్రణ :-
**శ్రీ పారాశర్య ముద్రాక్షరశాల, శ్రీ వ్యాసాశ్రమము.**

# నివేదన

శ్రీవ్యాసాశ్రమం ప్రచురిస్తున్న ఆధ్యాత్మిక గ్రంధాలు పాఠకలోకానికి సుపరిచితాలే ఈ గ్రంధాలను భక్తులు మిక్కిలి శ్రద్ధతో పఠిస్తున్నారు ఆధ్యాత్మిక సారస్వత ప్రచారం ద్వారా సాటి లేని సేవ చేసే సంస్థగా ఆశ్రమం ప్రసిద్ధి వహించింది

మహర్షి - సద్గురు శ్రీ మలయాళస్వాములవారు స్వయంగా రచించిన గ్రంధాలు ఆశ్రమప్రచురణలలో అత్యంత విశిష్టమైనవి అవి పలు సార్లు ముద్రణ పొంది అనన్య సామాన్యమైన ప్రచారం పొందాయి జిజ్ఞాసు జనానీకంలో జడత్వాన్ని తొలగించి చైతన్యం కల్గించడంలో విజయం సాధించాయి

శ్రీవారి రచనలు ప్రస్తుతం వివిధ పరిమాణాలలో నానాగ్రంధాలుగా ముద్రింపబడివున్నాయి వీటినన్నింటిని ఒకే పరిమాణం కల గ్రంధ రాశిగా ''శ్రీమలయాళసద్గురు గ్రంధావళి'' అన్న పేరుతో ముద్రించడం మంచిదని అభిజ్ఞులు సూచించారు ఈ సూచనను పూజ్యశ్రీ విద్యానందగిరి స్వాములవారు ఆమోదించారు

శ్రీవారు గోగర్భములో తపస్సు చేసే సమయం 1919లో రచించిన శుష్కవేదాంత తమోభాస్కరం ఇందులో మొదటి సంపుటమవుతుంది ఇంచుమించు ఆగ్రంధాన్ని పోలిన పరిమాణంలోనే తక్కిన సంపుటా

లుంటాయి. ఇలా ప్రచురిస్తే ఒక్కొక్కటీ సుమారు నాలుగువందల పుటలు గల సంపుటాలు ఇరువదికి పైగా సిద్ధమవుతాయి.

2001వ సంవత్సరంలో జరుగనున్న శ్రీవ్యాసాశ్రమవజ్రోత్సవ శుభసందర్భంలో పై సంపుటాలను విడుదల చేయాలని శ్రీస్వాములవారి సమ్మతితో వజ్రోత్సవ నిర్వాహక సంఘం వారు నిర్ణయించారు. ఈ సంపుటాల క్రోడీకరణ, ముద్రణ శ్రీ సముద్రాల లక్ష్మణయ్య గారి సంపాదకత్వం క్రింద జరుగుతున్నది.

భగవదనుగ్రహంతో, శ్రీసద్గురుదేవుల ఆశీర్వాదంతో, భక్తుల ప్రోత్సాహంతో ఈ గ్రంథ ప్రచురణ ప్రణాళిక విజయవంతం కాగలదని ఆశిస్తున్నాము.

శ్రీ వ్యాసాశ్రమం

ప్రకాశకులు



# విషయసూచిక







# పీఠిక

దైవాత్మ స్వరూపులారా! ఋషిసంతానములారా!

శ్రీవ్యాసాశ్రమ సంస్థాపకులు మహర్షి సద్గురు శ్రీమలయాళస్వాముల వారు రచించిన ఆధ్యాత్మిక గ్రంథాలు బహుళప్రచారంలో ఉన్న విషయం లోకవిదితమే అందులో మొదట పేర్కొనదగినది శుష్కవేదాంతతమోభాస్కరం ఇది శ్రీవారు గోగర్భంలో తపస్సు చేసే సమయంలో రచించినది

1926 లో వ్యాసాశ్రమాన్ని స్థాపించిన తరువాత అనేక గ్రంథాలు ప్రచురించడమైనది అందులో పెక్కు రచనలు మొదట 'యథార్థభారతి' మాసపత్రికలో వెలువడినవే

శ్రీవారు రచించిన గ్రంథాలలో ఉపదేశామృతం చాలా విశిష్టమైనది శ్రీవారు ధ్యానానంతరం ఏకాంతములో కూర్చున్నపుడు వారి ధ్యాన హృదయసాగరంనుండి ఆవిర్భవించిన జ్ఞానతరంగాలే ఈ ఉపదేశవాక్యాలు ఉపమాన పూర్వకమైన ప్రబోధంతో కూడిన ఈ ఉపదేశామృతం జిజ్ఞాసువులైనవారికి వేదాంత తత్త్వసారం గ్రహించడానికి అత్యంతం ఉపకరించగలదు. అనేక శాస్త్రాల సారం ఇందులో క్రోడీకరింపబడింది కర్మ, ఉపాసన, జ్ఞానమార్గాలతో కూడిన వేదాంత తత్త్వంనుండి జ్ఞాన భాగాన్ని వేరుపరచి యిందులో ఉపదేశించడమైనది మొదట యథార్థభారతిలో ప్రచురింపబడిన ఈ ఉపదేశామృతం తరువాత నాలుగు సంపుటాలుగా ముద్రించబడింది ఆ సంపుటాలు క్రమంగా 1929, 1930, 1945, 1953 సంవత్సరాలలో మొదటి సారిగా వెలువడ్డాయి. తదుపరి పలు ముద్రణలు జరిగాయి

శ్రీవ్యాసాశ్రమ వజ్రోత్సవాల శుభ సందర్భములో నిర్వహింప తలపెట్టిన

శ్రీ మలయాళ సద్గురుగ్రంధావళి ప్రచురణ పధకం క్రింద ఈ గ్రంధాన్ని ఒకే సంపుటంగా ఇపుడు ప్రచురించడమైనది.

పూర్వం ప్రచురింపబడిన సంపుటాలలో మొదటి సంపుటంలో 72 వ సంఖ్య గల 'ధ్యానం' అనే వ్యాసం స్వబోధ సుధాకరం అనే మరొక గ్రంధంలో ముద్రింపబడివున్నది. రెండవ సంపుటంలోని చాలాభాగం మూడవసంపుటంలో పునర్ముద్రితమయింది. అలా పునర్ముద్రిత భాగాలను తొలగించగా -

| | | |
|---|---|---|
| ప్రధమ భాగం | - | 256 |
| ద్వితీయ భాగం | - | 220 |
| తృతీయ భాగం | - | 174 |
| చతుర్థ భాగం | - | 227 |

మొత్తం 877 ఉపదేశ వాక్యాలు ఈ సంపుటంలో ముద్రించబడ్డాయి. ఒకే సంపుటంగా ప్రచురించడం జరిగినా ఆయా భాగాలను విడి విడిగా గ్రంధంలో పేర్కొనడం జరిగింది.

అప్రాకృతములు, ఉపనిషత్సారములు, ధ్యాన గమ్యములు, జ్ఞానబోధకములు, భక్తి వైరాగ్య ప్రదాయకములు అయిన ఉపదేశవాక్యాలతో నిండిన ఈగ్రంధం విస్తృత ప్రచారం పొందుగాక!

లోకాస్సమస్తాస్సుఖినోభవన్తు

శ్రీవ్యాసాశ్రమం　　　　సముద్రాల లక్ష్మణయ్య

24-6-2000

ఓమ్

# ధ్యానము

**మంగళం గురుదేవాయ మహనీయగుణాత్మనే ।**
**సర్వలోక శరణ్యాయ సాధురూపాయ మంగళమ్ ॥**

**1 హిరణ్యగర్భాది స్థావరాన్తేషు శరీరేషు యదేకం చైతన్యమస్తి తదేవాహ మస్మీతి దృఢజ్ఞానసిద్ధి ర్భూయాత్ ॥**

చతుర్ముఖబ్రహ్మ మొదలు స్థావరము వఱకు గల శరీరములయందు ఏ ఒకే చైతన్యమున్నదో అదే నేననెడి దృఢజ్ఞానసిద్ధి గలుగును గాక!

2. నిత్య నిర్వికారాసఙ్గాద్వితీయ పరిపూర్ణ సచ్చిదానన్ద స్వప్రకాశ చిదేకరస బ్రహ్మానుభవసిద్ధిర్భూయాత్ ॥

నిత్యమై, నిర్వికారమై, అసంగమై, అద్వితీయమై, పరిపూర్ణమై, సచ్చిదానన్దమై, స్వప్రకాశమై, చిదేకరసమై యొప్పు బ్రహ్మానుభవ సిద్ధి గలుగునుగాక!

**3. వాసనాక్షయ మనోనాశ తత్త్వజ్ఞానాభ్యాసవశాత్ జ్ఞానరక్షా తపస్సిద్ధిః సర్వసమత్వం దుఃఖనివృత్తిః సుఖావిర్భావ ఇత్యేతత్పఞ్చ ప్రయోజనసిద్ధి ర్భూయాత్ ॥**

వాసనా నాశము వలనను, మనోనాశము వలనను, తత్త్వజ్ఞానాభ్యాసము వలనను (కలిగిన) జ్ఞానరక్ష, తపస్సిద్ధి, సర్వసమత్వము, దుఃఖనివృత్తి, సుఖావిర్భావము అను నీ అయిదు ప్రయోజనముల యొక్క సిద్ధి గల్గునుగాక!

**4. మైత్రీ కరుణా ముదితోపేక్షేతి సద్వాసనా పాటవేన రాగాది దుర్వాసనా క్షయః సమ్యగ్భూయాత్ ॥**

మైత్రి, కరుణ, ముదిత, ఉపేక్ష అనెడి శుభవాసనల యొక్క దృఢాభ్యాసము వలన రాగాది మలిన వాసనా నాశము చక్కగా గల్గునుగాక!

**5. నిరన్తరాత్మానుసంధానవశాన్మనసో వృత్తిరూప పరిణామపరిత్యాగేన నిరుద్ధతాకారేణాత్మపరిణామో దృఢీభూయాత్ ॥**

సదా ఆత్మానుసంధానము చేయుటవలన మనస్సునకు వృత్తిస్వరూప పరిణామము నివృత్తి యగుటచే నిరోధింపబడినట్టి స్థితిస్వరూపమైన

ఆత్మపరిణామము దృఢమగునుగాక!

6. **శమాదిపూర్వక శ్రవణ మనన నిదిధ్యాసనాభ్యాసబలా ద్విషయాసక్తిః ప్రజ్ఞామాంద్యం కుతర్కో విపర్యయ దురాగ్రహాశ్చేతి వర్తమాన ప్రతిబన్ధచతుష్టయ నివృత్తిద్వారా అప్రతిబన్ధాపరోక్ష బ్రహ్మసాక్షాత్కారో దృఢీభూయాత్ ॥**

శమాది షట్క సంపత్తి మున్నుగా గల్గిన శ్రవణము, మననము, నిదిధ్యాసనముల యొక్క అభ్యాసబలమువలన విషయాసక్తి, ప్రజ్ఞామాంద్యము, కుతర్కము, విపర్యయ దురాగ్రహము అను నీ వర్తమాన ప్రతిబంధములు నాలుగింటియొక్క నివృత్తి వలన ప్రతిబంధములేని అపరోక్ష బ్రహ్మసాక్షాత్కారము దృఢమగునుగాక!

7. **వాసనాక్షయ మనోనాశాభ్యాం నిర్వాసనే వృత్తిశూన్యే చిత్తే సంశయ విపర్యయదోషద్వయాభావేన ప్రతిబన్ధాభావా దుత్పన్నం తత్త్వజ్ఞాన మబాధితత్వేన సురక్షితం భూయాత్ ॥**

వాసనాక్షయము, మనోనాశము అను నీ రెంటిచేతను వాసనలేని వృత్తిశూన్యమైన చిత్తమందు సంశయము, విపర్యయము అను దోషములు రెండును లేనందువలన ప్రతిబంధము గలుగమిచే బుట్టిన తత్త్వజ్ఞానము బాధింపబడకుండునట్లుగా చక్కగా రక్షింపబడినది యగుగాక!

8. **పరమేశ్వరం ప్రీతిపూర్వకం భజన్తో భక్తా యేన బుద్ధియోగేన సమ్యగ్దర్శన లక్షణేనాత్మభూతం భగవన్తం పరమేశ్వర మాత్మత్వేనోపయాన్తి ప్రతిపద్యంతే తం బుద్ధియోగం భగవాన్ వాసుదేవో మేదదాత్విత్యాశీర్నిరన్తరం భూయాత్ ॥**

పరమేశ్వరుని ప్రీతితో భజించు భక్తులు ఏ శ్రేష్ఠమైన దర్శనమే లక్షణముగాగల బుద్ధి (జ్ఞాన) యోగముచేత ఆత్మస్వరూపమైన భగవంతుడగు పరమేశ్వరుని ఆత్మమాత్రముగా (గ్రహించి) పొందుచున్నారో (అనగా ఎఱుగుచున్నారో) అట్టి బుద్ధి యోగమును భగవంతుడైన వాసుదేవుడొసంగును గాత అనెడి మంగళాశాసనము సర్వకాలమును కలుగును గాక!



# భద్రవాక్యములు



సత్యమే జయించును.

అసత్యము నశించును.

కరుణయే జయించును.

కాఠిన్యము నశించును.

ధర్మమే జయించును.

అధర్మము నశించును.

స్వాతంత్ర్యమే జయించును.

అస్వాతంత్ర్యము నశించును.



# ఉపదేశామృతము

## ప్రథమ భాగము

ఓమిత్యేకాక్షరం బ్రహ్మ ధ్యేయం సర్వముముక్షుభిః

ఉత్తిష్ఠత! జాగ్రత! ప్రాప్య వరాన్ నిబోధత!

1 అవిద్యను నాశము చేసెడి వృత్తికి విద్య యని పేరు ఈవృత్తి గలవారు నిరక్షరకుక్షులుగా నుండినను సమస్త శాస్త్రములను చదివినవారే సమస్తశాస్త్రములు చదివియు ఆత్మజ్ఞానము కలుగనివారు ఒక్క అక్షరము కూడా చదువని నిరక్షర కుక్షులని గ్రహింపుడు

2 విద్య లేనివారు పశుప్రాయులని కొందఱు చెప్పుచుందురు కాని విద్య యుండియు జ్ఞానము లేనివారు పశువులకన్న కనిష్ఠులే ఇది మఱువకుడు

3 మనస్సు చేయు చేష్టల నేకాంతముగ కూర్చుండి జాగ్రత్తతో నిరీక్షించుచుండిన మనో జయము త్వరలో సిద్ధించును

4 కోపమును కోపించెడు అభ్యాసము గల వారికి కోపము శీఘ్రముగా నశించును కోపము ఒకటి నశించిన తక్కిన దుర్గుణములన్నియు దమకు తావే క్షయించును ఇది రాజు జయింపబడినచో, ప్రజలు స్వయముగా జయింపబడునట్లు అని తెలిసికొనుడు

5 ఒక పాతబొమ్మను మరియొక నవీనపు బొమ్మగా జేయుటకొఱకు పురాతన విగ్రహమును సుత్తితో తునకలు తునకలుగా కొట్టి నిప్పులో నీరుగా కరగజేసినచో మాత్రమే నూతన విగ్రహము జేయవచ్చును కరగక పోయిన క్రొత్త బొమ్మను చేయ సాధ్యము కాని రీతి నజ్ఞానభావముతో గూడి జీవభ్రాంతి గల మనస్సును వైరాగ్య ధ్యానశాస్త్రవిచారమను సుత్తితో పగుల గొట్టి, భక్తి యను పరమాత్మ ధ్యానములో మనసు నీరువలె కరగించిన మాత్రముననే జ్ఞానాకారవిగ్రహమును చేయంగలుగుదుము భక్తిలో కరంగని హృదయమునకు జ్ఞానాకారము కలుగనేరదు

6 దేహేంద్రియాది సుఖములను పొరలు (తెరలు) లేక ఆవరణములు ఒక్కొక్కటిగా తెగి పోవుచుండునేని ఆత్మయొక్క ఆవరణములు కూడా ఒక్కొక్కటిగా నశించుచుండునని తెలిసికొనుడు ఆలాగున సమస్తేంద్రియ సుఖములు నశించిన ఆత్మస్వరూపము మాత్రమే మిగిలి యుండును

7 మోక్షమునకు మూడు మార్గములు గలవు వానిలో ఒకటవది సాధనానుష్ఠానములతో గూడి ఏకాంతస్థలమున సద్గురు సన్నిధిలో విద్య నభ్యసించియుండుట ఇది ప్రస్తుతము లభించుట దుర్లభము

రెండవది జీవయాత్రకు ధనము లేనిచో సాధ్యమైనంతవఱకు పాపము లేని ఒక పని జీవనోపాయమునకు చేసికొని ఉత్తములయిన భార్యాభర్తలు కూడికాని లేక ప్రత్యేకముగా గాని శాస్త్రవిచారములతోడ నిష్ఠానుష్ఠానముల నభ్యసించియుండుట ఈ మార్గమే ప్రస్తుత కాలోచితమయినది ఈ మార్గములలో పోయెడి వారికి పతనము కలుగదు ఒకవేళ దినములు కొంచె మధికమయినను విరోధము లేదు

మూడవది సర్వసంగపరిత్యాగియై వివిక్త స్థలములో (తన ప్రయత్నమునకు విరుద్ధము గానిచోట) విరక్తుడై తీవ్రతరమగు ధ్యాననిష్ఠను అనుష్ఠించుచుండుట, క్షుద్బాధ జనించినప్పు డెవరయిన అన్నాదివస్తువు లేవయిన దెచ్చియిచ్చిన భుజించుట, ఆకలిబాధ సహింపని కాలములో చేతిలో

గాని, మట్టిపాత్రములో గాని బిక్షాన్నము దీసుకొని భుజించుట మట్టి పాత్రము తప్ప ఇతర పాత్రము లుండగూడదు ఇది ముక్తికి సులభమార్గమైనను శాశ్వతముగ నిలుచుట దుస్తరము నెఱవేర్చెనేని మహాదన్ముడే సంశయము లేదు

8 వివేకవంతుడైన ఒకడు తనయొక్క తుచ్ఛసుఖములయిన ఇంద్రియాది సౌఖ్యములను విడిచెనేని తనకు శాశ్వతసుఖమగు జ్ఞానము లభించునదే గాక పెక్కు వేలుగ మనుష్యాది ప్రాణులకు నిహపరసుఖముల నిచ్చుటకు శక్తుడగును

వివేకశూన్యుడైన వాడొక్కడు ఎటువంటి వాడైనను తుచ్ఛములైన తన యింద్రియాది సుఖములకొఱకు నోఱు దెరచుకొని నిరీక్షించుచుండెనేని వానికి లోకములో గల అనేకకోట్ల మనుష్యాది ప్రాణులను పీడించి వధించినను చాలదు దీనిని బాగుగ విచారింపుడు

9 తినుటకొఱకు జీవించియుండువాడు బద్ధుడు జీవించుటకొఱకు తినువాడు ముక్తుడు దీనిని మఱువకుడు ఒకడు తన యందుండు అనాత్మవృత్తులను ఒక్కొక దానిని బయటికి నెట్టివేసెనేని ఒక్కొకమెట్టు ఆత్మసన్నిధానమునకు (పరమపదమునకు) నెక్కుచున్నాడని గ్రహింపుడు అట్లు సమస్తవృత్తులను నెట్టి వేసినచో ఆత్మయొక్క సంపూర్ణమైన మెట్టును ఎక్కి గమ్యస్థానమను మోక్షమును చేరగలుగును

10 ఇంద్రియములకు రుచికరమైన ఒక్కొక్కపదార్థమును స్వయముగా అరుచియై తనకు తానె విడిచిపోవుచుండునేని ఆత్మయొక్క పొరలు (తెరలు) లేక ఆవరణములు నశించి పోవుచున్నవని తెలియదగినది అలాగున సర్వేంద్రియవృత్తులు నశించినచో ఆత్మజ్ఞానము నిరావరణముగా ప్రకాశించును ఇది ఆత్మ ప్రకృతినుండి విముక్తి పొందుచున్నదా? లేదా? అని తెలిసికొను నుపాయము

11 దేవకరుణ లేనిచో తనకు తానే ముక్తి నొందుట తరము కాదు

ఎట్లన అగాధమై నిరాధారమగు కూపములో పడిపోయినవాడు స్వయముగా పైకెక్కసాధ్యము కానట్లును, కరచరణములు దృడముగా బంధింపబడిన వాడు తనకు తానే బంధచ్ఛేదనము చేయశక్తుడు కానట్లును స్వప్రయత్నమాత్రముచే భవబంధముక్తి కానేరదు కనుక దయామయుడగు సర్వేశ్వరుని కరుణకు పాటుపడుడు

12 సత్తువైన భూమిలో మంచి విత్తనములు వేసినను వర్షము లేనిచో ఫలింపనట్లు శుద్ధహృదయములో గూడ ధ్యాన, జప, తపో, యోగ, యజ్ఞ, వ్రత శ్రవణాదు లను సారవంతములయిన విత్తనములు పాతిపెట్టినను సర్వేశ్వర కరుణాకటాక్ష వీక్షణామృత భక్తి యను వృష్టి లేనిచో జ్ఞానఫలము ఫలింపదు కనుక ముక్తికి భక్తియే ముఖ్యసాధనమని మఱువకుడు

13 తామరపుష్పము వికసించునపుడు దళములు తమకు తామే వీడిపోయి కాయ శేషించి నిలుచునట్లు హృదయము వికసించునపుడు సమస్తావరణములు అనగా వృత్తులు స్వయముగా వదలిపోయి స్వస్వరూపమగు ఆత్మ మాత్రమే శేషించియుండును కాని కమలము వికసించుటకు సూర్యరశ్మి కావలసియుండునట్లు, హృదయము వికసించుటకు సర్వేశ్వర కరుణాకటాక్షదృష్టి యుండవలయును

14 ఒక జడమగు రైలు ఇంజన్ నిప్పుచేతను, నీరుచేతను శక్తిగలదై అనేకజనులను గమ్యస్థానము చేర్చునట్లు జీవరాసులలో గాడమగు కరుణయను జలమున్ను, తీవ్రమగు ఈశ్వర చింతనయను నిప్పును ఎవరి హృదయమను యంత్రములో నమరునో ఆపవిత్రాత్ముడు సంసారమందుండు అనేక జీవరాసులను మోక్షమనెడు గమ్యస్థానమును చేర్చ గలుగును విషయ విరక్తియను నిప్పుగొట్టము (బైలరు) దృఢముగా లేనిచో ఆవిరి (స్టీమ్) నిలువ జాలదు

15 నిప్పు మంట చేయువాడు మొదట చాల చిన్న చిన్న కట్టెపుల్లలను మంట వేసి తరువాత పెద్ద పెద్ద కట్టెలను వేసిన కాలునేగాని మొదటనే పెద్ద

కట్టెలు వేసిన ఊది యూది సంకటపడవలసినదే గాని అగ్ని ప్రజ్వలింపదు గదా! అలాగున బ్రహ్మాజ్ఞానాగ్ని ప్రకాశించుటకు ప్రథమమున పుణ్యకర్మానుష్ఠానమును నిష్కామముగా శ్రద్ధతో జేసి, గురుశుశ్రూష దైవభక్తి మొదలైనవి యనుష్ఠించి తరువాత యోగానుష్ఠానము వేదాంత విచారణ జ్ఞానము మొదలయినవి అనుష్ఠించవలయును ఇట్లు చేయనివారికి స్వరూపజ్ఞానము గలుగుట ప్రయాసకరము

16 ఒక వస్త్రమునకు రంగు అద్దునప్పుడు దానియందుగల గంజి, పిండి మొదలైన మాలిన్యములను ముందుగా నుతికి శుద్ధపఱచవలయును లేనిచో అద్దిన రంగు నీటిలో తడిపిన వెంటనే వదలిపోవును అలాగున అమనస్క బోద యను స్వరూపజ్ఞానమును ఉపదేశించుటకు ముందుగా నంతః కరణశుద్ధికొఱకు పుణ్యకర్మానుష్ఠానము, నిర్మల దినచర్య, దైవభక్తి గలిగి యుండవలయును ఇవి లేనివారికి స్వరూప జ్ఞానము శాశ్వతముగ నిలువజాలదు

17 నీడలో నుండు చెట్టు బాగుగా బలిసి యుండినను ఫలము చాల తక్కువ యగును ఎండలో నుండు వృక్షము చిన్నదిగా నుండినను కాయలు నిండుగా నుండునుగదా! మఱియు ఎరువు జాస్తిగల వృక్షములుగూడ గొప్పవిగా పెరిగినను కాపు చాల తగ్గిపోవును అలాగున సుఖమునకును, ఇంద్రియ సౌఖ్యమునకును లోనైనవారికి శరీరేంద్రియములు పుష్టిగానుండినను యోగానుష్ఠానమును, జ్ఞానసిద్ధియు లోపించిపోవును అని మఱువకుడు

18 రాత్రికాలములో నక్షత్రములు స్పష్టముగా బ్రకాశించుచుండినను, సూర్యుడు ప్రకాశించునప్పుడు మాయమైపోవునట్లు అజ్ఞానదశయందున్న వారికి ఇంద్రియ విషయములైన వృత్తులుండునే గాని ప్రబోధజ్ఞాన మను సూర్యుడు ఉదయించునపుడు ఉండవు ఇదియే జ్ఞానియొక్క గుర్తు

19 ప్రభాతకాలములో మనయొక్క నీడ చాల పొడవై కనిపించును సూర్యుండు పైకి పోనుపోను తమ ఛాయ తగ్గి, తగ్గి సరిగా మధ్యాహ్నమున

తనలో లయమందునట్లు ఒకరి మనస్సను సూర్యుడు స్వరూపస్థితినుండి ఎంత ప్రపంచముఖముగా వాలుచుండునో, వారికి మాయ అంత అపారమై కనుపించును అనుష్ఠానాది శాస్త్రవిచారణచే మనసు ఎంతవఱకు ఊర్ధ్వగామిగా పోవునో అంతకంతకు మనను ప్రకృతి క్షయించి, పూర్ణప్రబోధస్థితిలో ఆత్మకన్యముగా ప్రపంచము కనిపింపదు

20 సముద్రోపరి భాగములో విహరించు మత్స్యములు అలలచే నిశ్చలత్వము నొందక క్రిందికి, పైకి పోవుచుండును సముద్రాగాధ భాగములో నుండు చేపలచ్చట నిశ్చలముగా నుండి నిద్రించుచుండును పై జెప్పిన రీతిగా దేహేంద్రియాది దృశ్యజగత్తులో ప్రసరించిన బుద్ధిగలవారు సుఖ దుఃఖాది ద్వంద్వములచే తల్లడిల్లక మానరు ఆత్మసాన్నిధ్య దృక్కులో రమించు ఆత్మ దృశ్యద్వంద్వాదులచే క్లేశము నొందక పరమశాంతి నొంది అమృతమయమై యుండును

21 రాత్రికాలములో దీప నక్షత్రచంద్రాదుల ప్రకాశములను జనులు ఆశ్రయించి యుందురు సూర్యోదయమయిన వెంటనే ఆ ప్రకాశములన్నియు కానుపింపకపోవుటయే గాక వానిని చూడవలె నను బుద్ధి లేకపోవును అదే రీతిగ అజ్ఞానదశయం దుండువారికి ఇంద్రియాది విషయసౌఖ్యవృత్తులు ప్రకాశించుచుండునే కాని, ఆత్మోదయము గల జ్ఞానికి అవి కానుపింపవు ఇదే జ్ఞానియొక్కయు, అజ్ఞానియొక్కయు గురుతని తెలియదగినది

22 ఒక ప్రభువైనవాని సేవకులు మొదలైనవారలందరును, ప్రభువుయొక్క సౌఖ్యమును కోరి వర్తించవలసియుండుటయే ధర్మము, ప్రభువునకు ద్రోహము చేయు నౌకరులను వెంటనే దండించుట లేక నౌకరినుండి తొలగించుట ధర్మము అట్లే ఆత్మయను ప్రభువుయొక్క స్వసౌఖ్యమునకు విరుద్ధముగా దుష్ట విషయముల బ్రవర్తించు నింద్రియములను భృత్యులను శరీరము నుండి తొలగించుట గాని శిక్షించుటగాని చేయువాడు మాత్రమే ఆత్మ సౌఖ్యము నొందగలుగును

23 సముద్రాంతర్గతమగు ముత్యపు చిప్ప స్వాతికార్తి వర్ష బిందువుకై నోరు తెరచుకొని సాగరోపరి భాగములో నిరీక్షించుచుండునట్లు, ఎవని మనస్సు సంసారసాగరము నుండి సర్వేశ్వరకరుణామృతపానముకొరకు నిరీక్షించుచుండునో, అటువంటివాడే తీవ్రభక్తుడని గ్రహింపుడు, ముత్యపుచిప్ప గ్రహించిన జలము ముత్యమై పరిణమించునట్లు, దైవ కరుణయే మాణిక్యమనియు, భక్తియే చింతామణి యనియు, వైరాగ్యమే రత్నమనియు గ్రహింపుడు

24 నిర్విషయ బ్రహ్మసాక్షాత్కారము గలుగనివారి విశేషతరాద్భుతకరములగు బోధముల వినియు అనుష్ఠించియు సహవాసము చేయుటకన్న, నిర్విషయ స్వానుభవముగల జితేంద్రియుని సామాన్యబోధమును, నిష్ఠయు, నంనర్గమును గలిగి శ్రేష్ఠమైన విజ్ఞానులవలన శిక్షితులగువారు దర్మపథమునుండి చలనము గలుగక పోవుటచే క్రమముగ అమృతస్థితి నొందగలరు నిర్విషయము లేనివారి బోధనలో విషయాంశము కలిసియుండుటచే సూక్ష్మవిషము కలిసిన మంచి పదార్థమైనను భుజించువారికి క్రమముగ వైషమ్యస్థితి తప్పక కలుగునని మఱువకుడు

25 వేసవికాలములో అతిదారుణమగు ఎండచే లోకము అతి తపనముగా నుండినను అత్యున్నత పర్వత శిఖరోపరి భాగమునం దెల్లప్పుడు చల్లగానే యుండును అట్లే లోకము దుఃఖమయమై తపించెడు కాలములో గూడ, ఆత్మస్థితిలో అనగా తురీయములో రమించువా రెప్పుడును ఆనందమయముగానే యుందురు

26 రైల్ ఇంజిన్ పై అమర్చియుండు సర్చ్‌లైటు మొదలైనవి దూరముగా నుండు పురోభాగవస్తువులను కాన్పింపజేసినను దాని (దీపము) యొక్క వెనుకభాగమున నుండు సమీపవస్తువులనుగూడ ప్రకాశింప జేయజాలనట్లు ప్రపంచమువైపు బుద్ధిగలవా డెంత పండితుడైనను జడప్రకృతియగు దృశ్యమును దెలియు శక్తిగలవాడగునేకాని, చేతనమై

ఆనందమయమైయుండు దృక్కగు ఆత్మను దర్శింపజాలడు పై జెప్పిన లైటును వెనుక ప్రక్కకు త్రిప్పిన ఏలాగున వెనుక భాగములోనున్న వస్తువులను జూడనగునో, అలాగే ఎవరు తన మనస్సును అంతర్ముఖముగా త్రిప్ప శక్తి గలవారగుదురో వారు నిత్యానందమగు ప్రత్యగాత్మను దర్శించ గలుగుదురు

27 ఒక లైటును ముట్టించునపుడు ప్రకాశము ఎక్కువ యుండిన బాగుండునను బుద్ధితో వత్తిని కొంచెమధిక మెత్తించిన స్వల్పసమయమున ప్రకాశము ఎక్కువ కాన్పించినను క్రమముగా పొగచే నిండునదేగాక ఒకవేళ చిమ్నికూడ పగిలిపోవును గదా! అలాగున యోగాద్యనుష్ఠానములు చేయువారు మొట్ట మొదట గలిగెడు సంతోషాతిశయముచేతను లేక తీవ్రనిష్ఠయందుగల ఆసక్తి చేతను, శరీరపరిస్థితులను కనుగొనక అధికనిష్ఠను చేసినచో అనేక అపాయములు గలుగును మితముగా వెలింగించిన దీపము రాత్రి యంతయు నుండుచుండునట్లు మితముగా నిష్ఠను చేయువారు అజ్ఞానావరణములేని శాశ్వత నిత్యసుఖమును పొందగలరు

28 సూర్యుని అభిముఖముగా చూపిన సూర్యకాంతి అద్దముద్వారా, సూర్యకిరణము లగ్నియై క్రింది భాగములలో నున్న వస్తువులను కాల్చివేయునట్లు ఎవరి మనస్సు ఆత్మముఖమై ఏకాగ్రత నొందియుండునో వానియందు గల అజ్ఞానకర్మ స్వరూపకట్టెలన్నియు జ్ఞానాగ్నిచే కాల్చబడును సూర్యకిరణము ఇతర స్థలముల కన్న అధికముగా అద్దములో ప్రవేశించుట లేదు దర్పణములో ప్రతిబింబించిన కిరణములను ఏకీకరించెడు శక్తి అద్దముయొక్క నిర్మాణమందుండుటచే అగ్ని కలుగుటకు కారణమగుచున్నది ఆత్మశక్తి అందరి హృదయములో ఒకే విధముగా నుండినను ఏకాగ్రతయు, విశుద్ధతయుగల హృదయములలో మాత్రమే జ్ఞానజ్యోతి ప్రజ్వలించుచుండును

29 ప్రతిదినమును హృదయగుహయందు ఏకాగ్రచిత్తుడై బ్రహ్మ ధ్యానము చేయుచు రాగా రాగా, ఒక దినమున పరబ్రహ్మానుభవస్థితి

గలుగును (అనగా, పరమాత్మ ప్రత్యక్షమగును) పెరుగు మథనము చేయగ చేయగ వెన్న బైలు దేరునట్లును, అరణి మథవనము మరల మరల చేయునపు డగ్ని ప్రజ్వలించునట్లును, నూతిలో నుండు బురదను తీయగ జల ముత్పన్నమగునట్లను, ఈ బ్రహ్మనిష్ఠులు పరిపూర్ణానంద సంతృప్తులగుదురు ఎవరికి బ్రహ్మానుభవస్థితి గలుగలేదో వారికి మనన నిదిధ్యాసననిష్ఠ ఇంకను చాలదని తెలియవలయును పెరుగునుండి నవనీతము వేఱువడని కారణముచే మథనము చాలదని తెలియవలయును అరణినుండి ఏకారణముచే అగ్ని జనించలేదు? మథనము తక్కువగా నుండుటవలన, ఎందుచే బావియందు జలము గనబడలేదు? మట్టి తీయుట చాలదు ఇదే దీనికి కారణము (అరణి యనగా యాగాగ్ని కొఱకు చేర్చబడు కొయ్యపేరు)

30 అతివ్యభిచార స్వభావముగల స్త్రీయును, ఆలాగుననే పురుషుడును, తనజాతి ధర్మముల నుల్లంఘించి మాతాపితృసహోదరులను గూడా పరిత్యజించి అల్పసుఖము, బహుక్లేశమైన విషయసుఖము కొరకు పరపురుష పర స్త్రీలను అనుగమించుచున్నారుగదా! ఆలాగున అవ్యభిచారిణి (అతీతమైన భక్తిగల స్త్రీ) ఆత్మారాముడైన పరమ పురుష బ్రహ్మానందక్రీడయను శాశ్వత సుఖమునకును, అట్లే భక్తితో ముక్తి కాంతా విహారానంద బ్రహ్మానందమను మోక్షమునకును పురుషులు సర్వసంగ పరిత్యాగులై, స్వజనత్యాగ శీలురై మానావమానరహితులై, శీతోష్ణములను సహించి సంచరించెడి సంగతి ఆశ్చర్యమా? కాదు కాదు దీని యందు మొదటిది అతిమాయాంధకారము యొక్క స్వభావము రెండవది మాయ నతిక్రమించుటకై ప్రారంభించునప్పుడు అందరికిని గలిగెడి యవస్థగా నుండును

31 ఒక మలినమైవ వస్త్రమును సబ్బు వేసిగాని, చవుడు మట్టివేసిగాని, నిర్మలజలముతో రాతిపై ఉతుకునప్పుడు ఏలాగున దానియందు మురికిపోయి పూర్వస్థితివలె శుభ్రవస్త్ర మగుచున్నదో ఆలాగున

(పరిశుద్ధ) సచ్చిదానంద స్వరూపమైన ఆత్మను బాధించిన అజ్ఞాన మలనివారణ కొరకు పరబ్రహ్మధ్యాన (గురూపదేశ) మను సబ్బు వేసి, నిర్మలనిష్ఠయను జలమునందు, వైరాగ్యమను రాతిపై, జ్ఞానధ్యానములను ఉతుకును ఉతుకునపుడు నిజబోధస్వరూపమగు బ్రహ్మకారము ప్రకాశించును అనగా మాయావిముక్తి గలుగును సబ్బు మంచిదిగా నుండినను మలినజలమైనచో సబ్బుయొక్క నష్టమును, ఉతికిన కష్టమును మిగులునే గాని, వస్త్రము నల్లగానే యుండును, ఈ కారణముచేతనే ఇప్పుడు గురుపుత్రులని చెప్పువారిలో కొందరు బహుకాలమునుండి బ్రహ్మనిష్ఠ చేయుచున్నను మనః పారిశుద్ధ్యము గలుగుట లేదు అది సబ్బుదోషము గాదు, జలదోషము అనగా, వారి ఆచార దినచర్యలు నికృష్టము లగుటచే శుద్ధులు గాలేదు

32. విషయము లనుభవించుచునే యుండి (సంసారములోనే యుండి) అవిషయములందు మనోజయము గలుగవలెనని వాదించెడివారు, నదీప్రవాహములో కొట్టు కొనిపోయెడి పడవలో నుండు బాలురు దానియందుండి పడవను గట్టిగా బట్టుకొని నిలుప గోరినట్లు, వ్యామోహమే గాని, ఫలము గలుగదు పడవ సముద్రమున ప్రవేశించి మునుగునట్లు వీరును సంసారసాగరములో పతితు లగుదురు

33. ఒక నిమిషమైనను భగవంతుని స్మరింపక వ్యర్థమైపోవునపుడు ఎవరి నేత్రములనుండి ధారధారగా నీరు ప్రవహించునో ఆ పుణ్యాత్ముడే మానవజన్మముయొక్క మహిమ తెలిసినవాడనియు, యథార్థమైన దైవభక్తుడనియు, తరింపగలవాడనియు, ఇతరుల తరింపజేయువాడనియు, తీవ్రవైరాగ్యము కలవాడనియు మరువకుడు తదితరుల జన్మములు తమకును, ఇతరులకును, భూమికిని భారమే యగును

34 మనము శ్రీకృష్ణపటముయొక్క వెనుక భాగములో ఒక ముల్లుతో పొడిచిన లోభాగములో గల మూర్తికి తగులునుగదా! అలాగున నిజమైన భక్తునియొక్క చిహ్నములు బహిరంగములో ఏవియును కనుపడక

యుండినను, అతని హృదయము ఈశ్వరమయమ్మై యుండును ఆ మహాత్మునికి బహిరంగములో చేయు సాధక బాధలన్నియు లోపలనుండు ఆ దయామయుడగు సర్వేశ్వరుని చెందునవి తెలివి గలిగి వర్తింపుడు

35 ఒక రాతిబండను శిల్పిదగ్గరకు బండితో తోలుకొనిపోయి దొర్లించివేయుదురు ఆ చిత్రపు పనివాడు ఆ రాతిని ఒక దైవవిగ్రహముగా జేయుటకొఱకు సుత్తిచేతను, ఉలిచేతను బాగుగా కొట్టిపనిచేయును ఈ దెబ్బలకు ఓర్చి యుండెనేని, రాయి పోయి దేవుడవును గదా! అదేరీతిగా అనాత్మజడముతో కూడిన శిష్యుడు సద్గురువునకు సమర్పింపబడెనేని ఆమహాత్ముని శిక్షలచే నిత్యశుద్ధ స్వయంప్రకాశ జ్ఞానస్వరూపమునకు అన్యమగు అతని వృత్తులన్నిటిని తొలగించి లోకారాధ్యునిగా చేయును శిక్షలకు ఓర్వనివాడు శిల్పి దెబ్బలకు నిలువని రాయివలె వ్యర్థమగును ఈతత్త్వమును చక్కగా తెలిసినవాడే యధార్థ ముముక్షువగును

36 మిత్రులారా! వేలువేలు వెలగల నోట్లను మీరు చూచి యున్నారుగదా! ఆ కాగితపు తునకకు మీరు గౌరవము చేయుట లేదు, దానిలోగల ముద్రలకు గదా వేలకొలది రూపాయలిచ్చుచున్నారు! ఆలాగున జనుల జాతి, కుల, ఆశ్రమ, అడంబరములను కాదు భక్తులు చూడవలసినది, వారి హృదయములో వెలుగుచుండు ఆ దివ్య దైవజ్ఞానమును చూడ వలయును నోట్లు కాని చిత్రవిచిత్రపు రంగులతో కూడిన సబ్బుబిళ్ల మొదలైన వస్తువులకు చుట్టివచ్చెడు కాగితము లుపయోగములేనట్లు కుల ఆశ్రమాది బహిరంగములు నిరపయోగములు వాటిని చూచి మోసపోకుడు

37 గుణత్రయములు గొప్పరోగియైనవానికి వాత, పిత్త, శ్లేష్మనాడుల మార్పులవలె నిమిష నిమిషమునకు మారుచుండును నాడులను కనిపెట్టి వైద్యుడు జాగరూకతతో మందు ఇచ్చునట్లు బ్రహ్మనిష్ఠుల గుణత్రయపరిణామమును కనుగొని శ్రవణ మననములకై ప్రయత్నింపక పోయిరేని అపాయమునకు కారణమగును

38 చెఱకు, నీలి చెట్టు మెదలైన వాటి పరిపక్వకాలమును కనిపెట్టి

సారమును తీసిన మాత్రముననే వాటిచే కలిగెడు ఫలమును అనుభవింప కలుగుదుము గదా! కాలము తప్పిన నిరుపయోగమై పోవునటుల మనుష్య జన్మమున మంచి యౌవనకాలమందే ఆత్మజ్ఞానపరులై, జ్ఞానమును తెలిసికొనుటకు ప్రయత్నించవలయు అట్టి మంచి తరుణము చేతినుండి జారిపోయెనేని, మరల జన్మము నిరర్థక మగును

39 మనోవాక్కాయ కృత్యములు మూడును ఒక్కే విధముగా లేనివారి ఆధ్యాత్మవిషయకమగు అనుష్ఠానములన్నియు వ్యర్థములే ఎట్లన, ప్రమిద ఒకస్థలమున, తైలము మరియొక స్థలమున, వత్తి యింకొక స్థలమున పెట్టి దీపమును ముట్టించిన వెలుగదుగదా!

40 మోక్షమార్గము సున్న గాను, ఏటవాలుగాను పాచిపట్టిన బండరీతిగానుండును, దాని మీద నడచిపోవువారు ఎంత జాగరూకులై యుండవలయునో అట్లుజాగరూకులైయుండియు, ఎందరో క్రిందకు ఎట్లు జారిపడియెదరో, అటువంటిదని సర్వదా మరువకుడు ఏ పుణ్యపురుషులు చింతించ, వలసి యుండిన సర్వదా దైవచింతనము, మాట్లాడవలసియుండి దైవమును గురించిన భాషణము, ఏద్దైన చేయవలసి యుండిన దైవిక కార్యములను చేయుచుందురో, అటువంటి వారికి ముక్తి కరస్థమై యుండును వీరే త్రికరణ శుద్ధి గలవారు ఇది ఉత్తమ పక్షము రెండవది శుద్ధసంకల్పము, శుద్ధవచనము, శుద్ధమైన క్రియతో వర్తించుట ఇది మధ్యమము మూడవది పుణ్యకార్యములను చేయవలయునను తలంపును, మంచి భాషణమును గలిగి పుణ్యకార్యములో ఫలాపేక్ష విడిచి ప్రయత్నించి అభ్యసించుట ఇది కనిష్ఠము వీరును త్వరలో పవిత్రు లగుదురు

41 మనసు సంకల్పించునట్లు చెప్పుటయు, చెప్పేలాగున చేయుటయు కలిగి వర్తించినవారు ప్రకృతి రహితులు ఈ త్రికరణములను ఏకరీతిగా ప్రయత్నించేలాగున అభ్యసించుటయే తపస్సనియు, యోగమనియు, పుణ్యకర్మానుష్ఠానమనియు, వేదాంత శ్రవణాదులనియు మరువకుడు ఇదే త్రిపుటిని ఏకము చేసెడి విద్య. ఇట్టి నిష్ఠ లేనివారు,

ఏవిధమయిన యనుష్ఠానము చేతను ముక్తులు కాజాలరు

42 ఒక ముముక్షువైనవాడు అనేక విదసాధనలు చేయం బని లేదు ఒక దానియందు పట్టుదలతో అనుష్ఠానము చేసెనేని తరింపవచ్చును ఆకలిగలవాడు ప్రపంచములో గల అన్ని దాన్యాన్నములను తినం బనిలేదు ఏదైన ఒక అన్నము తినకుండిన జీవింపజాలనట్లును, రోగము గలవాడు వైద్యశాస్త్రములో చెప్పబడిన యావత్తుఔషధములను, పథ్యములును శీలింప బనిలేదు రోగమునకు తగిన ఒక ఔషధమును, పథ్యమును లేనిచో బ్రతుకజాలనట్లును, దాహము గలవాడు ప్రపంచములోగల అన్ని తీర్థములను త్రాగంబనిలేదు, ఒక తీర్థమైనను త్రాగనిచో నిలువజాలనట్లు ఒక్కసాదననైనను పట్టుదలతో అనుష్ఠింపకపోయిన ముక్తినొందలేడు అనుష్ఠించినవాడు తప్పక ముక్తినొందును

43 చాలా రోజులు వర్షములేక ప్రపంచ మంతయు తపించియుండినప్పడు, ఒక్క సమయమున సంపూర్ణముగా వర్షము కురిసిన లోకమేలాగున ఆనందభరితమై యుండునో ఆలాగున చిరకాలానుష్ఠానపరుడయ్యు జ్ఞానము గలుగక పరితపించుచుండినను, దైవకృప గలిగిన ఒక నిమిషములో సమస్త దుఃఖములు నశించి బ్రహ్మానందభరితుడు గాగలడు

44 వర్షము లేని కాలములో ఒకడు స్వప్రయత్నపూర్వకముగా బావి, గుంటలను త్రవ్వి, సంపాదించిన జలముచే, పండించెడు ధాన్యము తన కుటుంబపోషణములకే తృప్తికరము గాదు దైవకృపచే చక్కగ వర్షము కురిసి పండిన ధాన్యములచే భూమండలములో గల సమస్త జీవరాసులకు దండిగ అన్నము లభించును గదా! ఆలాగున కర్తృత్వాభిమానములతో అహంకారపరుడై చేయు సాధనలచేత తన ఆత్మకు శాంతి గలుగుట దుస్తరము అహంకారాభిమానములను విడిచి దయామయుడగు సర్వేశ్వరుని ఆధారముపై చేయు సాధనలవలన తన ఆత్మకు శాంతి కలుగుటయేగాక ప్రచంచములో గల అనేక వేలకొలది జనుల

తాపత్రయములను శమింపజేయు శక్తిగలుగును

45 రాహువుచే ఆవరింపబడిన గ్రహణకాలచంద్రుడు ఎంత ప్రభాశూన్యమై లోకములో విషతుల్యముగా నుండునో, ఆలాగున రాగముచే ఆవరింపబడిన ఆత్మయు అంత విమూఢమై విషతుల్యమైయుండును గ్రహణ విమోచన కాలమున చంద్రు డెంతమనోహరముగా బ్రకాశించునో, అత్తరుణమున ఎన్నియో విధముల దాన, ధర్మ, పరోపకార, దైవపూజాదులు జరుగునో ఆలాగున రాగ ద్వేష విముక్తాత్మసన్నిధిలోను జరుగును

46 మనస్సనెడి యంత్రము అతివేగముగా ఊర్ధ్వాధముగా దిరుగుచుండును దీనియొక్క కృత్య మత్యద్భుతము ఇది దేహేంద్రియాది జాతి వర్ణములయొక్క స్మరణ కలిగెనేని అతల వితలపాతాల లోకమున కావల తీసికొనిపోయి మనుజుని పిశాచిగా నొనర్చును దేహేంద్రియాది జాతి వర్ణాదులకు విలక్షణుడనియు, శుద్ధస్వయంజ్ఞానమే తనయొక్క స్వరూపమనియు స్మరణ చేసిన మాత్రమే తన్ను భూర్భువాది సత్యలోకముల కావల కందజేసి అమృతత్వముగా మార్చి శివత్వము నొందజేయును ఇట్టి మనస్సును స్వాధీనపరచుటయే యోగమని గ్రహించవలయును

47 గోపాల భూపాల పండిత అపండిత బ్రాహ్మణ బ్రాహ్మణేతరులలో నెవరికి గాని, స్త్రీపురుషులలో నెవరికి గాని, స్థూలదేహములో వ్రణాది దారుణ వ్యాధి యుండిన వేదన అందరికిని ఒకేవిధముగా నుండునుగదా! అదేరీతిగ సూక్ష్మదేహమున (అనగా హృదయములో) దుష్టగుణములు కలవారందరును దుఃఖములో పరితపించియే తీరవలెను ఔషధ పథ్యాదులచే వ్యాధి నివృత్తించినవారు ఆరోగ్యవంతులై సుఖించునట్లు, నిర్వృత్తిని బొందిన ఆత్మ ఆనందామృతములో నోలలాడుచుండును

48 శాంతముయొక్క మాధుర్యమును, కోపముయొక్క చేదును అనుభవించి తెలుసుకోవలసినదేగాని చెప్పనలవి కాదు

49 నిర్విషయముచే గలిగెడు అమృతత్వమును, దుర్విషయముచే

గలిగెడు విషమత్వమును అనుభవించి తెలియదగినదే గాని వర్ణించుటకు శక్యము గాదు

50 సత్యము గలవాడు దూదియంత చులకనవాడైనను మహామేరువంత బలముగలవాడగును మేరువంత బలవంతుడైనను, సత్యము లేనిచో దూదియంత లాఘవము నొందును దీనిని సత్యముగా నమ్ముడు

51 ఒక చెవితో ఉపనిషత్ప్రతిపాద్య బ్రహ్మమును వినుటయు, రెండవ కర్ణముతో దీనుల దుఃఖాలాపములను విని తన్నివృత్తికొరకు ప్రయత్నించుటయు, ఒక దృష్టితో బ్రహ్మము ననవరతము దర్శించుటయు, రెండవ నయనముతో జనుల తపనమును అవలోకనము చేయుటయు, ఒక చేతితో ఇహ పరధనముల నార్జించుటయు, రెండవ కరముతో లోకమున కిచ్చుటకు ఆతురపడుటయు, ఒక పాదముతో జ్ఞాన విజ్ఞానముల నార్జించుటకు తిరుగుటయు, రెండవచరణముతో దానిని భక్తుల కిచ్చు టకు పరుగెత్తుటయేం యథార్థమైన తపస్సనియు, ఋషిమతమనియు, సనాతనధర్మమనియు మరువకుడు

52 ఎంత గొప్పవారైనను తాము ఏవిద్యగాని పనిగాని నేర్చుకొనుటకు ఉద్యమించినచో యెవరిదగ్గఱనుండి నేర్చుకొనవలసి యుండునో అట్టివారు ఎంత తక్కువవారైనను వారు చెప్పేలాగున వినమ్రులై యుండవలెను అదెట్లన? క్షౌరము చేయుసమయమున చక్రవర్తిగాని, జగద్గురువు అయినను మంగలి చెప్పేలాగున శిరస్సు, ముఖము మొదలగు నుత్తమాంగములను కూడ త్రిప్పవలసియుండును గదా! కావున కార్య సాఫల్యముకొఱకు ఎంత చిన్నస్థితిలో నుండువాని నలహానైనను అనుసరించుకొనవలయును

53 కలియుగ ప్రభావము - ఈ ప్రభావము గల గురువు గురువుల యొక్క ధర్మము తాను చూడక శిష్యులయొక్క ధర్మమును సదా చెప్పుచుండును అలాగున శిష్యుడు శిష్యుని యొక్క ధర్మమును తాను

యోచించక గురువులయొక్క ధర్మమును గురించి సదా వర్ణన చేయుచుండును ఆలాగున భార్యయొక్క ధర్మమును భర్తచెప్పుచు చర్చ చేయుచుండునేగాని, భర్తయొక్క ధర్మమును అతడు చూడడు అట్లే భర్తయొక్క ధర్మమును భార్య సదా చెప్పుచుండుగనేగాని భార్య యేలాగున నుండవలెనో ఆమె విచారింపదు అట్లే బ్రాహ్మణులయొక్క ధర్మమును బ్రాహ్మణేతరులు వచించుదురేగాని, తమ ధర్మమేమియో యూహింపరు బ్రాహ్మణేతరుల ధర్మమును బ్రాహ్మణులు దెలుపుచుందురేగాని తమ ధర్మమును లేరీతిగా నుండవలెనో అని వారును విచారణ చేయరు అదేరీతిగా గృహస్థు లుండవలసిన ధర్మమును సన్యాసులుపదేశించు చుందురే గాని, యతిధర్మమెట్టిదో వారును దెలుసుకొన ప్రయత్నింపరు అట్లే సన్యాసుల ధర్మమును గృహస్థులు చెప్పుచుందురేగాని, గృహస్థు లేలాగున వర్తింపవలెనో అది వారును మరచిపోవుచున్నారు ఇదియే కలియుగ ప్రభావము ఈ ప్రభావము లేనివారు వారి వారి దర్మములను చక్కగా నాచరించుటలో సదా నియుక్త చిత్తులై యుందురు

54 యోగ మార్గములో చాలా జాగరూకులై వర్తించవలెను అది యెండిన కట్టె పుల్లను గుండ్రముగా జేయునట్లుండును తొందరతో వంచిన విరిగిపోవును నెమ్మదిగా కొంచెము కొంచెము ప్రతిరోజును వంగతీసిన కొన్ని దినములకు చక్రాకారముగ జేయవచ్చును నిండా కఠినమైనచో చమురుతో తడిపి నిప్పుసెగపై చూపిన త్వరలో వంకర చేయవచ్చును అనగా పూర్వాహారములను మార్పు చేయునప్పుడును, క్రొత్త ఆహారములను అభ్యసించుకొనునప్పడును, ఇతర కార్యముల యందును స్నాన ధ్యానాదులు చేయునప్పుడును, ప్రాణాయామము శీలించునప్పుడును చాల నిదానముగాను, తెలివితేటలతోను చేయవలయును లేనిచో యోగము రోగముగా బరిణమించుట కవకాశము గలుగవచ్చును మెలకువతో చేయువారికి యోగము సిద్ధించును

55 క్రూరులకు ఇతర ప్రాణుల దుఃఖము సుఖదాయకముగ

నుండును దయ గలవానికి ఇతర ప్రాణికోట్ల సుఖమే సంతోషమును గలుగ చేయును కఠినులగు కిరాతకులకు ప్రాణుల వధించి బాధించుట సుఖకరముగ నుండును సజ్జనులకు జీవకోట్లకు ప్రీతి గలుగ చేయుటకన్న సుఖమైన కార్యము మరియొకటి లేదు శ్రీబుద్ధ దేవునికి దేవదత్తునిచే క్షతగాత్రముగా జేయబడిన హంసను రక్షించుటలోను, బింబిసారుని యజ్ఞపశువును ప్రాణాపాయమునుండి కాపాడుటలోను గల సంతోషమునకు మేర యుండలేదు

56 ప్రపంచ విషయములో నూది దూరునంత సందు ఈదినమిచ్చినచో, రేపటిదినము ఏనుగు దూరిపోవునంత పెద్దగా నేర్పడునని మరువకుడు

57 మీ యొక్క వ్రతము యెంత దృఢత్వము గల్గియుండునో, అంత మంచిది గట్టిగా నుండని కోటలోపలికి శత్రువులు దూరగలరు దృఢతరవ్రతనిష్ఠలో జాలి గలవారు తరింపజాలరు వీరు శిథిలమైన ఓడలో ప్రయాణము చేయువారే యగుదురు

58 సోహంపరులై యుండదలంచువారు మొట్టమొదట సోమరితనమునకు తర్పణము విడువవలెను మోక్షమార్గము సోమరులు పోయెడు త్రోవ గాదనియు, సోహంపరులు వెళ్ళెడు మార్గమనియు తెలుసుకొన్న తర్వాత మాత్రమే అట్టి పద్ధతిలో ప్రవేశింపవలయును లేనిచో తమకు క్షేమము గలుగకపోవుటయే గాక లోకములో గల ముముక్షువులకుగూడ ఆటంకము గలుగచేసినవారే యగుదురు

59 స్వభావమును మార్పుచేయుట అతి దుస్తరము అయితే తన్ను తాను మార్పు చేసుకొనవలయునని తలంపుగల్గి సదా ప్రయత్నము చేయువా డైనచో మార్పు చేసుకొనవచ్చును అట్టి విచారము లేనివారు, ఇతరు లెంత ప్రయత్నించినను మార్పుచెందరు మైనపు బొమ్మను సులభముగా మరియొక బొమ్మగా మార్పుచేసుకొనవచ్చును లక్ష్మీవిగ్రహమును నారాయణ విగ్రహముగా కరిగించి పోతపోయుటకు ఎంత ప్రయత్నమవసరమో అంత

ప్రయాస మొందిన, స్వభావమును మార్చుకొనవచ్చును అట్లు గానిచో మారజాలదు ముందుచెప్పినది ఉత్తమ స్వభావము ఇది మధ్యమస్వభావముగ నుండును అట్లు స్వయముగా మనసులో మార్పు చేసికొనుటకు ప్రయత్నము లేనివారిని బ్రహ్మదేవునికి గూడ మార్పుచేయ తరము గాదు అది శిలావిగ్రహము వంటిది ఏవిధముగానైనను మార్పు చేయ వీలుపడదు, ఇది అధమ స్వభావము గలవారి గుణముగా నుండును

60 ఒకడు ఒక గ్రామములో నుండునప్పుడు అతనికి వచ్చుచుండు తపాల ఉత్తరములు, మనియార్డర్లు యావత్తును ఏలాగున మరియొక వూరికి పోవునప్పడు, ఆ గ్రామమునకు పోస్టువారు పంపుచుందురో ఆలాగున ఓ జనుడా! నీ యొక్క సంస్కారము ననుసరించి యీ జన్మములో ననుభవించవలసినది నీ వెచ్చటికి వెళ్లినను ఈశ్వరుండచ్చటికే బంపుచుండును ఈ దైవరహస్యము తెలియక జనులు సందేహించు చుందురు ఈశ్వరనియమ మలంఘనీయము దానిని మానవుడు నిరోధింపజాలడు

61 తుచ్ఛులు తమకు దండిగా నివ్వనిచో పుణ్యాత్ములను ధర్మాత్ములను, జ్ఞానాత్ములను గూడ దూషించుచుందురు ఇది యెటువంటి దనగా, నొకబాటసారి ఒక చెట్టునీడలో గూర్చుండి చెరకు తిని పిప్పి ఉమ్మి పోయియుండెను మరియొక భిక్షగాడు ఆ చెరుకు పిప్పిని తీసి కొన్నిటిని నమలుచుండగ దానియందు రసము లేనందుచే తిని ఉమ్మిపోయిన బాటసారిని తిట్టుచు, కొంచమైన మధురము నుంచక యీలాగున నీరసముగా జేసినవాడు యెంత చెడ్డవాడుగా నుండునో అని చెప్పే లాగున నున్నది

62 కొన్ని స్థలములలో గొప్ప కుటుంబమున పుట్టిన మంచి వయస్సులోనుండు కొందరు స్త్రీలనుగాని, పురుషులనుగాని గ్రహము ఆవేశించి యుండును కొన్ని సమయములలో మాంత్రికుడు గ్రహోచ్చాటనము గావించినను పోనిచో బెత్తముతో కొట్టుటయు, నీచముగా

తిట్టుటయుగూడ గలదు ఆలాగున కొందరు గురువులు కొన్ని సమయములలో శిష్యులకు గుణము మంచిది లేనిచో, ఆదోషము నివృత్తి చేయవలెనని తలంచుటచే పై మాంత్రికుని కృత్యమవలంబింతురు మంత్రగాడు అట్లు చేయుట గ్రహావిష్టమనుజులలో గల ద్వేషముచే గాదు గ్రహముపైగల ద్వేషమే అగును ఆలాగున గురువులుకూడా ప్రకృతి గుణములు గల శిష్యులను అనగా భక్తులను సంస్కరించుట వారిపై గల విరోదముచేత గాదు బాగుపడవలెనని విశ్వాసముతో జేయుదురు వారు తమ ఆత్మవలె శిష్యులనుగూడ పరిశుద్ధులుగా జేయవలెనను తలంపుతో జేయవలయును అట్టైన మాత్రమే ప్రకృతి స్వభావమగు దయ్యము వీరిని వదిలిపోవును

63 రైలుబండి నడిపెడు డ్రైవరు ఏలాగున స్టేషను సమీపించుటకు ముందుగా దూరమునుండి సిగ్నల్ (రెక్క ఫ్రాను) వ్రాలి యున్నదా? లేదా? యని చూచుకొని బండి నడుపుటచే అపాయము గలుగ కుండునో, అట్లు చూడక నడిపినచో ఏలాగున మరియొక బండితో డీకొనవచ్చునో, ఆలాగున వివేకవంతుడు సూక్ష్మదృష్టితో, ఇంద్రియములతో మనస్సు యేదైన దృశ్యవిషయములతో తగులుచుండునా? యని సదా చూచుచుండవలయును అట్లుచూచిన యేలాటి అపాయము గలుగక మోక్షస్థానము నొందవచ్చును రెక్కఫ్రాను వ్రాలనిచో, డ్రైవరు యేలాగునబండి గమనమును నిలుపుదల చేయుచుండునో, ఆలాగున దృశ్యవిషయము లేవైనను అడ్డు తగులుచుండిన, యింద్రియార్థ విషయములనుండి మనస్సును వశీకరించి దైవభావములోనికి తీసుకొనిపోవలయును లేనిచో అపాయము గల్గుట సిద్ధము

64 ప్రపంచవిషయము లన్నియు లెస్సగా మంచిస్థితిలో నుండునపుడు చాలా అనుకూలముగాను, సుఖముగాను ఉన్నట్లుండును విషయము విపరీతముగా పరిణమించునపుడు మహా అపాయముగాను, ఘోరమగు విషజ్వాలగాను మారుచుండును అగ్ని చూచునపుడెంతో

సుందరముగానుండును ఊరిపైబడి మంట రగులు చున్నవు డెటులుండును? జలము చూచునప్పుడు మనోహరముగ నుండును వరదలుగా గ్రామముపై పడునప్పుడు ఏలాగున నుండును? వాయువును జూచునప్పుడు ఎంతోరమ్యముగ గనుపించును తుపానుగా మారునప్పుడెట్లుండును? ఈలాగున ప్రపంచ విషయములన్నియు నుండునని బ్రహ్మనిష్ఠులు తెలుసుకొనవలయును

65 జ్ఞానము కర్మజ్ఞానమనియు, ధర్మజ్ఞాన మనియు, బ్రహ్మజ్ఞానమనియు ముత్తెరగులు, దేహమునకు సంబంధించిన వర్ణములు, ఆశ్రమములును మాత్రము సత్యమనియు, అదే ముఖ్య మనియు గోచరించెడి జ్ఞానము కర్మజ్ఞానము వర్ణమును, ఆశ్రమమును గొప్పదిగా తలంపక అదెట్లుండినను వారి యాత్మగుణములను చూచి యిదే సత్యమనియు, ముఖ్యమనియు నెరింగెడు జ్ఞానము ధర్మజ్ఞాన మనంబడును ఈ రెండు విధముల జ్ఞానములకు విలక్షణమై యందరిలోను ఒకే యీశ్వరుడే వెలుగుచున్నాడనియు, అట్టి యీశ్వరుడొక్కడే సత్యమనియు, ముఖ్యమనియు గలిగెడు జ్ఞానము బ్రహ్మజ్ఞాన మనంబడును 1 ఆత్మలో పరమాత్మజ్ఞానము గోచరించుట ఉత్తమజ్ఞానము 2 ఆత్మలన్నియు అనేకములుగా నుండినను అన్నియు ఈశ్వరుని యంశములని తెలియుదగిలిన అది మధ్యమజ్ఞానము 3 ఆత్మలో ఈశ్వరుడుగాని, యీశ్వరాంశముగాని గోచరింపక దేహమును మాత్రము ఆదారపడి యుండు జ్ఞానమదమము, లేక మొదటిది దైవజ్ఞానమనియు, రెండవది మనుష్యజ్ఞానమనియు, మూడవది మృగజ్ఞానమనియు తెలియందగును

66 కృషి చేయువారెంత శ్రద్ధతోను శ్రమతోను దున్ని యెరువువేసి పోషించినను, భూమి చవిటిమట్టియైనచో ఎట్లు సరిగా ఫలింపదో, అలాగున శ్రమపడి శ్రద్ధగల్గి చేసెడు తపస్సుగాని, వ్రతముగాని, యోగముగాని, జపముగాని, ధ్యానముగాని, మననిది ధ్యాననములుగాని,

పూజాపారాయణాదులుగాని, హృదయశుద్ధి లేనిచో ఫలము నివ్వజాలవు కావున సదా హృదయములో దృష్టినుంచి సత్యమునుండియు, దైవధర్మమునుండియు, శాంతమునుండియు, విరక్తినుండియు, కరుణ నుండియు, భక్తినుండియు మనస్సు మారుదల చెందుచున్నదా యని జాగ్రత్తతో సాధకుడు చూచుచుండవలయును భూమి శుద్ధముగా నుండిన కర్షకుని ప్రయత్నమేలాగున ఫలించునో, ఆలాగున హృదయము శుద్ధమైయుండిన సాదకుని తపోవ్రత యోగాదులన్నియు ఫలించును

67 మంచి శూరులును, సాయుధ ప్రాణులను, బలవంతులునగు సైన్యముచే సంరక్షింపబడిన కోట యేలాగున శత్రువులచే ఆక్రమించ బడుటకు సాధ్యము గాదో ఆలాగున ఎవరి శరీరములో బ్రహ్మచర్యము శుద్ధముగా నుండునో వారి శరీరములో రోగాణువులు ప్రవేశింపజాలవు అంతేగాక యెండ, వాన, గాలి, మంచు మొదలగు వానిని గూడా సహించెడు శక్తిగూడ గల్గియుండును, నఖాగ్రమునుండి శిరస్సు పర్యంతము ఈ బ్రహ్మచర్య జీవాణువులు మహాతేజోవంతములై, చైతన్య వంతములై సంచరించు చుండును, మరియు నమోఘు మేధా సంపత్తియు గూడ వృద్ధిపరచును మనోదుర్బలత్వమును పారద్రోలును జ్ఞాపకశక్తిని, జ్ఞానశక్తిని హెచ్చు చేయును జీవితదశలో ఇహ పరములకు సార్థక సాధనము ఇది తప్ప మనుష్యునికి మరియొకటి లేదని ప్రతివారును గ్రహించుకొన వలయును

68 ఒకే ధర్మమందుగాని, ఒకే గురువునందుగాని, ఒకే దైవమందుగాని, సత్యమునందుగాని దృఢమైన నమ్మకము లేనివానిగతి రెండు పడవలలో ప్రయాణమ ' చేయువానిగతి వంటిదే యగును

69 దయ్యము సోగినవారు గొప్పమాంత్రికుని పేరును స్మరించుచుండిన గ్రహము బాధింప నట్లును, పాము కరచినవారు గొప్పపాముల మంత్రగాని పేరు నుచ్చరించిన విషము ఎక్క నట్లును, మాయ యనెడు దయ్యము సోకిన వారును, విషయమనెడు దోషము

కల్గినప్పుడును భవరోగ వైద్యుడైన పరమేశ్వరుని భక్తిభావముతో స్మరించిన చాలును అట్టిన మాయామోహము గాని, విషయదోషములు గాని హృదయములో గలుగవు

70 కొన్ని మన్నెపు (మలేరియా) జ్వరము మొదలైన శల్యగత వ్యాధులు గలవు, అవి ఔషధ సేవచే శమించినట్లుండును ఆహారము, అనుపానము, శరీర పరిశ్రమము మొదలైన మార్పులు కొంచెము కల్గిన వెంటనే వ్యాధిగా బరిణమించును ఆలాగున ప్రకృతిదోషము గూడ గొప్ప అస్థిగత వ్యాధివంటిది మంచినిష్ఠ, ధ్యానము, జ్ఞానము, భక్తిగల్గియుండువఱకు అణగియుండును ఏదైన విషయము తటస్థించినప్పుడు మరల అట్టి ప్రకృతిగుణములు కలుగును కావున ముముక్షువు లెల్లప్పుడును జాగరూకత గలవారలై యుండవలయును, దృశ్యవిషయములతోను, చెడువిషయము గలవారితోను సంబంధము గలుగ చేసికొనకుండులాగున సదా వర్తించవలెను

71 మనస్సును ఎల్లప్పుడును ఒకే నిర్మల స్థితిలో నుంచనివారి జప ధ్యాన పూజా భజన యోగాదులన్నియు గజస్నానము వంటివే యగును ఆ జంతువును ఎంత శుద్ధముగా స్నానము చేయించినను, సుందరమైన తిలకమును దిద్దినను వెంటనే మట్టిని దుమ్మునుశరీర మంతటను చల్లుకొనును ఆలాగున జరుగ నీయక జిజ్ఞాసువులు, ముముక్షువులు, భక్తులు చూచుకొనుచుండవలయును లేని కారణము చేతనే కొందరు చిరకాలము నుండి దైవమార్గములో ప్రవర్తించినవారలయ్యు శుద్ధాత్ములు గాకపోవుటకు కారణమగుచున్నది కావున ధ్యాన, జప,యోగ,భజన పూజార్చనాదికాలములో ఏలాగున పవిత్రులై యుందురో ఆలాగున ఎల్లప్పుడును నుండేలాగున చేసుకొని మనో మాలిన్యమును గలుగచేసెడి కోప, తాప, అసత్య, మోసపుకృతములలోనికి మనస్సును జారనీయక చూచుచుండవలయును

*72 శాంతముతోను, ప్రీతితోను మాట్లాడుడు ఇది అమృతముకన్న ఎక్కువ సారమైనది

73 కోపము గలవారి జీవితములో గల అనుష్ఠానములన్నియు కళాయిలేని పాత్రలో వండిన పప్పుపులుసుకన్న ఎక్కువ నీచమైనవని మరువకుడు

74 విరక్తిలేని వారి యోగాద్యనుష్ఠాన సాధనలన్నియు, చవిటి భూమిలో చేసిన కృషివలె వ్యర్థమగునను తలంపుతో ముముక్షువులు వర్తించవలయును

75 శరీరములో సర్పము మొదలైనవాటి విషము గలవారు స్త్రీలుగాని, పురుషులుగాని, సన్యాసులుగాని, సంసారులుగాని, బ్రాహ్మణులుగాని, బ్రాహ్మణేతరులుగాని, భూపాలురు గాని, గోపాలురుగాని, యేలాగున సర్వదా నొప్పితో సంకటపడుదురో ఆలాగున ఎవరి హృదయములో విషయదోష ముండునో వారు తపింపక మానరు

76 వృక్షము పుష్పింప ప్రారంభించునప్పుడు ఏలాగున ఫలమునకు కాలమాసన్నమైయుండునో, ఆలాగున ఎవరి హృదయము శాంతముతోను, భక్తితోను వికసించునో, వారికి జ్ఞానఫలము గలిగెడు కాలము సమీపించియుండును

77 ఒక్కరోజు రైల్వేదారి ప్రక్కనుండగా అతివేగముగా వచ్చుచుండు రైలుబండియొక్క గమనము క్రమముగా తగ్గి నిలిచి పోయెను కారణము విచారించగా బండి నడిపెడు డ్రైవరు త్రాగుబోతగుటచే, ఆవిరిని తెలిపెడు మీటరును చూడక అజాగ్రత్త నొందినందున స్టీము (ఆవిరి తగ్గిపోయినందున

---

*72వ సంఖ్య--- ఇంతకుముందు 'ధ్యానము' అను శీర్షిక క్రింద దీనిలో ముద్రించిన వ్యాసము 'స్వబోధసుధాకరము' అన్న గ్రంథములో ముద్రింపబడియున్నది గాన ఇక్కడనుండి తొలగించడమైనది

బండి నిలుపడమైనదని తెలియవచ్చెను వెంటనే ఆసంగతి కనుగొని డ్రైవరును, ఫైర్మేనులును నిప్పుయెక్కువ చేసినందున కొంచెము సమయమునకు యథాశక్తి స్టీము ఎక్కి బండి క్రమప్రకారము వేగముగ వెళ్ళిపోయెను అదేరీతిగా ఎంత వైరాగ్య ధ్యాననిష్ఠ గలవారైనను, అనుష్ఠానములో లోపమువచ్చిన పురోగమనము ఆగిపోవును ఒక్కవేళ అట్లు గల్గినను నిలిచిపోవక పూర్వము రీతిగా తీవ్రవైరాగ్య మవలంబించి సాధనలో త్వరపడిన గమ్యస్థానము చేరవచ్చును

78 దుర్గుణములు అతి సూక్ష్మతరముగా వచ్చి చేరునని తెలియదు అణువుగా నుండినచో వెంటనే నివృత్తిచేయ చూడవలయును, లేనిచో, త్వరలో సమూలముగ నశింపచేయును ఎట్లన చెదలు పుట్టునప్పుడు కొంచముగా కనుపించినను కొలది రోజులలో కొయ్యను సంపూర్ణముగా తినివేయును

79 విషయవృత్తి సాంక్రమిక కలరా ప్లేగు మొదలైన క్రిములవంటిది అతి తీవ్రముగా క్రిములు వృద్ధియై జీవహాని చేయునట్లు విషయ బుద్ధి గల్గిన వెంటనే శమనము చేసుకొనవలయును లేనిచో నిమిషములో పెరిగి ఆత్మహాని గలుగచేయును ఎట్లన, ప్లేగు మొదలైన జాడ్యములను కనుగొని తీక్ష్ణఔషధమును వెంటనే వాడకపోయిన వ్యాధి అధికరించి పోవునుగదా!

80 మంచిచేవ గల బలమైన చందన వృక్షాదులు తగరపుకత్తిచే నరికిన యేలాగున తెగజాలవో ఆలాగున సామాన్య బాహ్యభక్తి వేషాదులచే బలమైయుండు చిత్తవృత్తులు తెలగజాలవు ఉక్కుతో చేయబడిన మంచివాడి గల పెద్ద గొడ్డలిచే ఎట్టివృక్షములైనను ఎడతెగక నరుకగల్గునట్లు తీవ్రవైరాగ్యబోధోపరతులు గల మనస్సు చేతనే అంతః కరణ వృత్తులను సమూలోచ్ఛేదనము జేయగల్గును

81 నిప్పపుల్లలో నిప్ప నిండుగా నుండినను, నీటిలో తడిసియుండిన ఎన్ని సార్లు గీచినను మండని చందమున హృదయమందు భగవత్కళ నిండి వెల్గుచుండినను, విషయవిరక్తి గల్గు వరకు ఎంతధ్యానించినను,

ప్రార్థించినను ఆత్మదర్శనము గలుగదు

82. అశ్వత్థవృక్షము మొదలైనవాటి కోటరములో చెట్టు మొదలైనవి మొలిచి పెరిగి పెరిగి అసలు వృక్షమును నశింపజేసి అట్టి స్థానములో తొఱ్ఱలోపుట్టిన చెట్టు నిలుచునట్లు సాక్షాత్ దైవమయమగు హృదయములో ప్రాపంచిక దుర్గుణములు గల్గెనేని ఆత్మను మరుగుపరచి, అహంకారము వానము చేయును అనగా సోఽహంకారమును గనుపరచనీక దురహంకారమే గానుపించుననుట వృక్షముయొక్క కొమ్మలో మరొక చెట్టు పుట్టిన, వెంటనే తీసివేసినచో, అసలు మ్రానుకు హాని గలుగని చందముగ హృదయములో ప్రపంచ వృత్తి గల్గిన వెంటనే తొలగించువారు ధన్యులగుదురు ఒక్క తరి వర్షాకాలమున గాలి వీచుచుండగా గొప్ప అశ్వత్థవృక్షము ఒకటి చీలిపడి పోయినది చూచితిని దానియందు జువ్విచెట్టు పుట్టినందున ఇట్టి స్థితి గలిగినదని తెలుసుకొంటిని

83. ఒక్కరోజు పర్వతప్రాంతమున కూర్చుండి ధ్యానించునప్పుడు మంచి వర్షము కురియుచుండెను అప్పుడు ఆ కొండ చాలా భాగము పటపటమని పగిలి పడిపోయెను కారణమరయుటకై దగ్గరకు పోయిచూడగ రాతిలో ఎచ్చటనో అతిసూక్ష్మమైన నెఱ్ఱిలో చెట్టువేరు సన్నది దిగి క్రమముగా బలపడి పెద్దదై నెఱ్ఱి యెక్కువై వర్షము కురిసినందున పడిపోయినదని గ్రహించితిని మొట్ట మొదట ఈ నెఱ్ఱిలో సూక్ష్మమై బంకవలె అతి మృదువైయుండు వేరు దిగియుండెను కాలాంతరముచే గలిగిన గతి చూచినారా! అదేప్రకారము ఎంత వైరాగ్యముగాని, యోగబలముగాని యుండినను విషయవాసన అతి స్వల్పము గలిగినను అది మహామేరువంత ధీరునిగూడ ధ్వంసమొనర్చునని మరువకూడదు ఈ పర్వతావస్థ గోగర్భములో నుండగ చూచితిని

84 జనుడా ! నిశ్వాసోచ్ఛ్వాసములు బైటపోవునట్లు మీ మనోభావముగూడా బైటికి పోవుచుండును శ్వాసోచ్ఛ్వాసములను నిలుపగలుగుదురేని, మీ మనోవృత్తులు గూడ ఎవరున్ను తెలియజాలరని జ్ఞాపకములో నుంచుము తుపాకిచే కాల్చునప్పుడు శబ్దమునకు ముందుగా

గుండ్లు బైటికిపోవునట్లు మీ సంకల్పము మీకు తెలియకనే లోకము తెలిసికొనుచుండును అనగా మనస్సు శుద్ధము లేక హృదయశుద్ధి గల వానివలె నటింపకుము

85 అపరంజి బంగారుగిన్నెలో నిమ్మరసముగాని, చింతపండు రసముగాని పెట్టిన చిలుముపట్టదు దానియందు రాగిగాని, యిత్తడిగాని కలిసియుండిన వెంటనే చిలుము పట్టునుగదా! ఆలాగున మీరు విశుద్ధాంత కరణులైనచో ఎట్టి విషయములచేతను వికారము నొందజాలరు విషయసంసర్గముచే మనోవికారము గల్గుచుండిన పరిశుద్ధులు గాలేదని గ్రహించవలెను

86 సువర్ణపరీక్షకుడు మలినబంగారమును ద్రావకములో పెట్టిగాని, పుటముచేసిగాని, శుద్ధపరచునట్లు నిర్విషయస్థితి గలుగు వఱకు మనన నిదిధ్యాసనములతోను, దారణాధ్యాన సమాధులతోను తీవ్రతర అనుష్ఠానము చేయచుండవలయును

87 వృత్తులు ఇంద్రియ సమూహములని తలంచి నిర్విషయ స్థితినొందుటకు ప్రయత్నింపని వేదాంతము అపాయకరమని మరువకూడదు ఇది దొంగపని చేయువానితో ఈపని మీకులవృత్తి యని బోధించెడు చందమున నుండును వీరు కారాగృహమున ఎప్పుడైనను పడిపోవక తప్పదు

88 మనోజయము గలవాడే బలవంతుడు మనోజయము లేనివా డెంత బలవంతుడైనను బహుదుర్బలుడే ఒక్కరంధ్రముగల పాత్రలోని జలము వేగముగా నశించుచుండగా పది ద్వారము లేర్పడిన పాత్రలోగల జలము ఎంత త్వరలో నశించునో, అదేప్రకారము ఒక్క ఇంద్రియము వశపడనిచో జ్ఞానము క్షయించుచుండగా దశేంద్రియములు వశీకృతములు గాని అభ్యాసియొక్క జ్ఞానము ఎంత త్వరలో నశించునో విచారింపుడు

89 ఒక కథ - ఒక ధనవంతుడు సంయమీంద్రుడగు ఒక్క

మహాత్మునియొద్దకు అప్పుడప్పుడు వెళ్ళి ఉపదేశ మడుగుచుండెను ధన వంతునకు మనస్సు పరిపక్వము గానందున మరల ఉపదేశించెదనని ఆమహాత్ముడు చెప్పుచుండెను ఇట్లు పలుమార్లు చెప్పుటచే, ఒక్కరోజు ధనికుడు ఆయాసముతో నిట్లనెను నేనెన్నియోసార్లు వచ్చినను, మీరు అలక్ష్యభావము చేయుచున్నారని పలికి ఊరకుండెను అప్పుడు ఆ బ్రహ్మనిష్ఠుడు తన కుటీరములో ఒక ప్రమిదలో దీపము పెట్ట సెలవిచ్చెను ఆ దినము వర్షము కురిసినందున వత్తి తైలము యావత్తును తడిసియుండెను ఇదే మంచి తరుణమని తలంచి త్వరలో దీపము వెలిగింపుము, ధ్యానము చెప్పెదనని మహాత్ముడు నుడివెను ధనవంతుడు ఎన్నిసార్లు వెలిగించినను వత్తిగైరా తడిసియుండుటచే మండకపోయెను మహాత్ముడు అత్తరి యేమి? సమయమైనది దీపము ముట్టించలేదా అని అడుగగా ధనవంతుడు స్వామీ! ప్రమిద, వత్తి, నూనె యావత్తును నీటిలో తడిసియుండుటచే ఎన్నిసార్లు వెలిగించినను మండుట లేదని చెప్పెను అట్టైన అదంతము పారవేసి ప్రమిదను శుద్ధముగా తుడిచి మంచి చమురు బోసి నిర్మలమగు వత్తినుంచి వెలిగించుమని చెప్పుటచే అదేప్రకారముగా చేసిన వెంటనే దీపము శుద్ధముగా వెలిగెను అప్పుడు ఆ మహాత్ముడు తమ కుపదేశ మైనది వెళ్ళవచ్చునని బోధించెను

90 జనులారా! గమనించవలయును ఏ వృక్షమునుండి యెక్కువ ఫలము లభించునో అది ఫలించుటకు ఎక్కువ కాలము పట్టును ఏ వృక్షములు త్వరలో ఫలించునో అవి శీఘ్రములోనే నశించునుగదా? దృష్టాంతముగా పనస, మామిడి, కొబ్బరి చెట్లు ఫలము నిచ్చుటకు కాలము అధికము పట్టును కాని బహుకాలమువరకు ఫలము నిచ్చును మిరప, వంకాయచెట్లు త్వరలో ఫలమునిచ్చినను, శీఘ్రంకాలములోనే నశించునుగదా? అదేరీతిగా, మీరు శాశ్వత ముక్తిఫలము నిచ్చెడు మోక్షమనెడు కల్పవృక్షమును పెట్టియున్నారు కావున అది ఫలము అనంతకాలమువరకు ఇచ్చుచుండును అది ఫలించుటకు కాలమధికము పట్టును

91 దైవమునకును, దయ్యమునకును, ఉత్తర ధ్రువ దక్షిణ ధ్రువముల దూరము గలదు దైవగుణముగలవాడు దైవత్వము నొందును దయ్యపుగుణము గలవాడు దయ్యమునే చెందును

92 వర్షజలము స్థలభేదములచే ఎన్ని మార్పులు చెందుచున్నదో చూడుడు ముత్తెపుచిప్పలో జలముపడిన ముత్యముగాను, శుద్ధస్థలములో పడిన జనులకు స్నానపానములకు యోగ్యముగాను, మరుభూమిలోపడిన వ్యర్థముగా నగుచున్నది అదేరీతిగా మహాత్ముల ఉపదేశము, పుణ్యపురుషులలో పడిన జ్ఞానరత్నముగాను, సామాన్య జనులలో పడిన ధర్మాత్ములుగాను, విషయాసక్తులలో పడిన వ్యర్థముగాను అగుచున్నది

93 మంచి విత్తనమైనను, సుక్షేత్రమైన మంచి ఫలితముగాను, సామాన్య స్థలములో సామాన్య ఫలితముగాను, ఊషరభూమి యైనచో వ్యర్థముగాను అగునట్లు కారణగురువుల ఉపదేశమైనను, ఉత్తమ మధ్యమ అధమాధికార భేదముచే ఫలితమున్ను వేరు వేరుగాను అగుచుండును

94 సత్పురుషులు ఎట్టి హీనస్థలములలో నుండినను, వారిదృష్టి ఆత్మాభిముఖమై యుండును ఎట్లన, నిప్పు ఎంత నీచస్థలములో నుండినను జ్వాల ఊర్ధ్వగామిగా పోవునేగాని అధోమార్గము గాజాలదుగదా! దుర్జనులు ఎంత మంచి స్థలములలో నుండినను తమయొక్క నీచస్వభావమును మానరు జలము ఎంత పవిత్ర స్థలములో నుండినను క్రిందికి పోవుచుండునేగాని పైకి పోవజాలదుగదా!

95 పగలంతయు ఇంటిలో కట్టబడియుండు ఆవుదూడను సంధ్యాకాలము వచ్చుతరి పాలు పితుకుట కొఱకు తల్లి గోవువద్ద విడిచి పెట్టిస్తనములో పాలువచ్చుచున్నపుడు, పిండుట కొఱకు దూడనుపట్టి లాగునప్పడు అది వచ్చుటకు ఎంత ప్రయాసముగా నుండునో, అదేరీతిగా ఎవని మనస్సు ధ్యానానందమునుండి అనివార్యకార్యములకైనను బహిర్ముఖమునకు వచ్చుటకు కష్టముగా కనుపించునో అట్టిమనస్సు

దైవామృతమును పానము చేయుచున్నదని తెలుసుకొనవలయును వీరికి మోక్షము అనగా దైవసుఖము కరతలామలకము బంధము తెగిన ఆత్మకు మాత్రమే ఇట్టి యవస్థ గలుగును

96 శుక్లపక్షచంద్రుడు వృద్ధి నొందగ నొందగ చీకటి శమించునట్లు సత్త్వగుణాభివృద్ధి గలుగుచుండగా జగద్భ్రాంతి అనగా లోక వ్యవహారము తగ్గిపోవుచుండును అనగా, అనాత్మబుద్ధి నశించుచుండును

97 ఏ కాయ అయినను బాగుగపండునప్పడు, మెత్తపడి మధుర రసము కారుచుండునట్లు, ఎవనికి దైవ విషయములో ఆనందబాష్పములు, జీవకోట్లయెడ ఎక్కువ కరుణ మృదుస్వభావము గలుగుచుండునో, అట్టి ఆత్మ పరిపక్వ స్థితినొందినదని గ్రహించవలెను అతడు ఈజన్మములోనే ముక్తుడు గావచ్చును

98 సాధారణ బ్రహ్మనిష్ఠులుగూడ చేయుకార్యము, చెప్పమాటలు మొదలైనవి స్వభావమని వచింతురు అది మనస్సును గురించియో బుద్ధిని గురించియో, కులమును గురించియో ఉండును అప్పడు అట్టి ఉపాధులు ఇంకను నశించి యుండలేదని గ్రహించవలెను స్వభావముయొక్క అర్థము స్వరూపాత్మయై యుండవలయును ఇది గ్రహించనిచో బంధనివృత్తి కాజాలదు "స్వస్య భావః స్వభావః" తక్కిన వన్నియు కల్పితములు, అస్వభావమని సదా జ్ఞప్తిలోనుంచి వర్తించువారు ధన్యాత్ములగుదురు ఆత్మాభ్యాసముచేత అనాత్మాభ్యాసమై చిరకాలముగా నుండెడు స్వభావమును మార్చుకొనవలయును

99 లక్ష్యము, అనగా గమ్యస్థానములోగల దృష్టి సదా లేనిచో అట్టివారి ఇతరానుష్ఠానములన్నియు గొప్ప ఫలమును ఇవ్వజాలవు, ఎట్లన చుక్కానివానిచేతినుండి చుక్కాను జారిపోయిన వెంటనే పడవ మార్గము తప్పిపోవునుగదా! మరియు చుక్కాని లేనిచో తక్కిన ప్రయత్నము లన్నియు వ్యర్థములు గావా!

100 పెద్దపులిచే తరుమ బడినవాడు వృక్షమునెక్కి కూర్చుండగా అతనికై నిరీక్షించుచు చెట్టు క్రింద కూర్చుండు పులిని చూచిన వాడైనచో, ఏలాగున నిద్రాది ప్రమాదములను నొందక జాగరూకుడై యుండునో అదే ప్రకారము తురీయస్థినుండి సంకల్పమనెడు ప్రకృతిలోనికి రానివానియొక్క నిష్ఠయే శ్రేష్ఠమైనదని తలంచవలెను

101 తుపానుచే సముద్రజలము పొంగి భూమిపైకి వచ్చునప్పడు దానితో మత్స్యములు గూడవచ్చుచుండును జలము మరల సముద్రములోనికి వెళ్లిన తర్వాత భూమి పైపడియుండు మీనములు నీటిలోనికి పోయిచేరుటకు ఏలాగున పరితపించునో ఆలాగున ప్రకృతిచేత ఆవరింపబడిన జీవుడు పరమపురుషుడగు భగవంతునిలో ప్రవేశించుటకు లేక సచ్చిదానంద సారామృతములో మునుగుటకు పై చెప్పిన మత్స్యము వంటి మనోవృత్తి గలిగి యుండుటయే తీవ్రవైరాగ్యమనియు, లేక తీవ్రతర భక్తి యనియు గ్రహించవలయును

102 విషసంపర్కము గలిగినవానికి ఏలాగున క్రమముగా స్మృతి తప్పిపోవునో, అదేరీతిగా విషయ సంసర్గముగల వారికిగూడ స్వబోధము నశించును అనగా తానెవడు? ఎట్టి స్థితిలోనుండువాడు? ఇప్పడు ఏ కార్యమునకు ప్రవేశించియున్నాడని తెలియజాలడు

103 గ్రహావిష్టులైన వారెవరైనను స్వభోధము మఱచి ఆ దయ్యపు చేష్టలు ఏలాగున చేయుచుందురో అదే ప్రకారము మాయా మోహితులైనవారు స్వప్రజ్ఞానరహితులై ప్రకృతియొక్క చేష్టయే చేయుచుందురు మాంత్రికునిచే గ్రహవిమోచనము గలుగునప్పడు అతడు తనయొక్క జరిగిన స్థితిని గుఱించి ఏలాగున పశ్చాత్తాపపడునో, అట్లే మాయావిమోచనానంతర ఆత్మైక్యబోధము గలుగునప్పడు, వ్యర్థముగ జరిగిన జీవితమును గురించి సంతాపము గలుగును దయ్యమును పారద్రోలిన మాంత్రికుడు రక్షా రేకు నొక్కదానిని కట్టవలయును లేనిచో ఆ దుష్టపిశాచి మరల బాధింపవచ్చును అదే ప్రకారము గురువులు

శిష్యులకు ఆత్మబోధము గలుగచేసిన చాలదు మంచి నియమ పద్ధతిని ఏర్పాటు చేయవలయును అట్లైన మరల భయము లేదు

104 చిన్నపిల్లవాడు గొప్ప మహాత్ముని పటము చూచిన, ఏలాగున వారి మహిమ ఎఱుంగ జాలక పటముయొక్క అందమును చూచి ఆనందించునో, తర్వాత పెద్దవాడైనప్పడు పటముయొక్క సుందరాకృతిలో మనస్సు రమింపక ఆ మహాత్ముని ఆత్మజ్ఞానము, కరుణ, శాంతము, వైరాగ్యము, లోకసేవాది కార్యములలో వాని మనస్సు రమించునో, అదే ప్రకారము ప్రబోదమైన అవస్థ గలుగువరకు సాకారభక్తిలో మనస్సు రమించునే గాని అనంతరము నిరాకార భక్తియందే చిత్తము రమించును కావున మొదట సాకారభక్తి యేర్పడిన రహస్యమని మరువకూడదు అట్టి సగుణభక్తి లోకమునకు అత్యవసరము

105 నిప్ప మంట వేయ తలంచువారు కట్టెలు ఎంత అధికముగా చేర్చుదురో అంత గొప్పమంట గల్గునట్లు ఎవరికి ప్రారంభదశయందే ఎక్కువ వైరాగ్యభక్తి, శాంతి దయాదులు గలిగియుండువో వారు లోకములో అంత గొప్ప జ్ఞానవంతులగుదురు సంశయము లేదు

106 ఒక్కరు సమారాధనకు సామాగ్రులు ఎంత అదికముగా సమకూర్తురో వారు, అంత అదికజనులకు భోజనముపెట్టి ఆకలిని శాంతి పరచు శక్తి గలిగియున్నట్లు, ఒక్కరు సాధన కాలమందు ఎంత గొప్ప వైరాగ్య, ధ్యాన, యోగ తపశ్చర్యలు శీలించుదురో, వారు తప్పక అంత అదిక జనుల తాపత్రయమును శమింపచేసి ఆత్మశాంతి గలుగచేయుటకు శక్తి మంతుల గుదురు

107 ఆత్మసుఖము పొందవలసియుండిన ఉపాయమొకటి గలదు అది యేమన? మనుష్యులలోగాని, జంతువులలోగాని, వస్తువులలోగాని కల చెడుచూడక మంచిది మాత్రమే చూడవలయును అప్పడు అట్టి జనులయందు తనకు ఆనందము గలుగును చెడును చూచిన వెంటనే, దుఃఖవరమగు విరోధముచే బాధకలుగును అది మిథ్యాదృష్టి

యనంబడును అనగా దైవదృష్టి గలిగినప్పుడు, అఖండైక సౌఖ్యము ఆవిర్భవించును జ్ఞానదృష్టియనియు, అజ్ఞానదృ,ష్టియనియు, విజ్ఞానదృష్టియనియు దృష్టి మూడు విధములు ఒక్కరిలోగల మంచి గుణమును మాత్రము చూచుట జ్ఞానదృష్టి యనియు, చెడుగుణములను చూచునది అజ్ఞాన దృష్టియనియు, దైవమును చూచునది విజ్ఞాన దృష్టియనియు గ్రహించవలెను

108 తామరపుష్పము కోయువారు పుష్పము మాత్రము కోసికొని వచ్చిన చాలును క్రిందికి దిగి చూచినచో అచ్చట బురదయు, పాచియు, కప్పలు, పాములు మొదలైనవి యుండును ఆలాగుననే పుణ్యపురుషుల యందును, పుణ్యాశ్రమ, పుణ్యక్షేత్ర పుణ్యతీర్థములలోను గలదని గ్రహింప వలయును

109 వస్త్రములలో రంగు అద్దదలంచువారు ముందుగా ఏలాగున వస్త్రములలో గల మాలిన్యము వగైరా ఉతికి శుభ్రపఱచి రంగులో అద్దుదురో, అదేరీతిగా బ్రహ్మవిచారము చేయుటకు ముందుగా, పుణ్యకర్మానుష్ఠాన భక్తివైరాగ్యాదులచే అంతఃకరణ శుద్ధి గలుగచేసికొనవలయును వస్త్రములలో మాలిన్యము నివృత్తి చేయక రంగు అద్దిన నీళ్లలో తడిసిన వెంటనే వదలిపోవునట్లు నిర్విషయస్థితిని చెందని వారి బ్రహ్మవిచారము రూఢిగ సుస్థిరత నొందజాలదు

110 ఎక్కువ వ్యాధి గలవారికి ముందుగా విరేచన ఔషధ మిచ్చిన తర్వాత రోగమునకు మందిచ్చినట్లు, బ్రహ్మసాక్షాత్కారజ్ఞానమును బోధించుటకు ముందుగా సత్కర్మానుష్ఠాన సదాచారముల నుపదేశించవలయును రోగియైన వారికి చెడునీరు శరీరమందుండగ ఔషధమేలాగున పట్టదో ఆలాగున వైరాగ్య భక్తి గలుగనివానికి బ్రహ్మసాక్షాత్కార ధారణాధ్యానములు బోధించినను నిలువజాలవు

111 జనుడా! నీయొక్క కర్మానుష్ఠాన ఫలము నీవు జన్మ మెత్తుటకు ముందుగానే జగదీశ్వరుండు భూలోకమున కంపియున్నాడు మరల యేల

సంకట పడెదవు? చూడు, పశువులు మొదలుగాగల జంతువులు పుట్టుటకు ముందుగానే వాటి తల్లుల స్తనములలో పాలు సర్వేశ్వరుండు ఏర్పరచిన తరువాతగదా అవి పుట్టుచున్నవి కావున జన్మసార్థక్యము కొఱకు మాత్రము బుద్ధిపూర్వకముగా ప్రయత్నింపుము

112. దైవము మీకొఱకు ఏర్పరచియుండు భాగ్యభోగ్యములు ఎవరి చేతను అపహరింప తరము గాదు అనగా నశింప చేయ అలవికావు ఎట్లన మీరు నడచిపోవునప్పుడు మీ యొక్క నీడను ఎవరు నిలబెట్ట గలుగుదురు?

113 సంపూర్ణముగా జీవితము దైవార్పితము చేయనివాడు పరమ భక్తుడుకాని, గొప్పజ్ఞానిగాని గాజాలడు అట్టి అవస్థ గల్గువరకు సంపూర్ణ సౌఖ్యము జీవులకు గలుగదు సేవకుడైనవాడు సంపూర్ణ రక్షకత్వము యజమానునిపై భారమునుంచువరకు వీనియొక్క సర్వవిషయములున్ను యజమానుడు నిష్ఠగా జూడడు గదా!

114 స్వల్పగుణము గలవాడు గొప్ప స్థలములోకి వెళ్ళినను తనయొక్క క్షుద్రగుణానుసారముగానే ప్రవర్తించును కుక్క గంగాస్నానమునకు వెళ్ళినను తన స్వభావ గుణమగు నాలుకచే నీళ్ళు నాకి త్రాగెడు గుణము మారదు గదా!

115 ఏ మానవుని ఆత్మ దైవముతో ఐక్యమునొందునో, అట్టివానికి దైవజ్ఞానము అనర్గళముగా గలుగుచుండును విద్యుచ్ఛక్తి యంత్రముతో ఐక్యపరచిన మాత్రముగదా, స్కాంతదీపము వెలుగుచుండును ఇట్టి విషయము చదువుకొనిన వారికి, లేనివారికిని, పురుషులకును, స్త్రీలకును సమానము గానే గలుగుచుండును

116 మనస్సులో భక్తివిశ్వాసములు గలవాడు గురు సమీపమున లేకయుండినను విరోధము లేదు భక్తివిశ్వాసములు లేనివాడు దగ్గర నుండినను ప్రయోజనము లేదు విద్యుద్దీపయంత్రముతో తగిలించియుండు

దీపతంతి ఎంతదూరమున నుండినను అచ్చట దీపము చక్కగ వెలుగుచుండును యంత్రముతో అమర్చని దీపము దగ్గరనుండినను మండదు గదా!

117 ప్రాణికోట్ల ఆత్మ సంరక్షణయందు ఎంత అనురక్తి గలిగియుండునో అట్టివానికి ఈశ్వరుండు అపారజ్ఞానమును, కరుణయు, శాంతియు, భక్తియు, విరక్తియు, దైవశక్తియు గలుగజేయును ప్రజాసంరక్షణశక్తిని చూచిగదా ప్రభువు ఉన్నతోద్యోగము నిచ్చును!

118 జనులారా! దైవమహిమను ఎరుంగజాలక సంకట పడుచున్నారు ఒక్కబీజము మొలకెత్తి భూమినుండి ఆహారము వ్రేళ్లద్వారా గ్రహించు శక్తి గలుగు వరకు దానికి జీవనము విత్తనములో అమర్చిపెట్టి యుండుట చూడలేదా? అట్లుండగా ఉత్కృష్టజన్మము గల మానవునికి జగదీశ్వరుండు కొరత చేయునా? కావున మీకు తగిన కర్మఫలమును సర్వేశ్వరుండు జన్మముతో సహా పంపియున్నాడు ఆ విషయమై పరితపింపక కర్తవ్యమును నిర్వహించి దైవకరుణ గలిగి జ్ఞానము కలుగుటకు పరితపింపుడు

119 సంకల్పభేదములు -1 మృగసంకల్పము 2 మనుష్యసంకల్పము 3 దేవసంకల్పము 4 సిద్ధసంకల్పము 5 ఈశ్వర సంకల్పము 6 నిస్సంకల్పము ఈ 6వది యగు నిస్సంకల్పమే బ్రహ్మసాక్షాత్కారము గలుగజేయును 1 మృగసంకల్పావస్థలోనుండు జనుడు ఎట్టి ధర్మకార్యమైనను విచారింపడు ఒక వేళ ప్రయత్నించినను ఎంత ప్రయాసపడినను నెరవేరదు అట్టి అవస్థలో ఇతరుల ధనము ధర్మవిషయమై సంపాదించిన తనయొక్క సౌఖ్యమునకే యెక్కువ వినియోగపరచెడు బుద్ధి గలిగియుండును వీనికి దేహేంద్రియ సుఖముల కన్న ఎక్కువగ సత్యధర్మముల సుఖమును, దైవసుఖమును గోచరింపదు 2 మనుష్య సంకల్పము - వీడు ధర్మ విషయమై జనులను ఆశ్రయించి తిరిగి తిరిగి బోధించి వచ్చిన రెండు మూడు సంవత్సరములలో శ్రద్ధతో పనిచేసిన వాని

ఉద్యమము నెరవేరును అట్టితరి వాని యవస్థ సత్యధర్మములో ఎక్కువ విశ్వాసమును, దైవమందు భక్తియు గలిగియుండును అయినను ధర్మవిషయమైన యింద్రియ సౌఖ్యముల ననుభవించుకొని జీవిత పవిత్రత కొఱకు పాటుపడును అయినను ధర్మకార్యములో తనయొక్క దనము ఎక్కువ ఖర్చుపెట్టడు కొంతవరకు వినియోగపరచును పరులిచ్చిన సొమ్ము ఒక పైసయైనను తాననుభవించవలయునను తలంపు ఉండదు వీడు ప్రారంభించిన ధర్మకార్యము రెండుమూడు సంవత్సరములలో నిర్వహింప గలుగును వీనికి రజోగుణము కొంచెముగాను, సత్త్వగుణము ఎక్కువగానుండును ముందుచెప్పిన మృగసంకల్పము గలవానికి సత్త్వగుణముండదు తమో గుణమెక్కువగాను, రజోగుణము కొంతవరకు ఉండును 3 దేవసంకల్పము అనగా ఇంద్రాది దేవతల అవస్థయని ఇచ్చట గ్రహించవలెను అట్టివానికి సత్త్వగుణము ఎక్కువగాను, రజోగుణము కొంచెముగాను నుండును తమోగుణముండదు వీడు దర్మకార్యము కొరకై జనులను ఆశ్రయింపంబని లేదు తిరుగనక్కరలేదు తనదగ్గరకు వచ్చువారితో చెప్పచుండిన చాలును అట్టి వానికి ఇంద్రియాది విషయములు చాల మట్టుకు తగ్గి యుండును సత్యధర్మములలో అపారవిశ్వాసము గలిగి యుండును ఎక్కువ కాలము ఆత్మధ్యానములోను, దైవకార్యములోను కాలము గడుపుచుండును వీరు ధర్మకార్యములలో తన ధనమును సంపూర్ణముగా ముందుగానే వినియోగపరచియే యితరులతో చెప్ప ప్రారంభింతురు వీరి సంకల్పము రెండుమూడు సంవత్సరముల లోపల ప్రయాసము లేకయే నెరవేరును సిద్ధసంకల్పము గలవారు సర్వసంగపరిత్యాగులై యుందురు నిర్విషయస్థితి వీరికి గలిగియుండును సదా ఆత్మధ్యాన పరులైయుండి శుద్ధ సత్త్వగుణముతో గూడియుందురు సర్వప్రాణి కోట్లను తనవలెనే ప్రేమింతురు సమస్త వస్తువులలోను ఈశ్వరచైతన్యము నిండి వెలుగు చుండునని వీరికి గోచరించును వీరికి జనులందరికిన్ని ఆత్మబోధ చేయవలెనని తలంపే ఎల్లప్పడుండును తన ఆత్మ పంచకోశాతీతముగా నుండి తుర్యాత్మానుభవము గలిగియుండును వీరు

ధర్మకార్యార్థమై సంకల్పించిన చాలును ఎవరితో చెప్పనక్కరలేదు అట్టిసంకల్పము రెండుమూడు సంవత్సరములోపల తప్పక ఫలవంతమై కనిపించును 5 ఈశ్వర సంకల్పము వీరికి చరాచర వస్తువు లన్నిటిలోను అంతర్యామియై యీశ్వరుండు వెలుగుచుండు తత్త్వము గోచరించును నిర్వికల్పసమాధి సులభముగా గలిగియుందురు పరప్రేరణ మాత్రము చేతనే లోకోద్ధారక బుద్ధి గలిగియుండును లేనిచో ఎల్లప్పుడును ఆత్మారాములై యుందురు వీరు సంకల్పించిన మాత్రముచేత సర్వసిద్ధులును గలుగవలసిన యేర్పాటు గలుగును, అణిమాద్యష్టసిద్ధులు వీరిసేవ కొఱకు నిరీక్షించుచుండును వీరికి భేదము సంపూర్ణముగా నశించియుండును దుఃఖము ఎఱుంగనే యెఱుంగరు ఇట్టి వారి వర్తనము ఏరీతిగా నుండునని చెప్ప సాధ్యము గాదు విధినిషేధములతో గూడియు గూడకయు నుందురు వీరే యథార్థమైన మహాత్ములు దృశ్యముగాని, కాలముగాని విధిగాని, నిషేధముగాని వీరి దృష్టిలో గోచరింపదు కాని అట్టివారు అరుదు ఉండిన లోకోద్ధారకులై యుందురు వీరు ఎట్లుండినను, జీవన్ముక్తులే 6 నిస్సంకల్పము గలవారు విదేహముక్తులు వీరికి దృశ్య, దర్శన, దృక్కులు ఏకమైయుండును ధ్యాతృ, ధ్యాన, ధ్యేయములనెడు త్రిపుటి లయించి ధ్యేయాకారమై యుందురు వీరికి ఏసంకల్పముండదు నిస్సంకల్పులై యుందురు వీరికి జరుగవలసిన దంతయు స్వయముగానే జరుగుచుండును పరప్రేరణచేతనైనను సంకల్పము గలుగదు అణిమాది అష్టసిద్ధులు వీరిని సేవించుచుండును అంతేగాక త్రిమూర్తులుగూడ వీరి కార్యములలో నియుక్తులవలె ప్రయత్నింతురు అదే పరిపూర్ణము, శివము, అద్వైతము, అమృతము, ఆనందము, అచలము, శాంతము, సంపూర్ణ సౌఖ్యము, మౌనము వీరు బహుజన్మములలో నుండి బ్రహ్మనిష్ఠయు, గురుభక్తియు, దైవభక్తియు గలిగి పుణ్యకర్మానుష్ఠాన పరిపక్వము చేతవచ్చిన వారు ఇది కడసారిజన్మము నిర్మలాకాశమునందు భాస్కరుండు ప్రకాశించుచున్నట్లు వీరు ఎల్లప్పుడున్ను స్వస్వరూపులై వెలుగుచుందురు సూర్యుని ప్రకాశముచే లోకములో చీకటి నశించునట్లు వీరు జన్మ

మెత్తునప్పుడు లోకములో గల అజ్ఞానము చాలమట్టుకు నశించి లోకము జ్ఞానలోకమై యుండును సరస్సులో గల కమలములు సూర్యోదయమున వికసించునట్లు వీరి అవతారముచే భక్తుల హృదయము సంపూర్ణముగా వికసించును జనులు కృతార్థులగుదురు దొంగ పోలీసు, యజమానుడు ఎంత తిరిగి యాచించినను ఎవరేమి యెక్కున యివ్వరుగదా! మేజిస్ట్రేటు అయిన అందరు కొంతవరకు తోడ్పడుదురు కలెక్టరు అయిన అడుగపనిలేదు ఎవరితోనైన చెప్పిన చాలును గవర్నరు అయినచో తన సంకల్పమును కలెక్టర్లు నిర్వహింతురు వైస్రాయి అయ్యేనేని భావము తెలుసుకొని గవర్నర్లు కార్యము నిర్వహించెదరు చక్రవర్తి యయినచో మంత్రులు, వైస్రాయి, గవర్నర్లు సమస్త కార్యములు శిరసావహించి, నిర్వహించెదరు గదా! కావున బ్రహ్మనిష్ఠలో అమరినవారు కనీసము సిద్ధసంకల్పము గలుగువరకైన నిష్ఠ సాధించవలయును తర్వాత లోకసేవాది కార్యములో ప్రయత్నించిన చాలును పూర్వీక ఋషులున్ను, యోగులున్ను ఇట్లే చేసిరి అట్టిస్థితి గలుగనందుచేత, గృహస్థులకు సాధువులపై విశ్వాసము తగ్గిపోవుటకును, బ్రహ్మవిద్యలోగల మహిమ జనులు యెఱుంగక పోవుటకును కారణమైనది

120 కృష్ణా, గోదావరి మొదలైన వాటి, ఆనకట్ట కాలువలు, ప్రతి సంవత్సరము శుద్ధ పరచి పనిచేయుట చేతనే జలము, కృషిభూమిలోనికి పారుచుండును అట్లు ప్రతి సంవత్సరము చేయకపోయినచో నీటిపారుదల మట్టిచేతను, బురదచేతను, కట్ట తెగుటచేతను ఆగిపోవునుగదా! జలము ప్రవహింపనిచో పైరు పండక దారిద్ర్యముచే జనులు తపించెదరు అదే రీతిగా ఒక్కొక్క రాష్ట్రములోను అప్పడప్పడు మహాత్ములుద్భవించి జనుల హృదయమును శుద్ధపరచుచుండవలయును లేనిచో అనాది వాసనయగు విషయాది దోషములచే హృదయము మలిన మైపోవుటయేగాక ఆత్మజ్ఞానము, భక్తి, కరుణ విరక్తి మొదలుగాగల మొగవు దైవిక రసామృతము అనుభవమునకు రాకపోవును అప్పడు జనుల జీవితము దు:

ఖభూయిష్ఠమగును కావున జనుల ఆయుస్సు సుఖముగా గడుచుటకును, పరములో నిత్య సౌఖ్యము గలుగుటకును దైవజ్ఞాన రసామృతము ముఖ్యావశ్యకము కావున మహాత్ములందరును, కాలువపనివార్లవలె, జనుల అంత కరణదోషములను తొలగించుటలో ప్రయత్నించుచుండవలెను మహాపురుషుల జన్మము దీనికొరకు ఏర్పడినదేగాని స్వార్థమునకు గాదు కాలువ పనివార్లలో, పనిచేయువార్లు మేస్త్రీలు, ఓవర్సీర్లు, ఇంజనీర్లు ఏలాగున నుందురో, ఆలాగున జనుల హృదయాంతరాళములోగల అజ్ఞానపు బురదను తొలగించువారి లోను ఇట్టి భేదము గలదు

121 మీరు ఇతరులకు బోధించు భావము, సత్యముగాను ధర్మముగా నుండినను శాంతముతోను, ప్రేమతోను బోధించవలయును, లేనిచో ఉద్దేశము విఫలమగును మంచి క్షీరాన్నమైనను ఉడుకుతో పోసినచో నోరును, చేతలును, కాలును గదా! ఈరహస్యము ఉపదేష్టలు గ్రహించవలసిన ముఖ్యవిషయమై యున్నది

122 గురువైనచో శిష్యులను, తండ్రియైనచో సంతానములను అంత కరణ సంస్కారపరిశుద్ధత, విద్యాది విషయములను మంచి శిక్షణముతో నేర్పువిషయములో, పై జెప్పిన శిష్యసంతానముల బాహ్యసంతోషమునకు హాని గలుగునేమో యని తలంచి స్వల్ప సంతోషమును చూచి బోధించెడు వాక్యములు తియ్యని పదార్థములో విషమునుంచి ఇచ్చినట్లే యగును ప్రస్తుత స్వల్పసుఖమును పాటింపక ఆత్మశుద్ధి గలిగి విద్వాంసులు కావలయుననను తలంపుతో చేయు శిక్షణము చేదుపదార్థములో అమృతము నుంచి యిచ్చినట్లుండునని యెల్లప్పుడును మరువకూడదు

123 ఆకాశమండలములో మేఘావరణము గలుగునప్పుడు ఏలాగున వర్షాకాలము ఆసన్నమగునో, వృక్షములు పుష్పించునప్పుడు ఫలమునకు కాలమెట్లు సమీపించునో, అరుణోదయము కానుపించునప్పుడు సూర్యోదయ సమయమెట్లు సమీపించియుండునో, ఆలాగున హృదయాకాశములో భక్తియు, కరుణయు ఎప్పుడు గలుగునో,

ఎప్పడు శాంతము ప్రస్నత ఆవిర్భవించునో, తీవ్రమైన బ్రహ్మజిజ్ఞాస అనగా దైవత్వము పొందవలయునను బుద్ధియు గలుగునో, అప్పడు అట్టి జీవునికి దైవత్వము పొందెడు కాలము సమీపించినది వాని కర్మములన్నియు క్షయించి పోయినవి

124 దీపము వెలిగించువారు శుద్ధమైన ప్రమిదలో మంచి తైలమునుంచి నిర్మలవత్తి నమర్చి వెలిగించినను కొన్ని ఘంటలు మండునప్పడు వత్తిపై కొడిగట్టి క్రమముగా దీపము ఆరిపోవును అప్పడు కొడిగట్టినది కొట్టివేసి వత్తి యెక్కించినచో శుద్ధముగా మండును వంటచేయు పొయ్యిలో మంచి యెండిన కట్టెలను పెట్టి రగిలించినను కొంతసేపు పోవునపుడు కట్టెలు మండి నిప్ప చల్లారును అన్నము ఉడుకువరకు అప్పడప్పడు కట్టెలను పొయ్యిలోపలికి నెక్కించవలసిన యుండునుగదా! అదే రీతిగా ఒకసారి గురువువద్దనుండి మంచి బోధ వినిన చాలదు ప్రపంచవాసనచే క్రమముగా మనస్సు మాలిన్యము నొందును కనుక అప్పడప్పడు గురువువద్దకు వెళ్లి పూర్ణత్వము గలుగువరకు బోధలు వినుచుండవలయును మడ్డి చమురును, బాగుగా ఎండని కట్టెలైనచో త్వరలోనే దీపమును, పొయ్యిలో నిప్పను శమించి పోవునట్లు తీవ్ర వైరాగ్యము గలుగని వారికి త్వరలోనే బోధలన్నియు క్షయించిపోవును

125 జనులకు జ్ఞానబోధలను చేయు ఉపదేష్టలు ప్రపంచములో గల జనులు చేయుచుండు అపరాధములన్నియు వారు తెలియకనే చేయుచున్నారని తలంపు గలిగి యుండవలయును అట్లైన మాత్రమే వారికి దయ గలుగును అట్లుగాక జనులు చేయుచుండు తప్పిదములు వారికి తెలిసియే చేయుచున్నారని తలంపు గలిగినచో వారిపై కరుణ గలుగదు కరుణతోను, శాంతముతోను బోధించెడు ఉపదేశములు అమృతవృష్టివంటివి ఇట్టి బోధ జనుల హృదయమును అతికోమలముగాను, మృదువుగాను ఒనర్చును ఉద్రేకముతో బోధించెడు విషయములు విషవృష్టివంటివి ఇది శాంతము, కరుణ, భక్తి మొదలైన దివ్యలతలతో కోమలముగా నుండు

మనస్సును గూడ దహింపచేయును

126 మనస్సు ఉద్రేకము గలిగి యుండు సమయమున ఎవరితోను మాట్లడుటగాని, యెవరికైన ఉత్తరము వ్రాయుటగాని చేయరాదు హృదయము శాంతముగాను, సంతోషముగాను, దయాన్వితముగా నుండునప్పడే సంభాషించుటగాని, జాబులు వ్రాయుటగాని చేయవలయును లేనిచో పశ్చాత్తాపమునకు కారణమగుటయేగాక కొన్ని విరోదములకు కూడ హేతువు గలుగవచ్చునని మరువకూడదు నిప్పలో పెట్టియుండు ఇనుమును ఎవరు తాకినను కాలునుగదా! చల్లారిన తర్వాత అట్టి వేడి యుండదు

127 తెలుసుకొని ఎవరున్ను ఏలాటి పాపకర్మలను చేయుట లేదు తెలియకనే చేయుచున్నారు ఏలన దుఃఖమును ఏజంతువైనను కోరుట లేదుగదా! సౌఖ్యమునే కోరుచుండును అట్లుండగా తెలివిగల మానవుండు ఏలాగున దుఃఖమును కోరును, కోరనేకోరడనుట విషము కలిసియుండు పదార్థమును తెలిసి తినరు గదా! ఆలాగున దృశ్యవిషయాదులలోగల విషమస్థితిని ఎరుంగకనే జనులు కష్టమునకు పాలగుచున్నారు

128 మధురమై ప్రేమాన్వితమైన వచనములు ఉచ్చరించుటకు అసంఖ్యాకములుగా నుండగా నేల చెడ్డమాటలను అనవలయును ఒక వృక్షములో పండిన మధుర ఫలములు కావలసినన్ని యుండగా అట్టివానిని భుజింపక యేల చేదు, వగరు, పులుపుగల లేతకాయలను తిని నోరు చెడగొట్టు చున్నారు?

129 మనస్సు విషయోద్రేకముతో గాని, లేక యితరసంకల్పముతో కూడియుండునప్పడు ఊరకుండుట గాని, ధ్యానజపాదులు చేయుట గాని, మనోనిగ్రహమునకు ప్రశాంతము గలుగుటకు తగిన పని గాదు శాంతము గలిగించెడు మంచి గ్రంథములను చదువుటగాని, మంచి వారితో సంభాషించుటగాని, లేక మంచిస్తోత్ర,కీర్తనపద్య, శ్లోకాదులను పఠించుటగాని లేక యేదైన ప్రశాంతమై, పనిలో ప్రవేశించుటగాని మంచిది

నిప్పు మండుచుండగా ఊరక చూచి కూర్చుండిన మంట అధికరించునే గాని శమింపదు గదా! వెంటనే జలమును పోసిన ఏలాగున శాంతి నొందునో పైన చెప్పిన కృత్యములును అటువంటివి

130 సత్కర్మానుష్ఠాన బ్రహ్మనిష్ఠాది సాధనములయందు సాధకునికి ఎంత యెక్కువ ప్రయత్నము గలదో, అట్టివానికి జ్ఞానశక్తియు, అంత అదికరించియుండును వృక్షములను ఎంతశ్రద్ధతో పోషింతుమో ఫలమును అంత అధికముగా గలుగును గదా! వృక్షములను చక్కగ పోషింపక పోయినచో ఫలసమృద్ధియు లెస్సగ గలుగనట్లు పుణ్య కర్మానుష్ఠానధ్యాన యోగాదులయందు లోపము కలిగిన జ్ఞానములోను కొరత గలుగునని మరువకూడదు

131 బీజము ననుసరించిన ఫలములు గలుగునేగాని, బీజమొక్కటి ఫలము మఱియొకటి యుండని చందంబున మీ హృదయములో గల వృత్తి ననుసరించిన ఫలమే మీకు గలుగుచుండును ఈ రహస్యము తెలిసికొని పవిత్రవర్తనముతో జీవింప జూచువాడు ధన్యుడగును

132. పంచేంద్రియములు దృశ్యవిషయములలో ప్రవేశించినప్పడు శబ్దేంద్రియాసక్తి గలుగగా జింకను, స్పర్శేంద్రియాసక్తి గలుగు నప్పడు ఏనుగును, రూపేంద్రియాసక్తి గలుగునప్పుడు మిడుతను, రసనేంద్రియాసక్తి గలుగునప్పడు చేపను, ఘ్రాణేంద్రియాసక్తి గలుగునప్పడు తుమ్మెదను జ్ఞాపకముచేసికొని, తత్తద్విషయములనుండి నివృత్తిని బొందుము అనగా శబ్దాదులచే కిరాతకులు లేడిని పట్టి వధింతురు స్పర్శేంద్రియాసక్తిచే ఏనుగు బంధీకృతమగును రూపాసక్తిచే మిడుత నిప్పులో మడియును జిహ్వేంద్రియాసక్తిచే గాలములో గల మాంసమును మ్రింగి మీనము మృతినొందును ఘ్రాణేంద్రియమువలన తుమ్మెద చంపక పుష్పమునందు వ్రాలుటచే నశించును

133 సమస్త బీజములును పొట్టుతో ఆవరించబడియున్నట్లు జీవు లవిద్యచే ఆవరించబడియున్నవి సూక్ష్మదృష్టితో విచారించిన, తోలు గూడా

బీజమున కన్నము గాదు అదే రీతిగా ఆత్మవిచారణజ్ఞానము, పరిపక్వావస్థ గలుగునప్పడు మాయాశక్తి బ్రహ్మమున కన్నముగా జాలదు

134 ఎంత పెద్ద పాత్రయైనను ఒక రంధ్రము పడినచో ఏలాగున వంటకు ఉపయోగపడదో, అదేరీతిగా ఎంత గొప్పయోగిగాని, జ్ఞానిగాని తపస్విగాని, భక్తుడుగాని అయినను ఒక్క దుర్గుణము ఉండిన అనగా ఒక్క యింద్రియము వశముగానిచో ఉపయోగపడడు ఒక్క ద్వారముండినందువలన ఇట్టి స్థితి గలుగుచుండగా, చాలా రంధ్రములుగల పాత్రను గురించి చెప్పవలయునా? ఆలాగున ఒక్క ఇంద్రియము వశపడక పోయినందుచే, ఉపయోగము గానప్పడు అనేక ఇంద్రియములు స్వాదీనము లేనివారిని గురించి మరల చెప్పవలయునా?

135 ఋషులవద్ద కామధేనువు, కల్పవృక్షము, చింతామణి పూర్వముండినట్లు చెప్పదురు కామధేనువు గోవువంటి జంతువు గాని, కల్పవృక్షము మ్రాను గాని, చింతారత్నము ఒకమణి గాని కాదు సమస్త కామములు నశించిన అనగా జితకాముడైనచో కామధేనుత్వమును, వికల్పములేని అవస్థ అనగా నిర్వికల్పము గలిగిన కల్పవృక్షత్వము, సర్వచింతలు నశించిన అనగా నిశ్చింతావస్థ గలిగిన చింతామణిత్వమును యోగులకు గలుగుచుండును పైనుదాహరించిన మూడు దివ్యవస్తువులు భగవత్సన్నిధియందుండుటచే భగవత్సంకల్పమాత్రముచే సమస్తము గలుగుచుండననియు, భగవత్సన్నిధియందు ఉండువారి సంకల్పములన్నియు నెరవేరుచుండుననియు జనులు చెప్పదురు ముందు చెప్పబడిన మూడవస్థల గలిగియుండు యోగికి సంకల్పసిద్ధి గలుగును అట్టి మహనీయుల దగ్గరకు వెళ్ళువారికి శక్తి కొలది వారి సంకల్పములు సిద్ధి యగును

136 మానసేంద్రియములు నిద్ర నొందనిచో ఆత్మ జాగ్రదవస్థను జెందజాలదు అదే ప్రకారము మానసేంద్రియములు చావని వారి ఆత్మ బ్రతికియుండజాలదు మొదటది జీవన్ముక్తునియందును, రెండవది

విదేహముక్తుని యందును కానుపించును కనీసము ఇంద్రియములు సుషుప్తి అవస్థనైన పొందవలయును లేనిచో దైవసుఖమును అనుభవింపజాలరు

137 వాఙ్నియమము మహాపురుషుల లక్షణమై యుండును కాకులు అరచునట్లు హంసలు అరవవు గదా!

138 పరరాజ్యము స్వాధీనపరచుకొనురాజును ఏలాగున ఇతరరాజుల ప్రజలు, సైన్యములు, ఉద్యోగులు, మంత్రులు మొదలైనవార్లు శత్రుపక్షము నవలంబించి తమ రాజ్యమునకు రానియ్యక బహువిధముల చిక్కులు పెట్టుదురో, రాజ్యము పరరాజునకు స్వాదీన పడినచో పైపేర్కొన్న వారందరును ఏలాగున నూతనరాజునకు దాసులై పోవుదురో అదేరీతిగా మోక్షసామ్రాజ్యము పొందజూచెడు ముముక్షువును మానసేంద్రియములు పలువిధములగు బాధలు పెట్టును ముక్తావస్థగలిగిన తర్వాత సర్వేంద్రియములు ఆత్మకు వశములై కొలుచుచుండును

139 సింహగర్జనమును వినిన అరణ్యములోగల మృగములన్నియు ఏలాగున పారిపోవునో, ఆలాగున ఓసాధకుడా! మీ హృదయారణ్యములో 'ఓమ్ తత్ సత్' అని ఆత్మభావముతో ఉచ్చరించుచుండుము అట్టైన వృత్తులు మీ హృదయములో పొడమజాలవు ఇచ్చట భక్తులు దైవస్మరణ చేయుటచే గూడ పై జెప్పిన దానివలె ఫలము కలుగును

140 కంటకాది వృక్షముల మధ్యనుండు మంచిచెట్టు ఏలాగున వృద్ధి నొందజాలదో, ఆ ముళ్లచెట్ల నన్నిటిని తీసివేసినచో, మంచి ప్రూనేలాగున త్వరలో వృద్ధినొందగల్గునో, ఆలాగున సాధువుల హృదయములో దృశ్యవృత్తియుండిన, ఆత్మజ్ఞానాభివృద్ధి శీఘ్రములో గలుగజాలదు వృత్తిరాహిత్యము గలుగగా సత్వరజ్ఞానాభివృద్ధి గలుగుచుండును

141 అగ్ని ఏమంట పొడమిన తర్వాత దగ్గరనుండు కట్టెలను ఏలాగున దహింపచేయునో, ఆలాగున ఓసాధకుడా! మీ హృదయములో

నెంతవరకు ప్రజ్ఞాన బ్రహ్మాత్మైక్య పరమగు శివత్వబోధము గలుగ లేదో, అంత వరకు కర్మకట్టెలుగాని, దృశ్యవృత్తులుగాని, దేహాత్మభావముగాని నశింపజాలవు అట్టి బోధైక దైవజ్ఞానము గల్గునప్పుడు సమస్త వృత్తులును, దృశ్యవాసనలు, కర్మలన్నియు దహించును కావున ఆత్మైక్యబోధము గలుగచేయు దైవభావమును బలపరచుము నిప్పుతప్ప తక్కిన దేనివల్లను కట్టెలు దహింపబడని చందంబున, దైవజ్ఞానము గలుగక తక్కిన యోగాద్యనుష్ఠానములచే నజ్ఞానము నశింపజాలదు యోగాద్యనుష్ఠాన పుణ్య కర్మానుష్ఠానము లన్నియు, అంతః కరణ శుద్ధికిని చిత్తైకాగ్రతకును అనుకూలపడును

142 జీవితమంతయు నియమబద్ధమై జరుపవలయునను దృఢ సంకల్పము కలుగుదశనుండియే నిజమైన మానవత్వము ప్రారంభమగుచుండును ఏలన, నియమము మానవులకు గదా యేర్పడినది! మృగములకు కాదు గదా? ఇట్టి ప్రయత్నము అంతరాత్మయందు ఎంతవరకు గలుగలేదో అంతవరకు అతండు ఎన్ని విద్యల నేర్చినను మృగావస్థయందుండు వాడే యగును ఇది యెంతకెంత తీవ్రతరముగా హృదయములో పరిణమించునో, అంతకంతకు ఈశ్వర సమీపమును చేరుచుండును అనగా దైవత్వము నొందును ఇది మానవత్వచిహ్నమే యగును ముముక్షువైన వాడు ఇక దైవత్వమును చతుర్ముఖ బ్రహ్మాత్వమును దాటవలసియుండును అప్పుడు మాత్రమే పరబ్రహ్మానుభవమును బొందగలుగును

143 మనము చీనీపండు మొదలైనవాటిని రెండు విధములగు దృష్టులతో చూచుచున్నాము ఒక్కవిధమగు దృష్టితో చూచునప్పుడు తోలు వేరుగాను, గింజలు వేరుగాను, గుజ్జు వేరుగాను కానుపించును దీనినే ద్వైతదృష్టియనియు, లేక దృశ్యదృష్టియనియు గూడ చెప్పదురు మఱియొక దృష్టితో చూచిన బెరడును బీజములును లోభాగమునందుండు గుజ్జును, ఒకే వస్తువు యొక్క పరిణామముగా గోచరించును, ఇదే అద్వైతదృష్టి

యనియు, దైవదృష్టి యనియు తెలియందగినది జీవేశ్వర జగద్భేదమును, అభేదమును దీనియందు గలదు

144 సోదరా! మీరు నిత్యశుద్ధ చైతన్య స్వయంప్రకాశులను బోద గలిగియుండువరకు ఎంత అశుచితో గూడిన శరీరముండినను మీరు పరిశుద్ధులు అట్టి బోధైకనిర్మలత్వము గలుగక ఎంతశుచి ఆహారముతో గూడి యుండినను, మీరు మహాఅశుచిలో నుండువారనియే గ్రహింపవలయును విద్యుచ్ఛక్తి తంతితో గలిసి యున్నప్పడు గదా దీపము ప్రకాశించును అట్లు గానిచో చీకటిచే ఆవరింపబడియుండును గదా!

145 కళాయి లేని పాత్రలో పప్పపులుసును వండినను ఎంతవరకు పాత్రము నిప్పపై నుండునో అంతవరకు చిలుము పట్టదు అగ్ని నుండి తీసి పెట్టిన వెంటనే చిలుము పట్టును అదేప్రకారము మీరు ఎంతవరకు నిజబోధైక స్వరూపమగు జ్ఞానాగ్నియందు నిలుకడ గలిగి యుందురో, అంతవరకు మిమ్ములను దృశ్యముగాని సంసారముగాని, బాధింపవు అట్టి నిలకడనుండి జారిన వెంటనే వికారరూపముగా మార్చి బంధనమును గలుగజేయును ఈ తత్త్వమును తెలిసికొనియే జ్ఞానులు వ్యవహారము చేయుచుందురు

146 ఒక్క జలాశయమునుండి అనేక జనులు వారివారి పాత్రలలో జలము తీసుకొనెదరు పాత్రలలో జలము ముంచి బయట తీసిన ఆ జలము మరి యొకరు ముట్టినచో కలహమును విరోధమును గలుగును పాత్రలలో నుండి తీర్థము జలాశయమున పోసిన మరల ఆ తీర్థమునకు భేదము లేదు గదా! అదే రీతిగా సంకల్పములు కల్పితములు అవి అఖండదైవమును ఖండపరచుచున్నవి అప్పడే భేదమేర్పడును అందువలన బాధ గలుగును మరల అఖండమును పొందిన సమరస జ్ఞానమగు సౌఖ్యము గలుగును అఖండ మేకత్వము, ఖండమనేకత్వము

147 పనసచెట్టు మొదలైన గొప్పవృక్షములు పెట్టినవారు జీవించి యుండినను లేక మరణించినను ఆ చెట్టు పెరుగునట్లు జిల్లేడిచెట్టు వగైరా

క్షుద్రవృక్షములు తాము బ్రతికి యుండునప్పడును లేక మరణించిన తర్వాతను ముందు జెప్పిన వృక్షములవలె వృద్ధిని పొందజాలవు విశాలబుద్ధితోను విశుద్ధభావముతోను ప్రారంభించెడు ధర్మస్థాపనములు తాము జీవించియుండు నప్పడును లేక పరలోకప్రాప్తి నొందినను, వృద్ధినే గాంచును సంకుచిత భావములతోను, స్వార్థపరత్వముతోను చేయు స్థాపనములు వృద్ధినొందజాలవు

148 వస్తువులలోగల వైరాగ్యము మారి భావములో వైరాగ్యము గలుగవలయును అయినను మొదట వస్తువులలో వైరాగ్యము గలిగిన మాత్రమే భావములో గల్గును భావములోగల వైరాగ్యమే నిజమైనది వస్తువులలో గలది నిజము గాదు వస్తువులలో ముముక్షువులకును, భావములో ముక్తులకును వైరాగ్యము గలుగుచుండును

149 మనస్సుకు రెండు విధములగు పరిణామములు గలవు జ్ఞానియైనవాడు మనస్సును దైవమయముగా అనగా ఆత్మమయముగా మార్చును అజ్ఞానియైనవాని ఆత్మ మనోరూపముగా మారుటచే విషయములలో మునిగి పోవుచుండును ఇట్టి పరిణామము గలుగనీయక దృఢతర వ్రతయత్నముతో చూచుటయేం అభ్యాసమనియు, నిదిధ్యాసమనియు, ధ్యానమనియు, దైవప్రార్థనమనియు గ్రహించవలయును ఇట్టి పరిణామముల మార్పు నిద్రనుండిగాని, సమాధినుండిగాని గలిగెడు ఉత్థానదశ యందు కనిపెట్టవలయును అదే దానికి సరియైన సమయము మనస్సు ఒక తెల్ల వస్త్రము వంటిది ఏయే రంగులలో అద్దుదుమో ఆయారూపమై మారి తనయొక్క నైజమగు శుక్లవర్ణము గనపడక పోవునట్లుండును మనస్సు దృశ్యవిషయమై పరిణమించిన మరల దానిని ఆపుట కష్టతరము కావున అట్టి పరిణామము నొందనీయక చూడవలయును దీనికి నిండా ఆత్మశక్తి గలిగి యుండవలయును లేనిచో దుర్బలుడైన సారథిని బలవంతములగు గుఱ్ఱములు పట్టి లాగునట్లు వశపడక పోవును

150 ఓ సోదరుడా! నీవు దైవములో ఐక్యమగుటకు ప్రయత్నించినను సరే! లేక దైవమును నీయందు ఐక్యపరచచూచినను సరే! ఇది నీటిలో ఉప్పు గలిపినను లేక ఉప్పులో నీరు గలిపినను ఒక్కే అవస్థయే గలుగుచున్నట్లుండును మొదటిది భక్తియోగముయొక్క పరమ కాష్ఠయనియు, రెండవది జ్ఞానయోగము యొక్క నిష్ఠాపర్యవసానమనియు గ్రహించ వలయును ఈ రెండు మార్గములును అతీత మార్గములు

151 ఓ భక్తుడా! నీవు చేయు ధ్యానము గాని, జపముగాని, కీర్తన పారాయణాదులు గాని దైవభావముతో కలియుచుండునా? అని జాగరూకుడవై చూచుకొనుము దైవముతో ఐక్యము గలిగిన మాత్రమే ప్రయోజనపడును అనగా ఆత్మభావముతో గలియని పూజార్చన ధ్యానాదులన్నియు గొప్ప ఫలమును గలుగచేయజాలవు ఏలనగా! గుండులేనిమందు మాత్రము వేసి కాల్చిన ఫిరంగి లక్ష్యము భేదింపజాలదుగదా! కావున భావమునందు రూఢిపడువరకు వాక్కుతోగాని, మనస్సుతోగాని స్మరణ ధ్యానకీర్తనలు చేయకుము

152 విద్యుచ్ఛక్తి తంతితో గలియునప్పుడు మాత్రమే విద్యుద్దీపము ప్రకాశించుటగాని, యంత్రములు పనిచేయుటగాని చేయును అదేరీతిగా దైవభావనయందు మనస్సు లెస్సగా అమరునప్పుడే మీ యొక్క ధ్యానాదులు ఫలించును అప్పుడమితానందము గలుగుచుండును అదే దానికి గురుతు అట్లు దివ్యానందములో మునుగనిచో తాపత్రయము నశింపజాలదు ఎట్లన? శరీరములో మాలిన్యము గలవాడు నీటిలో మునిగి స్నానము చేయనిచో మలనిర్మోచనము గాదు గదా!

153 మీరు దైవవిగ్రహము ముందట కొట్టుచుండు కొబ్బరికాయపై పీచు ఉండినచో ఎన్నిసార్లు కొట్టినను పగులని చందంబున మీ హృదయము ప్రపంచవాసనలగు వృత్తులచే కట్టబడియుండువరకు ఎంత ధ్యానించినను హృదయగ్రన్థి విచ్ఛేదము నొందదు అనగా ఆత్మయొక్క కట్టులు తెగి విముక్తి నొందజాలదు

154 కృతయుగమున ద్వాదశ సంవత్సరములున్ను, త్రేతాయుగమున తొమ్మిది సంవత్సరములును, ద్వాపరమున ఆరు వత్సరములును, కలియుగమున సంవత్సరత్రయమును విరక్తులై నిర్మలభక్తిలో మునిగిన వారలై ధ్యానము చేయువారికి ఆత్మానందము గలుగును అనగా దైవిక సౌఖ్యము సిద్ధించును అయినను దీనియందుగల రహస్యము తెలియకపోయిన ఎన్ని సంవత్సరములు ధ్యానయోగాదులు సలిపినను ఇసుమంతయు ప్రయోజనముండదు ఆ పరమరహస్యవేమన ఈ దినము మీ హృదయములో దృశ్యస్మృతి గలుగక యెంత సమయము దైవభావముతో నిలువగలుగునో అట్టి సమయముమాత్రమే లెక్కకు వచ్చుచుండును అనగా అట్టి స్థితి యెన్ని నిమిషముల వరకుండునో, అది మాత్రమే దినములో లెక్కలో చేరును ఆలాగున 24 ఘంటలు సమయము చేరునప్పుడు ఒక్కరోజగును ఈలాటి మూడు సంవత్సరములని గ్రహించలయును జపముగాని, ధ్యానముగాని, పూజార్చన పారాయణాదులుగాని చేయుచుండినను మనస్సు తన్మయము నొందనిచో ఒక్క నిమిషమైనను లెక్కలో చేరజాలదు ఇట్టి రహస్యము తెలియకనే కలియుగమున ధ్యానము సిద్ధింపదని చెప్పెడి మాటలని మరువకూడదు

155 కృష్ణాగోదావరీనదులకు ఆనకట్టకట్టి కాలువలద్వారా జలమును పంపుటచే కృషి యెంతయో అభివృద్ధియై జనులు సుఖజీవితము గలవారగుచున్నారు అట్లు ఆనకట్ట లేకయున్న జలమంతయు సముద్రములో పడిపోవుటచే వ్యవసాయము ఉండకపోవుటవల్ల జనుల జీవితమేలాగున దుఃఖపరమైయుండునో, అదేరీతిగా యింద్రియముల నియమనము గలవారి ఆత్మశక్తి దైవవిషయములలో వినియోగపడుటచే వారి జీవితము నిత్యసుఖమగు ముక్తిని పొందుచున్నది అట్లు చేయక యింద్రియములు దృశ్యసౌఖ్యములో పడిపోయెడివారి జీవితము దైవసౌఖ్యము నొందక సంసారసాగరమున పడిపోవును ఇదే యింద్రియ నిగ్రహము గలవారి యొక్కయు, లేనివారియొక్కయు గతి యని మరువకుడు

156 జనులారా! నిప్ప మంటవేయునప్పడు మొదట పొగ కనుపించి తరువాత ప్రకాశముగా నుండునట్లు మీరు అధ్యాత్మధ్యాన ననిరతులగునప్పడు దుఃఖములు అనగ బాధలు గలిగినను తర్వాత ఆత్మజ్యోతియగు దైవజ్ఞానజ్యోతిని కనుగొని సుఖించెదరు

157 క్షీరసాగరమథనము దేవాసురులు చేసినప్పడు మొట్టమొదట విషము కలిగినను క్రమముగ అమూల్యములగు వస్తువు లావిర్భవించి ఆఖరున అమృతము లభించి దేవతలు జరామరణములు లేనివారలై యేలాగున అమృతులైరో, ఆలాగున హృదయమున దైవాసుర గుణములతో ఆత్మధ్యాన మథనము చేయుచుండగా ముముక్షువులకు మొట్టమొదట విషయాది దోషములును, బాధలును గలుగ వచ్చును అయినను అవసానమున అమృతము లభించునట్లు దైవామృతము అనుభవించి నిత్యతృప్తులగుదురు వాసుకియొక్క విషమును ఈశ్వరుండు పానముచేసినట్లు నిజభక్తిగల వారి కష్టములన్నిటిని జగదీశ్వరుడు శమింపచేయును కావున బ్రహ్మనిష్ఠగలవారి కందరికిని దైవభక్తి ముఖ్యముగా నుండవలెను అట్టైన విఘ్నములు గలుగవు వాసుకి విషమును పరమేశ్వరుండు పానము చేయకపోయినచో, అందరును దహింపబడి యుందురుకదా! ఇదే భక్తి మార్గములో గల పరమరహస్యమని గ్రహించవలయును

158 పంచదార స్వయముగా మధురమైనను బియ్యపుపిండి యెంత యెక్కువగా దానియందు చేరునో అంతంత మధురము తగ్గిపోవునట్లు ఆత్మ స్వయముగా నిత్యానందమై శివమైయుండినను ప్రాకృత గుణములు ఎంత అధికముగా హృదయములో చేరునో, అంతగా ఆత్మసుఖరహితమై దుఃఖియై మారుచుండును కావున నిర్విషయస్థితి గలిగి రాగా రాగా శివమై అమృతమైయుండును అప్పడు తనయొక్క దైవత్వము గోచరించును

159 మోక్షమార్గ ప్రయాణము వర్షాకాలమున మట్టితో కట్టెడు

మట్టిగోడవంటిది నింపాదిగ కట్టవలెను కొంచెము ఎత్తు కట్టి అది ఆరువరకు కట్టరాదు కట్టినచో అంతయు పడిపోవునుగదా! ఆలాగున సాదనలో నిదానముగా వెళ్ళవలయును తీవ్రముగా పోయినచో రోగాదులచే పతనము గలుగవచ్చును తీవ్రముగా వెళ్ళుటకు సాదారణ జనులకు మానసిక కాయకీయశుద్ధియు, విరక్తియు నుండకపోవుటచే శక్తియు నుండజాలదు

160 దృశ్యమును, తదనుగుణములును కనపడువరకు మాత్రమే బంధముండును అది నిజముగా స్ఫురింవకపోయినచో మరల బంధముండదు అంతవరకు సాధనలు చేయుచుండవలయును

161 సూర్యరశ్మి ప్రసరింపని స్థలమున మాత్రమే చీకటి యుండునుగదా! ఆలాగున దైవములేని స్థలమున మాత్రమే మాయ యుండును దైవములేని స్థలము లేదు కావున యెచ్చట మాయ, అనగా దృశ్యవికారము స్ఫురించునో, అచ్చట సాధకునికి దైవత్వము కనబడుటలేదు ఇట్టి దృఢతరాభ్యాసముచే మాయను జయింపవలెను ఒకవేళ దృశ్యము స్ఫురించినను దానిని దైవమయముగా చేయుటలో ప్రయత్నించ వలయును

162 అద్దముయొక్క పురోభాగమున ఏదైన వస్తువు ఉండిన మాత్రమే దర్పణములో ప్రతిబింబించును లేనిచో ప్రతిబింబించని చందంబున అంతః కరణములో వృత్తులుండువరకు మాత్రమే సాధకుని హృదయములో ప్రకృతి స్ఫురించును ఈ తత్త్వమును జ్ఞప్తిలోనుంచి ముముక్షువైనవాడు అభ్యాసము చేయవలయును

163 తీవ్రతర నిష్ఠచేయుచు రాగా రాగాఅంతరాత్మ స్వయముగా గోచరించును జలము నిర్మలముగను, నిశ్చలముగను ఉండునప్పడు సూర్య ప్రతిబింబము కానుపించునుగదా!

164 మలినజలము నిర్మల మగువరకు నెంత ప్రయత్నించినను, సూర్యప్రతిబింబము కనుపించని చందంబున మనోనైర్మల్యము గలుగనివారి

బ్రహ్మప్రాప్తి విషయమైన ప్రయత్నము ఫలమును గలుగచేయజాలదు

165 మనస్సును ఎంత శుద్ధపరచినను మరల పరిశీలించిన దోషము కనపడుచునే యుండును పుస్తకము నచ్చు వేయునప్పడు ప్రూఫు ఎంత శోధించినను మరల అక్షరముల తప్పలు కనబడుచునే యుండునుగదా!

166 కృతార్థులు కావలసియుండిన కృతకృత్యులు గావలయును నంస్కృతములో కృతమనగా చేయంబడినదని అర్థము ఏది చేయబడినదనగా కృత్యము అనగా ఎవండు తనకుగల కృత్యమును లోపములేక చేయువాడో, అతడు కృతకృత్యుడు కాగలడని అర్థము ఇట్టి గుణము కలిగియుండుటచేతనే, కృతయుగమని పేరువచ్చినది అలాగున ఇప్పడును చేయువారు కృతకృత్యులే వీరికి కృతయుగ ఫలము తప్పక గలుగును

167 ఆత్మ పరిపక్వావస్థను పొందునప్పడు మూలావిద్యయగు ఆవరణము స్వయముగానే వీడిపోవును సర్పమునకు ముదురు కాలము వచ్చునప్పడు చర్మము అనగా కుబుసము స్వయముగా వీడిపోవును గదా! నర్పమునకు నరియైన కాలము వచ్చుటకు ముందుగా చర్మము మాంసముతో గూడియుండును అత్తరి యెంత ప్రయత్నించినను చర్మము వదలిపోవని చందంబున ఆత్మకు వైరాగ్య బోధోపరతులు పరిపక్వము నొందుటకు ముందుగా అవిద్యను అనగా దృశ్యవృత్తిని తొలగించినను అది వెళ్లిపోవజాలదు

168 మహాత్ముల జీవితము గుమ్మడి చెట్టువంటిది ఆ చెట్టు పెట్టిన స్థలములో కాయ కాయక దూరముగాబోయి ఫలము నిచ్చునట్లు మహనీయులు పుట్టిన కుటుంబము వారికన్న ఇతరులకే యెక్కువ లాభము గలిగించువారగుదురు

169 తామరకాడ గాని, అరటిబొందె గాని విరిచినను వాటియొక్క

దారము పరస్పర సంబంధము గలిగి కొంతదూరమువరకు విడువక యుండినట్లు విరక్తుడై, త్యాగియై, యుండినను తనకు సంబందించినవారి సమీపమున నుండిన వారితో కొంత సంబంధము గలిగియుండును పై జెప్పిన తామర కాడ, అరటి బొందెలను దూరముగా విసిరి వేసిన మాత్రమే బంధము తొలగునట్లు విరక్తులైనను కొంత దూరముగా నుండిన మాత్రమే సంసారమానసిక పరస్పర సంబందతంత్రులు తెగిపోవును

170 పచ్చి సొరకాయను నీటిలో వేసిన లోతులో మునిగిపోవును ఎండినది జలములో ముంచినను పైకి తేలుచుండును కారణ మేమన పచ్చికాయలో జలాంశయము ఎక్కువ యుండును ఎండినదానిలో జలాంశము నశించును అదేరీతిగా హృదయములో విషయవాసన యుండువరకు సంసార సాగరమునుండి తరింపజాలడు నిర్విషయ స్థితి గల్గినప్పడు సంసారములో నుండినను దానిలో మునుగజాలడు అప్పడు తరింపగల్గును

171 అడవి ప్రదేశమున బురదమయమగు తామరసరస్సులో తామరపుష్పములను ఆశించి దానియందు దిగిన యేనుగు ఏలాగున పంకములో దిగబడిపోయి మరల రాజాలక హింసనొందునో అదేరీతిగా నంసారమోహామనెడు బురదలో ప్రకాశించుచుండు స్త్రీపురుషుల ముఖపంకజావలోకనములో పరస్పరాసక్తులైన స్త్రీపురుషులు మాయా మోహపు బురదలో దిగబడి నశించుదురు ఓ మనస్సా! పై జెప్పిన గజము యొక్క గతియే నీకుగూడ గలుగునని మనస్సునకు బుద్ధి చెప్పి తప్పించువారు ధన్యాత్ములగుదురు

172 మనస్సును సన్మార్గములో నడపుటకు ఒక సూత్రము గలదు అదేమన, ఓ మనస్సా! నీవు సౌఖ్యమును యశస్సును కోరుచున్నావు అయినను దానికి సరియైన కార్యములను చేయుచున్నావా? యని మనస్సునకు విలక్షణముగా నుండి మనస్సుపై అప్పడప్పడు ప్రశ్న వేయుచుండవలయును

174 ఓ సాధకుడా! నీవు గ్రహించ వలసిన ముఖ్యవిషయ మొక్కటి

గలదు అదేమన? మంచి విద్యావతియు, రూపవతియు, యువతియు నగు రాజకుమార్తె, క్షయ కుష్ఠాది వ్యాధులచే దుర్గంధము గలిగి ముసలివాడైనవానిని వరించనట్లు విషయాది దోషములతోను, హీనగుణములతోను, శుష్క హృదయములతోను గూడినవారిని, ముక్తికాంత వరింపజాలదు అదే రీతిగా కుష్ఠక్షయ ప్లీహాది వ్యాధులచే చీము కారుచున్నదియు, వృద్ధయు నగుదానిని, మహాసౌందర్య యుక్తుడును విద్యాసంపన్నుడును, యువకుడు నగు రాచకుమారుడు వరింపజాలనట్లు దృశ్యగుణములును, విషయాది దోషములునుగల్గి ఆత్మజ్ఞానమును లేని స్త్రీని ఆత్మారాముడు వరింపజాలడు

174 భగవద్భక్తి విషయమై యెవరి నేత్రములనుండి అనర్గళముగా నీరు కారుచుండునో, ఆ పుణ్యపురుషుని అజ్ఞాననేత్రములలో గల మాలిన్యము తొలగినదగుటచే కాటుక చలాకుచే నేత్రపటలమును పోగొట్టంబడిన వానికి దృశ్యము వలె అతనికి దైవత్వము లెస్సగా గనిపించును

175 బ్రహ్మనిష్ఠుని దృష్టిలో ఈ మహత్తైన లోకమున, ఉన్నతమైన స్థానమును, స్థానసౌఖ్యమును, స్థానాధికారులును సూక్ష్మవస్తుగాను, అతి స్వల్పముగాను తోచుచుండినచో అట్టివారికి ప్రకృతి వంగిపోవుచున్న దనియు, జ్ఞానదృష్టి వికసించుచున్నదనియు తెలుసుకొనవచ్చును

176 నిర్మలత్వము నొందునప్పడు జలాంతర్భాగములో గల సూక్ష్మవస్తువులు ఏలాగున గోచరించునో, ఆలాగున అతి సూక్ష్మతర సూక్ష్మతమ, దైవిక రచనాశక్తియు, ఈశ్వర మహిమయు గోచరించుచుండిన అంతఃకరణము శుద్ధపడుచున్నదని సాధకుడు తెలిసికొనవచ్చును

177 గొప్ప రాజకీయ వేత్తయై దైవిక గుణములును, ప్రజాపాలన కుశలతయు గలవారు ఏప్రాంతములోనున్నను రాజులు ఏలాగున వారిని రప్పించి గొప్ప ఉద్యోగమును అధికారమును ఇచ్చుచుందురో, అదేరీతిగా మంచి తపస్సును, జ్ఞానమును, దయయును, వైరాగ్యమును, ప్రాణికోట్లకు ఇహపర సౌఖ్యము చేయుటలో ప్రీతియును గలవారెవరైనను వారిని

సర్వేశ్వరుండు తన దగ్గరకు చేర్చుకొని దైవశక్తినిచ్చి గొప్ప ప్రవక్తగా చేయును అనగా ప్రబోధజ్ఞానిగా చేయును కావున సాధకుడా! నీవు ఏజాతిలోనుండిననుసరి, ఏ ఆశ్రమములో నుండినను సరి, స్త్రీయైన సరి, పురుషుడైనను సరి, గొప్ప దైవగుణములు నీయందుండిన సర్వేశ్వరుండు నిన్ను సిద్ధపురుషునిగా మార్చి మహాత్మునిగా చేయును రాజకుటుంబములో పుట్టినవాడైనను, తగిన యోగ్యత లేనిచో, ఏలాటి ఉద్యోగమును యివ్వనట్లు బ్రహ్మనిష్ఠుల వర్గములో జన్మించిన వాడైనను దైవగుణములును, శాంతశమదమాది గుణములును లేనిచో ఈశ్వరకృపకు పాత్రుడు గాజాలడు

178 గ్యాస్‌లైటు వెలుగుటకు గాలియును, కిరసనాయిలును కలిసి యెక్కించిన మాత్రమే మండునట్లు బ్రహ్మాత్మైక్యబోధము నిరావరణముగా వెలుగుటకు వేదాంతవిచారణ జ్ఞానమగు శ్రవణమును, ఆత్మధ్యాన పరమగు యోగమును ఉండే తీరవలయును

179 వస్తువులలో సుఖింపక భావములో సుఖించెడు అవస్థ గలిగెడు దశనుండియే సత్యము యొక్కయు, ధర్మముయొక్కయు, ఆత్మయొక్కయు సుఖము అతనికి గోచరమగుచుండును అత్తరి సత్యమునకును, ధర్మమునకును తగని భోజనాదివస్తువులు ఎంతో రుచికరముగా, నుండినను విషముకన్న అధికముగా అరుచిగను, చేదుగను, బాధాకరముగను అతనికి గోచరించును అత్తరి ఆకు అలములు గాని, అంబలి గాని, గంజినీరు గాని ఆ మహాపురుషునకు దివ్యభోజనముకన్నను, అమృతమునకన్నను వెయ్యిరెట్లు సుఖముగా గానుపించును ఇదే సత్యధర్మ నిరతత్వము గలిగిన దానికి గురుతుగా నుండును

180 పతివ్రతయైన నారీమణి యైనచో తన యింటిలో గలిగినదియు, భర్త ప్రేమతో ఇచ్చునదియునగు మోటు వస్త్రములుగాని, మోటు ఆహారములుగాని భుజించి సంతుష్టి నొందునే గాని జారపురుషుడు ఇచ్చిన పట్టువస్త్రాభరణాదులును పంచభక్ష్యపరమాన్నాదులును భుజించి

సంతోషింపదు ఆ చందంబున నిజమైనభక్తియు, సత్యధర్మ నిష్ఠయు, విరక్తియు గలిగిన బ్రహ్మనిష్ఠుండును పై నుదాహరించిన పతివ్రతా స్త్రీ రత్నమువలె సత్యధర్మములతో దొరకినది నీరసమైనను దానితో సంతుష్టినొందునుగాని పరవస్తువులు మంచి రసయుక్తములైనను, వానితో తృప్తినొందక పోవుటయే గాక వాటిని విషమువలె చూచునప్పుడు వానికి నిజమైన వైరాగ్యమును, సత్యదర్మనిష్ఠయును గలిగిన దానికి గురుతని గ్రహించవలయును

181 పరవస్తువులను తిని బ్రహ్మనిష్ఠ చేయువారు ఎక్కువ వడ్డికి తీసిన కంపెనీ డబ్బుతో వ్యాపారము చేయువారివలె నుందురు జాగ్రత్తతో వ్యాపారము చేసి, లాభము సంపాదించినచో ఋణమును తీర్చుకొని సుఖముగా జీవింపవచ్చును లేనిచో ఋణమునకు బద్ధుడై పోవుటయేగాక పూర్వముండు సొత్తునుగూడ, వేలము పాడునట్లు జాగ్రత్తగలిగి బ్రహ్మనిష్ఠ నిరంతరము చేయుచుండినచో బద్ధుడు గాకయు పూర్వజన్మ సుకృతమును పోగొట్టకయు ముక్తుడు గావచ్చును లేనిచో పూర్వపుణ్యమును గూడ పోగొట్టినవాడగును కనుకనే బ్రహ్మనిష్ఠులు కోరక దొరికినదానితో సంతుష్టి గలిగియుండవలయు నని శాస్త్రము చెప్ప రహస్యము

182 భక్తుల కోరికలలో ఇట్టి భేదములు గలవు మోక్షము కోరుట ఉత్తమ మనంబడును అయితే తనమోక్షముతో సహా లోకములో గల అందరి సౌఖ్యమును గోరుట ఉత్తమోత్తమ మనంబడును స్వర్గమును కోరి చేయు కార్యములు మధ్యమము ఇహ సంబంధసౌఖ్యములయందలి కోరికతో చేయుకార్యము కనిష్ఠము విషయసుఖముల మాత్రము కోరుచుండుట అధమ మనంబడును పరుల యశస్సును సౌఖ్యమును జూచి యోర్వజాలక చెరుపు చేయు కోరికతో చేయు కార్యము అధమాధమనంబడును తన సౌఖ్యమును సహా చూడక యితరుల సౌఖ్యమున కోరిక గలిగి వర్తించెడు వాని స్థితి యిట్టిదని దేవతలకు గూడ ఊహింప శక్యము గాదు కాని అది ముక్తాత్ములకును జగదుద్ధారకులగు కారణగురువులకు మాత్రమే గలిగియుండును

183 భక్తుడా ! ఒక్క పరమరహస్యమును చెప్పెదను అదేమన ప్రభువైనవాడు తనకు గావలసిన రాజ్యాంగరహస్య కార్యములను అంతరంగ విశ్వాసము గలవారికి, రహస్యముగా నెరిగించి యేలాగున నిర్వహింపచేయునో ఆలాగున సర్వేశ్వరుండు తన కార్యమగు జగదుద్ధారకములైన పుణ్యకార్యములన్నియు, అంతరంగ భక్తులద్వారా ప్రపంచములో నిర్వహించుచుండును ఎందరో జనులుండగ రాజుగారు తనయొక్క అంతరంగ రహస్యకార్యములను తెలిపినందుచేత ఆ పెద్ద మనుష్యుడు ఏలాగున అపరిమిత సంతోషము నొందునో ఆలాగున ప్రపంచములో ఎందరో ధనవంతులును, బలవంతులును ఉండగా దైవకార్యము మనచేత సర్వేశ్వరుండు చేయించినారు గదా యని తలంచి పరమభక్తుండు అపరిమితానందమును పొందుచుండును

184 భూమిలో నడచువారు త్రోవ తప్పినచో, ముండ్లు, పల్లము, మిట్ట మొదలైనవాటిలో చిక్కుకొని ప్రతిబంధము నొందుదురు ఆకాశమున విమానములో వెళ్ళు వారికి ఈలాంటి బంధనము లుండవు అదేరీతిగా నెంతవరకు దృశ్యమునకు సంబంధించిన నామరూపములు స్ఫురించు చుండునో అంతవరకు సాధకుడు నియమనిష్ఠల నతిక్రమించి, యేకార్యమును చేయరాదు దృశ్యము స్ఫురింపక అంతయు దైవమయమై ప్రకాశించునప్పుడు నియమనిష్ఠా పద్ధతులను చూడపనిలేదు అట్లు చేయనిచో అకాశములో బోయెడివానివలె భూమిలో విహరించుచుండిన తప్పక బంధనములో చిక్కుకొనును

185 పూర్ణిమ దినమందును, అమావాస్యదినమందును చంద్రుడు ఆకాశమండలమునందు ఒక్కే విధముగానే యుండును అయితే పూర్ణిమ దివసమున పూర్ణప్రకాశమునకును, అమావాస్యరోజున చంద్రుడు కనపడకపోవుటకును కారణమేమి? అది చంద్రుని దోషము గాదు కృష్ణపక్షమున మధ్యరేఖ భూమి అడ్డుపడుటచేతను, శుక్లపక్షమున మధ్య నుండి భూమి తొలగుటచేతను శుక్లపక్ష కృష్ణపక్షములు గలుగుచుండును

ఆలాగున మానవుల హృదయాకాశమందు ప్రపంచవాసన అడ్డుపడినుండువరకు, ఆత్మజ్ఞానము ఆవరణపడి యుండును అట్టి ప్రపంచవాసన నిశ్శేషముగ తొలగునప్పుడు ఆత్మజ్ఞానము పూర్ణచంద్రునివలె ప్రశోభితమై ప్రకాశించును

186 తెల్లకిరసనాయిలును, మంచినీళ్ళను చూచునప్పుడు ఒక్కేవిధముగా నుండినను ఒక్కటిగా కలిపిన, కలియక వేరువేరుగా ఏలాగున నుండునో అదేప్రకారము దైవమునకు గల శుద్ధ, సత్య, జ్ఞానదయాది గుణములు జీవునికి గలుగనిచో జీవబ్రహ్మైక్యపరమగు ధ్యాననిష్ఠ శ్రవణమననాదులు ఎంతకాలము చేసినను, శివజీవైక్యపరమగు ఏకత్వము గలుగజాలదు అనగా, ప్రతిబంధరహిత ప్రబోధాఖండైక్యజ్ఞానము గలుగదు

187 నిర్మలమైన అఖండ భక్తిలేని వట్టి వైరాగ్యము మాత్రము గలిగియుండిన జలములేని వట్టి చెరువునకు గట్టి కట్ట కట్టినట్లు మాత్రమే యుండును దైవజ్ఞానముగాని, నిర్మలభక్తిగాని యుండియు తీవ్రతర వైరాగ్యము లేనిచో గొప్ప జలాశయమునకు కట్ట లేనట్లుండును కనుక బ్రహ్మనిష్ఠులు పై జెప్పిన రెండింటిలోను జాగరూకులై యుండవలయును

188 శాంతియు, కరుణయు, సద్భక్తియు, సత్యనిష్ఠయు, నిర్మలజ్ఞానమును, సదాచార ప్రవర్తనయు లేనివారికి వట్టి వైరాగ్యము మాత్రముండిన అదెట్లుండుననగా, ఫల, పల్లవ, పుష్ప, లతాదులులేని వట్టి ఉద్యానవనమునకు గట్టిగాను,ఎత్తుగాను, కట్టిన వట్టి గోడవంటిదే యగును పై నుదాహరించిన సుగంధపుష్పాదులును, మంచి ఫలములును గల్గిన తోటగా నుండినను ప్రహరీ గట్టిగా లేనిచో పశువుల చేతను, చోరుల చేతను హాని గలుగునట్లు, దృఢవైరాగ్యము లేనిచో సత్యధర్మానుష్ఠానములకు లోపము గల్గుటకు మెండుగ మార్గము గలదు

189 తగిన యేర్పాట్లు అన్నియు సరిగా లేనివారైన సాధువులకు మఠము ఉండినచో బీదవారికి ఏనుగు దొరికినట్లుండును ఇది సౌఖ్యము గలుగ చేయక భారమునే గలుగచేయును

190 వేలకొలది చెట్లు పెట్టియు పోషింపక పోవుటకన్న, ఒక్క చెట్టయిన పెట్టి చక్కగ పోషించినచో, ఏలాగున ఫలమనుభవింపవచ్చునో, ఆలాగున అనేక శాస్త్రములు చదువుటగాని, అనేక మంత్రములను ఉపాసించుట గాని అనేకసాధనలు చేయుట గాని, అవి అన్నియు చక్కగా చేయనిచో గొప్పఫలమేమియు గలుగదు ఒక్క శాస్త్రముగాని, ఒక్క మంత్రము గాని, ఒక్కసాధన గాని, ఒక ఉపాసనగాని లెస్సగ నుండిన చాలును అది అగ్నివంటిది కొంచెముగా నుండినను అగ్ని కట్టెల ననుసరించి వృద్ధి యగుచుండును అట్లు అనుష్ఠింపనిచో గొప్ప నిష్ఠైనను చల్లారిపోవును గదా ।

191 ఒక్క తరుణమున తిరుపతిలో నుండగా పుష్పోద్యానము నిర్మించునప్పుడు కొంచము ఎత్తైన ఒక రాతిపై ఒక జువ్విచెట్టుండెను దానివేరు తోటలోనికి వచ్చుటచే ఒక్కొక్క వేరును నరకబడుచుండెను కాని చెట్టు యెండిపోలేదు అయితే వేరులను నరుకగా నరుకగా చెట్టుయొక్క బలమును వృద్ధియును, తగ్గుచు వచ్చెను ఒక్క వేరుండు వరకును ఎండలేదు అన్ని వేరులను నరికినప్పుడు చెట్టు ఎండి పోయెను దీనివల్ల ఈ సారము గ్రహించదగినది సాధనకాలమున కొన్ని కొన్ని వృత్తులను విడిచినచో మనోనిశ్చలత్వముగాని, మనోరాహిత్యముగాని గలుగదు కాని మన మనశ్చలనత్వ ముడుగుచుండును అన్ని వృత్తులును వాసనలును త్యజించు నప్పుడే నిశ్చలధ్యానమునకు వీరి ప్రకృతి నశించి బ్రహ్మసాక్షాత్కారము గల్గును కొన్ని వేరులను నరికినను అజాగ్రత్త పడినచో నరికిన వేరునుండి మరల చిన్న చిన్న వేర్లు పుట్టి యథా ప్రకారము వృద్ధి యగును ఇదిన్ని చూచితిని కావున కొంతకాలము బ్రహ్మనిష్ఠచేసి విడిచినచో మరల యథాప్రకారము సంసారారణ్యము పెరుగుచుండును కాని ధ్యానఫలము బొత్తిగ నశించిపోవక జన్మాంతరమునకు మంచి సంస్కారమై పరిణమించును

192 ఓ సాధకుడా! ప్రారబ్ధమని తలంచి విషయము తటస్థించినప్పుడు దానినుండి నివృత్తి పరమగు కార్యము చేయుటలో

ప్రయత్నము మానకుము ఏలన విషయవృత్తి గలుగుట ప్రారబ్ధమా ? లేక పరిపక్వావస్థ గలుగకనో లేక వివేక రాహిత్యముచేతనో అని నీకెట్లు తెలుసును। కావున సదా నివృత్తిమార్గ ప్రయత్నము ముముక్షువు చేయుచునే యుండవలయును గొప్ప ఆత్మజ్ఞానులు గూడ రోగము వచ్చునప్పుడు ఔషధ సేవ చేయుట చూచుట లేదా।

193 కోటలోపల బంధింపబడినవాడు ఏలాగున బయట బోవజాలడో, ఆలాగున మీకు స్థూల, సూక్ష్మ, కారణశరీరములు గాని లేక దృశ్యముగూడ ఆత్మకు అభిన్నముగా గనపడువరకు ధైవత్వము గలుగదు అంతవరకు నిత్యశాంతియు, హాయియు లభింపదు అట్టిదానినే ఆవరణమనియు, సంకల్పమని, కర్మయనియు, వృత్తియనియు, అజ్ఞానమనియు గ్రహించవలయును ఇట్టిదానినుండి బయటపడుటకు వాసనాక్షయమును, ప్రారబ్ధశమనమును గలుగవలయును అంతవరకు గోడలోపల నుండువాడే యగును

194 కారాగృహ బంధీకృతుడు బయటపోవుటకు ప్రయత్నించినను ఏలాగున ఉద్యోగస్థులు అడ్డుపడుదురో ఆలాగున కర్మశేషముండువరకు నిరంతర నిర్వికల్ప సమాధిలో నుండుటకు ప్రయత్నించిన సంకల్పములును, వృత్తులును, రోగాదులును పైకి పోనియ్యవు ఏలన? అచ్చట నిత్యసుఖము మాత్రమే యుండును అట్టి దానిలో సదా యుండిన ఈ కర్మ శేషమును అనుభవించుట యుండదు

195 ఇంద్రియములు సూక్ష్మములు సూక్ష్మతరములు అతి సూక్ష్మతమములుగా మారునప్పడు అతిసూక్ష్మములగు ధైవవిషయ జ్ఞానములు గోచరించుచుండునదేగాక, బుద్ధివైశాల్యమును, విశుద్ధతయును గలుగును ఎట్లన ? ఒక ఘనీభూతవస్తువు ద్రవమగునప్పడు ముందుదానికన్న విస్తీర్ణ మేర్పడును మరల అది అగ్ని తత్త్వమై మారునప్పడు ఇంకను ఎక్కువ స్థలమును ఆక్రమించును వాయువై పరిణమించునప్పడు విశాలస్థలములలో వ్యాపించును ఆకాశమైన బహు విస్తీర్ణముగా

వ్యాపించియుండునట్లు జ్ఞానియైనవానికి అతీంద్రియజ్ఞానము గలుగుటకిదే కారణము కనుకనే మందబుద్ధి గలవానిని మొద్దు అనియు, మట్టి మనిషి అనియు జనులు పిలిచెడు రహస్యము

196 మట్టిలో కలిసియుండు మాలిన్యమును వేరుపరచుటకు సాధ్యము గాదు జలములో అయినచో కొంతవరకు ప్రయాసపడిన కొంచముగా మాలిన్యము తొలగింపవచ్చును అగ్నిలో అయిన దహించిపోవును వాయువులో అయినచో అంటి అంటక యుండును ఆకాశములో అంటనే అంటదు కనుకనే మహాపురుషులు లోకోద్ధారక కార్యములలో ప్రవేశించి యుండినను, అంటి అంటక యుందురని చెప్పబడు రహస్యము కాని యిది సామాన్యావస్థ యని తలంపరాదు అది వారి వారి అనుభవముచేత మాత్రమే గ్రహింప సాధ్యపడును దృశ్యాది విషయవృత్తులలో ఆత్మ కలియునట్లు తోచుచుండిన ఇంకను అగ్ని తత్త్వమునకుగాని, వాయుతత్త్వమునకుగాని, ఆకాశతత్త్వమునకుగాని రాలేదని సాధకుడు గ్రహించవలయును అగ్నితత్త్వములో ప్రవేశించిన విషయవృత్తి స్ఫురించినను వెంటనే విజ్ఞానాగ్నిలో నశింపచేయశక్తి గలిగియుండును వాయుతత్త్వములో ప్రవేశించిన వృత్తులచే వికారము గలుగదు ఆకాశతత్త్వములో ప్రవేశించిన వృత్తి కనుపించనే కనుపింపదు పృథివీతత్త్వమును జలతత్త్వమున్ను కేవలము బంధనములైయున్నవి అగ్నితత్త్వము నుండియే నివృత్తిమార్గములో ప్రవృత్తి ప్రారంభించి యుండును ముందు జెప్పిన మూడుతత్త్వములకన్న ఆవలిదగు అవ్యక్తతత్త్వమునుగూడ జ్ఞాని దాటవలయును ఈ నిరంతర ధ్యానాదిసాధన బలముచే ఈ అవస్థ అందరికిని గలుగుచుండును ఒక మైనపువత్తిని వెలిగించి పరిశీలించిన నీతత్త్వము సులభముగా అందరును కనుగొనవచ్చును

197 వైరాగ్యమును యోగమును జీవగుణములు అయితే ఇది ఉత్తమజీవులకే లభించును కాని భక్తియు, జ్ఞానమును దైవగుణములు, ఇవి ఉత్తమోత్తమ జీవులకే లభించును

198 ఆరోగ్యశాఖవారు మురికియుండు స్థలములను ఏలాగున శుద్ధపరచుటకు ఏర్పడియున్నారో, అదేరీతిగా లోకపావనము కోరు పుణ్యాత్ములు పాపకార్యము చేయు జనులను పాపవిముక్తులను చేయుటకు ప్రయత్నించుచుందురు పై జెప్పిన పని యేలాగున అధికారవర్గమువారు మాత్రము శ్రద్ధతో చేయుదురో, అదేరీతిగా నీశ్వరానుగ్రహమగు అధికారము పొందిన మహాపురుషులకు మాత్రమే పాపులను ఉద్ధరించెడు బుద్ధి గలిగియుండును

199 పట్టణప్రదేశములో దీపపుసంఘమువారు చీకటిసందులో దీపము పెట్టుదురే గాని వెలుతురు ప్రదేశమున పెట్టనట్లు దైవాంశములో పుట్టినవారు అజ్ఞానులను జ్ఞానులనుగా చేయుటలో ఎక్కువగా ప్రయత్నింతురు దైవాధికారముతో వచ్చిన మహాపురుషులకే యిట్టి శక్తి గలిగియుండును రోగుల కొరకే వైద్యుడు ఏర్పడియున్నాడని శ్రీ యేసు క్రీస్తునాథుడు సెలవిచ్చియున్నాడు

200 ఫలమును గోరి యీశ్వరకార్యము చేయువారు ఈశ్వరాంశములో పుట్టినవారు కారు ఈశ్వరాంశములో జన్మించినవారైనచో ఫలమును కోరకనే దైవకార్యము, పుణ్యకర్మానుష్ఠానము, లోకపావనత్వము, జపధ్యానాది యోగాదులు చేయుచుందురు ఏలన? కూలి కొరకు పనిచేయువారు అన్యులు కారా? స్వంతపని అయినచో కూలికోరడు గదా! అయితే కూలివారికన్న సొంతవాడు ఎక్కువ శ్రద్ధతోను, శుద్ధముగాను పనిచేయును

201 ఒక గొప్పవాడు సమారాధన, ఉత్సవము మొదలగు కార్యములు చేయునప్పడు అతని మిత్రులు కూలి కోరక యెక్కువ శ్రద్ధతో కార్యములు నిర్వహించుచుందురు అట్టివారిపై గల ప్రేమ కూలిపని చేయువారిపై యజమానునికి ఉండదుగదా! పై జెప్పిన వారికిగల స్వతంత్రమును వీరికి దొరకదుగదా! అలాగున ఫలమును గోరి దైవనిష్ఠ, తపో, ధ్యానయోగాది దైవకార్యములు చేయువారికన్న ఫలమును కోరక చేయువారిని ఈశ్వరుండు

ఎక్కువగా ప్రేమించును అంతేగాక సర్వేశ్వరుండు అట్టివారిని సర్వస్వతంత్రులనుగా చేయును మరియు కూలిపని చేయువాడు బీదవాడు ఈతత్త్వమును జ్ఞప్తిలో నుంచుకొని భక్తులు సర్వకార్యములలోను ప్రయత్నించవలయును

202. కూలిపని చేయువానికి యజమానుండు కూలి మాత్ర మిచ్చునే గాని, అతని యోగక్షేమములను విచారించడు కూలి కోరనివాని యోగక్షేమములను విచారించి అన్ని కార్యములను నిర్వహించునట్లు, ఫలమును గోరి దైవకార్యమును చేయువానికి కోరిన ఫలము మాత్రమే దొరకును ఫలమును కోరక దైవకార్యము చేయువాని సర్వకార్యములను సర్వకాలములలోను సర్వేశ్వరుండే నిర్వహించుచుండును పరమభక్తులు ఇటువంటి వారలే ఫలమును కోరిన యీశ్వరునికి దూరుడగుచుండును ఫలమును కోరక దైవకార్యమును చేయువాడు సర్వేశ్వరుని దగ్గరకు చేరుచుండును అన్ని కోరిక లుడుగునప్పుడు ఈశ్వరమయు డగును

203 తనయొక్క ధనమును, తనువును, మనస్సును అంతేగాక సర్వమును భగవదర్పణము చేయువాడే పరమభక్తుడగును కృతకృత్యుడును అగును ఒక్కరు ఇచ్చిన వస్తువు లన్నియు అతనికి తిరిగి యిచ్చువాడు గదా కృతకృత్యుడు! తనకొరకు కొంచమైన దాచుకొను వాడు ఎట్లు నిర్మలుడగును ? అంతయు భగవదర్పణము చేయునప్పుడు భగవంతుడే మన కార్యములన్నియు నిర్వహించును ఇదే పరమభక్తియును, నిజమైన జ్ఞానమును అగును విచారముగూడ భగవద్విచారమే యుండవలయును అప్పుడు వాక్కును, క్రియను గురించి మరల చెప్పవలయునా? ఇట్టివాడే త్యాగియు, సన్న్యాసియు, నిష్కామ కర్మయోగియు, నిజమైన భగవద్భక్తుడును అగును అంతవరకు స్వార్థమును వీడినవాడు కాడు

204 ఓ సాధకుడా! మీరు నిరంతరధ్యాన సమాధులు శీలించుచుండిన, మనోనైర్మల్యము మాత్రము గల్గును ఓ భక్తోత్తముడా!

మీరు సదా భగవత్సంకీర్తన స్మరణ జపాదులు మాత్రము చేయుచుండిన వాక్శుద్ధి మాత్రమే సిద్ధించును, నిష్కామకర్మయోగము సదా చేయుచుండు ఓ యోగిసత్తమా! మీరు దేహేంద్రియాదులచే సదా యీశ్వర ప్రీతికరమగు కార్యములు చేయుచుండిన ఇంద్రియశుద్ధియు, కాయశుద్ధియు మాత్రమే గలుగును కావున విశాలబుద్ధిగల నిర్మలాత్ముడా! త్రికరణ శుద్ధి కోరువారు పైజెప్పిన మూడు కార్యములను సదా చేయుచుండవలయును ఇట్టివారినే ఉత్తమ యోగనిష్ఠులనందగును పై జెప్పినవాటిలో ఒక్కొక్కటి మాత్రము చేయువారికి ఒక్కొక్క యింద్రియము మాత్రమే శుద్ధినొందును మూడు విధములగు పై జెప్పిన తపస్సు చేయువారికి మూడు దేహములు శుద్ధపడి గుణత్రయాతీత జ్ఞానము కలుగును ఒక్కొక్కటి చేయువారికి ఒక్కవిధమగు లాభమే గల్గును మూడు పనులు చేయువారికి మూడు విధములుగా లాభమేర్పడును మూడింటికి విలక్షణుడై మూడు దేహముల దైవకార్యములు చేయించేలాగున ప్రయత్నించువాడు సిద్ధపురుషుడును, మహర్షియును అనందగును

205 ఓ సాధకుడా! సాధనలన్నిటిలోను నీ మనస్సు దృశ్యాకారమై పరిణమింపక చూచుటయే గొప్ప సాధన యగును ఇది ధ్యేయాకారమందు నందృఢమగు నిలకడ గలిగిన వారికే సాధ్యపడును ఏలన దుర్బలహృదయముగల వానినే మెస్మరిజం చేయువాడు వశపరచి తన కిష్టమైన కార్యము చేయించుటకు సాధ్యపడును దృఢసంకల్పము గలవానిని, మెస్మరిజంవాడు చలింపచేయజాలడు మనస్సు దృశ్యపరిణామము గలిగే రహస్యము చెప్పెద మీరు ఒక గదిలో కూర్చుండి ధ్యానము చేయునప్పుడు బయట ఎవరైన మాట్లాడిన మొదట శబ్దము వినవచ్చును అది యేమని విచారించిన శబ్దార్థమును తర్వాత ఆ మానవుడు, దానిపై వాని గుణములును మీహృదయములో స్ఫురించి అవన్నియు మీ యెదుట కనుపించును అప్పుడు మీ మనస్సు వాని యాకారముతో ఐక్యమగును అందువల్లనే విషయాదులలో మునుగుటకు కారణము ఇట్టి పరిణామము

గలుగకుండచేసికొనవలెను ఇదే సద్భావమునకును, అసద్భావమునకును కారణమగును

206 నిర్మలమైనదైవభక్తియు, ప్రాణికోట్ల సేవయు ఇహపర సౌఖ్యములకు మార్గములు

207 దైవభక్తి నాలుగు తరగతులుగా గలదు శ్రీశివభక్తిగాని, శ్రీవిష్ణుభక్తిగాని, శ్రీరామభక్తిగాని, ఆత్మధ్యానముగాని, లేక క్రైస్తవ, మహమ్మదీయాది మతానుసారము గల భక్తిగాని కలిగియుండువానిలో ఏదైన ఒకదానియందు మంచినిష్ఠ గలిగి తక్కిన మతములనుగాని, దేవతలనుగాని, దైవభక్తులను గాని, దేవాలయములనుగాని, ప్రేమింపకయు పేర్లు సహా ఉచ్చరింపకయు ఉండుభక్తి చాలా సంకుచితమైనది ఇదియొక విధమగు భక్తియే ఐనను, కనిష్ఠమైనదే వీరిలో కొందరు ఇతరులను దూషించుట కూడా గలదు దీనిని అనన్యభక్తియని కూడా కొందరు తలంతురు

మఱికొందఱు పై జెప్పిన దేవతలలోగాని, మతములలోగాని, నిష్ఠలలోగాని, ఒక్కదానియందు మంచినిష్ఠగలిగి, ప్రాపంచిక విషయములలోనికి మనస్సును పోనీయక హృదయములో అన్యచింత గలుగనీయక తన యిష్టదేవతను నిరంతరము భావనజేసుకొని దైవస్మరణ జేయుచుండుటయే అనన్యభక్తియని తలంచుదురు తక్కిన పద్ధతులను వేనిని నిందింపరు ప్రేమతో చూచుదురు ఇది శ్రేష్ఠమైన భక్తియని చెప్పవచ్చును వీరి మనస్సు ముందు జెప్పబడినవారికన్న చాలా నిర్మలత్వమును, వైశాల్యమును గలిగియుండును ముందు జెప్పబడినవారికన్న వీరు వేయిరెట్లు ఎక్కువ దైవకృపగలవారు ఇక కొందరు చరాచర ప్రాణికోట్ల హృదయాంతరాళములో వెలుగుచుండు చైతన్యవస్తువే దైవమని తలంచి ఉపాసింతురు పాత్రలు అనేకములుండినను వాటిలో ప్రతిబింబించు సూర్యప్రతిబింబ మొకటే యనియు, అనేకరకములగు

మణులు గ్రుచ్చబడిన దారమేలాగున ఒకటిగా నుండునో అలాగున అనేకత్వములో ఏకత్వమును గనుగొని ఉపాసించుటయే అనన్యభక్తియని అందురు ఇది శ్రేష్ఠతరమైన భక్తి యనందగును పై జెప్పబడిన వారికన్న వీరి హృదయము బహునిర్మలత్వమును విశాలత్వమును గలిగియుండును పై జెప్పబడిన వారికన్న వీరు వెయ్యిరెట్లు ఎక్కువ స్థితి గలవారు వీరి హృదయము నిర్విషయస్థితి గలిగి దృశ్యవృత్తికి తావు ఇవ్వనందుచేత ఇది అనన్యభక్తి యని చెప్పబడినది

ఇక కొందరు విశుద్ధాంతఃకరణులై బ్రహ్మానుభవము గలవారు దైవమున కన్యముగా తన ఆత్మ లేదనియు, తన ఆత్మకన్యముగా దైవము లేదనియు తలంచుటయే అనన్యభక్తియని ఆనతిచ్చుదురు, ఇది శ్రేష్ఠతమమైన భక్తి యనందగును వీరికి త్రిపుటి రాహిత్యము గలిగి యుండును ముందు జెప్పిన మూడు తరగతుల భక్తి కన్న యీ నాలుగవ తరగతి భక్తివేయిరెట్లు అధికమైనది అయితే ఇక్కాలమున ఇట్టి అవస్థ గలుగుట చాల ప్రయాసము మొదట జెప్పబడిన భక్తియొక్క అనుష్ఠానము చేయుచు రాగా రాగా కొన్ని జన్మములకు ఈ యవస్థ గలుగును ఈ స్థితి గలుగక జీవునియొక్క ఉపాధులు నశింపవు ఉపాధులు నశించువరకు పూర్ణత్వము గలుగదు పూర్ణత్వము గలుగువరకు జీవికి కొరత గలుగు చుండును దివ్యరసాయన సేవజేయుచు రాగా రాగా రోగము శమించునట్లు మొదటజెప్పిన భక్తిలో ప్రయత్నించి రాగా రాగా నిశ్శేషవాసనా రాహిత్య మున్ను, మనోనాశమున్ను గలిగి ప్రబోధబ్రహ్మసాక్షాత్కారము గలుగును

ఇక క్షుద్రదేవతోపాసకులై నీచాచారములగు మధుమాంసాదులచే ఆరాధించువారు కొందరు గలరు ఇది నికృష్టభక్తి యనందగును వీరు మంచి సద్గతి నొందజాలరు క్రూరస్వభావముగల భూత ప్రేతపిశాచాలతో గలసి పోవుదురు ఇట్టి ఆరాధన మానవజన్మమెత్తిన వారెవరును చేయరాదు సత్యధర్మ దయాస్వభావము గలిగి వర్తించే లాగున చూడవలెను ఇట్టివారికి సద్గతి గలుగును

208 విషయవిరక్తి యను నిప్పును, నిర్మల దైవభక్తి యను జలమును, గలిగియుండువారు ధన్యాత్ములు అగ్ని చేతను, జలముచేతను రైలుఇంజను ఏలాగు పోవుచుండునో అలాగున పై జెప్పిన వారికి మోక్ష మార్గ ప్రయాణము త్వరలో సిద్ధించును, నిప్పు, నీళ్ళు ఎక్కువగా నుండిన ఇంజన్ గమన వేగమేలాగున నుండునో, ఆలాగున భక్తివిరక్తులు ఎంత తీవ్రావస్థను బొందుచుండునో, అంతకంతకు దైవమును సమీపించుచుండును

209 ఒక్క పురుషునియందు ఏలాగున ఒకే స్థలమున స్వంతభార్యయు, జారస్త్రీయు ఐకమత్యముగా కాపురము చేయజాలరో, అదేరీతిగా ఒక బ్రహ్మనిష్ఠునియందు ముక్తి కాంత యను యోగమును, విషయస్వభావ మను భోగమును ఉండజాలవు

210 శ్రీని, స్త్రీని ఎంతవరకు జయింపజాలడో, అంతవరకు మనుజుడు శ్రేయస్సు నొందజాలడు జయించిన వానికి, నిశ్రేయస్సు వచ్చి సేవజేయుచుండును నిశ్శ్రేయస్సు అనగా ముక్తి

211 ప్రార్థన, ధ్యాన, పారాయణ, పఠన, ఉపన్యాసాదులలో ఈలాటి భేదము గలదు కొందరు లోకములోను, కొందరు దేహములోను, కొందరు మనస్సులోను నిలిచియుందురు అనగా లోకదృష్టి, దేహదృష్టి, మనోదృష్టి గలవారలై యుందురు వీరందరును మిథ్యాదృష్టి, అనగా జడబుద్ధి గలవారలే గాక తమస్సులో నుండువారు అయితే లోకమునకన్న దేహమును, దేహమునకన్న మనస్సును ఆత్మకు సమీపముగా నుండును ఒక్కొక్క దానికిని ఎక్కువ ఎక్కువ పవిత్రత కూడ గలిగియుండును వీటి నన్నిటిని ప్రకాశింప చేసెడి ఆత్మయందు, దైవభావము గలిగి చేయు ప్రార్థన ధ్యానాదులు మాత్రమే సత్యములైనవి అది మాత్రమే నిజమైన ఫలము నిచ్చునది దానియందు నిలకడ గలిగినప్పడే తనకును, ఇతరులకును అపరిమితానందము గలుగుచుండును అది చైతన్యదృష్టి లేక దైవదృష్టియని కూడా చెప్పవచ్చును అట్లు ఆనందము గలుగనిచో, ఆత్మయందు నిలకడ గలిగి యుండదు అదే దానికి గుర్తు ఇతరుల శరీరేంద్రియ గుణాదులను చూచి మనోవికారము

గలిగినచో అది లోకదృష్టి యగును తనయొక్క దేహసంబంధ కులగోత్ర ఆశ్రమ సౌందర్య గౌరవములతో గూడిన స్త్రీ పురుష భావము జెందినచో దేహదృష్టి యనంబడును శబ్దోచ్చారణశుద్ధి, మనోవైశాల్యము, విద్యాభిమానము, తపోధ్యాన యోగము మొదలుగా గల వృత్తితో గూడిన హృదయమ్మైనచో మనోదృష్టి యనంబడును ఇవి యన్నియు ప్రకృతిగతములు వీటికన్నిటికి సాక్షియైయుండు ఆత్మలో పరమాత్మభావము కలిగి యుండు నప్పడు దివ్యదృష్టి గలుగును అదే యోగదృష్టి యనియు గ్రహించవలయును అప్పడు మాత్రమే నిత్యశాంతము, నిత్యసుఖమును, దైవామతత్త్వమును జీవులకును లభించును

212 మనస్సు దృశ్యమ్మై పరిణమింపకుండ చూచుటయే యోగధారణ యనంబడును ఇట్టి దానినే అనన్యభక్తి యనియు, స్వస్వరూపానుసంధానమనియు మహాత్ములు వచింతురు మనస్సు ఏలాగున దృశ్యాకారమ్మై పరిణమించునో చూడందగును మీరు ఏకాంతమున ధ్యానములో కూర్చున్నప్పడు బైట ఎవరైన మాట్లాడుచుండిన ధారణాశక్తి ఎక్కువ యుండినచో శబ్దము వినరాదు ఇది చాల సిద్ధిగల సిద్ధపురుషులకే సిద్ధించును సామాన్య ధారణశక్తి గల వారైనచో శబ్దము వినవచ్చును అర్థము గోచరింపదు శబ్దముపై మనస్సును కొంచెము పోనిచ్చిన శబ్దార్థముకూడా స్పష్టముగా గోచరించును ఇంక కొంచెము పోనిచ్చిన మాట్లాడువారియొక్క రూపము గోచరించును మరింత మనస్సును విడిచిన మాట్లాడువారి గుణములన్నియు తన మనస్సులో ఏర్పడును తరువాత మీరును అదే రూపమ్మై మారుదురు అప్పడు మనస్సు దృశ్యాకారమ్మై పరిణమించి విషయములో మునిగిపోవును మనస్సు ఇట్టి పరిణామము నొందక ఎవరును విషయములో మునుగజాలరు ఇట్టి పరిణామము గలుగనీయకుండ చూచుటయే సంయమమనంబడును అటులయిన ముముక్షువులు విషయములో మునుగజాలరు దీనినే మననమనియు, యోగధారణమనియు, ఆత్మనిష్ఠ యనియు, దైవభావన యనియు

గ్రహించవలయును దృశ్యదృష్టియే సంసార మనంబడును

213 సాదకునిదృష్టి బహుజనములతోను, అనేక రకములగు బండ్లతోను గూడి వంకర వంకరగా నుండు వీధులలో వేగముగా మోటారుకారు నడిపెడు డ్రైవరు దృష్టివలె నుండవలయును కనురెప్పపాటు తప్పినచో ఏలాగున అపాయము గలుగునో, ఆలాగున ఆత్మభావములో నుండి ఎంతవరకు కనురెప్పలాడక నిలుప సాధ్యపడునో ఆలాగున అభ్యసించవలెను అట్టిన బ్రహ్మభావన చలింపక యుండును ఒకవేళ కనురెప్పలాడినను భావమునుండి చలింపకుండిన చాలును అయితే మొదట కన్ను రెప్పలాడకనే చూచుచుండవలయును అప్పుడు శ్వాసముకూడా సూక్ష్మావస్థ నొందును కన్ను రెప్పలాడు కాలము దైవభావమునుండి చలించిన మేరుపర్వతాగ్రము నుండి పతనమొందినవానివలె రెప్పపాటు కాలములో అధఃపతితు డగును మనస్సు అంతవేగముగాను, సూక్ష్మముగాను ఉండును ఇట్టి మనస్సుయొక్క అతివేగమును, మార్పును ముముక్షువు చూచుచుండవలయును అభ్యాసి దైవభావములో నిలుచుకొని కన్ను రెప్పలాడనీయక కొంతకాలము దినమునకు కొన్ని గంటలకాలముగాని, నిమిషముల కాలముగాని అభ్యసించుట మంచిది దైవభావన లేనిచో జడత్వము నొందునని కూడా జ్ఞప్తిలో నుంచవలయును

214 వైరాగ్యమనగా కుటుంబమును విడిచి పెట్టుట, ఆహారమును మాని చెట్టుక్రింద గాని, నిర్జనప్రదేశమందు గాని ఊరకపడి యుండుట మాత్రము కాదు అది వైరాగ్యముయొక్క అంగము ఒక నిమిషమైనను వ్యర్థముగా పోవునపుడు ఎవరి నేత్రములనుండి ధారధారగా జలము కారుచుండునో, దైవవిషయమై పట్టరాని దుఃఖము కలుగుచుండునో, మనస్సులో మండుచు నిప్పువలె హృదయము క్రాగుచుండునో, అదే నిజమైన వైరాగ్య మనంబడుచుండును వీరికి అన్నపానాదులు కూడా రుచించవు ఇదే గురుతు ఇట్టివారికి దైవసాక్షాత్కారము త్వరలో గలుగును

215 చింతచెట్టు మొదలుగా గల పులుపు వృక్షముల ఫలపల్లవ పుష్పాదులన్నియు పులుపుగాను, ముష్టిచెట్టు మొదలగు చేదుగల వృక్షముల పుష్ప, లతా ఫలాదులు చేదుగాను, లవంగిపట్ట (వరంగిపట్ట) గల చెట్టుయొక్క పత్రపుష్పాదులు తీపుగాను ఉన్నట్లు పుణ్యపురుషుల మనోవాక్క్రియలన్నియు పుణ్యమయములై యుండును ఆలాగున పాపజీవుల మనోవాక్క్రియలు పాపస్వభావముగాను, రజోగుణము గలవారి క్రియలన్నియు రాజసయుక్తములుగాను ఉండును కనుక ఒక్కొక్కరి వాక్కును,క్రియయును, సంకల్పమును చూచినచో వారిస్థితి గనుగొనవచ్చును కావున పుణ్యపురుషులమని తలంచువారు సదా తమ యొక్క సంకల్పమును, వాక్కును, క్రియయును పుణ్యమయములై యున్నవా? అని చూచుచుండవలయును దీనియొక్క భావన వలన పునీతులు గావచ్చును

216 ఒక్కరియందు ఏవృత్తియైన ఒకటి దుష్టగుణము గల్గియుండునట్లు కనుపించిన తక్కిన వృత్తులన్నిటిలోను దోషము గలిగియుండును ఏలన, ఒకరియందు ఒక్క యింద్రియము సత్వగుణము గల్గి తక్కినవి రజోగుణములును, కొన్ని తమోగుణములును గలిగి యుండవు ఎట్లన సానుకూలపాత్రలో అన్నము గాని, యితరములగు విత్తనములుగాని, ఉడుకబెట్టునప్పడు కొన్ని గింజలు ఉడుకుట కొన్నివిత్తనములు ఉడుకకపోవుట ఈలాటి భేదముండుట లేదుగదా! ఆత్మపరిణామము అదేవిధముగ ఒక్కేసరణి ననుసరించి మారుచుండునేగాని వివిదములైన మార్పు లుండవు

217 ఓ సోదరుడా! నీ యొక్క కర్మయందు జాగరూకుడవై యుండుము అట్లైన నీకు సర్వత్ర విజయమును, సుఖమును గల్గును మీరు చెడు విత్తనములు వేయునప్పడు జనులు మంచి విత్తనములు పెట్టుచున్నాంని చెప్పినను మంచి ఫలము ఫలింపదు లేక మంచి విత్తనములు పెట్టునప్పడు చెడు విత్తనములు పెట్టుచున్నారని జనులు చెప్పచుండినను, మంచి ఫలమే ఫలించును కనుక మీరు చెడు కృత్యములు

చేసినను జనులు మంచికార్యమే చేయుచున్నారని మిమ్ముల స్తోత్రముచేసిన ఫలమేమియు లేదు చెడు కార్యము గల్గుట నిక్కము అదేప్రకారము మంచి కార్యము చేయునప్పుడు దుష్టకార్యమును చేయుచున్నారని జనులు చెప్పుచుండినను విరోదము లేదు మంచిదే గల్గును కనుక అంతరాత్మకు భంగము గలుగనీయక యే కార్యమైనను చేయుచుండుము ఫలప్రదాత జగదీశ్వరుడేకాని మానవులు కారను తత్త్వము మాత్రము సదా జ్ఞప్తిలో నుంచి వర్తించుము ఆ సర్వేశ్వరుడు సర్వప్రాణికోట్ల హృదయాంతర్వర్తియై సదా సమస్త కార్యములను చూచుచుండెడు ప్రభువై వెల్గుచున్నాడు

218 నీటిలోనుండి బయట పడిన చేప యేలాగున సౌఖ్యము నొందజాలదో, అలాగున కర్తృత్వము వీడి దైవభావములో జీవించనంతవరకును ఈ జీవికి నిత్యసౌఖ్యము గలుగజాలదు భూమిపైనుండు మత్స్యము నీటిలో పడునప్పుడు ఎట్టి సౌఖ్యము నొందునో, అట్టి సౌఖ్యము కర్తృత్వము విడిచి యీశ్వరభావములోనికి పోయెడు జీవికి గల్గును

219 రేపు చేయందగిన పనికి యీ దినమున ప్రతిఫలము తీసికొనకుము ఈ దినము చేసిన పనికి రేపు ప్రతిఫలము తీకొనేలాగున జీవింపుము ఏలన! రేపు ఆపని నిర్వహింపగలుగుదుమని మీకు ఎట్లు తెలియును? ఏలన! జగత్తు సదా పరిణామము జెందుచుండునుగదా! అంతేగాక జీవితము బుద్బుద సదృశముగదా! ఈ రహస్యమును తెలుసుకొనకనే జనులు దుఃఖమునకు పాలగుచున్నారు కావున నోసోదరుడా! దీనియందు జాగరూకత వహించనిచో సత్యజీవితమును, సుఖజీవితమును గడుపజాలవు

220 సత్యజీవితముయొక్క పరిణామము అమృతమయమై పరిణమించును అసత్య జీవితముయొక్క పరిణామము విషభూయిష్ఠమై పరిణమించునని మరువకుడు పాండవుల యొక్కయు, దుర్యోధనాదుల యొక్కయు జీవితముచే ఇది తెలుసుకొనుడు

221 తాను తరించుటయు, ఇతరులను తరింపచేయుటలో ప్రయత్నించుటయు ఏది గలదో, అదే సనాతన ధర్మము

222. దేహేంద్రి యాదులచే విధియుక్త సత్కర్మలను అకర్తగానుండి చేయుటయు, అట్టికర్మలకు తాను విలక్షణముగా నుండుట యేది గలదో అదే నిజమైన కర్మయోగమనియు, జ్ఞానయోగమనియు తెలిసికొనుటయే సనాతన ధర్మమగును

223 యోగసమాధియం దుండునప్పుడును, దానినుండి ఉత్థానదశ గలుగునప్పుడును, పరప్రాణులకు ఉపకార ప్రదములగు కార్యముల చేయునప్పుడును, ఆత్మయందుండి వియోగము గలగని దశ యేదియో అదే సనాతనధర్మ మనంబడును

224 వివిధములగు లోహములచే వివిధాకృతులు గల పాత్రములలోనుండు జలమందు ప్రతిబింబించెడు సూర్యుడు ఒక్కడే యని తెలసికొన్నట్లు, సర్వప్రాణికోట్ల హృదయములో వెల్గుచుండు ఆత్మను, లేక దైవమును, తన ఆత్మను ఒక్కటిగా గనుగొనుటయే సనాతన ధర్మమగును

225 దూషణ భూషణములను, సుఖ దుఃఖములను మానావమానములను సహించుకొని కర్తృత్వమును, కర్మఫలమును దూరముగా త్యజించి, దైవనియమమును లేక గురుకార్యమును శ్రద్ధాభక్తులతో నిర్వహించి, ఆనందించుటయే యీశ్వరసేవ యనియు, గురశుశ్రూషయనియు తెలిసికొనుటయే సనాతనదర్మ మనంబడును

226 దేహేంద్రియములు నశించినను ఆత్మకు నాశనము లేదని తెలిసికొనియుండు నిజానందమునే సనాతన ధర్మమని యెరుంగ వయును

227 గుణకర్మములను ఆధారము చేసికొనియే వర్ణాశ్రమ ధర్మముల ఉచ్ఛ నీచావస్థలు ఏర్పడినవని తలంచి, సుగుణసంపత్తి గలవారందరికిని దైవప్రాప్తికి అర్హత గలదని తలంచి వారివారికి ఉపయుక్తమగు విధముగా దైవప్రాప్తి మార్గమును ఉపదేశించుటయే ననానతనధర్మమని

యెరుంగవలయును

228 అంతః కరణములో గల వృత్తులు గాని, సంకల్పములు గాని, గుణములుగాని, వాసనలుగాని, సంపూర్ణముగా విలయము పొందువరకును సనాతనమగు బ్రహ్మమును పొందుటకు అర్హతలేదని తలంచి సాధనయందు జీవితమును వినియోగపరచినవాడే సనాతన ధర్మముయొక్క రహస్యమెరింగినవాడని తెలిసి కొనుటయే సనాతన ధర్మమనంబడును

229 అనేక యోజనముల విస్తీర్ణము గల సముద్రమును దాటతలంచువారు ప్రయానమును సహించి తీరసమీపమువరకు భద్రముగా వెళ్ళినను, దగ్గర వచ్చినప్పడు ఓడ మునిగిన గమ్యస్థానమును జేరక యేలాగున వ్యర్థులై పోవుదురో అదే రీతిగా భక్తివైరాగ్య, యోగసాధనలు చేయువారలైనను చాలాకాలము తమయొక్క వ్రతమును చెడనీయక సంరక్షించుకొనినను, సాక్షాన్మోక్షావస్థ గలుగువరకు నిష్ఠసాధించ వలయును అంత్యకాలము వరకు తనయొక్క వ్రతమును చెడనీయక చూడవలయును చెడినచో జీవితపవిత్రతను పొందజాలరు అయితే నిష్ఠ సంపూర్ణముగా నశింపక మరియొక్క జన్మమునకు సంస్కార వాసనగా బరిణమించును

230 అనేకములగు ఫల, పల్లవ, పుష్ప లతాదులతో గూడిన గొప్ప వృక్షమైనను మొదలు చెడినచో, ఏలాగున దానియందు గల ఫల, పల్లవ, పుష్పలతాదులన్నియు రాలిపోవునో, అతేరీతిగా శమ, దమాది సత్య, ధర్మ జ్ఞానములతో శోభించెడు యోగి యైనను తనయొక్క నడతలో లోపము గలిగినచో, అతనియొక్క గొప్పయశస్సు, గౌరవమును, జ్ఞానవిజ్ఞాన శమదమాది ఆత్మసంబంధ గుణములును, సత్యధర్మదయాది దైవికస్వభావములును వీనిని విడిచిపెట్టి వెళ్ళిపోవును

231 ఏలాగున విత్తనములు ఎండలో పెట్టినను బీజాంకురము నశింపదో, నిప్పలో వేయించిన మాత్రమే బీజాంకురము నశించునో, అలాగున ఎంతమాత్రము తీవ్రతరమగు తపస్సుగాని, కష్టమగు వ్రతముగాని

ధ్యానయోగముగాని అనుష్ఠించినను ఇంద్రియముల యొక్క విషయ బీజాంకురము నశింపజాలదు బ్రహ్మాజ్ఞానాగ్ని ఒక్కటి అనవరతము రగులుచుండిన మాత్రమే పునర్జన్మాంకురమునకు కారణమగు వృత్తులనెడు బీజములు జీర్ణించును ఇట్లుండగ నెండలో గూడ పెట్టక నీడలో పెట్టియుండు విత్తనముల బీజాంకురము నశించునా? ఆలాగున తపస్సు, యోగము, వ్రతములుగూడ చేయని సౌఖ్యమానవుల వృత్తులెట్లు నశించును? తపస్సు, యోగము మొదలైనవి, జ్ఞానాగ్నికి సానుకూలమగు కట్టెల వంటివని గ్రహింపుడు

232 త్రాచుపాము ఎంత ముదిరినదైనను విషమేలాగున నశింపదో ఆలాగున ఓసోదరుడా! మీ మనస్సు, తపస్సు మొదలైన నిష్ఠలచే శుష్కించినను లేక మీరు వృద్ధత్వ మొందినను, మనస్సులో గల విషయము మాత్రము నశించినదని తలంపకుడు ఇట్టి విచారము మీకుండినచో మీరు చెడజాలరు అయితే సర్పము మృతినొందినచో, మరల విషముండని రీతిగా మనస్సు చచ్చినచో, అనగా మనోరాహిత్యము గలిగినపుడు మాత్రము విషయదోషము నశించును

233 సముద్రమున ఓడలో ప్రయాణము చేయునప్పుడు కొంచమైన రంధ్రము గలిగి ఓడ లోనికి జలము ప్రవేశించిన ఏలాగున ఓడను ముంచివేయునో అదే రీతిగా విషయమయమైన సంసారసాగరమును దాటుచుండు ముముక్షువులకు విషయవృత్తి స్వల్పమైనను గల్గినచో, వెంటనే నివృత్తి చేసికొనవలయును లేనిచో అచిర కాలములోనే విషప్రాయమగు సంసారసాగరములో మునుగుట నిక్కము

234 వస్త్రనిర్మాణము చేయువారికి పడుగు పేకలు రెండును ఏలాగున సమముగా నుండవలయునో, ఆలాగున బ్రహ్మనిష్ఠ సాధింపతలంపుగలవారికి యోగసాధనయును, జ్ఞాననిష్ఠయును సమముగా నుండవలయును లేనిచో పరిపూర్ణస్థితిని బొందజాలరు

235 ఒక్కరికి తన ప్రకృతి ఎంతకెంతకు వశపడునో, అంతకంతకు

ప్రపంచమును, ఆ మహాపురుషునకు వశపడును ఈ తత్త్వమును తెలిసికొను సమర్థతలేకయే అట్టి మహాపురుషునకు జనాకర్షణయనియు, ధనాకర్షణయనియు సామాన్యజనులు తలంతురు ఇది మనస్సును తన ఆత్మలోనికి ఆకర్షించుటయే గాని, మానవాకర్షణము గాదు సుమా!

236 మానవులలో ముఖ్యముగా నాల్గు తరగతులు గలవారున్నారు ఈ గుణముల బట్టియే చాతుర్వర్ణ్య మేర్పడినది అది వారి వారి స్వభావ గుణములనుబట్టి గనుగొనవచ్చును 1 ఒక్కడు తనయొక్క దైవప్రాప్తి లబించుటలో అనగా సత్య ధర్మ తపోయోగజ్ఞానములు సిద్ధించుటకు మానావనములు గాని, శీతోష్ణాది సుఖదుఃఖములనుగాని, సహించుటయు, దననష్టముగాని, శరీరాది సౌఖ్యములనుగాని, లక్ష్యపెట్టకయు, పైన జెప్పిన కార్యములను నిర్వహించెడు పట్టుదల గలిగి వర్తించునప్పుడు అతడు బ్రహ్మణవృత్తి గలవాడగుచున్నాడు 2 శౌర్యపరాక్రమాది గుణములు గల్గి యశఃకీర్తులు గలుగు విషయమై ధనమును గాని, దేహేంద్రియాది సౌఖ్యములనుగాని, నిద్రాహారాది దేహసౌఖ్యములనుగాని ఆఖరుకు ప్రాణమునుగాని తృణీకరించి, పైనుదాహరించిన యశశ్శౌర్యాది కీర్తులను సంపాదించెడు బుద్ధిగలవాడు క్షత్రియు డనంబడును వీనికి ప్రాణమునకన్న యశస్సు గొప్పదను తలంపు గల్గియుండును 3 ధనలాభములోను, కొంతవరకు శరీరసౌఖ్యములోను, మాత్రమభిలాష కలిగి, సత్య శౌర్యాయశస్సులనుగూడ పాటింపక కొంత దైవభక్తియు, ఫలాపేక్షతో గుడిన దానశీలమును, గలిగియుండెడు గుణము గలవాడు వైశ్యజీవితములోనికి ప్రవేశించినవాడగును నిద్రాహారాది దేహ సౌఖ్యములే పరమపురుషార్థమను బుద్ధిగల్గి కొంత ధనాబిలాషయు గలిగి, సత్యమునుగాని, జ్ఞానమునుగాని యశస్సునుగాని, ధనమునుగాని ముఖ్యమని తలంపక పైనుధాహరించిన కార్యములలో మాత్రము కాలము గడుపు వాడు శూద్రజన్మముగలవాడగును ఈ గుణములనుబట్టి ఒక్కొక్కరిని గనుగొనవచ్చును

మరియు ఈ నాల్గింటిలో మరల మూడేసి మార్పులు గలవు

మొదటిది సత్త్వగుణాధిక్యమును, రెండవది రజోగుణాధిక్యమును, మూడవది మూడుగుణముల మిశ్రత్వమును, నాల్గవది తమోగుణమును గలిగియుండును అనగా సత్త్వగుణములో సత్త్వగుణము, సత్త్వగుణములో రజోగుణము, సత్త్వగుణములో తమోగుణము, ఈలాగున తక్కిన రెండుగుణములలోనుగూడ గలదని గ్రహించవలయును వీరిలో క్రిందతరగతి జన్మము గలవారికి నిష్కామకర్మయోగమును, రెండవవారికి భక్తియోగమును, మూడవవారికి యోగాభ్యాస పరమగు ధ్యానయోగమును, నాల్గవవారికి ధ్యానయోగపరమగు విజ్ఞానయోగమును తరణోపాయములు అయితే దీనియందు కొన్ని రహస్యములు గలవు మొదటి వారికి అనగా క్రిందితరగతివారికి సకామ కర్మయోగముండును రెండవవారికి కొంత నిష్కామ కర్మయోగమును, సకామభక్తియును గలిగి యుండును మూడవవారికి నిష్కామ కర్మయోగమును, కొంతవరకు నిష్కామ భక్తియోగమును, సకామయోగప్రాప్తీచ్ఛయు గలిగియుండును నాల్గవవారికి నిష్కామ కర్మయోగమును, నిష్కామదైవభక్తియు, నిష్కామ యోగధ్యానమును, సకామ జ్ఞానయోగమును గలిగియుండును వీరికందరికన్న విలక్షణు డొక్కడుండును వీడు విశుద్ధ సత్త్వగుణము గలవాడు అనగా గుణత్రయాతీతుడు, జీవన్ముక్తుడు, తురీయుడుగాను, తుర్యాతీతుడుగాను ఉండవచ్చును వీనికి నిష్కామ కర్మయోగము, నిష్కామదైవభక్తి, నిష్కామ యోగధ్యానము, నిష్కామ దైవజ్ఞానము గలిగి యుండును వీడు మహాత్ముడు, పరిపూర్ణుడు పుష్పమునుండి స్వయముగా సుగంధము వెడలునట్లును, సూర్యునినుండి స్వయముగా ప్రకాశము గలుగునట్లును, చంద్రునినుండి నైజముగ చల్లదనము గలుగునట్లును, సర్వకాల సర్వావస్థలలోను అతని శరీర రోమకూపములనుండి సహోభక్తియున్ను, జ్ఞానమును, వైరాగ్యమును, కరుణయును సర్వతోముఖముగా ప్రకాశించుచుండును ఇట్టివారు స్త్రీలలోను, పురుషులలోను గూడ నుండవచ్చును ఇదే సత్యమైన వర్ణాశ్రమధర్మముయొక్క రహస్యము ఏ కాలమున వర్ణవిభాగ

మేర్పడియుండినదో అది దీనిపై ఆధారపడియే యుండును కావున ఒక్కొక్కరును తనయొక్క అంతరాత్మలో స్వయముగా పరిశోధన సలిపి జన్మకారణమును గనుగొని తరించే లాగున చూడవలయును కావుననే కొన్ని శాస్త్రములలో బ్రాహ్మణుడై పుట్టినమాత్రమే మోక్షము గలుగునని చెప్పెడు రహస్యమై యున్నది ఇది దేహముతో సంబంధించియుండు నని తలంచుట పొరబాటు ఆత్మతో సంబంధించినదని తలంచువారు ధన్యాత్ములగుదురు అట్టి బ్రహ్మత్వస్థితి గల్గుటకు ఒక జాతిగాని ఆశ్రమముగాని, స్త్రీ పురుషాది భేదములుగాని అవసరము లేదు జన్మాంతరసంస్కారమును, సర్వేశ్వరకృపయును దీనికి కారణము అయితే ఇది జ్ఞానపరమై ఆత్మతో సంబంధించినదని గ్రహించవలెనే గాని దేహముతో సంబంధించిన కర్మపరమైనది తలంపరాదు ఇట్టి బ్రహ్మీభూతస్థితి గలుగుటకు అవిద్యాతనుసంబంధ గుణములు నశించి విద్యాతనువు గలుగవలసి యుండును ఇది గలుగునప్పుడు సర్వేంద్రియముల ద్వారా విజ్ఞానబోధైక రసామృతము పర్వతబిలమునుండి పరిశుద్ధమైన గంగ పొంగి ప్రవహించునట్లు ప్రవహించుచుండును ఇదే దానికి గురుతు దీనియొక్క సారమేమన? దేహేంద్రియాది సౌఖ్యములే గొప్పవిగా తలంచువాడు శూద్రగుణము గలవాడు ధనమే గొప్పదని తలంచువాడు వైశ్యగుణము గలవాడు యశస్సే గొప్పదని తలంచువాడు క్షత్రియగుణము గల వాడు దైవజ్ఞానమే గొప్పదను తలంచువాడు బ్రాహ్మణగుణము గలవాడు భోగమే గొప్పదను తలంపు స్త్రీ గుణమై యుండును యోగమే గొప్పదను తలంపు పురుషగుణమై యుండును క్షత్రియగుణము గలుగు నప్పటినుండియే శుభేచ్ఛయు, బ్రహ్మజిజ్ఞాసయు, ముముక్షుత్వమును, నివృత్తిమార్గబుద్ధియు గొప్పదను తలంపుగల్గును అప్పటినుండి ఆత్మ వికాసమునకు వచ్చుచుండును అదే దానికి గురుతు

237 చెరువులో నుండి జలము కాలువ ద్వారా పారుచుండిన ఆ జలముద్వారా ఏలాగున మత్స్యములు మొదలగు జంతువులు చెరువులోనికి

వచ్చి చేరుచుండునో (అనగా నీటిపాములు, ఎండ్రకాయలు, కప్పలు మొదలుగాగల జంతువులని భావము) ఆలాగున హృదయములోనుండి యింద్రియములద్వారా మనస్సు బహిర్ముఖముగా దృశ్యవిషయములలోనికి ప్రసరించినచో తద్వారా ప్రపంచగుణములు ఆత్మలోనికి వచ్చి చేరుచుండును

238 కొయ్య మొదలైన ఏవస్తువైనను వర్షాదిజలముచే తడిసినప్పడు ఉబ్బునట్లు అది నిశ్చయముగా నెండ మొదలైన వేడిమిచే చిక్కును అదేప్రకారము ఎవరు సుఖకరహితముచే సంతోషము నొందుదురో వారు నిశ్చయముగా దుఃఖకర అహిత కార్యముచే దుఃఖము నొందుదురు ఇవి రెండును మనోధర్మములు దీనికి సాక్షియగు ఆత్మలో నిలువ జూడవలయును, రాయి మొదలైనవి యెండచే చిక్కుట లేనందుచే, వర్షముచే ఉబ్బుట లేదు సాధకుడు దుఃఖము వచ్చునప్పడు సహించవలసియుండినచో సుఖము వచ్చునప్పడు సంతోషము నొందకుండునట్లు జాగ్రత్తతో చూచుచుండవలయును అట్లైన దుఃఖము వచ్చునప్పడు క్లేశము నొందక నిర్వికారమగు రాతివలెనుండు నిత్యగాంభీర్య ద్వంద్వాతీత శాశ్వత సుఖపదవి నొందవచ్చును దుఃఖము పరాధీనముగాను, సుఖము స్వాధీనముగాను నుండును కనుక సుఖము వచ్చునప్పడు వికాసస్థితి నొందక చూడవలయును అట్లైన దుఃఖము వచ్చునప్పడు సంకోచము నొందక యుండవచ్చును

239 సత్త్వ, రజస్తమోగుణముల ఫలాసక్తి యీలాగున పరిణమించును ముముక్షువు దీనిని గమనించినచో గుణత్రయాతీతస్థితిని పొందవచ్చును తాను చేయు కార్యములలో సుఖమును, లాభమును గలుగు కార్యములలో ప్రీతి తమోగుణము యశస్సును విఖ్యాతియు గలిగిన చాలునని తలంచెడు బుద్ధి రజోగుణముతో గూడినది తానుచేయు కార్యము వృద్ధికరమై యుండిన చాలునుగాని, ధనముగాని, సుఖముగాని, కీర్తిగాని అక్కరలేదని గలిగెడు బుద్ధి సత్త్వగుణమైనది అయితే రజస్తమోగుణముల

స్వభావము విడువవచ్చునుగాని సత్త్వగుణ స్వభావము విడువడము చాల ప్రయాసము సత్త్వగుణముగూడ శుద్ధప్రకృతితో గూడినదని మరువకూడదు రజస్తమోగుణములు మలిన ప్రకృతివలన పుట్టుచుండును దీనిని గమనించి తనయొక్క స్థితిని గనుగొనవచ్చును త్రిగుణాతీత స్థితి గలుగునప్పడు పైన జెప్పిన మూడుగుణములును లేనిదై తనయొక్క కర్తవ్యకార్యమును నిర్వహించుచువృష్టి, వాయు, సూర్యాదులవలెను, చంద్రిక వలెను ఫలమునుగాని, స్థలాస్థలములనుగాని చూడకనే దైవకార్యములను చేయుచుండువాడు జీవన్ముక్తుడగును అయితే సత్త్వగుణము మాత్రము ముక్తికి సహాయము చేయును తక్కినవి రెండును బంధనమును గలుగచేయును

240 ఏ బీజమైనను పొట్టుతోనుండు వరకు మాత్రమే మొలకెత్తును పొట్టు తీసి వేసిన మరల మొలవనట్లు మాయ, లేక అవిద్య, లేక ఆవరణము, లేక అజ్ఞానము ఉండువరకు మాత్రమే జన్మముండును అది వదలిపోయిన మరల జన్మముండదు

241 ఓ నాయనా! ఎంత మేధాసంపత్తిగలిగినవాడైనను, దేహస్మృతి తప్పిన యేలాగున నేల గూలునో, అదే రీతిగా నెంత జ్ఞానము గాని, యోగబలము గాని యుండినవారైనను, ఆత్మస్వరూపజ్ఞానము, లేక దైవభావము మరచినచో అజ్ఞానములో పడిపోవుట నిక్కము కనుక దైవస్మరణ సతతము తప్పక సంరక్షించుకొనుము

242 పూర్వీకులగు ఋషులు అనుష్ఠించి నట్లుగదా ఇప్పడుండువారు గూడ అనుష్ఠానము చేయుచున్నారు! అయితే అలాటి మహిమ వీరికి ఏల గలుగలేదని అనేకులు తలంచెదరు దీనికిదే కారణము అదేమన? మంచిసారవంతమైన భూమిలో పెట్టిన బీజము గొప్పవృక్షమై అధిక ఫలము నిచ్చును సామాన్య భూమిలోనిది సామాన్య ఫలము నిచ్చును ఊషరభూమియైన బీజము నశించిగూడ పోవచ్చును కనుక ఒకేసాధన అయినను హృదయముయొక్క పక్వాపక్వ స్థితుల ననుసరించి

మహిమకుగూడ మార్పు గల్గును ఇప్పడుగూడ ఒకేగురు శిష్యులలో కొందరు గొప్పవారుగాను, మరికొందరు సామాన్యులుగను ఉండుటకు ఇదే కారణము

243 నిర్విషయమును, నిర్మలత్వమును గలవారి అనుష్ఠానము మంచి కళాయితో గూడిన పాత్రలో వండిన పప్పపులుసు పదార్థములవలె నుండును దీనిని జనులు కడుపు నిండుగ భుజించుదురు అదే పప్పపదార్థములతో వండినవస్తువులు కళాయిలేని పాత్ర అయినచో చిలుమెక్కి ఒక్కరైన తినరు ఇదే నిర్విషయమును, నిర్మలత్వమును లేని వారిదగ్గరకు జనులు చేరకపోవుటకు కారణము కళాయిలేని పాత్రలో వండినవారు గూడ దానిని భుజింపజాలరు ఆలాగున శమదమాది సత్యకరుణాదులు లేనివారి అనుష్ఠానము వారికిని, మఱియెవరికిని ఏమియు ఉపయోగముండదు

244 ఉప్ప నీటిలో పడవేసినను నీళ్లై మారెడు స్వభావము గలదు లేక ఉప్పలో నీళ్ళుబోసినను జలమయమ్మై పోయెడు గుణముండును ఆలాగున ఆత్మనో బ్రహ్మభావము లేక అద్వైతభావన చేసినను దైవత్వము సిద్ధించును లేక దైవములో ఆత్మను ఐక్యపరచి అనగ నిశ్చలపరచి ద్యానించెడు విశిష్టాద్వైత భావముగాని, ద్వైతభావముగాని జేసుకొని భావించినను అదిన్ని ఈశ్వరాకార సిద్ధిని గలుగ జేయును, దీనియందొక్కటి అతీత జ్ఞానియొక్కయు, రెండవది అధికభక్తుని యొక్కయు లక్షణమ్మై యుండును ఇట్టి స్థితి లేనిచో అట్టి స్థితి గలుగుట ఉభయులకున్ను ప్రయాసకరము

245 ఎవడు భక్తి వినయ నమ్రతలతో మహాత్ములకు వంగి నమస్కరింపడో వానికి ప్రకృతి వంగి వశపడదు

246 విద్యుచ్ఛక్తి మొదలగువాటి యొక్క మూలస్థానమగు యింజన్, శుద్ధము గాను, విద్యుచ్ఛక్తితోను గూడియుండిన దానినుండి వ్యాపించియుండు దాని శాఖలగు యంత్రదీపాదులు ఏలాగున

చైతన్యముతోను, ప్రకాశముతోను గూడి పనిచేయుచుండునో అలాగున ఏ సంఘమును స్థాపించినవారైనను దానియొక్క మూలపురుషుడుగాని, మూలస్థానముగాని సత్యధర్మనిష్ఠలతో గూడియుండువరకు దానికిని దానిశాఖలకును అభివృద్ధి గల్గుచుండును ఎప్పుడు సత్యధర్మముల నిష్ఠ లేకపోవునో అప్పుడు విద్యుత్తు నశించిన యంత్రమువలెను, యంత్రశాఖలవలెను నిలిచిపోవును

247 అందరికన్న తాను తక్కువ వాడనని తన్ను ఎవడు తలంచునో, వాడు అందరికన్న గొప్పవాడగును అందరికన్న తాను ఎక్కువ వాడని యెవడు తలంచునో, వాడు అందరికన్న తక్కువ వాడగును ఇది ప్రకృతియొక్క అలంఘనీయ శాసనము అయితే యీ భావన ప్రపంచనడతలలో మాత్రము వుండవలయునే గాని, ఆత్మభావనలో మాత్రము అట్లుండరాదు దానియందు తన్ను అఖండాకార మహిమాతిశయముగల దైవభావనయే చేయవలెను అప్పడు ఎక్కువ తక్కువలు గనపడుటకు అవకాశము లేదు అదే దానికి గురుతు అప్పడు అంతయు తానై యుండును లేక అంతయు దైవమయమై కంటిలో కనబడును

248 అంతయును దెలియునని నటించువాడు తెలియనివాడే యగును అంతయును తెలియజాలదు అని తలంచువాడు చాలమట్టుకు తెలిసినవాడే యగును ఏలన, అనంతమును ఎట్లు పూర్తిగా దెలిసి కొనగలుగును? తెలుసునని చెప్పిన యెట్లు అనంతమగును? పూర్ణముగా తెలివి గలిగిన అంతయు అనంత మహిమాతిశయము గల ఒకే దైవవస్తువను అనుభవము గలుగును అంతయును తెలుసునని తలంచువానికి తెలుసు కొనుటకు మరల అవకాశము దొరకదు అనంతమును ఎట్లు తెలుసుకొనగల్గునని సదా తలంపుగలవానికి నిజము తెలుసుకొనందగిన కాలమొక్కటి వచ్చును, ఇది నిజము అదెట్లన! నిండిన పాత్రను ఏలాగున నిండిం పగలుగును? నిండని పాత్రయైనచో యేలాగున నిండింపగల్గును?

249 ఒక్కడు అతి తీవ్రప్రయత్నముతో గొప్పడాక్టరు పరీక్షకై చదువునప్పడు ఏకాకియై యుండును పరీక్షలో ఉత్తీర్ణుడైన మరల గొప్ప ఆస్పత్రియు జనులుండుటకు తగిన వసతులన్నియు ఏర్పాటు చేయునుగదా? అలాగున భవరోగవైద్యపరీక్షలో జదువుచుండు తీవ్రనిష్ఠగల ముముక్షువైన బ్రహ్మనిష్ఠుడు అనుష్ఠానకాలములో ఏకాకియై యేకాంతస్థలములో విరక్తుడై బ్రహ్మనిష్ఠ చేయుచుండును మనస్సు ప్రశమనము గలిగి మాయ నశించిన మరల బ్రహ్మనిష్ఠులకు కావలసిన ఉపయోగ కార్యములనే సదా చేయుచుండును దీనిలో వైద్యుడు ఎంత గొప్పవాడో, వారి వైద్యాలయమును అంత గొప్పగానే యుండునట్లు యీ బ్రహ్మనిష్ఠుడు ఎంత మహిమాతిశయము గలవాడో వారి ఆశ్రమపరికరములును అంత యెక్కువగానే యుండును

250 సముద్రములోనుండి మేఘరూపముగా పరిణమించిన జలము వర్షరూపముగా భూమిలో పడునప్పడు ఏలాగున మెట్ట ప్రదేశములోనుండి పల్లములోనికి పరుగెత్తి సముద్రములో చేరువరకు నిలకడ లేకపోవుచుండునో అలాగున ఈశ్వరస్థితినుండి ప్రకృతి శక్తిచే జీవరూపులై యుండువారిలో ముముక్షువులు దైవత్వము పొందువరకు విశ్రాంతి నొందకనే నిష్ఠ సలుపుచుండవలయును ఇదే నిజమైన వైరాగ్యమనంబడును జలము పోవుటకు సమయమును గాని, మంచి స్థలమునుగాని చూడక యే సమయములోనైనను, యే మార్గమైనను దొరికిన చాలునని ఆ మార్గముననే పోవునట్లు, ఎప్పడు సమయము దొరుకునో, యే స్థలము దొరకునో, అప్పడు బ్రహ్మనిష్ఠచేయుటకు ఆతురపడుచుండవలయును

251 వృక్షముయొక్క మొదలు చెడకుండ నుండువరకు, వృక్షమును, దానియొక్క శాఖలును ఏలాగున దినదినాభివృద్ధి నొందుచుండునో, మూలము చెడినచో వృక్షమునకును, శాఖలకును వృద్ధి గలుగదో, అలాగున ఏ సంఘమైనను స్థాపించిన వారియొక్క యోగ్యత ననుసరించి అభివృద్ధి

నొందుచుండును దాని యొక్క వృద్ధి వారియొక్క సత్యధర్మముల ననుసరించి యుండును అదిన్ని వారి పవిత్రతయుండు కాలమువరకు మాత్రమే అభివృద్ధి నొందును అంతేగాక దానిశాఖలు గూడ అంతవరకే వృద్ధి నొందగల్గును ధర్మస్థాపకులందరును ఈ సత్యమును జ్ఞప్తిలోనుంచి వర్తించవలయును

252. ఒక్కడు తన ప్రభువును ఎక్కువగా ప్రేమించుచున్నాడు అయితే ప్రభువు యొక్క అజ్ఞను ఎక్కువ ప్రేమించుట లేదు మరియొక్కడు ప్రభుశాసనమునే యెక్కువగా ప్రేమించుచున్నాడు ప్రభువును ఎక్కువ ప్రేమించుటలేదు వీరిద్దరిలో నెవడు గొప్పవాడు ? అదేరీతిగా ఒక్కడు దైవమునుగాని గురువునుగాని యెక్కువగా ప్రేమించుచున్నాడు కాని దైవశాసనమునుగాని, గురు ఆశయమునుగాని యెక్కువగా ఆదరించుట లేదు ఇంకొక్కడు దైవమునుగాని, లేక గురువునుగాని యెక్కువుగా ప్రేమించేలాగున నటించుట లేదు అయితే దైవాజ్ఞను, గురుశాసనమును ఎక్కువగా ప్రేమించి తనయొక్క జీవితమంతయు దానిలో వినియోగపరచుచున్నాడు వీరిద్దరలో ఎవరు గొప్పవారు? ఇదే అంతరంగ భక్తియొక్కయు, సామాన్య భక్తియొక్కయు గురుతుగా నుండును

253 కొందరు అంతరంగభక్తి గలుగనివారు, మహాపురుషుల విషయమ్మై యిట్లు చెప్పదురు వారు గొప్ప మహనీయులే, వారిపై మాకు గొప్ప భక్తిగలదు అయితే వారు చేయు కార్యములలో మాత్రము మాకు తృప్తి లేదు ఈ మాటలు ఎటువంటివనగా, మాకు చక్కెరపై యెక్కువ ప్రీతి గలదుగాని, తీపిపైమాత్రము ఇష్టము లేదు అని చెప్పెడు మాటలవలె నుండును వీరు నిజభక్తులు కారు,

254 ఏ యింటిలో దీపము వెలుగుచు, మనుష్యులు తిరుగుచుందురో, ఆ యింటి లోపలికి దొంగలు జొరబడనట్లు ఎవరి హృదయమున నిజబోధమ్మైన దైవభావమను జ్యోతి వెలుగుచు, పవిత్రపరిశ్రమ విచారము జరుగుచుండునో అట్టివారి దైవజ్ఞానము ఆవరణము

నొందకపోవుటయేగాక, దృశ్యవిషయవృత్తులేమియు ప్రవేశింపజాలవు

255 వస్తువుకన్న పాత్ర పెద్దదిగా నుండవలెను ఈ సామ్యము ననుసరించి అనంతుడైన దైవమును, హృదయములో అవగాహనము చేయతలంచు వారి హృదయముగూడ అనంత వైశాల్యము నొందవలయును, లేనిచో కస్తూరి మాత్రలుంచు నన్న సీసాలో పెద్దగుమ్మడిపండు పెట్ట తలంచినట్లే యుండును సంకుచితహృదయులకు బ్రహ్మభావన హృదయములో గలుగకపోవుటకు కారణమిదే అట్టి వైశాల్యము, అంతఃకరణ శుద్ధి చేతను, నిర్వాసనపరమగునిష్ఠ చేతను గలుగవలసి యుండును

256 మనుష్యుల ప్రేమలు రెడు విధములుగా గలవు అవి మలిన ప్రేమ యనియు, శుద్ధప్రేమ యనియు గ్రహించవలయును ఆ మలిన ప్రేమలో నికృష్టమనియు, శ్రేష్ఠమనియు ఇరుతెగలు గలవు నికృష్ట ప్రేమ కేవలము విషయానక్తులైనవారి నీచస్వభావమై యుండును అది మొదటినుండి లోపల నీచభావముగానే యుండును అది ఇచట వచించుటకు కూడ యోగ్యమైనదిగాదు రెండవదైన శ్రేష్ఠప్రేమ స్వబంధువులు, స్వధనము మొదలైనవాని యందు గలుగుచుండును నికృష్టప్రేమ నరకమును, ఈశ్రేష్ఠప్రేమ బంధమును గలుగచేయును ఈ శుద్ధప్రేమ, మలిన శుద్ధ ప్రేమయనియు విశుద్ధప్రేమ, యనియు ఇరుతెగలుగా నుండును మలినశుద్ధ ప్రేమ మోహమై పరిణమించి విషయరూపమై మారును అనగ కామరూపమై పరిణమించును విశుద్ధప్రేమ తనలోను ప్రేమించబడు వారిలోను, తన ఆత్మమయమై లేక దైవమయమై లేక దృక్కును, దృశ్యమును, ఏకమయమై మారుచుండును ఇట్టి ప్రేమ జీవన్ముక్తునికి మాత్రమే గలుగును ఒక్కరిలో గల భక్తి గాని, శాంతము గాని, కరుణ గాని, జ్ఞానము గాని గలిగియుండు దానిపై గలిగెడు ప్రేమ మలినశుద్ధ ప్రేమ యని గ్రహించవలయును ఏలన, ఇది త్రిగుణములతో సంబంధించినది పై జెప్పిన విశుద్ధప్రేమ గుణత్రయాతీతమైనది ఈ ప్రేమకు వికారము గలుగదు అదే

దీనికి గురుతు ఏ ప్రేమ వికారమును గలుగచేయునో, అది గుణమ్ములతో గూడినది ఇట్టి ప్రేమ నియమమున కధికముగా నొక్కరిలో చూపకూడదు ఇది సాధకుడు స్వానుభవముచే గనుగొనవలయును అయితే మలిన ప్రేమ బద్ధులకును, శుద్ధ ప్రేమ భక్తులకును గల్గుచుండును

**ఉపదేశామృతము ప్రథమభాగము**

**సంపూర్ణము.**





# ఉపదేశామృతము

## ద్వితీయ భాగము

257 దృశ్యవస్తువు లన్నిటిలోను గల విరక్తి బాహ్య వైరాగ్య మనంబడును ఏలాగున ఈ బాహ్య వృత్తులనుండి మనస్సును వేరుపరచి ఆత్మధ్యానములోనికి మొదట ముముక్షువు చేర్చుకొనునో, ఆలాగున అంతరంగవాసనలతోను, అనగా వృత్తులతోను, సంకల్పముల తోను, అంతరింద్రియములతోను గల సంబంధమును గూడ సాధకుడు నివృత్తి చేసుకొని స్వస్వరూపములోనికి చేరవలయును ఇదే అంతరంగ వైరాగ్యమని గ్రహించవలయును అప్పడు విజ్ఞానబోధైక స్వరూపమగు దైవసాక్షాత్కారము మాత్రమే మిగిలియుండును ఇదే జ్ఞేయ వస్తు వనంబడును ఈ అంతరంగ విరక్తి లేకపోయినచో, అతని వైరాగ్యము మూర్ఖవైరాగ్యమై మారును ఇది ఒకవిధమగు అహంకారమును గూడ గలుగచేయును అంతే గాక యిది మానవుని ప్రేమతత్వమునుండియు, సోదరభావము నుండియు వేరుపరచి దూరము చేయును

258 పోస్టాఫీసు సేవింగ్సు బ్యాంకులో డబ్బు కట్టి దేశాంతరము వెళ్లువారికి ధనము కావలసిన ఎచ్చట కావలసియుండునో, అచ్చట పోస్టాఫీసులో తీసికొనునట్లు దైవకృప, గురుకరుణ, భూతదయ, పుణ్యకర్మానుష్ఠానములనెడి సుకృతములను కొండంత ఆర్జించియుండు వారికి మాత్రమే అన్ని విధములలోను సౌకర్యము సమకూడి తపస్సు నిర్విఘ్నముగా సిద్ధించును లేనివారికి సర్వవిధములలోను అనుకూలత

చేకూరక బహువిఘ్నములు కలుగవచ్చును

259 ఋణస్థుడైనవాడు ఋణమును తీర్చవలయునని తలంపు గలిగియుండిన ఏలాగున క్రొత్తఋణము చేయక పాత ఋణము కొంచెము కొంచెముగా తీర్చుకొనుచు వచ్చిన క్రమముగా ఋణవిమోచనము కల్గునో, అలాగున సాధకుడు తన హృదయములో గల పాతవృత్తుల నొక్కొక్కటిని రహితమొనర్చుకొని క్రొత్త తలంపులను రానియ్యక దైవభావములో సదా నిలుచుకొని వచ్చేలాగున మంచి ప్రయత్నము చేసుకొని వచ్చినచో కొలదికాలములో మోక్షమును గలుగజేసుకొనవచ్చును

260 ప్రతిదినము ఏలాగున వ్యాపారమందు నిపుణత గలవాడు రాత్రి దుకాణమును మూయునప్పుడు ఆదాయ వ్యయములను చూచుచుండునో, అలాగున సాధకుడు ప్రతిదినమును రాత్రి పండుకొనుటకు ముందుగా తనయొక్క దినచర్యను వ్రాయుచు రావలయును మరల సదా దైవభావములో నిలుచుకొని యేపనియైన చేయుచు దైవభావమును మరచిపోయెడు సమయమునుగూడ ప్రతిదినమును కనిపెట్టి అదిన్ని డైరిలో వ్రాయవలయును ఇట్లుండువారు తప్పక త్వరలో దుఃఖముల నన్నిటిని తొలగించుకొని మంచి బ్రహ్మనిష్ఠ గలవారగుదురు సాధన లన్నిటిలోను ఇది శ్రేష్ఠమైనది అయితే యీ దినచర్యలో ఆత్మవంచకమైన పని చేయరాదు ఆదాయ వ్యయములన్ను లెక్క చూడని వ్యాపారి యేలాగున దివాలైపోవునో ఆలాగున మనోవృత్తులను పరిశీలింపని సాధకుని కపాయము గల్గవచ్చును

261 సాధారణమైన వ్రతానుష్ఠాన, జప, ప్రార్థనా, తీర్థసేవా, పరోపకార, దాన, ధర్మ, పారాయణాదులు అజ్ఞానవృక్షముయొక్క చిన్న చిన్న కొమ్మలను నరికినట్లుండును దీనివల్ల వృక్షము చావదు అంతేగాక యెల్లప్పుడును అట్లు చేయకపోయిన త్వరలోనే యథాప్రకారము వృక్షము పెరుగుచుండును నిరంతర బ్రహ్మచింతన గాని, ధారణాధ్యాన సమాధినిష్ఠలు గాని వృక్షముయొక్క పెద్ద పెద్ద కొమ్మలను ఛేదించినట్లుండును అయితే

దీనివలనగూడ బ్రూను నశింపదు అంతేగాక మానివేసిన మరల కొంతకాలమునకు చెట్టు వృద్ధి యగును ధ్యానసమాధులలో గాని, తీవ్రతర నిరంతర బ్రహ్మచింతనలో గాని యుండువారు అనగా ధ్యాతయును, ధ్యేయమును ఏకత్వమును గలుగక అన్ని వృత్తులును లేనివారు వృక్షము యొక్క మొదలును చేదించినవారగుదురు అయితే వృక్షముయొక్క మూలమును, వేరును ఉండుటచే కొన్ని వృక్షములు నశింపవు అదిన్ని ఒక్కవేళ అంకురించి కొంతకాలమునకు వృక్షమై పరిణమింపవచ్చును ఇట్టివారికి గూడ వృత్తియొక్క పునరావృత్తి గల్గి సంసారవృత్తి గలుగవచ్చును వృక్షముయొక్క మూలమును అనగా కూకటి వేరును (దీనికే కందమనిపేరు) సహా తీసి వేసిన మరల ఆ వృక్షము పుట్టనే పుట్టదు అనగా కేవల సమాధిగాని, కేవల దైవత్వముగాని, అనగా ధ్యాత ధ్యేయాకారమైనవారికి మరల జీవత్వముండదు దీనినే నిర్వికల్ప సమాధి యనియు, బ్రహ్మసాక్షాత్కార మనియు, కేవల దైవప్రాప్తి యనియు, నిర్వాణమనియు, నిష్కామకర్మయోగ జ్ఞాన భక్తులయొక్క పర్యవసానమనియు గ్రహించవలయును అంతవరకు యోగి గాని, జ్ఞాని గాని, భక్తుడు గాని, నిష్కామకర్మయోగి గాని నిలుపక ప్రయత్నము సలుపుచుండవలయును అట్లు గానిచో పునర్జన్మము గల్గును అయితే వీరిలో మొదటినుండి చెప్పివచ్చినవారిలో ఒక్కొక్క తరగతివారు శ్రేష్ఠములైన పుణ్యలోకములను, ఉత్కృష్టములైన జన్మములను పొందుచుందురు

262 మనస్సుయొక్క బైటనుండువాడు మోక్షము యొక్క వెలిలో నుండువా డగును మనస్సుయొక్క లోపలనుండువాడు మోక్షము యొక్క లోపలనుండువా డగును ఈ తత్త్వమును జాగరూకులై గ్రహించి ప్రయత్నపూర్వకముగా మనస్సుయొక్క లోపలికి ప్రవేశింపచూడవలయును ఇట్టి మహాపురుషుడు ఇచ్చటనుండినను, వైకుంఠమందుగాని, కైలసమందుగాని యుండెడువాడే యగును చాల సమర్థతగలవారు మాత్రమే మనస్సు యొక్క లోభాగమునకు దూరుటకు యోగ్యులగుదురు

వీరే యోగమును సాధించిన వారు వీరే అమనస్కులు

263 మనస్సు అనగా ప్రకృతికి ఈవల అనగా లోపడి యుండువరకు మాత్రమే విధి యుండును అనగా విధికి లోబడియుండును మనస్సును అనగా ప్రకృతిని దాటినవారికి విధి లేదు అనగా విధిని అతిక్రమించిన అవస్థ గల్గును ఈ తత్త్వము గోచరము గాకపోవుట చేతనే మతి గొప్పదా? విధి గొప్పదా? అను ప్రశ్న వచ్చుచుండును అనగా విధించువాడును, విధింపబడువాడును యుండుటచేకదా విధి యుండును? అనగా విధించు జడ్జియు, విధినిపొందదగిన నేరస్థుడగు మనుజుడును ఉండుటచే గదా విధి ఏర్పడినది! అలాగున జీవేశ్వరుల ఐక్యము గల్గువరకు విధియును, కర్మమును ఉండును ఐక్యము గల్గిన మరల విధి యుండదు అయితే దృశ్యసంబంధమైన రోగారోగ్యములు, స్తుతినిందలు, మానావమానములు దేహమునకు గల్గుచుండును అవి ఆత్మకు లేనందుచే జ్ఞాని చిన్మయరూపుడై యుండును

264 చిన్న చిన్న పడవలచేతగాని, తెప్పలచేతగాని కాలువలు నదులు దాటుటచూచి వాని వలన సముద్రము దాటవచ్చునని తలంపకుము సాగరమును దాటుటకు దృఢమైన గొప్ప నావ అవసరము అలాగున సామాన్యములగు పుణ్యకర్మములు, జపములు , ప్రార్థనలు, భజనలు మొదలైనవి పుణ్యలోకప్రాప్తిని గలుగచేయునే గాని ద్వంద్వమయమగు భవసాగరమున దాటుటకు ధ్యానసమాధి మొదలగు ఆత్మసాక్షాత్కారనిష్ఠ గల్గియుండవలయును లేనివారు దాటజాలరు

265 శ్రద్ధతో చదువుచుండు విద్యార్థు లేలాగున పగలు మామూలు ప్రకారము బడిలో చదువునదే గాక, రాత్రిలో ఎక్కువసేపు చదువుచుందురో, అట్లు చదువువారు ఏలాగున పరీక్షలో ఉత్తీర్ణులగుదురో, అలాగున మామూలు ప్రకారము బ్రహ్మనిష్ఠ పగలు ముముక్షువులు చేయునదేగాక రాత్రులలో గూడ నిష్ఠ చేయువారే అధ్యాత్మవిద్యలో నుత్తీర్ణులగుదురు ఇదే శ్రద్ధగలవాని యొక్క గురుతు శ్రద్ధలేని విద్యార్థి బడిలో శ్రద్ధతో

చదువుకపోవుటయే గాక, బడినుండి బైటవచ్చిన, మరురోజు బడిలో ప్రవేశించువరకు పుస్తకము విప్పిచూడుడు ఇదే శ్రద్ధలేనివారిని యొక్క గురుతు అలాగున పగలు మాత్రము కొంత బ్రహ్మనిష్ఠ చేసుకొని రాత్రిలో నిష్ఠ చేయనివారు భక్తి శ్రద్ధ లేనివారని గ్రహించవలయును రాత్రిలో నిష్ఠచేయువారికి మాంద్యము గలుగని శుద్ధాహారము స్వల్పముగానే యుండవలెను అది ద్రవపదార్థమైన మంచిది ఆహారము లేకుండ నిష్ఠచేయుట కనుకూలపడిన మరింత మేలు గల్గును

266 మానవుండు మాయామోహముచే ప్రపంచములో గల ధనధాన్య పుత్రమిత్ర గృహారామ పశుతురగ గజాదుల, భార్యాసేవకాదుల ఆధిక్యముచేత సౌఖ్యము నధికముగా బొందుచుండునని తలంచును అది భ్రమ మాత్రమే ఏలయన, తనయొక్క ఆత్మభావమును ఎంతకెంత దృశ్యములో ప్రవేశపెట్టుచుండునో, అంతకంత ఆత్మసౌఖ్యము తగ్గిపోవుచుండును మాయాశక్తిచే దానిని తెలుసు కొనుట లేదు ఎట్లన ఒకయంత్రములో గల శక్తి బహుముఖములుగా పోవుచుండిన దానియొక్క చైతన్యము ఏలాగున తగ్గిపోవుచుండునో, మరియు ధనవంతుడు తన ధనమును అనేకులకు ఇచ్చుచుండిన ధనమేలాగున తరిగిపోవుచుండునో, అలాగున అనేక వస్తువులలో వ్యాపించిన హృదయము గలవారికి ఆత్మసౌఖ్యము లోపించి పోవుచుండును నానామార్గములుగా పోవుచుండు యంత్రములలోగల చైతన్యమును ఏకముఖముగా చేయునప్పుడు, ఇతరులకిచ్చి యుండు ధనమును మరల ప్రోగు చేయునప్పుడును, ఏలాగున మొత్తము ఎక్కువగా నుండునో, అలాగున బహిర్విషయము లన్నిటిలోనుండి మనస్సును ఆత్మలోనికి అనగ దైవధ్యానములోనికి మరలించునప్పుడు గలిగెడు సుఖమనంతము, అనిర్వచనీయము కనుకనే తీవ్రతర విరక్తి గల్గునప్పుడు సమస్త వృత్తులనుండి మస్సును వేరుపరచి, ముముక్షువు నిష్ఠచేయుచుండు రహస్యము ఐతే ఇది ఆత్మయొక్క అఖండత్వము గల్గువరకు మాత్రమేయుండును పూర్ణబోధము గల్గిన మరల

నానాత్వమును,, వ్యష్టిత్వమును లేకపోవును కర్తృత్వమును, కర్మఫలాసక్తియును, అనేకత్వమును క్షయించని బ్రహ్మనిష్ఠులుగూడ మఠములు కట్టుటచేతను, శిష్యులను చేర్చుటచేతను పై జెప్పినవారికివలె వీరికిని మనోబలము తగ్గిపోవును కావున దీనిని కనిపెట్టియే జ్ఞాననిష్ఠుడు గాని, యోగనిష్ఠుడుగాని, భక్తినిష్ఠుడు గాని లోకకార్యములలో ప్రవేశించవలయును

అనంతముతో కలిసిన, అనగా అనంతత్వ బోధగల్గిన యిచ్చుట, పుచ్చుకొనుట అనునది లేదు అది సముద్రములో నుండి పంపుతో నీళ్ళుతీసి సముద్రములోనికి పంపునట్లుండును అట్టి అనంతత్వైక్యము గలుగని బ్రహ్మనిష్ఠుల వ్యవహారము మంచి ఊటలేని కూపమునుండిగాని, గుంటనుండి గాని పంపుతో నీళ్ళను బైటికి తీసివేయునట్లుండును ఈతత్త్వమును గూడా బ్రహ్మనిష్ఠులు జ్ఞాపకములో నుంచవలసియుండును

267 వైరాగ్యనిష్ఠుడు తపాల తీసుకొని పోయెడు రన్నరు రీతిగా నుండును ఇతడు నిలువక పరుగెత్తుచుండునే గాని, యితరులతో మాట్లాడుచు, కూర్చుండుచు, లోకవార్తల చెప్పచు కాలము వ్యర్థపుచ్చుకొనడు గదా! ఇదే నిజమైన వైరాగ్యము గలవాని గురుతుగా నుండును వీరు త్వరలో దైవత్వమును బొందుదురు ఇట్లు కాని వారు ఏదో కారణాంతరముచే సాధువులైనవారే గాని నిజమైన సాధువులు గారు వీరికి ముక్తి గూడ చాలా దూరము

268 సాధకునికి ఎంతవరకు స్వరూపస్థితిలోలో అనగా దైవాత్మైకత్వ నిష్ఠలో సుస్థిరత గలుగలేదో, అంతవపకు అట్టి సాధకుని స్థితి చుక్కానిలేని పడవచందంబునను, దారము తెగిపోయిన గాలి పటము రీతిగాను, నిలకడయును, దైవసౌఖ్యమును పొందక మనస్సు పోయెడు మార్గముగా పోయి అశాంతియున్ను, మనఃక్షోభమును గలిగి వ్యథనొందుచుండును

269 మంచి సారవంతమైన భూమిలో చక్కగా పెంచిన కొబ్బరిచెట్టు మూడు సంవత్సరములలో ఫలము నిచ్చునట్లు, వైరాగ్యము గల్గి

సత్వగుణముతో గూడినవాడై, యేలాటి కోరికయును లేనివాడై కేవలము ఆత్మసౌఖ్యము అనగా దైవసుఖము మాత్రము పొందవలనెనను తలంపు గలవాడు కాలము వ్యర్థము చేయక యేకాంతస్థలములో అనుకూలరీతి నిష్ఠచేయుచుండిన యీ కలియుగములో మూడుసంవత్సరములలో శోకశాంతియు, ఆత్మసుఖమును కొంతవరకు పొందవచ్చును మనశ్శాంతి గల్గును పై జెప్పిన గుణములు లేనివారికి ఎన్ని సంవత్సరములలోపల అట్టిస్థితి గల్గునని చెప్పటకు వీలు లేదు సంవత్సరములే గాక యెన్ని జన్మములలో గల్గుననికూడ చెప్పనలవి కాదు ఆయితే యెన్ని జన్మములకైనను దైవసుఖమగు స్థితిగలుగువరకు తనయొక్క వ్రతము నిర్వహింపగలను అని నిష్ఠసలుపుచుండు మంచి వ్రతనిష్ఠగల వానికి ఈ జన్మములోనే దైవసుఖము గల్గును ఈశ్వరకరుణ వీనికి సులభముగా లభించును కృతయుగమున ద్వాదశ సంవత్సరములును, త్రేతాయుగమున నవ సంవత్సరములును, ద్వాపరమున షట్సంవత్సరములును, కలియుగమున సంవత్సర త్రయమును బ్రహ్మనిష్ఠ పూర్తియగుటకు కాల మేర్పడియున్నది

270 బీదవానికి ఒక వెయ్యిరూపాయలు దొరికిన తాను గొప్పవాడనైతినని తలంచి గర్వితుడై యుండును గొప్ప శ్రీమంతుడైన సహస్ర రూప్యములు స్వల్పముగా తలంచును గర్వముండదు ఆలాగున స్వల్పగుణము గలవానికి కొంతయోగ, ధ్యాన, జ్ఞాన, విరక్తి, విద్యలు గల్గిన తాను సర్వజ్ఞుడనైతినని తలంచును మరల ఆత్మవిద్యకు సంబంధించిన దేమియు గ్రహింపజూడడు

271 బాగుగ ఎండని కట్టెలైన చక్కగా మండవు వానిని నిప్పులో పెట్టి విసరుచుండిన లేక ఊదుచుండిన యేలాగున బాగుగ ప్రజ్వలించునో, ఆలాగున పరిపక్వ ప్రబోధము గలుగని హృదయముగలవారు యోగము, ధ్యానము, తపస్సు స్వయముగా జేయుచుండిన జాలదు మహాపురుషుల బోధ కొంతకాలమువరకు వినుచుండవలయును అయితే కట్టెలువేసి నిప్పు మంట వేయనిచో, ఎంత ఊదినను, విసరినను అగ్ని జ్వలింపదు అదే

రీతిగా మంచి తపోధ్యానమనములు లేనివారికి ఎంత మహాపురుషుల బోధ యుండినను ప్రయోజనము లేదు

272 ఇనుము ఊరక నిప్పులోవేసి కాల్చినను కొలిమితిత్తిచే ఊదనిచో ఏలాగున కరుగదో, అలాగున తీవ్ర విరక్తి గల్గి యేకాంతమున తపస్సు చేయుచుండినను ఆత్మజ్ఞుల తత్త్వబోధ లేనిచో, హృదయగ్రంథి విచ్ఛేదము గల్గి సమరస జ్ఞానము గలుగుట దుస్తరము

273 జ్ఞానోపదేశమునకును, దానధర్మములకును పాత్రాపాత్ర మెరుంగవలెనని చెప్పదురు అయితే పాత్రాపాత్రముల భేదము బ్రాహ్మణాది వర్ణముల గురించిగాని, సన్న్యాసాది ఆశ్రమముల గురించిగాని మాత్రము ఆధారపడియుండునని తలంపరాదు అది హృదయ పరిపక్వత ననుసరించి యుండును బ్రాహ్మణుల భూమిగాని లేక సన్న్యాసుల భూమిగాని ఊషరక్షేత్రమైనచో, దానియందు కృషి చేసినను ఫలము గలుగచేయదు ఇతరుల భూమియైనను సారవంతమైన సుక్షేత్రమై యుండిన దానిలో చేసిన కృషి బాగుగా ఫలించునుగదా! (ఇదే పాత్రాపాత్రముల నెరుంగవలెనని చెప్పెడు రహస్యము)

274 ఒకనిపై, పై ఉద్యోగస్థులైన గవర్నరు మొదలైనవారు ప్రీతి గల్గి యుండిన క్రింది యుద్యోగస్థులైన పోలీసువారలు మొదలైనవారు ఏమియు నతని చేయజాలరు, చేసినచో పై యుద్యోగస్థుల భీతి వీరికి ఎట్లుండునో, అలాగున బ్రహ్మనిష్ఠాభ్యాసకులకు ఈశ్వరకృప, గురుకరుణ, సత్యధర్మనిష్ఠ గల్గియుండినచో, విఘ్నదేవతలచే పతనము గలుగదు అట్లు లేనిచో పతనము గలుగుటకు మెండు మార్గములు గలవు కావున దైవభక్తి, గురుకరుణ, సత్యధర్మనిష్ఠ గలిగియుండే లాగున చూడవలయును

275 సిమెంట్, అనగా సీమసున్నముతో చేయబడిన వస్తువులు నీటిలో నుండినను కరుగవు అయితే యెండుటకు ముందుగా నీళ్లు తగిలిన చెడిపోవును అట్లుండగా నీటిలో పెట్టిన మరల చెప్పవలయునా? అదే

రీతిగా జీవన్ముక్తి పరిపక్వదశ గల్గిన మహాత్ముడు సంసారజనమధ్యములో నుండినను చెడడు గాని, అట్టి దశ గల్గువరకు విషయస్పర్శ గూడ అపాయకరము

276 శరీరములో వ్రణములు పుట్టుట సౌఖ్యముకొరకు గాదు, దుఃఖముకొరకే అదేరీతిగా హృదయములో దృశ్యవృత్తులు గలుగుట మీకు క్షేమముకొరకు గాదని తలంచి త్వరలో రహితమొనర్పజూడుము ఆ వ్రణములు దారుణమ్మైన కురుపులైనచో, ఏలాగున తీవ్రతరవేదన గలుగచేయునో, అలాగున నీచవృత్తి, ద్రోహతలంపు, విషయవాసనలైనచో గొప్ప దుఃఖమును గలుగచేయును

277 పాముయొక్క నడక యెంత చక్కపరచచూచినను, ఎట్లు చక్కబడజాలదో అట్లే లోకముయొక్క నడతగూడ వక్రముగనే యుండును కావున నీవు బాగుపరచ జూచిన బాగుపడనిచో, అది ప్రకృతియొక్క స్వభావమని తలంచి సాక్షిగానుండి సుఖముగా నుండుము మహాత్ములు ఇట్టి బుద్ధివల్లనే సౌఖ్యమొందిరి

278 ఎల్లప్పుడు రాత్రి గాని, లేక పగలు గాని, లేక వర్షాకాలము గాని, లేక యెండాకాలము గాని యుండిన లోకములో ఒక్కప్రాణి గాని, ఒక్క తృణముగాని బ్రతుకజాలదు అలాగున ఓ సాధకుడా! ఎల్లరు నిన్ను స్తోత్రము చేయవలెనని తలంపకుము అట్లైన నీకు ఆత్మైక్యజ్ఞానము వృద్ధి గానేరదు అంతేగాక ప్రమాదమునకుగూడ కారణము మెండుగ గల్గును నిందించుట నీకు అభివృద్ధికి కారణమగును అయితే నిందించుటకు కారణ మేమియు నీయందుండరాదు ఉండిన చెడును ఇది నిజము

279 దైవమందు పరమభక్తిగలవాడు ఏలాగున ఆదైవసొత్తునుండి ఒక చిన్న పైసాయైన వ్యర్థఖర్చు చేయడో, ఆలాగున ఏమానవుండు సర్వేశ్వరుండు తన కొసగియుండు తను, ధన, మనములను ఈశ్వరుని సొమ్మని తెలిసికొనునో, అతడు ఈ మూడింటిని కొంచమ్మైనను వ్యర్థముచేయక యీశ్వరకార్యములోనే వినియోగపరచును ఇట్టి బుద్ధి

గలవాడు ధన్యాత్ముడు సంశయము లేదు ఈ పరమతత్త్వము తెలియకనే పామరులు పై జెప్పిన మూడింటిని వ్యర్థకార్యములలో వినియోగపరచుటే గాక పాపకార్యములలో గూడ వినియోగపరచుచున్నారు ఇది భక్తులు తెలుసుకొనవలసిన పరమ రహస్యము

280 ఓ సోదరుడా! ప్రపంచములో కొబ్బరి, బాదము, వరి, గోదుమ మొదలగు బీజములలో మన కుపయోగములేని బెరడు, పొట్టు మొదలగు వాటిలోవలనే ఉపయోగకరమగు పప్పు, బియ్యము మొదలగునవి ఉండుచుండును మొదట ఉపయోగములేని పొట్టు వగైరా లేనిచో వుపయోగరమగు పప్పు, బియ్యము మొదలుగునవి యెట్లుండజాలవో, అదే ప్రకారము సాధన వలననే సాధ్యపదవియగు జ్ఞానము గల్గుచుండును పై జెప్పినవాటి తవుడు, వూక మొదలైనవి ఆఖరున ఉపయోగము లేనప్పటికిని మొదటనుండే తీరవలయును ఆలాగున సాధ్యపదవి యగు విజ్ఞానబోధైకస్థితిలో సాధనలు అక్కర లేనప్పటికిని అభ్యాసకాలమున విడువరాదు ఈతత్త్వమును గ్రహించి సాధనానుష్ఠానము చేసికొనుము ఐతే సాధనచే మాత్రము తృప్తిపొందకుము ఈ లాగుననే జరాయుజములగు మనుష్యులుగూడ మొదట మావిలో నుండియే పుట్టుచుందురు అండజములగు పక్షులును గ్రుడ్లనుండియే కల్గుచున్నవి దీనికన్న ఇక మీకు దృష్టాంతము సర్వేశ్వరుండు ఏమి చూపవలయును?

281 సోదరుడా! మొట్టమొదట మనకు ఉపయోగము కాని అరటిచెట్టు మొదలగు వృక్షములను పోషించినగదా ఉపయోగములగు ఫలములు గలుగుచుండును? ఫలము పరిపక్వదశ వచ్చునప్పుడు అరటిచెట్టు మొదలైనవి అనవసరములే గాని మొట్టమొదట విడిచి పెట్టిన నీవు ఫలమును అనుభవింపగలుగుదువా? ఆలాగున సాధనానుష్ఠాన బలముచే నీవు దైవత్వమునొందిన తర్వాత నీకు సాధన లక్కరలేదు అంతవరకు చక్కగా దైవప్రాప్తిపరమగు ధ్యాననిష్ఠ చేయుచుండుము చెట్టు నెంత చక్కగా పోషించిన అంత యెక్కువ ఫలము లభించునట్లు ఎంత తీవ్రతరమగు

సాధన చేయుదువో, అంత యెత్తైన సాదనముగూడ త్వరలో లభించును శ్రీ కృష్ణచైతన్య, శ్రీ రామకృష్ణపరమహంస, శ్రీ యేసుక్రీస్తు, శ్రీ మహ్మదునిబి, శ్రీ బుద్ధదేవ, శ్రీ గురునానక్ మొదలగు లోకాద్ధారక మహాపురుషుల జీవితచరిత్రముల చదువుచుండుము

282 సాదన నిష్ఠాపరులగు మహాగురువులు నీకు దొరకక పోయినచో నిర్మలభక్తితో ధైవద్యానము చేయుచుండవలసినదేగాని, సాధనారహితులును, ఆచార నియమ నిష్ఠలేని గురువుల దగ్గర చేరకుము మొదటనే బీజమ గొప్పరకముండవలయును జిల్లేడుచెట్టు పెట్టి పెంచిన పనసచెట్టంత పెరిగి ఫలము నివ్వజాలదుగదా? ఈ తత్త్వమును సదా జ్ఞప్తిలో నుంచుము భగవంతుడు కరుణామూర్తి నీకు తగిన గురువును గలుగచేయును నమ్మకముతో నుండము

283 దైవాజ్ఞకు విరుద్ధముగా మానవుని ఆజ్ఞ కనుపించినచో దానిని అవలంబించకుము ఒకవేళ సంఘమువారు నిన్ను బాధింతురని తలంచినచో, వారివెనుక నిలువుము ముందుకు పోవకుము తిరస్కరించువాడు ఉత్తమోత్తముడు వెనుక నిలుచువాడు మధ్యముడు నీవు భయపడకుము సత్యమును సర్వేశ్వరుండు రక్షించును మానవుడు అనిత్యుడు సర్వేశ్వరుడు నిత్యుడని మరువకుము

284 సాత్వికాహారముచే సత్త్వగుణము గలిగి యెక్కువగా బ్రహ్మనిష్ఠ చేయవచ్చునని కొందరు తలంతురు అది ఒక విదమైన సత్యమైనను, దాని యందు గొప్ప రహస్యమొక్కటి గూఢమై యున్నది అదేమన, సాత్త్వికాహారమని తలంచి యెక్కువ సారవంతమైన పదార్థములను తినినచో, దానివలన గలిగెడు స్త్రీ పురుషులయొక్క రక్త శుక్లములు యోగ, ధ్యాన, తపస్సులచే ఓజస్సై మారవలయును అనగా తేజస్సై పరిణమింపవలయును లేనిచో శుక్లశోణితములు వృద్ధి ఏయగునప్పడు తప్పక విషయబుద్ధి గల్గును ఎక్కువ తపస్సు యోగము గలిగి చెడిపోవుటకన్న కొంచెము తపస్సుగాని, యోగముగాని, జ్ఞానముగాని గలిగినవాడైనను

చెడకయుండువాడే శ్రేష్ఠుడు బాయిలర్‌లో ఉత్పత్తియగు ఆవిరి (స్టీము) లేక శక్తి యింజన్ పనిచేసి అశక్తి విలయ మొనర్చక యుండిన యంత్రము శిథిలమైపోవునుగదా? ఈ తత్త్వమును బ్రహ్మనిష్ఠులు గ్రహింపకపోయినచో విషయములలో మునుగుట నిక్కము సాత్త్వికాహారమునకు ఘృతము, క్షీరము, పంచదార మొదలగునవి యుండవలసిన పనిలేదు శుద్ధపదార్థముండిన చాలును ఈ విషయములో వారివారి అనుభవమును వారువారే చూచుచుండవలయును ఆహారరసమును ఓజస్సుగా మార్చశక్తిలేనివారు స్వల్పాహారముచే శరీరమును శుష్కింపచేసినను విరోధము లేదు కళాయి లేని పాత్రలో పప్పు, పులుసు మొదలైనవి యెక్కువ వండుటకన్న కళాయిగ ల పాత్రలో కొంచమైనను వండిన చాలునుగదా!

285 ఓ భక్తుడా! భగవంతుడు కన్ను లేకనే చూచువాడు, చెవి లేకనే వినువాడు, కాళ్ళు లేకనే నడచువాడు, కరములు లేకనే యిచ్చువాడు, మనసులేకనే సమస్తమును తెలుసుకొనువాడని నమ్ముము జాగ్రత్స్వప్నసుషుప్త్యాది భేదము లేకనే యెల్లప్పుడును యెల్ల కార్యములును, యెల్లచోట్లను తెలిసికొనుచున్నాడు ఓహో, యెంత గొప్పవాడు!

286 అరణ్యమధ్యమున పెద్దపులిని చూచి భయపడి పారిపోవువానికి ఏలాటి విశేషమును లేదు ఇది సామాన్యజను లందరి స్వభావమై యుండును పెద్దపులిని తరిమినవాడుగదా శూరులందరిలో పరమశూరుడు! అలాగున సంసారారణ్యములో లోకమునకు సంబంధించివానిని చూచి భీరువై యేకాంతమున చేరుటయు, సర్వసంగ త్యాగియై యుండుటయు గొప్పతనము గాదు లోక సంబంధముచే బంధము నొందక లోకమును నడుపువాడే గొప్పవాడు పులిని చూచి భయము చెందినవానికి ఎల్లప్పుడును భీతి పోజాలదు పులిని బట్టి తరిమినవానికి ఎట్టి దండకారణ్యములో దిరిగినను భయము లేదు అలాగున లోకసంబంధముచే భయపడువానికి ఎప్పటికి నిర్భయత్వమును, సమత్వమును, ప్రశాంతమును, ప్రసన్నతయు గలుగజాలదు దానిని జయించిన యోగికి ఎచ్చోటనైనను ప్రశాంతమైన

ప్రసన్నసౌఖ్యము గలుగుచుండును అయితే పులిని తరుముశక్తి లేనివాడై, పులినోటిలో పడి హతమైపోవు కటకన్న తప్పించుకొనుటయే శ్రేష్ఠము లేనిచో జన్మము వ్యర్థమై పోవునుగదా! పులిని హతమొనర్చుటకు గాని, లేక వెంబడించి తరుముటకు గాని మంచి అస్త్ర శస్త్రములుండవలయును ఆలాగుననే ప్రకృతియను భయంకర క్రూరపులిని తరుమువానికి దైవకృపయు, గురుకరుణయు, యోగశక్తియు, ఇంద్రియ జయత్వమును, ఆత్మబోధోదయమును, జన్మాంతరసంస్కారమును ఉండవలెను

288 అగ్నియొక్క వేడిమిచే నెచ్చట గాలి ఖాళి యైపోవునో అచ్చటికి అన్నిదిక్కులలో నుండియు వాయువు వచ్చి చేరునట్లు ఎవరి హృదయములో జ్ఞానాగ్నిచే ప్రాపంచిక వాంఛ నశించిపోవునో, వారివద్దకు ప్రపంచము లోగల సౌఖ్యములన్నియు స్వయముగా వచ్చిచేరును ఎచ్చట వాయువు స్తంభించియుండునో, అచ్చటికి యితరస్థలములోనుండి వాయువు వచ్చి చేరుటకు అవకాశము లేనట్లు ఎవరి హృదయములో ప్రపంచవస్తువుల కోరిక గలిగియుండునో వారివద్దకు ప్రపంచములోగల వస్తువులేమియు వచ్చి చేరజాలవు అనగా కోరిక గలవానికి దొరకవు కోరిక లేని వానికి సమస్తమును దొరకును.

288 సంస్కారముండిన అనగా ప్రాప్తి యుండిన అంతయు గలుగునని తలంచి యూరకయుండరాదు ప్రార్థన చేయక ప్రాప్తి యెట్లు గలుగును? సంస్కారము నివురు గప్పియుండు నిప్పవలెనే యుండును అట్టి నిప్పనూది ప్రజ్వలింప చేయవలసి యుండునుగదా! ఆలాగున సంస్కారము వాసనారూపమై యుండును అట్టిదానిని భక్తిశ్రద్ధలతో గూడిన అనుష్ఠానముచే ప్రబోధము గలుగచేసుకొనవలయును జన్మాంతర ప్రాప్తి లేనందుచే వర్తమానములో మంచి సంస్కారములు గలుగలేదని మీరు నమ్మకము గలవారలైనచో, రాబోవుజన్మమునకు ఈజన్మము జన్మాంతరమగునుగదా! అట్లైన ఇప్పుడైనను మీరు మంచి సంస్కారమును ప్రారంభింపకపోయినచో ఇంకొకజన్మమునకైన సద్గతి గలుగదుగదా! అని

నిరంతరము విచారము చేయుడు, తలింపవచ్చును

289 శారీరేంద్రియములకు దృఢమైన బలములేనివారికి అగాధనిష్ఠలో దిగి బ్రహ్మచింతనము చేయుటకు శక్తి చాలదు అయితే శరీరేంద్రియముల బలమును ధ్యానయోగముచే అణచిపెట్టెడు దివ్యశక్తి గలిగియుండవలెను మంచి వేగముగా పోగలశక్తియు, బలమును గల గుఱ్ఱముపై సవారిచేయువాడు మంచి నేర్పరియై యుండవలయును లేనిచో గుఱ్ఱము వీనిని క్రింద బడద్రోయునట్లు తప్పక విషయములలో బడద్రోయుట నిక్కము గుఱ్ఱపుసవారి తెలియనివానికిని, శరీరశక్తి లేనివానికిని బక్కబడి పోయిన అనగ చిక్కిపోయిన గుఱ్ఱమే మంచిదిగా నుండునట్లు, జ్ఞాన ధ్యానశక్తి లేనివానికి వ్రతానుష్ఠానములచేతను, నిరాహారత్వముచేతను శరీరమును శుష్కింపచేసుకొనుటయే మంచిది శరీరపుష్టి గలుగచేసుకొని చెడిపోవువానికన్న శరీరము శుష్కించినను మంచి నియమనిష్ఠలో నుండు వాడే శ్రేష్ఠుడు

290 కాలువయొక్క సంకుచిత భావము నదిలో చేరువరకే యుండును నదియొక్క వ్యక్తిత్వము సముద్రములోనికి ప్రవేశించువరకే కనబడును అప్పడు ముందుచెప్పిన కాలువయు, నదియు అఖండసముద్రమై మారును అలాగున జీవునియొక్క సంకుచితభావము సాకారస్వరూపుడగు ఈశ్వరుని చెందువరకే యుండును సాకార స్వరూపుడైన యీశ్వరుని ఖండభావము నిరాకారమగు బ్రహ్మము నొందువరకే యుండును అప్పడు అఖండమై, అద్వయమైన దైవభావము గలుగును కాలువకును, నదులకును నిలుకడ లేదు, గమనముండును, హెచ్చు తగ్గులు గలుగును అలాగున జీవావస్థలో నుండువారికిని, సగుణో పాసనచేయువారికిని నిలుకడ గలుగదు సుఖదుఃఖములచే సంతోష దుః ఖములు గలుగుచుండును పూర్ణ బ్రహ్మాకారవృత్తి గలుగునప్పడే నిలకడ గలుగును ద్వంద్వమును దాటును అయితే కాలువకన్న వేలకొలది అధిక మహిమయు, పవిత్రతయు పుణ్యనదికి ఉండును వేలకొలది నదులకన్న

మహిమయు, గాంభీర్యము, పవిత్రతయు, అచలత్వమును సముద్రమున కుండును గదా! కాలువలకు జలముచే హెచ్చుతక్కువలు త్వరలో గల్గును పుణ్య నదులకు ఆలాగున హెచ్చుతక్కువలుండవు సముద్రమునకు అసలే లేవు

291 నీటిలో మునిగినవారిని దరిజేర్చవలయునని తలంచువాడు గూడ నీటిలో మునుగవలసి యుండును ఒడ్డుపై నిలిచి దరికిరండు అని పిలిచిన ప్రయోజనముండదు ఆలాగున సంసారసాగరములో మునిగిన జీవులను తరింప చేయతలంచు మహాపురుషులు సంసారజనులతో కొంత వరకు కలిసికొనిన, తరణోపాయములన్నిటిని సమకూర్చ సాధ్యపడును అయితే మునిగినవారిని తీరము జేర్చు శక్తికలవారుమాత్రమే ఆపని జేయవలయును తానుగూడ మునిగిపోయెడు అవస్థలో నుండినచో నీటిలో దిగకుండుటే మేలు ఈ తత్త్వమును సదా జ్ఞప్తిలో నుంచి లోకసేవాపరులు పనిచేయవలయును మునిగినవారి నుద్ధరించుట కొరకు మునుగువానిని చూచి జనులు ఇతడు గూడ మునిగిపోయెనని తలంతురు అయితే మునిగినవానిని తీరము చేర్చునప్పడు ఆశ్చర్యము నొంద గల్గుదురు ఆలాగున బ్రహ్మనిష్ఠాపరులై సర్వసంగ పరిత్యాగులైనవారు ముక్తావస్థ గలిగిన తర్వాత బద్ధులైన జనుల బంధవిచ్ఛేదమునకు ప్రవర్తించినప్పడు ఆ మహాపురుషులు గూడ బంధములో చిక్కుకొన్నట్లు లోకము తలంచును అయితే లోకముయొక్క బంధవిచ్ఛేదము చేసి సంసారసాగరమునుండి వారి నుద్ధరించినప్పడు లోకమే తనయొక్క పొరబాటునకు సిగ్గుపడును అయితే యిది సామాన్య బ్రహ్మనిష్ఠులు చేయవలసిన పని కాదు లోకోద్ధారకులై కారణగురువులై భూలోకమునకు వచ్చిన జీవన్ముక్తులగు మహాపురుషులు చేయవలసిన పనిగానుండునని మాత్రము జ్ఞప్తిలో నుంచవలయును మణిమంత్ర ఔషధము గలవాడు త్రాచుబామును పట్టి ఆడించునట్లు అది లేనివాడు చేయజాలడుగదా!

292. చక్కగా సంస్కృతము మొదలగు శాస్త్రములు చదువుకొనిన

వాడైనను, తాను నిద్రలో నుండిన సుషుప్తిలోనుండు ఇతరులను మేల్కొలుపుట కేలాగున సమర్థత యుండదో, ఆలాగున సమస్త శాస్త్రములు చదివినవాడైనను, మోహమనెడు సుషుప్తిలో నుండువాడైనచో, ఇతరుల కాత్మబోధచేయు శక్తి యుండదు తాను ఫలనివాడని తెలుసుకొనుటకును సాధ్యము కాదు చదువు లేనివాడైనను, జాగ్రదవస్థలో నుండువాడు నిద్రలో నుండు చదివినవారినిగాని, చదువనివారినిగాని మేలుకొలుప సమర్థత గల్గియుండునట్లు, విద్యలేనివారైనను, ఆత్మబోధము గల్గి యుండిన, విద్య గలవారికిని,లేనివారికిని గూడ దైవసాక్షాత్కార జ్ఞానము గలుగ జేయుటకు సమర్థత గల్గియుండును

293 తీవ్రతర ముముక్షుత్వము గలవాడు, సౌధము పైకి నిచ్చెన యెక్కెడువానివలె నుండును ఒకపాదము పైన పెట్టునప్పడు క్రింది పాదమును విడిచి యేలాగున నడుచుచుండునో, ఆలాగున ప్రతిదినమును ఒక్కొక్క ప్రకృతిగుణమును ద్రొక్కివేయుచు, అప్రాకృత స్థిలోనికి అడుగు పెట్టుచుండవలయును

294 సంగీతము నేర్చుకొనుట కభిలాష గల వారు సంగీత స్వరగ్రంథములను తెప్పించి చదివిన యేలాగున స్వరజ్ఞానమును దెలుసుకొన సాధ్యము లేదో, ఆత్మజ్ఞానమును ఆలాగున గ్రంథ పఠనముచే లభింపదు సంగీతము దెలిసినవారివద్ద నుండి ఏలాగున నేర్చుకొనవలసి యుండునో ఆలాగున ఆత్మజ్ఞానమున్ను, సాధుశీలమును, కరుణయు, విరక్తియు గల అనుభవజ్ఞులగు గురువుల వద్దనుండియే బ్రహ్మవిద్య నేర్చుకొనవలసి యుండును

295 రాత్రిలో దీపము పట్టుకొని సామాన్యపు చీకటిలో నడచువానికి దగ్గరమాత్రము కనుపించునేగాని,దూరములో ఏమియు గోచరము కాదు ఆలాగున, ఎవండు సొంత ధనసహాయముతో సంచరించునో వానికి ప్రపంచముయొక్క యథార్థజ్ఞానము గోచరము కాదు సొంత సహాయమేమియు నపేక్షింపక దైవసహాయము మాత్రమవలంబించి

సంచరించెడువానికే ప్రకృతియొక్క రహస్యము గోచరించును వానికే దూరదృష్టి గల్గును

296 రాత్రిలో వెలుతురు దగ్గర నుండిచూచువారికి దగ్గర నుండునది కనబడునేగాని, దూరముగా నుండునది కొంచెముగూడ కనబడనట్లు, గృహస్థాశ్రమములో మునిగియుండువారికి స్వార్థపరత్వమును, తనకు సంబంధించినవారి సుఖమును గోచరించునేగాని, స్వార్థరహిత విశాలదృష్టియు, విశేషజ్ఞానమును గల్గుట దుస్తరము సామాన్యమగు చీకటిలో నిలిచి చూచువారికి చాలాదూరము వరకు కనపడును అలాగున స్వార్థత్యాగులకు మాత్రమే అతీంద్రియ జ్ఞానము గల్గును వీరికి మాత్రమే లోక రహస్యము గోచరించును కనుకనే తీవ్ర విరక్తుడు సమస్తమును విడచి ఏకాకియై తిరుగుచుండును

297 రోగియైనవాడు, సేవించెడు ఔషధము బాగుగ జీర్ణమై సర్వరక్తనాళములలోను, సర్వశరీరాణువులలోను, సర్వరోమ కూపములలోను నఖాగ్రమునుండి శిఖాగ్రమువరకు వ్యాపించిన మాత్రమే రోగము శమించును అలాగున అజ్ఞాన రోగము శాంతించుటకు బ్రహ్మచింతన చేయువారి శరీరమంతయు బ్రహ్మభావనాధ్యానముచే ప్రజ్వలింపచేయవలయును వీరికి అజ్ఞాన వృత్తి యుండదు తరువాత అదే ప్రపంచమంతయు బ్రహ్మమయముగ మారును

298 తాను సంసారమునుండి ఉద్ధరింపబడిన వాడైనాడో, లేదో యని తన్ను తానే చూచుకొనుచుండవలయును సముద్రములో నుండు ఓడ అయినచో అది అలలచే చలించుచుండును ఒడ్డుచేర్చియుండు నావ చలింపక గంభీరముగా నుండును అదేరీతిగా, నెవడు శోకమోహములు, స్తుతినిందలు, సుఖదుఃఖములు, రుచి యరుచులు మొదలుగల్గు ద్వంద్వములచే చలించుచుండునో, అతడింకను ద్వంద్వరూప సంసారము నుండి తరించినవాడు కాడు ఇదే ముక్తునియొక్కయు, బద్ధుని యొక్కయు స్థితియని గ్రహించవలయును ఇదే అచలముయొక్క

రహస్యము

299 ప్రారబ్ధానుభవము జ్ఞానికిని, అజ్ఞానికిని ఒకే విధముగానే గల్గుచుండినను, ఇట్టి భేదము గలదు అజ్ఞానియొక్క ప్రారబ్ధము కారుచీకటిలో వెలుగుచుండు దీపమువలె నుండును జ్ఞానియొక్క ప్రారబ్ధము నుంచి ఎండలో బెట్టిన దీపమువలె నుండును దీపము చీకటిలోను ఎండలోను ఒకేవిధముగా నుండినను, రాత్రిలో దీపము బాగుగా ప్రకాశవంతమైయుండును మంచి యెండలో దీపము వెల్గుచుండినను, సూర్యరశ్మి మహిమచే గనపడదు ఆలాగున జ్ఞానికి ఆత్మజ్ఞానశక్తి సుఖముచే కర్మ గోచరింపదు అజ్ఞానికి జ్ఞానప్రకాశము లేనందుచే కర్మ యెక్కువ గోచరించుటచే నతడు దుఃఖితుడగును

300 శరమును లక్ష్యములో అనుసంధించిన వాడు ఏకాగ్రత కలిగి, కరమునకును, దృష్టికిని నిశ్చలత్వము ఏర్పడి లక్ష్యము (గురి) స్పష్టముగా గుదురువరకును ఏలాగున చేతులనుండి శరమును విడిచిపెట్టడో, ఆలాగున జపముగాని, ధ్యానముగాని, మరియే మంత్రములను గాని, ప్రార్థనలనుగాని అనుష్ఠించువాడు ధ్యేయాకారము అనగా మంత్రాధిష్ఠానదైవము లేక లక్ష్యము ఆత్మలో అవగాహనము గల్గువరకు జపము నాచరించుట గాని, మంత్రముల నుచ్చరించుటగాని, ప్రార్థనలుసలుపుటగాని, పూజలు చేయుట గాని చేయరాదు అట్టి దైవభావము గలుగువరకును చిత్తమును ఏకాగ్రత పరచుచునే యుండవలయును అట్లైన ప్రతి మంత్రప్రార్థనాదులకు చెప్పియుండు ఫలము గల్గును అట్లు చేయని కారణముచేతనే ఫలము లేకపోవుచున్నది లక్ష్యములో ఏకాగ్రత పడని శరములు వ్యర్థములైపోవును గదా! ఈ తత్త్వమును ప్రతిసాధకుడును గ్రహించి యుండవలయును అట్లు చేయక నామకార్థముగా సహస్ర, లక్ష్య, కోటి జపాదులుచేసినను, లేక రామకోటి, శివకోటి, కృష్ణకోటి మొదలైనవి వ్రాసినను నిజమైన ఫలము గలుగదు

301 మంచి నిష్ఠ గలవారిని మంత్రమూర్తులని పిలిచెదరు అనగా

మంత్రజపము చేయునప్పుడు అగ్నిలో వడవేసి ఊదుచుండిన లోహఖండము ఏలాగున అగ్నిమయమ్మై కనుపించునో, ఆలాగున ప్రణవ, నారాయణ, శివ, శ్రీరామాది మంత్రములను జపించువారు మంత్రాధిష్ఠాన దైవభావముతో హృదయమును అదే మాదిరిగా మార్చుకొనవలయును క్రమముగ నఖాగ్రమునుండి శిఖాగ్రము వరకును మంత్రాధిష్ఠాన దైవమయముగా భావనచే మార్పు చేసుకొనవలయును అట్టివారినే మంత్రమూర్తులని శాస్త్రము చెప్పుచున్నది ఈలాగున అనుష్ఠించువారికి ఆత్మలోనే గాక శరీరమంతయు దైవమయమ్మై ప్రజ్వలించునట్లు గోచరించును ఇట్టివారికి ప్రకృతిదోషము నశించి నిర్వృతి గల్గియుండును ఇది అనుభవముచే సాధకులకు గోచరము గాగలదు ఇట్టివారిని తీర్థభూతులనియు, తీర్థపాదులనియు పిలిచెదరు అనగా తరింపచేయువారని అర్థము

302. సాధకులగు బ్రహ్మనిష్ఠులలో ఈలాటి మూడు భేదములు గలవు 1 మీనవృత్తి 2. మృగవృత్తి, 3 కూర్మవృత్తి, మీనములు జలమును విడిచి జీవింపజాలవు మృగము భూమి విడిచి జలములో జీవించదు కూర్మము జలములోను, భూమిలోను సమముగ జీవించగల్గును అదే రీతిగా కొందరు మహాత్ములు సదా నిర్విషయముతో నిర్జన స్థలములో నుండిన మాత్రమే సంతోషము గల్గియుందురు మరి కొందరు ఎల్లప్పుడు లోకోపకార కార్యములు చేయుటలోను, ధర్మతత్త్వమును బోధించుటలోను, భజనప్రార్థనాదులు సలుపుటలోను పరమానందము గలిగియుందురు వీరిద్దరును సమానులే, జీవన్ముక్తులే అయినను లోకొద్ధారక కారణగురువులు కారు జగదుద్ధారక అవతారగురువులు తాబేలువలెనే యుందురు అనగా లోకోద్ధారక కార్యములు చేయునప్పుడును, నిర్జనస్థలములో నిర్విషయ నిర్వికల్పస్థితిలో నుండునపుడును ఒకే రీతిగనే యుందురు వీరు మహామహనీయులు, జగదుద్ధారకులు వీరి హృదయతత్త్వము అందరికిని తెలియదు అంతరంగ భక్తులకు మాత్రమే తెలిసియుండును వీరు గొప్ప నావవంటివారు తక్కిన యిద్దరును సామాన్యమైన పడవవంటివారు

పడవలో కొలదిమంది మాత్రమే ప్రయాణము చేయగల్గుదురు పెద్ద పొగ ఓడలో అనేకులు తరింపగల్గుదురు ముక్తియును మోక్షసుఖమును వీరు ముగ్గురికిని సమానముగానే యుండును ప్రయత్నములో మాత్రమే మార్పు గలిగియుండును

303 మనస్సు చాలా ప్రాతదైన వస్త్రము వంటిదిగా నుండును కొంచెమైన చినిగినచో వెంటనే కుట్టవలయును లేనిచో త్వరలో అంతయును చినిగిపోవును అలాగున హృదయములో ఏదైన ప్రపంచవృత్తి గల్గినచో వెంటనే మనః పరివర్తనపరమగు మార్పు చేసుకొనవయును లేనిచో దృశ్యవిషయములో మునిగిపోవచ్చును

304 బ్రహ్మనిష్ఠులలో కొందరు త్రాచుబాములవలె నుందురు త్రాచుబాము నోటిలో విషముండినను ఆవిషము దానిని బాధింపజాలదు అలాగున కొందరు మహాత్ములు ప్రపంచజన మధ్యములో నుండి ప్రపంచకార్యములు చేయుచుండినను వారిని అది బాధింపజాలదు వారు చేయు కొన్ని కార్యముల జూచి అందరును అలాగున చేయరాదు చేసినచో అపాయము గల్గుట నిక్కము ఇది కొందరు తపసంపన్నులకు గలిగెడు నిగ్రహాను గ్రహశక్తిగా నుండును కనుక ఇట్టి విషయములలో బ్రహ్మనిష్ఠులు చాల జాగరూకులై ప్రవర్తించవలయును ఇది అందరికిని సంబంధించినది కాదు

305 లోకోద్ధారకులగు మహాపురుషుల జీవితము మూడు కార్యములలో నియుక్తమై యుండును

1 శిష్టాచరణలో అనగా పవిత్రమైన సదాచారములో మొట్టమొదట ప్రవృత్తి గలుగును ఇదే వారియొక్క ప్రవృత్తికి అంకురార్పణముగ నుండును అనగా, వారియొక్క స్థాపనమునకు ఇది పునాదివంటిది వారియొక్క అభివృద్ధి యంతయు దీనిపై ఆధారపడియుండును ఇది బీజమునకు సుక్షేత్రమువలె ప్రాణాధారమై యుండును ఈ ఆచరణానుష్ఠానము ఎంతకెంతకు పరిశుద్ధావస్థను బొందుచుండునో, అంతకంతకు ఆ సంఘము

అభివృద్ధినొందును

2. రెండవది దైవప్రార్థన ఇది భజన ప్రార్థనధ్యానములనెడు మూడు శాఖలు గలిగియుండవలెను ఇదే శ్రవణ మనన నిదిధ్యాసనలుగా మారవలెను దీనియందు పుణ్యకర్మానుష్ఠానములను భగవద్బుద్ధితో చేయుచుండవలయును ఇది వారి ధర్మస్థాపనాబీజమునకు జలమువంటిదగును ఈ పైన జెప్పిన రెండింటివలన జీవన్ముక్తి గల్గును అయితే లోకోద్ధారకులగు సాదుపురుషుల జీవితోద్దేశ్యము దీనివల్ల పూర్తి కాజాలదు

3 మరల లోకమునకు బోధించుటలో నియుక్తులై యుండవలయును దైవసాక్షాత్కారము గల్గువరకు, లేక యీశ్వర కరుణ గల్గువరకు, లేక ప్రకృతిగుణము శాంతించువరకు బోధనలకు శక్తి గలిగియుండదు ఈ అవస్థలో జిజ్ఞాసువులైన వారి చేతను, ముముక్షులగువారి చేతను సచ్ఛాస్త్రపఠనము చక్కగ చేయించవలయును అంతేగాక శాస్త్రములో చెప్పేలాగున ఆచరింప జేయవలయును ఇదే యథార్థమైన మహనీయుల లక్షణముగా నుండును దీనివలననే వారు కృతార్థులు గావలసియుండును అనగా లోకోద్ధారణ జరుగవలసి యుండును గురూపదేశమనగా, ఏదో యొక మంత్రమును చెప్పి పంపివేయుట మాత్రము కాదు అంతఃకరణములోగల ప్రాకృతగుణముల నన్నిటిని ఉపదేశ వాక్యములచే దొలగించి వారిని ప్రకృతిబంధముల నుండి తొలగింప జేయవలయును సొంత ఆత్మోద్ధరణ యెటువంటిదో లోకోద్ధారమును అటువంటిదని ముముక్షువులకు ఉపదేశించవలయును ఈ రెడింటిని నేత్రద్వయము వలె చూచుచుండులాగున తెలుపవలయును

306 ఆత్మశుద్ధికి కారణములు 1 ఆహారశుద్ధి 2. వాక్శుద్ధి 3 సంకల్పశుద్ధి 4 వస్త్రశుద్ధి 5 నివాసశుద్ధి 6 సంసర్గశుద్ధి 7 క్రియాశుద్ధి 8 ధ్యానశుద్ధి ఇవి ఆత్మశుద్ధిని గలుగచేయును

1 చేసిన తప్పునకు సరి యయిన శిక్షను విధించి, మరల తప్పు చేయకుండునటుల సంస్కరింపుడు అనునదే ఉత్తమమనబడును 2 చేసిన తప్పును క్షమింపుడు అని క్షమాపణ కోరుట మధ్యమము 3 చేసిన తప్పును సవరణ చేసి రక్షింపుడు, అనుట కనిష్ఠము 4 చేసిన తప్పును చేయలేదనుట అధమస్వభావమగును ఇది నికృష్టము

307 శ్రద్ధతో వ్యాపారముచేసి వృద్ధిపరచు వారికి ధనసహాయమును, ఆసక్తితో కృషి చేసి చక్కగా పండించెడు వారికి భూమియును యివ్వవలసియున్నట్లు, శ్రమను సహించి శ్రద్ధతో చదువుచుండు విద్యార్థికిని, భక్తితోను, వైరాగ్యముతోను ధ్యానముచేయు ముముక్షువుకును సహాయము చేయవలయును పై నుదాహరించిన వ్యాపార వ్యవసాయములు చేయువారు పెద్ద వారు గాని, చిన్న వారు గాని, బ్రాహ్మణులు గాని, బ్రాహ్మణేతరులు గాని ఎవరైనను ఎట్టి విరోధమును లేదో, ఆలాగున చదువుచుండు విద్యార్థియు, బ్రహ్మనిష్ఠ చేయు ముముక్షువును పెద్ద వారని గాని, చిన్న వారని గాని, బ్రాహ్మణులని గాని, బ్రాహ్మణేతరులని గాని చూడనక్కర లేదు

308 ఎవరిపైనైన ఏవిధమైన సందేహము గల్గినచో, వెంటనే దానియొక్క నిజమును కనుగొనుటకు ప్రయత్నించి సంశయ నివృత్తి చేసి కొనుము సందేహము దేహములో ముల్లు గ్రుచ్చుకొనినట్లుండును ఆ ముల్లును వెంటనే తీసివేయనిచో, అది గొప్ప వ్రణమగునట్లు సందేహము మనుష్యుని అక్రమమునకు దించును

309 దయకును, ధర్మమునకును కొంచము వ్యత్యాసము గలదు అయితే అవి రెండును పరస్పర సంబంధములై యుండవలయును దయకు లోబడి ధర్మమునకు దూరుడైనచో అది ప్రస్తుతము సుఖముగా గనుపించినను క్రమముగ నుభయులకును దుఃఖమునకు కారణమగును కావున ధర్మమునకు విరోధము గాని దయను మాత్రమే చూపవలయును లేనిచో తీవ్రరోగమునకు రోగిపై దయచే తీక్ష్ణమైన

ఔషదమును, కఠిన పథ్యమును పెట్టనట్లుండును ధర్మమునకు మించిన దయను చూపువారు లోకోద్ధారకులు గాజాలరు అంతేగాక అట్టిది నీతికి దూరమగును అయితే సాధువులు చాలవరకును దయ గలిగియే యుండవలయును

310 మహనీయులు తమకెంత మహిమ గల్గియుండినను, హద్దు దాటి ఒక అడుగైన పెట్టరు ఒక చిన్నకార్యమైనను చేయరు సూర్యుడు ఎంత మహిమాతిశయము గల్గియుండినను తన యొక్క జ్యోతిశ్చక్రకరేఖనుండి చలించుట లేదు సముద్రమెంత గొప్పశక్తి గల్గియుండినను తన యొక్క హద్దైన కట్టును దాటి వచ్చుట లేదుగదా! మహాపురుషుల జీవితమును ఈలాగుననే యుండును సామాన్యమైన చిన్న నదులు హద్దు దాటి అప్పడప్పడు వెల్లువలుగా వచ్చుటచే జనుల కెంత అపాయకరమో, ఆలాగున సామాన్య సాధువులు, భక్తులు, బ్రహ్మనిష్ఠులు హద్దు దాటి వర్తించుటచే జనులకును వారికిని గలిగెడు అపాయము అందరకిని తెలిసియే యుండును

311 స్థూలదేహము శుద్ధపడునప్పడు నిశ్చలత్వమును, ఇంద్రియములు శుద్ధమగునప్పడు నిశ్శబ్దమును, సూక్ష్మశరీరము శుద్ధపడునప్పడు నిశ్చింతయు, అంతఃకరణము నిశ్శేష నిర్మలత్వము నొందునప్పడు నిస్పృహతయు, ఆత్మశుద్ధి గల్గునప్పడు నిష్కళంకమును, నిర్మలబోధమును గల్గును అప్పడు స్వబోధైక రసామృతుడై యోగి వెల్గుచుండును కావున భజన, కీర్తన, ప్రార్థనాదులు సలుపువారు క్రమముగా పై చెప్పిన వాటి చలనముల నణచ జూడవలయును యథార్థమైన దైవపూజ కేవలాత్మస్వరూపమలో నిలిచి చేయవలయును ముందు చెప్పబడిన ఒక్కొక్కటికిని సహస్రాంశాధిక ఫలము గలదు దేవాలయముల యొక్క బైట చేయు కర్పూర దీపారాధన పూజలకును, దేవాలయము ముఖద్వారమున చేయు పూజాదులకును, గర్భగృహముల లోపల చేయు ఆరాధనకును, సాక్షాన్మూర్తిని తాకి చేయు అభిషేకాది పూజలకును ఎంత

భేదము గలదో, అట్టి భేదము దీనియందు గలదు లేక రాజుదగ్గరనుండు మంత్రులకును, దూరముగా నుండు గవర్నర్లకును, జిల్లాలోనుండు కలెక్టర్లకును, తాలూకాలో నుండు తహసిల్ దార్లకును ఎంత తారతమ్యము గలదో అట్టి భేదము ఈదైవపూజలోను గలదు

312 మాణిక్యము కుప్పలో పడియుండినను దానియొక్క విలువ తగ్గుట లేదు రాగి రత్న సింహాసనములో నుండినను దానియొక్క విలువ యెక్కుట లేదు అలాగున మహనీయు లెచ్చట నుండినను వారి గౌరవము తగ్గుట లేదు అట్లు గానివారు గౌరవించదగిన స్థలములో గూర్చొనినను వారికి గౌరవము గలుగనేరదు

313 ప్రకృతియొక్క అనగా జన్మాంతర సంస్కారముయొక్క శక్తిని అతిక్రమించుట దుస్తరమైనది ఎట్టి ధీరులైనను అనుష్ఠానపరులైనను గూడ ఒకానొక సమయమున సంస్కారమునకు లోబడి పోవలసివచ్చును వారిలో నిట్టి భేదము గలదు 1 జన్మప్రభృతి యేలాటి దోషమును లేక తనయొక్క నిష్ఠను సాధించినవారుత్తములు 2 తనయొక్క ప్రయత్నమునకు మించి ఒకప్పుడు ప్రకృతికిలో బడిపోవలసి వచ్చినచో బహువిధములుగా బరితపించి కఠినములైన ప్రాయశ్చిత్తముల జేసికొని మరల అట్టి కార్యములలో దగులక జాగరూకులై యుండువారు మధ్యములు 3 తాను చేయరాని పనియని గ్రహించియు ప్రకృతిగుణములలో పడిపోయి ప్రాయశ్చిత్తము చేసుకొనకయు, మరల అలాటి నికృష్టకార్యములలో ప్రవేశించియుండి అనుష్ఠానము మాత్రము చేయుచుండుట కనిష్ఠులైనవారి స్వభావము 4 ప్రాకృత గుణములలో పడిపోకూడదని తెలిసియు విషయములలో పడిపోయి యెవరైన అడిగినచో అట్లు పడిపోలేదని వాదించుచు అట్టి నికృష్టకార్యములనుండి నివృత్తింప జేయనివారు నికృష్టులు వీరు తరింపజాలరు మొదటివాడు ముక్తుడు రెండవవాడు గూడ ముక్తికి యోగ్యుడే మూడవవాడు జన్మాంతరములలో ముక్తికి తగిన యోగ్యత గల్గియుండును నాల్గవవాడు బద్ధుడు

316 దేహత్రయాతీత ప్రత్యగాత్మయందు పరమాత్మభావము గల్గువరకు పూర్ణమైన భక్తి గలుగజాలదు నాస్తికులలో కొందరును, అచల పరిపూర్ణులలో కొందరును స్థూలదేహ నాశముతో ఆత్మగూడ నశించునని చెప్పుదురు అది సరి గాదు ఏలన, చింతపండు పైపొట్టు అనగా బెరడు పోయినను బీజము నశించుట లేదు మరియు బీజముండెడు గుజ్జు (పండు) నశించినను విత్తనము నశించదు ఆలాగున స్థూల సూక్ష్మ దేహములు నశించినను జీవన్ముక్తి గాజాలదు బీజమునకుగల పొట్టు (టెంకి) వుండువరకు బీజము వృక్షమగుచుండును అది కారణదేహ మనంబడును అది వీడిపోయిన మరల బీజ మంకురింప జాలనట్లు కారణదేహ ముండువరకే జననమరణములు గల్గుచుండును కావున ప్రత్యగాత్మయందు పరమాత్మభావము గలుగువరకును, బ్రహ్మాత్మైక్యజ్ఞానము గలుగ చేసుకొనవలయును ఇది చాల రహస్యమైనది

315 వైరాగ్యబోధోపరతులచే పరిపక్వత జెందని హృదయములో భావన చేసెడు దైవజ్ఞానము చక్కగ కాలనికుండలో పోసిన జలమువలె నుండును ఈ కారణముచేతనే విరక్తిలేనివారి జ్ఞానము జ్ఞేయాకారమై నిలవక జారిపోవుటకు కారణమగుచున్నది కాలిన కుంభమైనచో జలము నిలిచియుండునట్లు విరక్తిగల హృదయములో ధ్యానముచే గల్గెడు జ్ఞేయము మరుపు గలుగక యుండును

316 జ్ఞాననిష్ఠలో ఆరూఢస్థితిని పొందకయు, జ్ఞేయబ్రహ్మము ధ్యాతగా గలుగక యుండువారు అన్నివిధములలోను అనుష్ఠానము విడువరాదు దీనికొక కథ గలదు అది అత్తగారింటికి ఒక అల్లుడు పోయిన చరిత్రముగా నున్నది ఒక గొప్ప జమీందారు కుమార్తెను మరియొక జమీందారు కుమారునకిచ్చి వివాహముచేసెను అల్లుడుగారికి కొన్ని రోజులనుండి అజీర్ణవ్యాధి గల్గి యుండెను ఔషధసేవ జేయుచుండు సమయముననే వివాహము జరిగినది వైద్యుడు మిరయాలచారును, వడియములును, అన్నములో కలిపి తినవలయునే గాని మరి యేమియు తినరాదని పథ్యము

పెట్టెను క్రొత్తగా అల్లుడు అత్తగారింటికి వెళ్ళునప్పుడు బంధువులుగూడ చాలామంది వచ్చియుండిరి అత్తరుణమున అనేకములైన పిండివంటలును, కూరలును, ఫలములును సమకూర్చి యుండిరి బంధువులమధ్య అల్లుడుగారును భోజనమునకు కూర్చుండెను అతడు మందబుద్ధి గలవాడగుచే ఈ పదార్థము లన్నియు అందరివలె భుజింపనిచో వీరేమి తలంతురో, ఇట్టి రోగికి ఏల పిల్లనిచ్చితిమని తలంచుదురేమో! మరియు తనపై భార్య మొదలైన వారికి యేమి బుద్ధి గుల్గునో యని తలంచి అయ్యో పాపము ! అందరివలె అన్నివస్తువులను బాగుగ భుజించెను రాత్రి 10 ఘంటలగునప్పటికి కడుపుబ్బి వమనమును, భేదియును అపరిమితముగా గల్గెను అప్పడింటివారి ప్రయత్నమువల మంచి వైద్యుని సహాయముచే ప్రాణము దక్కెను మరల పదిరోజులు ఉపవాసముగా లంకణము బెట్టినందుచే క్రమముగ ఆరోగ్యము గలుగ నారంభించి ఆరునెలలు పట్టెను పూర్వమున్నట్లు పథ్యముతో నుండిన త్వరలో ఆరోగ్యము గల్గియుండునుగదా! ఈలాగున కొందరు మందబుద్ధులు సాధనానుష్ఠాన నిష్ఠలతో గూడియుండిన యిది పరిపూర్ణము గాదనియు, ఆరూఢ లక్షణము గాదనియు, బ్రహ్మజ్ఞానికి అది ఇది యను భేదభావముండవచ్చునా? దొరికినదంతయును, ఎవరు పెట్టినను తినవలయునుగదా యని శుష్కవేదాంతులు చెప్పమాటలను విని, పరిపక్వత లేనివారు నియమనిష్ఠలను విడిచి చెడిపోవుచున్నారు ఇది బుద్ధిమంతుల స్వభావము గాదు రోగి కేలాగున రోగము వృద్ధి యైనదో, అట్లు వీరికిని అజ్ఞానవ్యాధి అధికరించునే గాని శమింపదు

317 అతీంద్రియ జ్ఞానులయొక్కయు, అపరిమిత ఇంద్రియజ్ఞానము గలవారియొక్కయు జ్ఞానమున కింత తారతమ్యము గలదు ఉపనిషత్తులు యోగశాస్త్రములు రచియించినవారు అతీంద్రియజ్ఞానులు వాని కర్థమును వ్రాయువారు అట్టివారే కావలయును నిర్విషయ విరక్తిగలుగని వారు వ్రాసిన ఆ గ్రంథముల యర్థము పూర్ణముగ తెలుసుకొనజాలరు

దీనికొక గాథ గలదు ఒక దేశ చరిత్రకారుడు ఎత్తైన

పర్వతోపరిభాగమున గూర్చుండి దూరదర్శిని యంత్రసహాయముతో దేశముయొక్క చిత్రమును చరిత్రమును వ్రాసి పోయెను కొంతకాలమయిన తర్వాత మరి యొకడు వచ్చి పర్వతముక్రింద గూర్చొని తన యొక్క కన్నులకు గనుపడిన చిత్రమును చరిత్రమును వ్రాసి వెళ్లినాడు ఈ రెండింటికిని యెంత మార్పు గలదో, ఋషులు వ్రాసియుండు మూలగ్రంథములకును, వానికివ్వడు వ్రాయు సామాన్యజనుల యర్థమునకును ఇట్టి మార్పు గలదు ఋషుల యాశయమును తెలుసుకొనవలసియుండిన, నిజమైన యోగి కావలయును జ్ఞానుల యభిప్రాయము దెలిసికొనవలసియుండిన, నిజమైన ఆత్మజ్ఞాని గావలయును అట్లు గానిచో, పురాతనములగు మూలగ్రంథములకు యథార్థమైన అర్థము తెలియజాలరు కనుకనే ఒక్కొక్క గ్రంథమునకు ఇన్ని భాష్యములును కావలసి వచ్చినవి ఇచ్చట పర్వతోపరిభాగమనగా, తురీయముగాని, తుర్యాతీతము గాని పొందియుండవలయునని భావము దూరదర్శిని యనగా దివ్య దృష్టి గలుగవలయును పర్వతోపరిభాగ మందుండి దూరదర్శిని సహాయముతో చూచువారికి వేలకొలది మైళ్లదూరము గనుపించునదేగాక,చిన్న వస్తువులు గూడ గనపడును కావున అతీంద్రియజ్ఞానము కలిగేలాగున సాధన చేసుకొనవలయును ఇది వైరాగ్యము చేతను, నిష్కామముచేతను, ప్రశాంతముచేతను, యోగసాధనచేతను, బ్రహ్మచింతనచేతను, ప్రాణికోట్లలోగల కరుణచేతను గలుగును బ్రహ్మచింతనమునే అనన్యభక్తి యని గూడ గ్రహించవలయును మరియు దీనినే స్వస్వరూపాను సంధానమని గూడ మహాపురుషులు చెప్పుదురు

318 నిరశన వ్రత నిష్ఠగలవారి స్థూలశరీర మేలాగున కొంతకాలమునకు నశించిపోవునో ఆలాగున నిశ్చింత, నిర్విషయ, నిస్సంకల్పాభ్యాసనిష్ఠను శీలించువారి మనస్సుగూడ నశించిపోవును ఏలన స్థూలములగు అన్నపానాదులచే ఈ స్థూలదేహము వృద్ధినొందుచుండును అవి లేనిచో ఈ స్థూలదేహము క్షయించును ఆలాగున సంకల్పముచే

సూక్ష్మదేహ మేర్పడియున్నది కనుక నిస్సంకల్పానుష్ఠానముచే సూక్ష్మహము నశించును ఇదే యోగశాస్త్రములయొక్క రహస్యము సాత్త్వికాహారముచే శరీరమునకు సత్త్వగుణమును, రాజసాహారముచే రజోగుణమును, తామసా హారముచే తమోగుణము ఏలాగున వృద్ధినొందునో, అలాగున సత్య, శాంత, దయాదులచే సూక్ష్మదేహమునకు స్వచ్ఛమగు జ్ఞానమును, కామక్రోధభోగాదులచే రాజసస్వభావమును, విషయాదిక్రూరకృత్యములచే తామస స్వభావమును గల్గుచుండును సూక్ష్మ దేహమునకును, స్థూలదేహమునకును కొంతవరకు పరస్పర సంబంధము గలదు ప్రాణాయామాది ఆసనాదులచే స్థూలదేహమునకు నిశ్చలత్వము గల్గును ప్రత్యాహార ధ్యానధారణాదులచే సూక్ష్మదేహమునకు నిశ్చేష్టత్వము సిద్ధించును యోగశాస్త్రము దీనికొరకు ఏర్పడినది యోగము యొక్క ఉద్దేశ్యమున్ను ఇంతవరకే అయితే దీనివల్ల జీవుడు జన్మపరంపరా బంధమునుండి విముక్తి గల్గి నిత్యానందమగు శివత్వము నొందజాలడు జీవునియొక్క అమృతత్వజ్ఞానమగు శివత్వమొందుటకే జ్ఞానశాస్త్ర మేర్పడినది ఇది వేదాంతశాస్త్రము బోధించును ఏలన, సూక్ష్మదేహము లోపల కారణదేహము గలదు ఈ కారణదేహము ఆత్మజ్ఞానబోధాగ్నిచే మాత్రమే దహించును వేరు మార్గము లేదు మారేడుపండు, చింతపండు మొదలైనవాటియొక్క పైబెరడు స్థూలదేహముగాను, లోపలగల గుజ్జు సూక్ష్మదేహముగాను, గుజ్జులోపల విత్తనమును ఉండును కావున వాటితోడు పోయినను బీజము నశింపదు గుజ్జుతీసివేసిన బీజము నశింపదు బీజమును దహింపజేసిన మాత్రమే వాటి జన్మపరంపర నశించును కావున అవిద్యయొక్క మూలమగు కారణదేహమును రహిత మొనర్చవలెను కనుకనే హృదయగుహయందును, బుద్ధిగుహయందును ఆత్మ గలదని శాస్త్రము చెప్ప రహస్యము కాబట్టి అట్టి ఆత్మబోధము గల్గునప్పుడే శివత్వమును, అమృతత్వమును నిత్యమైన ఆనందమును, జీవన్ముక్తియును జీవులకు గల్గుచుండును అందుచేతనే ఏ బీజమైనను మొలకెత్తునప్పుడు దాని బెరడు అనగా తోడు వేరుపడిపోవును ఇదియే దీనికి గురుతు అయితే యోగశాస్త్రము జీవన్ముక్తికి చాల

సహాయపడును కాని యోగముచే మాత్రము తృప్తినొంది కృతార్థుడనైతినని తలంచరాదు

319 కట్టెలు కొంచముగాను, నిప్పు, ఎక్కువగాను నుండిన లాభము లేదు గొప్పగా మండదు కట్టెలధికముగాను నిప్పకొంచెముగానుండిన చాలును అప్పుడపారముగ జ్వలించుచుండును గదా! ఆలాగున కొందరు భక్తులు సాధనలు బహిరంగములు ఎక్కువగా జేయుదురుగాని సత్య, ధర్మ, దయా, విరక్తులు మొదలగు దైవగుణముల నధికముగా నాచరణలో పెట్టిచూడరు వీరు ఎంత సాధన చేసినను ఆత్మసౌఖ్యము గల్గుట దుస్తరము ఏలన, అగ్ని కట్టెలలోనే యిమిడియున్నది కొండంత కట్టెలను ప్రజ్వలింపచేయుటకు రవ్వంత అగ్ని యుండిన చాలును ఆలాగున బ్రహ్మనిష్ఠుని యాత్మాభివృద్ధి యంతయు అతిసూక్ష్మసుగుణములపై ఆధారపడియున్నది

320 తామరపుష్పమును, చామగడ్డయును నీటిలో వృద్ధినొందునేగాని మెట్ట ప్రదేశమున ఏలాగున వృద్ధి గాజాలవో, అదేప్రకారము రోజా పుష్పమును, ఉర్లగడ్డయును మెట్టపై వృద్ధినొందునేగాని నీటిలో ఏలాగున వృద్ధిగాజాలవో, పై జెప్పినవి స్థలములు మారిన ఏ లాగున చెడిపోవునో, అదేప్రకారము బ్రహ్మనిష్ఠులు గూడ తగని స్థలములో నుండరాదు అనగా నిష్ఠకనుకూలములేని స్థలములోను, పురుషులుండే స్థలములో స్త్రీలును, స్త్రీలుండేస్థలములో పురుషులును ఉండి బ్రహ్మనిష్ఠ చేయరాదు అనుకూలస్థలములును ఉభయులకు ప్రత్యేకస్థలములును ఉండవలయును అట్లు గానిచో పరమయోగులై యుండవలయును

321 మధురమైన, అమృతసదృశమైన దివ్యవస్తువును ఒకే స్థలములో నుండి ఒకరు అచ్చటికి వచ్చినవారికి పంచిపెట్టుచుండిన యెల్లప్పుడును అతనిదగ్గరకు పిలువకనే యనేకులు వచ్చుచుందురు చేదువస్తువును విషయుక్తముగా నుండుదానిని తినుటకు ఎవరు పిలిచిన రారుగదా!

ఆలాగున ఎవనికి ఆత్మప్రబోధము గల్గి బోధామృతము గల్గియుండునో, వారిదగ్గరకు పిలువకనే యనేకభక్తులు వచ్చుచుందురు అట్టి అవస్థ గలుగక నిర్విషయము నొందక యుండుటచేతనే తనదగ్గర కెవరును రాలేదని తలంపు గల్గిన మరల విచారమున కవకాశము గలుగదు

322 బ్రహ్మనిష్ఠుడు తనకు సంబంధించని లోకవిషయము సత్యమైనదిగా నుండినను దాని యందు జోక్యము కలుగచేసికొనరాదు గవర్మెంటులో ఏడిపార్టుమెంటువారు ఆకార్యముతో జోక్యము చేసికొందురే గాని, అట్లుగాని ఫిర్యాదులను తీసికొననట్లు జ్ఞానియును తనకు సంబంధము లేని లోకకార్యము సత్యమైనదైనను జోక్యము చేసుకొనరాదు కనుకనే మైత్ర్యాది చతుష్టయములో నాల్గవదైన ఉపేక్ష యేర్పడినది అయితే తగిన బలము గల్గునప్పడు అధర్మమును ఎదుర్కొని తరిమే ధర్మము బ్రహ్మనిష్ఠులపై నుండవలయును

323 వేరు చెడిన యెటువంటి వృక్షమైనను ఏలాగున చెడిపోవునో ఆలాగున ముక్తి నిచ్చునదియగు కల్పవృక్షమువంటి జ్ఞానవృక్షమునకు వైరాగ్యమే వేరు ఇది చెడినచో తప్పక పతనము గల్గును

324 కాలువలద్వారా నిండుగా జలము ప్రవహించుచుండగా కట్ట తెగిన యేలాగున ఆ జలవేగము మరియొక మార్గముగా పోవుచు పూర్వము పారుచుండు స్థలమునకు వేగముగా వెళ్ళజాలదో, అదే ప్రకారము బ్రహ్మనిష్ఠాపరమగు ధ్యానములోనుండిగాని, యోగములో నుండిగాని, తపస్సులో నుండిగాని మనస్సు మరియేు విషయంవైపు అనగా ప్రపంచములోగలసామాన్య ధర్మకార్యము లోనికిగాని యితరకార్యము లోనికిగాని దిగినచో, జ్ఞానముయొక్క అంతము అనగా పూర్ణము గనుగొనుటకు తరము గాదు కనుక తాను ప్రారంభించిన దైవకార్యము యొక్క అంత్యము చేరువరకు ఏకదృష్టితో విశ్రాంతి లేక ప్రయత్నించువారు మాత్రమే పూర్ణసుఖమగు ఆత్మవిశ్రాంతిని బొందగల్గుదురు

325 ఒక రాజ్యమును స్వాధీనపరచుకొనజూచువారు

కేంద్రస్థానమును లోబరచుకొనజూడక రాష్ట్రములో గల యితర స్థానములుగాని, స్థాపనములనుగాని, పట్టణములనుగాని వశపరచినను పూర్ణనిర్భయము గాని, సుఖము గాని కలుగదు రాష్ట్రముయొక్క రాజధానిని స్వాధీనపరచుకొని పట్టాభిషిక్తులైనచో ఆ రాజ్యములో గల సర్వరాష్ట్రములును, స్థావనములును, స్థానములును తమకు వశములై పోవుటేగాక నిర్భయత్వమును నిరంకుశ సుఖమును గలుగునట్లు ఆత్మసాక్షాత్కారమును పొందనిచో ప్రకృతిరాజ్యమును జయింపజాలరు అట్టి ప్రకృతిజయము గలుగువరకును తక్కిన యెన్ని మహిమలనుగాని, సిద్ధులనుగాని సంపాదించినను పూర్ణశోకశాంతియు, నిత్యమగు ఆత్మసౌఖ్యమును గలుగజాలదు ఆత్మసిద్ధి గల్గినవారికి తక్కిన సిద్ధులన్నియు స్వాధీనములైపోవును, లేక తుచ్ఛములను తలంపు గలుగును లేక ప్రభువుదగ్గర ప్రజలవలె సిద్ధులన్నియు వశవర్తులై యుండును కావున ఇతర మహిమలో మనస్సును ప్రవేశింప నీయక ఆత్మసాక్షాత్కారములో సదా ప్రయత్నించి దైవసాక్షాత్కారస్థితి నొందవలయును

326 మంచి గౌరవముగల కుటుంబములో పుట్టి రాణిగానుండు రాచకుమార్తె యేలాగున యాచకుడై తిరిగెడు భిక్షగానిని వివాహము చేసుకొన నిశ్చయింపదో, ఆలాగున గౌరవ వంశములో జన్మించిన రాజకుమారుడు, యాచకురాలై భిక్షమెత్తి జీవించెడు వనితను, ఏలాగున పెండ్లాడడో, ఆలాగున పరులను యాచించెడు స్వభావముగల యోగిగాని, తపస్విగాని, పండితుడుగాని, భక్తుడగాని, సన్యాసిగాని అట్టి పురుషుని ముక్తికాంత వరింపజాలదు అదేరీతిగా గొప్ప గౌరవముగల మన ఆత్మారాముడు యాచకురాలై యుండు సన్యాసినినిగాని, యోగినినిగాని, తపస్వినినిగాని, భక్తురాలినిగాని, పండితురాలినిగాని వరింపజాలడు తనలో ఐక్యము చేసికొనుడు ఆత్మారామ దర్శనము నిజమైన నిష్ఠలేని యెవరికిని లభింపజాలదు ఆలాగుననే సరియైన బ్రహ్మనిష్ఠ లేని యోగికిని ముక్తికాంతా దర్శనము దొరకుట దుస్తరము

327 అడవియందు పట్టుబడిన గజము వశపడువరకు ఎట్లు గొలుసు సదా వేసుకొని యుండవలెనో, అలాగున మనస్సు వశపడి ప్రశాంతమును, ప్రసన్నభావమును గల్గువరకు సదా జపమాల చేతిలో నుంచుకొని దైవభావముతో జప మాచరించుచుండవలయును ఇట్టివారికి మనస్సు త్వరలో వశపడును ప్రపంచవృత్తి మనస్సులో స్ఫురించునపుడెల్ల జపమాలను ద్రిప్పుచు ఆత్మస్వరూపములో పరమాత్మ భావము చేసికొనుచుండవలయును

328 బ్రహ్మనిష్ఠులలో ఈలాటి తారతమ్యము గలదు 1 ఒక గ్రామమునసబు అయినచో, అతని ఆజ్ఞను పాలించువారు ఆ గ్రామములో నుండువారు మాత్రమే గాని యితర గ్రామస్థులు పాలింపరు 2 ఒక తహశిల్దారు గాని మేజిస్ట్రేటుగాని అయినచో, అతని యుత్తరువు ఆ తాలూకా అంతయును గౌరవింపబడును అంతేగాని యితర తాలూకాలలో చెల్లదు 3 కలెక్టరు అయినచో అతనిశాసనము ఆ జిల్లాలో అందరును గ్రహించుదురు అంతేగాని, తక్కిన జిల్లాలలో గౌరవము చేయరు 4 గవర్నరు అయినచో, తనయొక్క శాసనము ఆ రాజదాని యంతటను అమలులో నుండును కాని యితర రాజధానిలో చెల్లనేరదు 5 రాజప్రతినిధియైన ఆ రాజ్యమంతయు తనయొక్క ఆజ్ఞను అమలులో నుంచును కాని, యితర రాజ్యములలో చెల్ల నేరదు 6 సార్వభౌముడైన, తనయొక్క ఆజ్ఞాపనము తనకుగల సర్వ రాజ్యములలోను అమలులో నుండును ఆలాగున బ్రహ్మవేత్తలలో తమయొక్క ఉన్నతోన్నత పదవులను బట్టి వారి యొక్క విజ్ఞానము గూడ వ్యాపించును జనులు గూడ తమ యాజ్ఞను పరిపాలింతురు తమ మతమునుగూడ అంగీకరింతురు పై జెప్పిన గ్రామాధికారినుండి సార్వభౌముని వరకుగల యుద్యోగములలో నుండువారు ఏవర్ణస్థులైనను, ఏ మతస్థులైనను, ఏదేశీయులైనను లేక అగ్రజాతిగాని నిమ్నజాతిగాని అయినను ఆయా స్థానమునకు వెళ్ళునప్పుడు దానికి తగిన యధికార మంతయు అందరికిని ఒకేవిధముగానే గల్గును

ఆ స్థానములకు వచ్చువారు స్త్రీలయినను, పురుషులయినను విరోధము లేదు వారికిని అట్టి పదవి లభించును విక్టోరియా మహారాణిగారుండిరి గదా! ఆలాగున హిందువులలోను, మహమ్మదీయులలోను, అనేక నారీమణులు రాణులయి రాజ్యభారమును వహించి యుండిరి అట్లే, బ్రహ్మనిష్ఠులలో శ్రీశుక, సనక, విశ్వామిత్ర, జనక, తులాధార, సూత, విదుర, ధర్మవ్యాధాదులు చాతుర్వర్ణములోగల పురుషులై యుడిరి అట్లే, మైత్రేయి, గార్గి, చూడాల, సులభ మొదలైన స్త్రీలును తార్కాణములు కనుక లోకములో ధర్మమును వ్యాపింపచేయదలంచువారు తమలో తామే ఉన్నతోన్నత బ్రహ్మనిష్ఠుల పదవిని పొందేలాగున ప్రయత్నించవలెను అప్పడు లోకము తనకు తానే మీయాజ్ఞను గ్రహింపగల్గును అట్లు గానిచో అదికారములేని యాజ్ఞవలె మీయాజ్ఞగూడ వ్యర్థమైపోవునని లెస్సగ జ్ఞాపకము చేసుకొనవలయును దీని యందు 1 అన్నమయ కోశమును జయించిన వాడు గ్రామాధికారి యనియు, 2. ప్రాణమయకోశమును జయించినవాడు మేజిస్ట్రేటు అనియు, 3 మనోమయ కోశమును జయించినవాడు కలెక్టరనియు, 4 విజ్ఞానమయకోశమును జయించిన వాడు గవర్నరనియు, 5 ఆనందమయ కోశమును వశపరచుకొనిన వాడు వైస్రాయియనియు గ్రహించవలెను అన్నమయము నుండి ఆనందమయ కోశమువరకు ఒక్కశరీరము పూర్తియైనట్లు రాజప్రతినిధితో ఒక్క రాజ్యమును పూర్తియగును ఇది వ్యష్టికి సంబంధించినది 6 ఆవలనుండు అవస్థ వ్యాపకమై యున్నట్లు సార్వభౌమునకు తన రాజ్యములో తన యాజ్ఞ వ్యాపకమైయుండునుగదా! అట్టి తురీయునియందు తుర్యాతీతావస్థ గల్గినవారలే జగద్గురువులు శ్రీబుద్ధదేవుడు, శ్రీయేసుక్రీస్తు, శ్రీశంకరులు మొదలయినవారు సార్వభౌములతో సదృశులు ఇది గ్రహించిన తాను లోకములో చేయబోవు పనిని మొదట తనలో చేసుకొన వలయునను బోధము గల్గి వర్తింపగల్గును ఇదే దీనిలోగల రహస్యము

ఇట్టి రహస్యమును గ్రహింపజాలకయే తన యాజ్ఞను లోకులంగీకరించుట లేదని తలంచి కొందరు కోపపడుటకును, మరికొంద

రసూయపడుటకును, వేరుకొందరకు విసుగు గల్గుటకును, ఇంకకొందరికి దుఃఖము గల్గుటకును కారణమగుచున్నది కనుకనే నిజము నెరింగిన జ్ఞాని దేనికిని చలింపక నిత్యసుఖము నందుచుండును ఈ యవస్థలన్నియు దైవాధికారము గలిగి భూలోకమునకు వచ్చిన మహాత్ములకు గల్గియుండును జీవన్ముక్తికి మాత్రము కోరికగల జ్ఞానికి దీనితో నేలాటి సంబంధమును లేదు అట్టి ఆత్మజ్ఞానికి లోకములో ఏలాటి కార్యమును చేయవలెనని కోరికయే గలుగదు అదే దానికి గురుతు పై జెప్పినది అధికారపురుషులకు సంబంధించి యుండును

329 దేహములోగల రోగశమనమునకు ఔషధ మవసరమైనను మందు అధికమైనచో దేహమునకు హాని గలుగునదే గాక, మరణము గూడ గలుగవచ్చును అలాగున ఆత్మలో గల దోషమును నశింపచేయుటలో తపస్సును, యోగాభ్యాసమును మంచివే గాని, అధికమైన శరీరమునకు హాని గూడ గల్గును కనుక నిట్టికార్యములలో సాధకులు జాగరూకులై అనుష్ఠానమును చేయుచుండవలయును

330 సన్నసన్న నూలుపోగులతో ఏలాగున ఏజంతువునైనను కట్టివేయ సాధ్యము గాదో, అయితే అనేక సన్నదారములతో చేయంబడిన పెద్దమోకుతో ఏలాగున ఏనుగునుగూడ బంధింపవచ్చునో అలాగున ఇంద్రియములు ఏకాగ్రత లేనివారిచే మనస్సును బంధింప సాధ్యము గాదు ఇంద్రియ సంయమము గలవారు మమన్సనెడు ఏనుగును బంధించుకొనవచ్చును కావున ఎవరికి మనస్సు స్వాధీనము గాలేదో, వారికి ఇంద్రియనిగ్రహము లేదని గ్రహించుకొనవలయును

331 దీపమునకు, తైలమునకును ఎంత సంబంధమున్నదో ఆహారమునకును, బ్రహ్మచర్యమునకును అంత సంబంధము గలదు మలినతైలమైనచో దీపమేలాగున నిలువజాలక త్వరలో ఆరిపోవునో అలాగున శుద్ధమైన ఆహారము లేనివారికి అనగా రజోగుణ తమోగుణ ఆహారములను భుజించువారికి నిర్మలమైన బ్రహ్మచర్యమును నిలబెట్ట శక్తి

చాలదు ఆహారముతో సహా సత్త్వగుణము గూడ గల్గియుండవలయును అప్పుడు మాత్రమే సాత్త్వికాహారముయొక్క ఫలమును గలుగచేయును అట్టిన మాత్రమే పరిశుద్ధమైన బ్రహ్మచర్యమును నిలుపశక్తి గల్గును ఇది శుద్ధమైన చమురుతో వెలిగించెడు దీపమువలె సత్యజ్ఞానానంద జ్యోతిని ప్రకాశింపచేయును కనుక సాత్త్వికాహారమును, సత్త్వగుణమును, సత్యనిష్ఠయును, ధర్మచింతనమును గలవారికే నిజమైన బ్రహ్మచర్యము నిలువగలదు సాత్త్వికాహారము మాత్రము గల్గియున్నను సత్యధర్మనిష్ఠయు, దైవభక్తియు లేనిచో ఆహారసహాయము మాత్రము గలిగియుండిన చాలదు ఏలన, అజగజ అశ్వ వృషభాది జంతువులకు సాత్త్వికాహారముండియు జ్ఞానము లేకపోవుటచే వాటికి బ్రహ్మచర్యము లేకపోయినది కనుక బ్రహ్మప్రాప్తి గలుగచేసుకొనవలెనను దృఢసంకల్పము గలవారికిని, వ్రతనిష్ఠగలవారికిని మాత్రమే బ్రహ్మచర్యము సిద్ధించును ప్రపంచములో ఇంతప్రయాసమైన వ్రతము మరి యొకటి లేదు దీనికి నెంత ప్రయాసము గలదో అంత ప్రభావము గలదు పాపము! అనేక బ్రహ్మనిష్ఠులు దృఢవ్రతము గలవారలై దయాస్వరూపులై సత్యస్వరూపులై ధర్మనిష్ఠులై యుండతలంచినను ఈవ్రతమును నిర్వహింపజాలకయున్నారు ముఖ్యముగా దీనియందు గ్రహించవలసిన రహస్యమొకటి గలదు అదేమన, జిహ్వేంద్రియమునకును, గుహ్యేంద్రియమునకును పరస్పరము ఓతప్రోతములవలె సంబంధము గలదు ఓతప్రోతములనగా వస్త్రమునకు పడుగుపేకలని యర్థము కనుకనే జిహ్వేంద్రియ నిగ్రహము ముందుగా కలుగజేసుకొనిన మాత్రమే గుహ్యేంద్రియ నిగ్రహము గలుగును ఈ ఓతప్రోతముల ధర్మము సత్యధర్మములకును సాత్త్వికాహారమునకును గల్గియుండును ఏలన, జిహ్వేంద్రియము ద్వారా గ్రహించు ఆహారరసము గుహ్యేంద్రియమును ప్రేరణ చేయుచుండును అనగా, జిహ్వేంద్రియము ఎంతవరకు రసము గోరుచుండునో అంతవరకు గుహ్యేంద్రియమును తప్పక విషయమును గోరుచుండును ఏలన, ఆహారరసము రక్తము మొదలగు సప్తధాతువులై, శుక్లమై మారును ఆహారగుణము ననుసరించి స్వభావము గూడ గల్గును

విరేచనమునకు ఔషధము తీసుకొన్నవారు ఏలాగున మలవిసర్జనముచేయక నిలువజాలరో ఆలాగున తమోగుణ రజోగుణములు గలవారికి బ్రహ్మచర్యము నిర్వహింప ఎంతో కష్టముగా నుండును మఱియు జిహ్వాయందు వాక్కనెడు ఒక కర్మేంద్రియము గలదు గుహ్యేంద్రియమును కర్మేంద్రియమే గనుక వీరిద్దరికిని పరస్పరమైత్రి గలదు ఏలన ఇద్దరు మిత్రు లేలాగున ఒకరికొకరు ఐకమత్యము గల్గి ఒకేవిధముగా ప్రవృత్తిగలవారై యుందురో ఆలాగున జిహ్వేంద్రియ నిగ్రహము లేనిచో గుహ్యేంద్రియ నిగ్రహము గలుగజాలదు ఇది దీనిలో గల పరమరహస్యము కనుక జిహ్వేంద్రియ రసవర్జనము సంపూర్ణముగ గలిగిన మాత్రవే గుహ్యేంద్రియమునకు నిర్విషయము గలుగును ఈ రెండిం ద్రియములలో రెండేసి గుణములు గలవు వాగింద్రియములో రసమును గ్రహించుట యొకటి వాక్కు నుచ్చరించుట యొకటి అలాగున గుహ్యేంద్రియములో జలమును విసర్జించుట యొకటి విషయానురక్తి యొకటి

వానిలో దేహసంరక్షణకు కావలసినదాని నొక్కొక్క దానినుంచి అధికముగా నుండిన మరి యొక్కొక్కటిని విడిపెట్టవలయును అప్పడు సమరసజ్ఞానము గల్గును ఈ నిర్విషయము గలుగనిచో బ్రహ్మనిష్ఠని తక్కిన సాధనలన్నియు అమృతములయినను విషము కలిసిన క్షీరాన్నాదులవలె దుష్టములయిపోవునని సత్యనిష్ఠులు మరువకయుందురుగాక! సంపూర్ణ గురుభక్తియు, దైవభక్తియు, సత్యధర్మనిష్ఠయు, అధర్మములో భీతియు గలవారికే యిది సాధ్యము గాగలుగును వీరు తగని స్థలములో ఒక నిమిషమైనను నివాసము చేయకూడదు ఇదే దీనిలో గల గూఢమైన మర్మము మరియు, ఏదో యొక ప్రయత్నముచే దేహమునకు బ్రహ్మచర్యము సంరక్షించిన చాలదు మనస్సు లోనుగూడ బ్రహ్మచర్య సంరక్షణ గలిగియుండవలెను ఇది మరింత మహాకష్టతరము అయితే ఇది సాధించినప్పడు మనస్సు మలినపడినను అప్పడప్పడు మనస్సును తానే శిక్షించుకొని పవిత్రభావములోనికి తీసుకొనిపోవలెను ఆ శిక్ష

దైవప్రార్థనయు, ధ్యానమును అగును శుష్కోపవాస వ్రతముగూడ వానిలో గలుపవచ్చును ఇక యీ బ్రహ్మచర్యము పురుషుల కేలాగున చెప్పబడినదో స్త్రీలకు గూడ ఆలాగున నుండునని గ్రహించవలయును దీనియొక్క సంరక్షణ ప్రతిఫలము ఉభయులకును ఒక్కేవిధముగానే గల్గును దీనిని విశదీకరించిన యెనిమిది విధములుగా నుండును అయితే మనోవాక్కాయ కర్మలలో పై అయిదును నిగూఢము లయియున్నవి ఏకాదశ్యాది వ్రతముల ఫలము ఏలాగున పురుషులకు చెప్పబడియున్నదో స్త్రీలకును ఆలాగుననే యుండును గదా! బ్రహ్మచర్యమును అటువంటిదే ఈ బ్రహ్మచర్యవ్రతము నైష్ఠిక బ్రహ్మచర్యమనియు, విధుర బ్రహ్మచర్యమనియు, గృహస్థ బ్రహ్మచర్యమనియు త్రివిధము నైష్ఠిక బ్రహ్మచర్యమనగా వివాహము లేనిది విధుర బ్రహ్మచర్యమనగా, వివాహితులయిన తర్వాత భార్యభర్తలలో ఎవరికైన వియోగము గల్గిన తర్వాత గల బ్రహ్మచర్యము, లేక భార్యాభర్త లుభయులుండియు పవిత్రస్థితిని బొందుటకు బ్రహ్మచర్యవ్రతము సలుపుట గృహస్థబ్రహ్మచర్యమనగా, ఋతుకాలములో మాత్రము సత్సంతాన బుద్ధితోగూడుట యనంబడును ఇతరకాలములో బ్రహ్మచర్య వ్రతులయి యుండవలయును కనుక వీరు ముగ్గురును బ్రహ్మచారులే అయితే నైష్ఠికత్వమునకును, గృహస్థత్వమునకును చాల భేదము గలదు మానవజన్మములో ఇహమునకుగాని, పరమునకుగాని యేదైన సత్తయుండిన అది బ్రహ్మచర్యములోనే యుండును దీనితో సహా బ్రహ్మభావనలో మునిగియుండవలయు ననిగూడ గ్రహించవలెను అదియే అమృతత్వమును గలుగజేసెడు బ్రహ్మచర్యవ్రతము

332 తనలోగల దోషములను, ఇతరులలో గల సుగుణములను చెప్పువాడు ఉత్తముడు

తనలోగల దోషగుణములను, ఇతరులలోగల గుణదోషములను సమముగా విమర్శన చేయువాడు మధ్యముడు

తనలో గల సుగుణములను, ఇతరులలోగల దోషములను చెప్పువాడు

అదముడు

తనలో లేని సుగుణముల నారోపించియు, ఇతరులలో లేని దుర్గుణములను కల్పించియు చెప్పువాడు అదమాదముడు తనలోను, ఇతరులలోనుగల గుణదోషములను ఎవరితోను ప్రస్తావింపక తనయొక్క స్వరూపస్థితిలో సదా నిలుచుటకు ప్రతిబంధములైన వృత్తులు గల్గియుండిన దానిని రహితమొనర్చుటకు నిరంతరము ప్రయత్నించుకొని, దైవభావనలో సదా నిలుచుటకు జూచువాడు ఉత్తమోత్తముడు గుణదోషములచే స్పర్శింపబడనివాడు జీవన్ముక్తుడు

333 ఎవనికి సత్యధర్మములు రెండు పాదములుగా నేర్పడునో, ఎవనికి త్యాగవైరాగ్యములు రెండు హస్తములై యేర్పడునో, ఎవనికి శ్వాసనిశ్వాసములు రెండును హంసమంత్రమై లేక తారకమంత్రమై యేర్పడునో, ఎవనికి ఆత్మలో పరమాత్మభావన గలిగియుండునో అట్టివాడు మాత్రమే నిరంకుశసుఖము ననుభవింపగల్గును, నిర్భయుడై ప్రవర్తింపగలుగును, నిరావరణము గలిగి తేజోరాశియై వెలుగగల్గును

334 ముగ్గురు రోగులు గలరు, వారిలో ఒకడు ఔషధసేవ మాత్రము చేయుచున్నాడు కాని పథ్యముగా నుండలేదు ఇంకొకడు పథ్యముగానే యుంటున్నాడు కాని ఔషధసేవ చేయుట లేదు వీరిద్దరికిని రోగము కుదురదు మరియొకడు ఔషధసేవయును పథ్యమును గల్గియున్నాడు ఈయనకు మాత్రమే రోగశమనము గల్గియుండును ఆలాగున భూలోకములో కొందఱు బ్రహ్మోపాసన చేయుదురు గాని ధర్మాచరణము లేక యున్నారు వేఱుకొందఱు కర్మకాండపరమగు ధర్మాచరణగలవారై యున్నారు గాని బ్రహ్మోపాసన చేయుట లేదు వీరిరువురకును భవరోగము శమింపదు బ్రహ్మోపాసనతో గూడ శమదమాది సత్యశౌచగుణములు గలవారు మాత్రమే అజ్ఞానరోగరహితులు గాగలరు

335 ఒకడు తనయొక్క ముఖమునకును, దేహమునకును కురూపముగాను, వికారముగాను మసిపూసుకొని మంచి అద్దముయొక్క

ముందుకు పోయి నిలిచెను అప్పుడు తనయొక్క నీచభావమును శుద్ధపరచుటకు అద్దమును శుద్ధపరచిన చక్కపడునా ? లేదు గదా ! ఆలాగున తనయొక్క యాచరణానుష్ఠానక్రియలను శుద్ధపరచ జూడక ఆత్మశుద్ధికొరకు జప, తపో, వ్రతాదులను చేయువాడు తనయొక్క ముఖమును, దేహమును పరిశుద్ధ మొనర్చక దర్పణమును నిర్మలపరచచూచెడి మూఢునివంటివాడగును క్రియాశుద్ధి లేనివారికి జ్ఞానసిద్ధి గలుగదని శాస్త్రము చెప్పెడు రహస్యమిదియే

336 ధనవృద్ధుడు గాని, విద్యావృద్ధుడు గాని, వయోవృద్ధుడు గాని, అధికారవృద్ధుడు గాని యైనను తత్త్వబోధకుడగు పరమగురువు దగ్గర బాలభావము గలిగి వర్తించవలయును అట్టివారికి మాత్రమే గురుబోధ సార్థకమగును

337 ఆహార పదార్థము దేహమునకు భిన్నమైన దైనను చక్కగ నమలి భుజించి బాగుగ జీర్ణమైన యేలాగున దేహములో కలిసిపోవునో ఆలాగున ధ్యానము చేయువారు ధ్యేయాకారములో ఐక్యమయ్యే లాగున ధ్యానము చేయవలయును అనగా భగవన్మయ మయ్యేలాగున ధ్యానము కావలయును అప్పడు మాత్రమే శివజీవైక్య మను అవస్థ గలుగును దీనినే బ్రహ్మాత్మైక్య జ్ఞానమనియు, జీవేశ్వరుల ఐక్యమనియు తెలియవలయును లెస్సగా జీర్ణము గాని ఆహారపదార్థము ఏలాగున దేహములో ఐక్యము కాదో, ఆలాగున ధ్యానములో లయము కాని వారు దైవములో ఐక్యము కారు అనగా దైవాత్మజ్ఞానము వీరికి కలుగదు ధ్యానములో జ్ఞేయాకారస్థితి కలుగవలయును దేహమును, ఆహారపదార్థమును పంచభూతాత్మ కములు గనుక ఐక్యము గలుగుచున్నది ఆలాగున జీవేశ్వరు లుభయులును దైవస్వరూపులు గావున ఐక్యము గలుగును అనగా దైవైక్యబోధము గలుగును

338 లోకసేవ విషయమై ప్రవర్తించవలయునని సాధారణ జనులు చెప్పచుందురు వారి ఆశయ మేమన, వారు చేయుచుండు కార్యమే

లోకసేవ యనియు, అదే అందరును ఆచరించవలయు ననియే అట్లు తలంచుట కూడా ఒకవిధమగు సంకుచిత భావమే లోకసేవ ఒకేవిధము గాదు అది అనేకవిధములుగా నున్నది ఎట్లన, తన యొక్క స్వాత్మసుఖమునకు నేత్రమొకటి యుండిన చాలునా? లేక కర్ణమొక్కటి యుండిన చాలునా? లేక నాసిక ఒకటి యుండిన చాలునా? అలాగున నాసికయును, జిహ్వయును, పాణియును, పాదమును, ఉపస్థమును, గుదమును,ఒక్కొక్కటి యుండినచాలునా? అలాటి ఇంద్రియములన్నియు నుండవలయును అట్లు గాక పై చెప్పిన యింద్రియములలో ఒక్కొక్క యింద్రియమును నేనే శ్రేష్ఠమనియు, నేనేయెక్కువ ఆత్మసేవ చేయువాడననియు, నాచేతనే ఆత్మసుఖము కలుగుచున్నదనియు, నేను లేనిచో దేహనిర్వహణము జరుగదనియు తలంచునట్లుండును కనుక దైవసేవచేయుటయు, చేయించుటయు కూడ గొప్ప లోకసేవ యగును అలాగున విద్యయున్న, ఆరోగ్యము కొరకు ఔషధమును ఆత్మ,శుద్ధికొరకు భక్తిజ్ఞాన వైరాగ్యములను అనుష్ఠించుటయు, అనుష్ఠింప చేయించుటయు గూడ లోకసేవ యగును సాధకులకును, బీదలకును అన్నదాన మొనర్చుటయు గొప్ప లోకసేవ యగును ఇంద్రియము లన్నియు గలిగియుండినను ప్రాణము లేనిచో ఏలాగున నిరర్థకమో ఆలాగున అన్ని సేవలు చేసి నను ఈశ్వరసేవా పరమగు దైవజ్ఞానము లేనిచో జీవితము నిరర్థకమగును ఇట్టి విశాలభావము గలుగునప్పుడే అభిమానము నశించును అట్లు కానిచో జనులు దురహంకారు లగుదురు మరియు లోకక్షేమము కొరకు సూర్యరశ్మి ఒక్కటి మాత్రము చాలునా? లేక వర్షముమాత్రము చాలునా? లేక వాయువు మాత్రము చాలునా? పృథ్విమాత్రము చాలునా? ఇవి యన్నియు సమానముగా నుండిన మాత్రముగదా లోకసౌఖ్యము గలుగును! వీనిలో నేను ఎక్కువ వాడననియు తక్కినవి తక్కువ యనియు తలంచుట పంచభూతములందెంత పొరబాటో పై చెప్పినదియు నాలాగుననే యుండును మరియు ఒకరాష్ట్ర సంరక్షణలో విద్య లేనిచో జనులు మృగప్రాయులగుదురు గదా! ఆరోగ్యమునకు తగిన

ఔషధములును, వైద్యులును లేనిచో మనుజులు రోగులగుదురు గదా! రాష్ట్రసంరక్షణకు భటులు లేనిచో దుష్టులు అరాజక మొనర్చుదురుగదా! పాలకులు అనగా ఉద్యోగస్థులు లేనిచో కార్యములు సక్రమముగా జరుగవుగదా! కనుక వీరందరును రాజసేవకులై యుందురు వీరిలో ఒక్కొక్క సంఘమువారు మేమే రాజ్యసంరక్షకుల మని అభిమానించుట ఎంత సంకుచితభావమో, అలాగున మేమే లోకసేవకులము అని చెప్పవారి వాస్తవస్థితి కూడా ఉండును అయితే ప్రకృతియొక్క మహిమ తాము చేయునదే తప్పని సరిగా వుండే లాగున కనుపింపచేయును వాస్తవము విచారించిన జనులకు దేనికి వుపయోగము లేనిదని తలంచెడు రాత్రియు, సుషుప్తియు కూడ గొప్ప యుపయోగకరమయ్యే వున్నది అవి లేనిచో మనుష్యులు సుఖమును పొందజాలరు అలాగున దేనికి ఉపయోగము లేని జనులు భూమిభారముకొరకు కొందరు కలరని సామాన్యులు తలంచినను, వాస్తవముగా వారును ఉపయోగపరులయ్యే వున్నారు సర్వేశ్వరుని సామాన్యజనులు తెలిసికొనజాలరు

339 ఇనుము కాచి పదునిచ్చిన అప్పడు ఉక్కు అగును దానివలన చేయబడిన కత్తి తీక్ష్ణతగలిగి అన్నిటిని తెగనరక గలుగును వట్టి యినుముతో చేసిన కత్తియైనచో తెగకపోవుటయే గాక ముఖము మడిగిపోవును అలాగున గురుకుల వాసముచేసి సుశిక్ష నొందినవారికి ప్రపంచములో అడ్డు లేదు వీరు మనోవృత్తు లను తీగలను తెగద్రుంచగలరు

340 లేప్రాయములో ఎండచే వాడిన పైరయినచో మరల వర్షము కురిసినప్పడు చక్కగ పెరిగి మంచి ఫలితమిచ్చును నీడలో గల పైరైన అంత ఫలమివ్వజాలదు అలాగున మంచి గురుశిక్షణము నొంది వ్రతధర్మనిష్ఠ గలవారికి అఖండైక జ్ఞానము కలుగును లేనివారి జ్ఞానము సామాన్యముగానే యుండును

341 ఓ జనుడా! ఒక తామ్రఖండమును సన్నని తంతిగా అనగా తీగెగా మార్చవలసి యుడిన అగ్నిలో కాచి అనేకసారులు స్థూలసూక్ష్మ అతి

సూక్ష్మములగు అచ్చులలో పెట్టి లాగవలసివుండును లేనిచో సన్నని తీగగా చేయ వీలు గాదు అదేరీతిగా మీ మనస్సును అతి సూక్ష్మముగా జేయవలసియుండినను అనేక మార్పులు గలుగవలసి యుండును ఈ మార్పు ఆధ్యాత్మిక సాదనలచేతను, సాత్త్విక, ఆహారనియమముచేతను, ప్రబోదముగల గురువుయొక్క శిక్షణచేతను చెందవలసియుండును

342 సాధారణముగా కొందరు భక్తులును, తపస్వులును, బ్రహ్మనిష్ఠులును, యోగులును కొంతవరకు బ్రహ్మవిషయములో కాలము గడుపునప్పడు గొప్ప గొప్ప కార్యములు చేయ తలంపు గలవారగుదురు అయితే కొందరికి అది జరుగక పోవచ్చును అప్పడు తనయొక్క యిష్టదైవమందును, గురునియందును బ్రహ్మనిష్ఠయందును ప్రీతి కలుగకపోవచ్చును అయితే కార్యము జరుగక పోవుటకు తగిన కారణము మీలో లేకపోలేదు అది మీరు కనుగొనుట లేదు అట్టి మహత్కార్యము నిర్వహించుటకు తగిన యోగ్యత మీకు ఇంకను కలుగలేదనియే తలంచవలయును అట్టిదానికి ఎంత ఓర్పును, శాంతియును, కరుణయును, విరక్తియును, భక్తియును, జ్ఞానమును, ధర్మబుద్ధియును, త్యాగమును, సమత్వమును, ఉదారస్వభావమును, విశ్వప్రేమయును కలిగి యుండవలయునో అవి యన్నియు మీయందు గలవా యని యోచించుకొనుడు మీలో నెన్నియో దురాశలు, కోపము, లోభము, భేదస్వభావము, స్వార్థబుద్ధి, అసహనగుణము, సర్వమానవ సోదరాభావము, ఇతరుల సుగుణములను సహింపలేనితనము మొదలైనవి గలవా అని చూచుకొనుడు ఉన్నతోద్యోగము కావలసివుండిన ఉన్నతవిద్యయొక్క పరీక్షలో నుత్తీర్ణుడు కావలసివుండును గదా! ఈ సంగతి మీరు మరచిపోయినారు అదే దీనికి కారణము మీకు తగిన యోగ్యత కలిగినపుడు మీరు అనుకొన్న కార్యము కూడ సిద్ధమగును అప్పడు చేయగలరు ఒక్కపైసా చేతియందుండినప్పడు దానిని త్యాగముచేయ నొల్లనివాడు ఒక్కరూపాయి లభించిన యెట్లు త్యాగము చేయగలుగును? ఈశ్వరుండు

ఔషధములును, వైద్యులును లేనిచో మనుజులు రోగులగుదురు గదా! రాష్ట్రసంరక్షణకు భటులు లేనిచో దుష్టులు అరాజక మొనర్చుదురుగదా! పాలకులు అనగా ఉద్యోగస్థులు లేనిచో కార్యములు సక్రమముగా జరుగవుగదా! కనుక వీరందరును రాజసేవకులై యుందురు వీరిలో ఒక్కొక్క సంఘమువారు మేమే రాజ్యసంరక్షకుల మని అభిమానించుట ఎంత సంకుచితభావమో, ఆలాగున మేమే లోకసేవకులము అని చెప్పవారి వాస్తవస్థితి కూడా ఉండును అయితే ప్రకృతియొక్క మహిమ తాము చేయునదే తప్పని సరిగా వుండే లాగున కనుపింపచేయును వాస్తవము విచారించిన జనులకు దేనికి వుపయోగము లేనిదని తలంచెడు రాత్రియు, సుషుప్తియు కూడ గొప్ప యుపయోగకరమయ్యే వున్నది అవి లేనిచో మనుష్యులు సుఖమును పొందజాలరు ఆలాగున దేనికి ఉపయోగము లేని జనులు భూమిభారముకొరకు కొందరు కలరని సామాన్యులు తలంచినను, వాస్తవముగా వారును ఉపయోగపరులయ్యే వున్నారు సర్వేశ్వరుని సామాన్యజనులు తెలిసికొనజాలరు

339 ఇనుము కాచి పదునిచ్చిన అప్పుడు ఉక్కు అగును దానివలన చేయబడిన కత్తి తీక్ష్ణతగలిగి అన్నిటిని తెగనరక గలుగును వట్టి యినుముతో చేసిన కత్తియైనచో తెగకపోవుటయే గాక ముఖము మడిగిపోవును ఆలాగున గురుకుల వాసముచేసి సుశిక్ష నొందినవారికి ప్రపంచములో అడ్డు లేదు వీరు మనోవృత్తు లను తీగలను తెగద్రుంచగలరు

340 లేప్రాయములో ఎండచే వాడిన పైరయినచో మరల వర్షము కురిసినప్పడు చక్కగ పెరిగి మంచి ఫలితమిచ్చును నీడలో గల పైరైన అంత ఫలమివ్వజాలదు ఆలాగున మంచి గురుశిక్షణము నొంది వ్రతధర్మనిష్ఠ గలవారికి అఖండైక జ్ఞానము కలుగును లేనివారి జ్ఞానము సామాన్యముగానే యుండును

341 ఓ జనుడా! ఒక తామ్రఖండమును సన్నని తంతిగా అనగా తీగెగా మార్చవలసి యుడిన అగ్నిలో కాచి అనేకసారులు స్థూలసూక్ష్మ అతి

దృశ్యభావములుగాని గోచరము గాకూడదు ధ్యేయము మాత్రమే గోచరించవలయును అనగా జ్ఞేయము మాత్రము లేక దైవము మాత్రము గోచరించవలసినదే గాని మరి యేమియు హృదయములో స్ఫురింపరాదు స్ఫురించిన ఆంతరదృష్టి యికను మూయబడలేదని తెలిసికొనవలయును

345 కృతజ్ఞత గలవారిపైన సర్వేశ్వరుడు కృప గలవాడై యుండును ఒక్కసారి మంచినీళ్ళు ఇచ్చినవారికి కనీసము పదిసార్లైన ఆవుపాలు మధురముతో జేర్చి యివ్వవలయు ననెడి కృతజ్ఞతా బుద్ధి గలిగియుండవలయును చూడుడు, కొద్ది ఖర్చుపెట్టి త్రవ్విన నూయి గాని, కోనేరుగాని మంచినీళ్ళను మంచి యూటయును గలిగియుండిన ఆబావి తటాకములు అనేకజనులకు అనేక వేల సంవత్సరములు మంచినీటినిచ్చి సంతోషపరచునది చూచుటలేదా ? లేక కొంతకాలమే పోషించిన మామిడి, పనస వృక్షాదులు ప్రత్యుపకారార్థముగా నెన్నియో సంవత్సరములు ఫలములను, పుష్పములను, పత్రములను, నీడను ఇచ్చి కృతజ్ఞత చూపునది కనుపించుట లేదా? జడములే అలాగున కృతజ్ఞత గలవై యుండగా చైతన్యస్వరూపులగు మనుజులు ఎంత కృతజ్ఞత గలవారలై యుండవలయునో యోచించుకొనుడు అట్లు చేయక నిర్జన స్థలములో గాని, చవిటిభూమిలో గాని త్రవ్విన కూపతటాకాదులవలె దీనావస్థను కలుగచేయకుడు వాటిలో రాళ్ళు, రప్పలు, చెత్తలు, చాములు, పేడలు, పెంటలువేసి మూసి వేయబడునేగాని మరి యేయొక్క యుపయోగములేని హీనావస్థకు పోవకుడు చవిటిభూమిలో వృక్షపోషణము అలాగుననే నీచావస్థను పొందివుండును కృతఘ్నుడు కృతార్థుడు కాజాలడు అతనికి ఎచ్చోటను దుర్గతియే , సద్గతి కలుగజాలదు

346 ఏకార్యములకైనను తనయొక్క సొంతధనము ఖర్చుపెట్టుటకన్న కనీసము పరులు ఇచ్చిన ధర్మధనమును గాని, ఉచితముగా నిచ్చినవి యైనను పదిరెట్లు అధికజాగరూకతతో వాడవలయును అప్పడే ధర్మకార్యము లన్నియు నిర్విఘ్నముగా జరుగగలవు జ్ఞానులకు పరము, సొంతము అని బుద్ధి గలిగి

వుండదు మరియు తనయొక్క సొమ్మును వ్యక్త ఖర్చుపెట్టినచో అంత ఎక్కువ పాపములేదు గాని, పరుల సొమ్మును వ్యర్థముగా ఖర్చు పెట్టుటలోను, పెట్టించుటలోను పాపముకూడ గలుగుచుండును ఎట్లన తనయొక్క భార్యను గాని, బిడ్డలనుగాని దండించిన అంత విరోధము లేదు గాని, ఇతరుల భార్యలనుగాని, పిల్లలనుగాని బాదించిన ఎంత అపరాదమో, అపాయమో, కష్టమో దానిని జ్ఞాపకములో నుంచవలయును ఇట్టి సుబుద్ధి గలవారికి ఎచ్చటను సౌఖ్యమే గలుగును

347 దొరికినదానితో సంతుష్టి గల్గి అది యీశ్వరప్రసాదమో, లేక కర్మఫలమో యని నమ్మి నిరాశగల్గి దైవనియతి ననుసరించి వర్తించి సదా సంతుష్టి గలవాని దగ్గర ఏకచక్రాధిపత్య పదవి తలవంచుకొని సిగ్గునొందును

348 దృశ్యసంకల్పము లేమియు హృదయములోనికి రానీయక, దృక్కగు ఆత్మయందు రమించుకొని సదా ప్రసన్నవరమగు ఆత్మసుఖములోనుండు యోగిసన్నిధిలో స్వర్గము సిగ్గునొంది క్షిన్నభావమును వహించును

349 బ్రహ్మాకార భావములో సదా ఓలలాడి యీ జగత్తంతయు బ్రహ్మమయంబుగా దలంచి బ్రహ్మాకారవృత్తిగల బ్రహ్మజ్ఞాని సన్నిధానములో బ్రహ్మాదిలోకత్రయము లజ్జగలదై తనయొక్క హీనభావమును గురించి వ్యాకులము గలదియై యుండును

350 భగవంతుని యాజ్ఞను పరిపాలించుటయే జీవుని ధర్మము భగవంతుడు వస్త్రములు తయారుచేసి జీవులకు ఇచ్చుట లేదు కాని దూదిని సృష్టించుచున్నాడు భగవంతుడు అన్నమును వండి యిచ్చుట లేదు, కాని ధాన్యములను సృష్టించియున్నాడు అతడు గృహమును కట్టియిచ్చులేదు కాని గృహోపయుక్తములగు కఱ్ఱ, రాయి, మృత్తికలను సృష్టించియున్నాడు దూదిని బట్టలుగా చేయుటకును, ధాన్యమును పండించి వండుటకును, కఱ్ఱ మొదలగు వానిచే గృహమును నిర్మించుటకును తగిన బుద్ధి జీవులకు

గలుగచేసియున్నాడు

351 ఏవృక్షమైనను కొంత కాలము ఒకే స్థలములో స్థిరముగా నుంచక అప్పుడప్పుడు గుంటలను మార్చుచుండిన యేలాగున చక్కగ చిగురించి పుష్పించి బలముగలదై ఫలమును ఇవ్వజాలదో ఆలాగున బ్రహ్మనిష్ఠ చేయువారు గాని, తపస్సు చేయువారు గాని, యోగమును అభ్యసించువారు గాని కొంతకాలము ఒకేస్థలములోనే యుండి నిష్ఠ సాధించవలయును లేనిచో యోగ, ధ్యాన, తపసిద్ధులు గలుగజాలవు

352. విషము గ్రక్కుచు పడిగె యెత్తుకొని వచ్చెడు నాగుపామైనను దాని ఎదుటకు గరుత్మంతుడు వెళ్లిన ఏలాగున పారిపావునో లేక పడిపోవునో, అట్లే మహాబలముతో పొడుచుటకు వచ్చెడు ఏనుగు అయినను దానిముందుకు సింహము వచ్చిన ఏలాగున పరుగెత్తిపోవునో లేక అణగిపోవునో, ఆలాగున సాధకుని అంతఃకరణములోనికి ప్రకృతిగుణములు ప్రవేశించునపుడు అప్రాకృత దైవగుణములను దెలిపెడు వేదాంతవాక్యములు గాని, శ్లోకములు గాని, పద్యములు గాని, భగవద్విషయకీర్తనలు గాని జ్ఞాపకము చేసుకొని చదువుచుండిన, పాడుచుండిన విషయవృత్తులు నివృత్తి కాగలవు కావున అట్టి పవిత్ర శ్లోకాదులను రూఢిగ ముఖస్థము చేసుకొనవలయును

353 సాధకుడా ! సోదరుడా! నీవు త్యాగివై బ్రహ్మనిష్ఠ చేయ తలంచినచో ముందుగానే నీయొక్క ఉదరమును జాడిగా చేసికొనుము.జాడిలో ఏ పదార్థము పెట్టినను పాత్ర చెడిపోదు వాసన కూడా ఆ పాత్రను అంటదు అగ్ని ద్రావకము కూడా దానిలో పెట్టెదరు తక్కిన యే పాత్రలో అగ్నిద్రావకము పెట్టినను పాత్ర ద్రవించును అనగా పరమత్యాగి గానిచో బ్రహ్మనిష్ఠ కుదురదు కొన్ని ప్రదేశములలో గోధుమరొట్టెయు, కొన్ని ప్రదేశములలో జొన్న, మొక్కజొన్న, రాగి మొదలగువాని రొట్టెలును, పైవాని అన్నమును, సంగటియును మాత్రమే దొరకును కొన్ని స్థలములలో పచ్చిబియ్యపు అన్నమును, ఉప్పుడు బియ్యపు అన్నము మాత్రమే లభించును

కావున నివి అన్నియు నీవు అభ్యాసము జేసుకొనవలయును లేక నీవు సుకుమార భోజనము, పాలు, నెయ్యి, పండ్లు మాత్రము సుఖముగా భుజించి శీలించినచో ఇవి దొరకని స్థలములలో కష్టపడగలవు మరియు ఎక్కువ భోజనాది సౌఖ్యములు మంచి బ్రహ్మనిష్ఠ స్థలములో నుండవు ఎక్కువ భోజనాది సుఖములు గల స్థలములలో బ్రహ్మనిష్ఠ తగ్గియుండును అచ్చట భుక్తిప్రియులు ఎక్కువ చేరుదురే గాని, ముక్తిప్రియులుండరు ఏలన బాహ్య సౌఖ్యములను నిజమైన బ్రహ్మనిష్ఠులు దగ్గర చేరనివ్వరు ఒకవేళ సౌఖ్యమునకు అనుకూలముండినను వారు చేయరు అన్నసౌఖ్యమును కోరువారు విరక్తులు కారని వారికి బాగుగా తెలియును కావున నీవు అన్నమును ఆశించి జ్ఞానమునకు దూరుడవు గాకుము మరియు శిరస్సు కూడ దీపపుశెమ్మె (ప్రమిద)వలె చేయ వలయును దానియందు ఏ చమురుబోసినను మండుచుండును ఆలాగున మంచినీటిలోను, ఉప్పనీటిలోను తెల్లవారుజామున స్నానము చేసుకొన అభ్యసించుము అట్లైన నీకు ప్రపంచములో ఎచ్చటను ప్రతిబంధము లేదు సుమీ ! లేనిచో నీవు మాయను జయింపజాలవు ఆలాగున వట్టినేలలోను, గాలిలోను, మంచులోను శయనించి నిద్రించి శీలింపుము షడ్రసోపేతములైన అన్నాదులును, స్నానమునకు వేడినీళ్ళును, శయనించుటకు మెత్తని పానుపును కావలయునని నీవు నిరీక్షించియుండిన నీకును, పంజరములో పడివుండు పక్షికిని ఏలాటి భేదమును గలిగియుండలేదని తెలిసికొనుము కావున ఇవి అన్నియు గృహస్థాశ్రమములో నుండునప్పుడే, సమస్తసౌఖ్యములు గలిగియుండునప్పుడే శీలించుకొనుము లేనిచో నీకు నిర్భయత్వము గలుగదు అప్పుడు త్యాగము జనింపదు త్యాగము లేనిచో శాంతియును, మోక్షసౌఖ్యమును గలుగవు

354 రసాయన ప్రయోగములయందుగాని, జ్యోతిషాది గణితములయందుగాని మంచి నేర్పరితనము లేనివారు అట్టివిషయములో మంచి యోగ్యత గలవారియొద్ద తయారైనచో ఏలాగున

పరమప్రయోజకులు గాగలరో, అలాగున బ్రహ్మనిష్ఠాధ్యానయోగాదులయందు నిలకడ గలుగనివారు మంచి బ్రహ్మనిష్ఠులయొక్కయు, బీదలయొక్కయు సేవ చేయుచుండిన కొలదికాలములో అన్ని దోషములు తొలగి మంచి బ్రహ్మనిష్ఠులు గాగలరు బ్రహ్మనిష్ఠకు ప్రతిబంధములు రోగము, దారిద్ర్యము, మనోనిశ్చలత్వము లేకపోవుట, ధ్యానములో నిలకడ గలుగకపోవుట, నిర్విషయము గలుగక యుండుట మొదలైనవిగా నుండును

355 ఇప్పడు గల కోడండ్రందరును కొంతకాలమునకు అత్తలు గాగలరు ఇప్పడుండు కొడుకులందరు కొంత కాలమునకు తండ్రు లగుదురు ఇప్పడుండు యువరాజు లందరును మఱికొంతకాలమునకు సార్వభౌములు గాగలరు అలాగున నిప్పడుండు శిష్యులందరును మరికొంత కాలమునకు గురువులు గాగలరను తత్త్వము జ్ఞప్తిలో నుంచి ముముక్షువులు ప్రయత్నపరులై యుండవలెను అట్లైన మాత్రమే వారు గొప్ప స్థితికి రాగల్గుదురు లేనిచో వారు తుచ్ఛులై పోవుదురు ఇప్పడుండు అత్తలందరును, తండ్రులందరును, సార్వభౌములందరును ఒక కాలమున కోడండ్రుగాను, పుత్రులుగాను, యువరాజులు గాను నుండినవారే అలాగున ఇప్పడుండు మహాగురువులు గూడ ఒక కాలము మీవలె విద్యార్థులై గురుసేవాపరులై యుండిన శిష్యులని మరువకుడు ఇట్టి విచారము మీకు ఉన్నత లోకప్రాప్తిని గలుగచేయును

356 సేవయొక్క మహిమ చాల గొప్పది గోవుకు ఆహారమైన తృణాదులు దివ్యమైన క్షీరమై, దేవతలకును, మహాపురుషులకును మహాప్రీతిని గలుగచేయుచున్నవిగదా! అట్లు గానిచో ఆతృణాదులు దేనికిని ఉపయోగము లేక మురిగి మట్టియై పోవుచుండును అలాగున లోకసేవ గాని, మహాపురుషుల సేవగాని గలిగిన వారి యాత్మకు దివ్యలోక ప్రాప్తికి అర్హత గల్గుచున్నది లేనిచో మృత్యువుచే బాధింపబడి, నానావిధమగు దీనావస్థలను జెందుచుండును

357 ఓ సాదకుడా! నిన్ను గొప్ప మహాపురుషులు దగ్గర చేర్చి ప్రేమింపకపోయినచో మనస్సులో విసుగు గలిగి ప్రయత్నము మానకుము

గడ్డి మొదలైన వానిచే మహాత్ముల కుపయోగము లేకపోవుటచే వానిని వారు ప్రేమింపరు అయితే అవి గోవుల కాహారమై క్షీరమై ఘృతమై మారునప్పడు, మహనీయులందరును దానిని ఎంతో ప్రేమించి తమయొక్క హృదయములో పెట్టుకొనుచుందురు అనగా భుజింతురు ఆలాగున ఒకడు పుణ్యాత్ముడై సజ్జనప్రీతికి అర్హత గలుగవలసియుండిన చాల పరిణామము పొందవలసి యుండును కావున నీవు ఇప్పడుండు స్థితికి తగిన వారి ప్రేమను సంపాదించుకొని ప్రయత్నపరుడవై సేవ సలిపి ధ్యాననిష్ఠ చేయుచుండుము యత్నము మాత్రము మానకుము గడ్డి మొదలైనవి పరిణామము గలిగిన తర్వాత పాలు, పెరుగు, నెయ్యిగా మారుచున్నవని జ్ఞాపకములో నుంచుకొనుము ఆలాగున నీవు సేవలోను, సాదనలోను చాల నలుగవలసియుండును సుమీ!

358 వంటకముయొక్క రుచిని గురించి వంటవారి నడుగ నక్కర లేదు భుజించువారిని గనుగొన్న చాలును ఆలాగున ఆచార్యులయొక్క యోగ్యతనుగురించి వారినడిగి కనుగొన నక్కరలేదు అంతేవాసుల (శిష్యులను) జూచిన తెలిసి పోవుచుండును

359 బేలుదార్లు అనగా ఇల్లు కట్టువారు మహారమ్యములగు హర్మ్యములు నిర్మింతురు అయితే పాపము వారు దానిలో నివసించి సుఖమును పొందుట లేదు వారి నివాసము చిన్న పూరిండ్లలోనే ఆలాగున అనుష్ఠానములేని వేదాంతులు కొందరు, మహామనోహరముగ నుపన్యాసముల నిచ్చుచుందురు గ్రంథములును గూడా వ్రాయుచుందురు అయితే పాపము దానిలోగల దివ్యసుఖము వారనుభవించుట లేదు అది అనుష్ఠానము గల్గి భక్తులై, విరక్తులైన ముముక్షువులే అనుభవించి సుఖించుచుందురు

360 సముద్రము దాటుటకు ఓడగాని, సేతువు గాని, విమానము గాని యేదైన నొకటి యెట్లుండవలసియుండునో, ఆలాగున ఓ సాధకుడా! నీవు ఏదైన నొకదృఢమగు వ్రతము అనగా ధర్మము గల్గియుండవలెను

దానియం దేలాటి లోపమును గలుగరాదు అది యుండిన నీకు నీయందే ఒక విధమగు ధైర్యమును, సంతోషమును సదా గల్గియుండును అట్టి వ్రతము నిన్ను సమస్త ఆపత్తులనుండి రక్షించును ఎప్పుడైన ఆపత్తు గల్గునప్పుడు నీకు అది జ్ఞాపకమునకు రాగల్గును ఇట్టి పవిత్రధర్మముండగా మనకు ఎందు కాపత్తు గల్గును? అని అది నిన్ను శాంతి పరచును అట్టి దర్మ మేదైన యొకటి దృఢముగా లేనిచో మానవుడు తరింపజాలడు ఆపత్తులు వచ్చుటకు ముందుగానే మహాభయము గల్గును మనస్సు తల్లడిల్లును ఏదియు రక్షించుటకు మనకు లేదు గదా!ఏ అని భీతి గల్గును కావున గురుభక్తి యందుగాని, దైవభక్తియందుగాని లేక యేదైన యొక వ్రతమందుగాని దృఢము గల్గియుండవలెను అప్పుడు నీచెంత ధర్మదేవత నిలిచియుండి రక్షించును అది నిన్ను అన్ని విపత్తులనుండి కాపాడును ఇది దృఢముగా నమ్ముము దీనికి తారకమని గూడ పేరు గల్గియుండును ఇదే మనుష్యుల రక్షించెడు ధర్మదేవత

361 రాత్రికాలములో ప్రకాశమునుండి బయటికి వచ్చినప్పుడు కొంతసేపటివరకు కండ్లు కనుపించక కష్టముగా నుండును కొంత సమయము పోయిన మరల బాగుగ కనబడును అలాగున పరమత్యాగ మొనర్చి యింటినుండి బైటికి వచ్చు వారికి కొద్దిరోజులు కొంచెము కష్టముగా కనుపించవచ్చును అయితే కొన్ని రోజులు పోయిన పరమసౌఖ్యమును, మహాశాంతియును, అత్యధిక ప్రసన్నతయును గల్గును అయితే సత్యధర్మములు మీకు బాగుగ గల్గియుండవలయును

362. అత్యవసరముకొరకుండు ధనము ఎటువంటిదో మీ యొక్క కాలము అనగా సమయము అటువంటిదే అట్టి డబ్బును దుబార ఖర్చుచేసిన మీ యొక్క కార్యము ఏలాగున గూలిపోవునో అనగా మీయొక్క కృత్యము ఏలాగున జరుగదో, ఆలాగున సర్వేశ్వరుడు మీకిచ్చియుండు కాలమును దుర్వినియోగపరచుటగాని, వ్యర్థము చేయుటగాని చేసినచో, మీ యొక్క జీవితగమ్యమునుండి మీరు జారిపోగలరు సుమీ!

363 లేనిదానిని ప్రకటన చేసినచో ఉన్నది గూడ లేకపోవును ఈ కార్యము భక్తులును, యోగులును, బ్రహ్మనిష్ఠులును చాలజాగరూకులై గమనించవలయును అనగా లేని మహిమను వెల్లడి చేయకుము దానివల్ల రాబోవు మహిమ గూడ గలుగకపోవును ఎట్లంటివా, ఒకచిన్న యుద్యోగియైనవాడు తనకు లేని గొప్ప హోదా గలవానివలె నటించినచో శిక్షితుడగుట గాని, తగ్గింపబడుటగాని, గల్గునుగదా! కావున లేని మహిమలను, సిద్ధులను, అనుభవములను చెప్పకుము

364 కర్మకాండమును విడువకుము, కర్మలచే బద్ధులు గాకయు చూచుకొనుము అనగా ఆత్మ సంస్కారమునకు తగిన కర్మములను, అనుష్ఠానములను విడువకుము అయితే కర్మములచే గర్వపడకుము కర్మ శుద్ధమైనదైనచో, ఆత్మసంస్కారము గల్గునే గాని, మోక్షమునకు జ్ఞానమే కారణమగును పునాది గట్టితనము లేని మేడ కూలును కాని పునాది కొరకు అన్నియు ఖర్చు పెట్టకుము పై కట్టడము లేనిచో, నీకు నివాసమునకు స్థలము దొరకదు గదా! కాని పైన మాత్రము కట్టి పునాది గట్టిగ లేనిచో, అది కూలిపోవునని గూడ మరువకుము అనుష్ఠానము లేని జ్ఞానము కూలును జ్ఞానము లేని అనుష్ఠానము శాశ్వతసుఖమును గలుగచేయదు

365 అనేకత్వములో ఏకత్వమును కనుగొనుము అయితే యేకత్వములో నిలిచి అనేకత్వమును బొత్తిగ పోగొట్టకుము విషామృతములకు భేదము గలదు కాని దానిలోగల ఆకాశమునకు భేదము లేదను సంగతిగూడ మరువకుము ఇట్టి బోధము గలవాడే ఉపదేష్ట యగును అయితే జడమును నమ్మి చైతన్యమును వదలకుము అది దేహమును నమ్మి దైవమును మరచునట్లుండునని గూడ జ్ఞప్తిలో నుంచుకొనుము లేక అట్టిది జీవములేని శవమువంటిదే యగును అనేకత్వము స్ఫురింపకపోయిన మరల ఏమియు చేయనక్కర లేదు

366 విద్యగల్గియుండియు, జ్ఞానము లేనివానికంటె జ్ఞానముగల్గి విద్యలేనివాడే శ్రేష్ఠుడు ఏలన, ధనము గల్గియుండియు, రోగియై

యుండువానికన్న ధనము లేనివాడయ్యు ఆరోగ్యము గల్గి యుండువాడు శ్రేష్ఠుడుగాడా! పాపము! ధనము గల్గియుండియు, రోగియైనందున ఏసుఖమును అనుభవించుటకు లేకపోయినది గదా యను దుఃఖమతనిని బాధించుచుండును, జనులును చెప్పుచుందురుగదా! ఈ బాధ రోగము లేనివానికుండదు ఆరోగ్యసౌఖ్యముచే అతని హృదయము సదా ఆనందములో నుప్పొంగుచుండును అట్లే విద్యలేనివాడైనను, జ్ఞానము గల్గియుండిన సదా అతని హృదయము జ్ఞానానంద సాగరములో మునిగి యుండును

367 తాను ఆచరింపనిదియు, తనకనుభవము లేనిదియు నగు అభ్యాసమును, జ్ఞానమును, అనుష్ఠానమును ఇతరులకు బోధించుటయు, చెప్పుటయు ప్రమాదకరము అది యెప్పటికైనను అపాయమును గలుగజేయును అంతేగాక అది ఒకవిధమగు ఆత్మవంచకమే యగును అట్టిది కన్ను గనబడనివాడు నేత్రము గలవానివలె నటించుటయే యగును ఇది యెంతమాత్రము సత్యమని లోకము తెలుసుకొనుటకు ఎంతకాలము పట్టునో వీరియొక్క స్థితియు నంతే యుండును

368 తీవ్రముగ చదువుచుండు విద్యార్థు లేలాగున ఒక్కొక్క సంవత్సరములో ఒక్కొక్క తరగతి చదివి క్రమముగ ఉన్నతస్థానమును పొందుచుందురో అలాగున భగవద్భక్తులలో పూజార్చనాదులు ఎక్కువ చేయువారు కొంత తగ్గించి ప్రార్థన కీర్తనములలోనికి ప్రవేశింపవలయును ప్రార్థన కీర్తనము లెక్కువ చేయువారు కొంత తగ్గించి జపములోనికి ప్రవేశింపవలెను జపము ఎక్కువ చేయువారు కొంత ధారణా ధ్యానముల లోనికి జొరవబడవలెను ధారణాధ్యానము లెక్కువ చేయువారు ధ్యేయములోనికి అనగా జ్ఞేయములోనికి ప్రవేశించి అచ్చట నిలుకడ చేసికొనవలయును అనగా దైవాకారస్థితి నొందవలయును దానినే సమాధి యనిగూడ గ్రహించవలెను అచ్చట నిలిచి పై జెప్పిన అన్నిటిలోను కొంచెము ప్రవేశించి ప్రవర్తించవలయును అట్టైన మాత్రమే సామాన్యజనులకును,

భక్తులకును ఈశ్వర విషయములో ప్రవేశించుట కనుకూలమగును మహాపురుషులు, సిద్ధపురుషులు ఈలాగుననే ఆచరించిరి

369 గడగట్టి యెత్తులో సూక్ష్మమైన తంతిపై నడచుటయు, నర్తనము చేయుటయు సామాన్యమైన పనిగాదు అది బహుకాలాభ్యాసము చేతనే లభ్యమగును ఆలాగున జగద్వృత్తి గలుగక దైవభావములో నిలుచుట గూడ సులభమని తలంపరాదు దానికి సులభమార్గము జపమే సరియైనది అయితే ఈ విషయములో జపమాచరించు నప్పడు మాల త్రిప్పటలో మనస్సు నిలిచి పోవునని కొందఱు చెప్పచు జపమును చేయనీయక కేవల స్వరూపజ్ఞానములో, అనగా దైవభావములో నిలకడ గలిగేలాగున అభ్యసించుకొనవలయునని తెలుపుదురు అది అంత శ్రేష్ఠమైన మార్గము గాదు జపము క్రమముగా వాచికము, ఉపాంశువు, మానసికమని మారును అప్పడు సామాన్యమానవులకు గూడ సులభముగా మనస్సాక్షియగు నాత్మలో (బ్రహ్మాభావములో) నిలకడ గల్గును సంపూర్ణముగ వృత్తి నశింపక అనంతరము దైవాకార వృత్తిలో మనస్సు నిలకడ గలుగదు కనుకనే సర్వ మతస్థులును జపము నేర్పరచుకొన్నారు అట్లు గానిచో చంచలమైన మనసు కొంతవరకైన దైవకార్యములో నిలవదు ఆవిరి (స్టీము) కాక దెబ్బ యంత్రము (మీటర్) యొక్క ముల్లు ఏలాగున స్టీము అధికరించి రాగారాగా ఉపరి మార్గమునకు వెళ్లి గమ్యస్థానమున నిలిచిపోవునో, ఆలాగున జపమాచరించువారికి ఏకాగ్రత గల్గి రాగా రాగా, దైవాకారస్థితిలో మనస్సు నిలిచిపోవును ఈ జపమును కొందఱు తారకమని యందురు తారకమనుపేరు సామాన్యమైనది గాదు భవసాగరమును తరింపచేయునది గనుకనే తారకమను పేరు వచ్చినది ఇదే రూఢి గల్గునప్పడు సాంఖ్యము గాను, అమనస్కముగాను మారుచుండును తదేక భావముతో జపము చేయునప్పడు ఉపరిస్థితి త్వరలో గల్గును అదే మరల ధారణ, ధ్యాన, సమాధులై మారును తురీయస్థితి వీరికి సులభముగా గల్గును ఇతరములైన సాధనములు చేయశక్తిలేనివారు ఏకాగ్రతతో జపమా చరించుట మంచి

మార్గము ఎవరైనను చేయవచ్చును దీనివలన అనన్యమైన దైవభక్తి గల్గును దీనికి తారకయోగమని నామాంతరము గలదు యోగమనగా, దైవాత్మైక్యమనియే గ్రహించవలయును ఇది సర్వజనులకు సులభమార్గము, ఉత్తమజిజ్ఞాసువులకు ఏలాగున శ్రవణ కాలముననే మనననిధిధ్యాసనలు గలుగుచుండునో, ఆలాగున విరక్తులకును జపకాలముననే దైవజ్ఞానము గల్గును అదే సమాధి నొనగూర్చును దీనియందు పరిశుద్ధ మంత్రమహిమచే త్వరలో పాపములు నశించి అంతఃకరణ శుద్ధి గల్గును భగవద్భావము గల్గినప్పుడు జీవునకు పూర్ణావస్థ గల్గును

370 రాత్రికాలములో దీపారాదనలును, దీపములును ఎట్టివారి మనస్సుకైన నానందము గలుగచేయును అయితే కండ్లు కలగుట యను నేత్రవ్యాది గలవారికి అట్టి మహదానందము గలుగజేయు నిర్మల దీపారాధనల జూచిన నేత్రములకు గొప్ప బాధ గల్గుచుండును ఆ లాగున పుణ్యకర్మలను గాని, పుణ్యజీవులను గాని జూచిన పాపాత్ములకు సహించలేని ద్వేషము గల్గుచుండును పావనేత్రములు గలవారికే యాలాగుననుండును పుణ్యాత్ములైన వారై చేయకపోయినను చేయువారినిచూచి పరమానంద భరితులై యుందురు అట్టివారి యాత్మకు సద్గతి గల్గును

సరోవర (జలాశయ) వృక్షాగ్రమున ఒకరు నిశ్చలముగా గూర్చుండిన తమయొక్క నీడ నీటిలో ప్రతిబింబించుచుండిన యలలచే అది కదలుచుండును తనయందు దృష్టినుంచిన తాను నిశ్చలముగ నున్నట్లు గోచరమగును ఆలాగున తాను కూటస్థచైతన్య జ్ఞానస్వరూపుడై యుండినను, మాయయొక్క మహిమచే గలిగెడు భ్రమ వలన తనస్వరూపము తెలియక బుద్ధ్యుపగత చిదాభాసునియొక్క సుఖదుఃఖములన్నియు తనయందున్నట్లు భ్రమ గల్గుచుండును సరియైన విచారణయు, రూఢియైన జ్ఞానమును గలుగకపోవుట చేతనే యాలాగున సంభవించును

371 కాలమునకు వశపడినవాడు కాలునికి వశుడగును అనగా

తన కాలమును వ్యర్థము చేయువాడు మృత్యువునకు లోనగును కాలమునకు వృత్తి యనియు, మాయ యనియు, విషయ మనియు, గుణమనియు పేర్లు గలవు కాలమునకు వశము గానివాడు కాలకాలుని పొందును అనగా కాలమును వ్యర్థపరచక సార్థక విషయములో వినియోగ పరచువాడు కాలకాలుడగు పరమేశ్వరుని చెందగల్గును కాలమునకే ప్రకృతి యనియు, దృశ్యమనియుగూడ పేర్లు గల్గియున్నవిగదా! దీనిలో ఒకటి యభ్యాసికిని, రెండవది యారూఢునికిని సంబంధించియుండును కాలమును నిరర్థకముగాకుండ జాచుట ముముక్షుధర్మముగను, కాలమును రహిత మొనర్చుట ముక్తుని ధర్మముగ నుండును కాలమును దుర్వినియోగపరచి దుష్టకార్యముల జేయువాడు నరకబద్ధు డగును

372. ఒక కట్టెల మోపు ననేకములైన దారములతో ననేకములగు కట్లు గట్టియున్నను, దాని యందగ్నిప్రవేశించి జ్వలించువరకు మాత్రమే ఆకట్లన్నియు నిలుచును నిప్పు రగుల ప్రారంభించిన నన్ని కట్లును "ఏలాగున తెగిపోవునో, ఆలాగున హృదయమందు జ్ఞానాగ్ని ప్రజ్వలించువరకు మాత్రమే కర్మబంధనము లుండును తర్వాత అన్ని సంసారపాశములును, ముడులును, కర్మలును నశించి పోవును దీనినే హృదయగ్రంథి విచ్ఛేదమని గూడ చెప్పెదరు

373 జనులకు మూడు విధములగు భావములు గలవు వానిలో రెండు విధములగు భావములు బంధనము గలుగచేయును మూడవ భావము మాత్రమే జ్ఞానమును గలుగచేయునది పీచుతో గూడిన టెంకాయ యుండిన దానికి పైపీచు (అనగా నార) దానిలోపలి బెరడు (చిప్ప) ఇదిన్ని విడచి లోపలనుండు నీళ్ళను కొబ్బరియు భుజింప దగినవి అది యాకలిని శాంతపరచును పీచు గాని బెరడు గాని తిన్నచో, గొంతు బట్టుకొని బాధ గలుగ చేయును అలాగున జీవావస్థను, దేహసంబంధభావమును విడిచిపెట్టుము అవి గల్గియుండిన సుఖము గలుగదు కావున గుణములను దేహభావమును విడువుము మరల ఆత్మలో పరమాత్మను గనుగొనుము

అది శాశ్వత సుఖమును గలుగచేయును

374 గంధకము, పెట్లుప్పు, బొగ్గు భాగాలు ప్రకారము మంచి పదునిచ్చి నూరిన మందువేసి కాల్చిన ఫిరంగిగుండు ఏలాగున వందలకొలది గజముల దూరముగా నుండు కోటల ధ్వంసము నొనర్చునో, అలాగున వైరాగ్యబోధోపరతులు, బ్రహ్మచర్యము, నిస్సంగత్వము, అనన్యభక్తి మొదలగు దైవగుణములు గలవారి మనస్సు సమస్త ప్రకృతి బంధములనుండి తొలగి స్వరూపస్థితిలో (బ్రహ్మరంధ్రములో) (సుషుమ్నాగ్రములో) ప్రవేశించి బహిర్దృష్టి గలుగనీయక యెక్కువ కాలము బ్రహ్మనిష్ఠ లోనే యుండును మంచి మందు గానిచో, పదును లేనిదైనచో మట్టి బూడిద మొదలైనవి కలిసినదైనచో ఏలాగున ఫిరంగి కాల్చినప్పటికిని, బుస్సను గాలి గల్గి గుండు దూరము పారక దగ్గరనే పడిపోవునో, అలాగున పై జెప్పిన భక్తి విరక్త్యాది గుణములు లేనివారి మనస్సు బ్రహ్మారంధ్రములో ప్రవేశింపకయు, ప్రవేశించినను వెంటనే దృశ్యవృత్తి గల్గి బహిర్ముఖ మగుటకును కారణమగును ఇదే విరక్తి లేని వారికి గురుతని తెలిసికొనవలయును

375 రోగులకు సరియైన పథ్యము పెట్టినచో వారికి తనపై అనిష్టము గల్గునని తలంచి వారి రోగ మెట్లైనను సరి, తనకు రావలసినది దొరకిన చాలునని బుద్ధి గల్గి ప్రవర్తించెడు వైద్యుడెట్టి వంచకుడో, అలాగున శిష్యులలో గల దుర్గుణములను ఖండించి మంచి నిష్ఠను బోధించినచో తనపై వారికి ప్రీతి తొలగిపోవుననియు, తనకు రావలసిన దక్షిణ రాకపోవుననియు, తలంచి యుపేక్షను పొందియుండు గురువు గూడ ఒక విధమగు వంచకుడనియే చెప్పవచ్చును సత్యధర్మనిష్ఠులగు గురవులెవరు నీలాగున చేయకయుందురుగాక! అపేక్ష లేని సరియైన శ్రేష్ఠుడైన వైద్యుడైనచో ఎట్టివారికైన పథ్యవిషయములో కఠినముగానే ప్రవర్తించును గాని లోపము గలుగచేయుడు ఉత్కృష్టగురువులును అలాగుననే ప్రవర్తింతురు

376 ఆకాశములో లేచిన మబ్బు అంతయు వర్షజలమై కురియనక్కరలేదు సూర్యకిరణశక్తి వలన అది మరల ఆవిరిగా మారగలదు

ఆలాగున ముముక్షువులైనవారికి జన్మాంతరములో నుండి యేర్పడి హృదయములో గల కర్మరాసులన్నియు ననుభవింప నక్కరలేదు దైవ చింతన బలముగా గల్గిన ఆ కర్మరాసులు చాలవరకు నశించిపోవును

377 యుద్ధకాలము వచ్చినప్పడు శూరులైన యోదులకు గలిగెడు సంతోషమునకు హద్దు లేదు అయితే భీరువులైన తిండిపోతులకు భయమును, అలసటయును గల్గును ఆలాగున నిజమైన పుణ్యజీవులైనచో దైవసంబంధమైగాని, గురువిషయమైగాని లేక లోకసేవావిషయమైగాని, పనులు వచ్చినప్పడు పరమాహ్లాదము గల్గుచుండును అయితే సోమరిపోతులైనచో అట్టి కార్యము వచ్చునప్పడు తప్పించుకొని పోవుటకు చూతురు లేక మనస్సులో విషాదమైన గలుగుచుండును లేక ప్రసన్నరహిత హృదయము గల్గియుందురు

378 నిర్మలదైవగుణము లేనివారలై కోట్ల కొలది దివ్యమంత్రములు జపించుట గాని, వ్రాయుట గాని చేయువారికన్న నిర్మలమైన గుణము గల్గి వర్తించువారు ఒక్కమంత్రము జపించుట గాని, వ్రాయుట గాని చేయుట గాని శ్రేష్ఠము ఏలన, చవిటిభూమిలో పుట్టెడు ధాన్యము కృషిచేయు వారికన్న శ్రేష్ఠమైన భూమిలో చిట్టెడు విత్తనము పైరు చేయువాడు ఎక్కువ ఫలమును బొందును గదా!

379 ఆచరణమునకును ఆత్మజ్ఞానమునకును ఏమి సంబంధము? మనస్సే గదా! కారణము అని వచించెడు వేదాంతులతో ఈలాగున నడుగవలయును దేహమునకును, దేహికిన్ని యేమి సంబందము? దేహమునకు విలక్షణుడగు దేహికి దేహముతో నేమి సంబందము గలదు? మనస్సేగదా కారణము! అనిన వారు అంగీకరింపగలరా? అట్టైన దేహసంబంధమగు నేలాటి సౌఖ్యమును వారు కోరరాదు అంతేకాక దేహమునకు సంబంధించిన యేలాటి బాధకును వారు లోబడకూడదు అట్టైన వారు చెప్పినది నిజము అట్టి స్థితి గలుగక యేల వ్యర్థప్రలాపములు చేయవలయును? ఈ విషయమై వారు ఈలాగున చెప్పదురు

సూర్యుడాకాశమండలము నుండి తన కిరణములను లోకములో గల మంచి చెడు వస్తువులలో ప్రసరింపచేసినను ఏలాగున అసుగంధ దుర్గంధవాసనలు సూర్యునికంటవో ఆలాగున మంచిచెడుగులలో ప్రవర్తించినను ఆత్మకు బంధము లేదని వచింతురు సూర్యునికి ప్రపంచములో జేయు నేకార్యమైనను బాధగాని కళంకము గాని గలిగించదు గాని మానవుల కాలాగున గనుపించుట లేదు వీరికి సుఖదుఃఖములు గనపడుచున్నవి ఇట్టి సుఖదుఃఖముల కతీతులైన వారికి మాత్రమే ఆ యుక్తులు చెల్లును తదితరులకు చెల్లనేరవు

380 ఎవనికి సమయము పోవుట లేదో, ఈశ్వరుడు కాలము నెంతో పొడవుగా పెంచి యున్నాడు! మానవజీవిత మెంత దీర్ఘకాలము పెరిగియున్నదని తలంపు గల్గునో ఆతడు సోమరి జీవితము గలవాడగును ఎవనికి సమయము చాలక పోవుచున్నదో, సర్వేశ్వరుడు కాలమునెంత స్వల్పముగా జేసినాడు! అట్లే మనజీవితము ఎంత అల్పకాలముతో గూడినది! కార్యము నిర్వహింపకాలము జాలక యున్నదే! అను బుద్ధిగలవాడు సోఽహంపరత్వమును పొందగల్గును అనగా ముక్తుడగును

381 ఎవడు విశ్వశాంతిని గోరునో వానికే ఆత్మశాంతి గల్గును

382 ఎవనికి లోకసౌఖ్యముపై కోరిక గల్గునో వానికి ఆత్మసౌఖ్యము గల్గును

383 తాను చేయవలసిన పని సరిగా చేయనిచో తనకు రావలసినదిన్ని సరిగా రాజాలదు ఇది చిన్న వారికిని పెద్దవారికిని సమానధర్మము

384 పురోభివృద్ధి గోరువారు పూర్వవృత్తాంతమును మరువకూడదు దీని యర్థము విచారణ చేయగా నున్నతభావము గలుగునదే గాక పురోభివృద్ధికి ఎయ్యది అడ్డు గల్గియుండునో అది తొలగిపోవును

385 దైవము నీమనస్సు శుద్ధముగా నున్నదా? లేదా? యని

చూచువాడే గాని మీకులమును గాని, విద్యనుగాని, ధనమునుగాని చూచువాడు గాడు సుమీ! ఎట్లులన, సూర్యుడు శుద్ధజలమున ప్రతిబింబించునేగాని సువర్ణపాత్రమా? లేక గంగాజలమా? అని చూచుటలేదు గదా! దీనిని నీవు చాలా జాగరూకతతో జ్ఞాపకము చేసుకొనుము అట్లైన తరించవచ్చును, లేక పోయిన నీగర్వమంతయు వ్యర్థమగును సుమీ!

386 రోగముయొక్క దారుణత్వముననుసరించి మందుగూడా తీక్ష్ణముగా నుండవలయును ఆలాగున భవరోగమగు అజ్ఞానముయొక్క బలము ననుసరించి తపోధ్యాన వ్రతనిష్ఠాదులుగూడ నుండవలయును అట్లైన మాత్రమే మనోనిర్మలతయు, చిత్తశాంతియు త్వరలో చేకూరును

387 ఒక రాజవైద్యుడుండెను ఆయన మంచి పరిశ్రమ జేసి వైద్య శాస్త్రమందు శ్రేష్ఠమైన పేరు సంపాదించుటయే గాక అనేక వ్యాదులను గూడ సర్వజనులకు సులభముగా మాన్పించుచుండెను అట్టి కాలమునందు రాజులే (ప్రభువులే) గాక అనేకజనులు వారి వద్ద ఔషధము తీసుకొను చుండిరి వారి యనంతరము కుమారులు తండ్రి గౌరవముచే కొంతవరకు సుఖముగా బ్రతుకుచుండిరి కాని యేలాటి పరిశ్రమ చేయనొల్లకయు, ఆయుర్వేదము చక్కగా చదువకయు సోమరులై కాలముగడుపుటయే గాక తమ పూర్వీకుల మహిమను గురించి వర్ణన జేసి కాలము గడిపేలాగున వైద్యమును ప్రారంభించివచ్చినందున ఎవరికి రోగము కుదరక పోవుటయే గాక తాముగూడ రోగులై జీవించవలసిన స్థితికి వచ్చిరి అట్టికాలమున ప్రభువులును, ప్రజలును తగిన వైద్యుని వెదుకవలసి వచ్చెను అది చూచి రాజకుటుంబమువారిపైనను జనులపైనను అనూయువడిన ఏమి ప్రయోజనము గలదు? ఆలాగున వంశగురువుల యొక్కయు, మఠాధిపతులయొక్కయు పరంపరగా వచ్చెడు ఆచార్యులయొక్క స్థితి గల్గినది మేము వంశపరంపర గురువులము, మఠాధిపతులము, ఆచార్యులమని చెప్పి కోపపడిన ప్రయోజనమేమి? దేనివల్ల తమ గౌరవము

నశించినదో అది కనుకొని తగిన కృషి సలిపిన మరల అది కలుగునే గాని అసూయపడిన రాజాలదు ఇప్పడు జూడుడు భారతీయులలో సరియైన వైద్యులు లేనందుచే ప్రతి రాజకుటుంబములోను ఇంగ్లీషు డాక్టర్లను పెట్టుకొనుచున్నారు వారేదేశీయులు? ఏ జాతి వారో? చూచుట లేదు కారణమేమన, రోగియైన వానికి ఆరోగ్యము గలుగవలెనని తలంపే యుండును పూర్వ గురువులు, మఠాధిపతులు, ఆచార్యులు గొప్ప భవరోగ వైద్యులై యుడిరి అప్పడు వారిని ప్రభువులేగాక ప్రజలందరును గురువులుగా భావించి పూజించుచుండిరి ఇప్పడు వార్లలోనే చాలామంది భవరోగములో చిక్కుకొని పరితపించుచుండగా వారిని గురువులుగా చేసుకొనలేదని లోకులపై నిష్ఠురములాడిన ప్రయోజనమేమి? ఇతర దేశీయులయందుగాని, జాతులయందుగాని కల మహాత్ములను గురువులుగా గ్రహించవలసి వచ్చినందుకు పై జెప్పినవారియొక్క అజ్ఞానమే కారణము గాని మరియొకటి గాదు కావున వంశపరంపరగా గురువులుగా నుండువారు తనయొక్క పతనమునకు కారణము తమలో గలిగిన భక్తి, జ్ఞాన, వైరాగ్య, కరుణాదుల యొక్క కొరతయని కనుగొని ప్రవర్తించిరేని పూర్వీకుల పూజ్యత తమకు గలుగునేగాని మఱియొక్క మార్గము లేదు

388 ఒక్క డొకప్పడు శుద్ధముగా క్షీరాన్నము పక్వము చేసియుండెను అప్పడందరును దానిని సంతోషముగా భుజించి తృప్తి నొందుచుండిరి అది పాసిపోయిన తర్వాత దానిని భుజించుటకు జనులను శాసించిన ఎవరు తినెదరు? భుజించినను రోగమే గల్గును గదా! మతముల యొక్క స్థితియు నటువంటిదే నూతన మతకర్తలు ఆవిర్భవించినప్పడు తమ మతమును చాల శుద్ధముగా నుంచియుండిరి కాలాంతరమున వాని ప్రవర్తకులలో మాలిన్యము గలుగుటచే క్రొత్త మతములను జనులు గ్రహించవలసివచ్చినది ఇది యిట్లే జరుగును పాసిపోయిన క్షీరాన్నమును త్యజింపక భుజించిన రోగము కల్గును అలాగున మతము చెడిన భాగమును విడువవలసినదే ఆ కాలమున కది సరిగా నుండెను ఈ

కాలమునకు సరిగా లేనిచో త్యజింపవలసినదే అయితే యే కాలమున దానికి మహిమ గల్గియుండునో అది ఆ కాలములో నుండిన ప్రవర్తకులయొక్క మహిమయే గాని మతముయొక్క మహిమ గాదని మాత్రము ప్రతివారును గ్రహించవలయును అట్టిన మాత్రమే కార్యము చక్కబడగలదు ఎయ్యది యెల్లప్పుడును శుద్ధముగా నుండునో అది సదా కాలమును సేవింపదగినదే

389 గృహస్థులు తమయొక్క సమస్త కార్యములును నిర్మలముగ గడపిన చాలును అట్టిన వారు శుద్ధులే, జ్ఞానులే యగుదురు సన్యాసులు అనగా సాధువులు నిర్మల ప్రవర్తనము మాత్రము గల్గియుండిన చాలదు నిర్విషయులై యుండవలెను అంతవరకు సాధు ధర్మము పూర్తి గాజాలదు ఇదే గృహస్థులకును సాధువులకును గల భేదమని గ్రహించవలెను ఏలన, గృహస్థునికి దృశ్యము గలదు సన్యాసి దృశ్యము గల్గియుండరాదు నిర్విషయస్థితి గల్గియుండినవారెవరైనను వారలు సన్యాసులే

390 కండ్లు కనుపింపనివాని ఎదుట ఎంత మనోహరముగనుండు చిత్ర విచిత్రములైన అనేక వస్తువులను ప్రదర్శించినను అతడేలాగున వానిని చూడజాలడో, ఆలాగున జ్ఞాననేత్రము తెరువబడని వారికి ఎన్ని విధములుగా వేదాంత తత్త్వముల బోధించినను గోచరము గాజాలదు

391 నిష్ఠ జరుగవలసిన కాలమున ఎప్పుడు నాష్ట యేర్పాటు జేసికొనిరో, అప్పటినుండియే బ్రహ్మనిష్ఠ నష్టమైపోయినది

392 స్త్రీగాని, పురుషుడు గాని బాల్యదశలో నుండునప్పుడు మహాపండితులచే కళాశాస్త్రము (కామశాస్త్రమును) బహువిధములుగా బోధించినను అట్టి కాలములో నేలాగున కొంచమైనను గోచరము గాజాలదో ఆలాగున వైరాగ్యబోధోపరతులు గలుగనివారికి గొప్ప గురువులుగాని, శాస్త్రజ్ఞులుగాని బ్రహ్మతత్త్వము నుపదేశించినను అవగాహనము గలుగదు అట్టి బాలబాలికలకు యౌవనకాల మారంభమగునప్పుడు ఏలాగున ఏ శాస్త్రముయొక్కగాని,

గురువుయొక్కగాని బోధలేకయే స్వయముగా మనోవికారము గల్గుచుండునో, లేక అట్టి శాస్త్ర ఆచార్యవాక్యములు అతి సులభముగ గోచరమగునో, అలాగున భక్తి వైరాగ్యబోధోపరతులు కలుగునప్పుడు దైవ తత్త్వము ఆత్మజ్ఞానము సులభముగ గోచరము గాగల్గును

393 ఓ సాదకుడా! ఇప్పడు మహారమ్యముగ గనుపించెడు రోజాపుష్పముగాని, మల్లెపుష్పముగాని కొంతకాలము క్రిందట ఏదో యెరువై యుండినది నుమీ! అవి పుష్పములై పరిణమించుట కెన్నియెా పరిణామములు కలుగటయేగాక యెన్నియో దినములుగూడ కావలసి వచ్చినవి ఆ యెరువు మట్టియై చెట్టుయొక్క వేరులోను, ప్రానులోను, చిగురులోను, పత్రముల లోను అనేక పరిణామముల బొందిన పిమ్మటనే మనోహరమైన పుష్పముగ మారినది అంతేగాక ఆ యెరువులో గల ననేక వ్యర్థ పదార్థములను వృక్షము పరిత్యజించుచున్నది అలాగున ఓ జీవుడా! నీవు శుద్ధుడవు గావలసియుండిన సాధనలోను దైవభక్తిలోను చాల నలుగవలసియుండును అంతే గాక నీయందు గల ప్రాకృత గుణములన్నియు తొలగవలసి యున్నవనికూడ మరువకూడదు అప్పడే నీవు దైవప్రీతికిని, జ్ఞానమునకును పాత్రుండవు గాగలవు

394 ఓహో! దైవము యొక్క సృష్టివైచిత్ర్యము ఆత్యాశ్చర్యకరము! ఇది కనుగొనిన మనుజులయొక్క భావము, ఉపాసనకనుగుణముగా జన్మము గలుగునను తత్త్వము గోచరము గాగలదు అనగా మరణానంతర ప్రాప్తి గల్గునని తెలిసికొనవచ్చును ఏవిధమైన యెరువుగాని, పేడగాని, మురిగిన పదార్థముగాని ఏ వృక్షమునకు వేసినను ఆ తరువు ఆ యెరువును తనయొక్క స్వరూపముగా మార్చివేయుచున్నది చెరుకునకు వేసిన మధుర రసముగా మార్చును చింతచెట్టయిన ఆ ఎరువును పులుపుగా మార్చును ముష్టిచెట్టయిన చేదుగా మార్చును అలాగు పనస, ద్రాక్ష, మామిడి, వరి, గోధుమ, సజ్జ, జొన్న మొదలుగాగల సమస్తము రసవర్గములుగాను, ఫలవర్గములుగాను, ధాన్యవర్గములుగాను మారుట లేదా? అట్లే జీవుడా!

నీవు ఏ యుపాసన చేయుదువో అలాగున మారగలవు ఇదియే సాత్త్విక రాజస తామసగుణోపాసనయైనను ఆలాటి అవస్థగనే మారగల్గును కావున శుద్ధ బ్రహ్మము నుపాసింపుము శాశ్వత సౌఖ్యము కలుగును దైవప్రాప్తి సిద్ధించును లేనిచో జన్మము నిరర్థక మగును సుమీ!

395 మనస్సెంతకెంతకు ఏకాగ్రత పొందుచుండునో, అంతకంతకు దేహేంద్రియాది దృశ్యములనుండి ఆత్మలోనికి అనగా జ్ఞేయవస్తువు లోనికి సమీపించుచుండును దృశ్యములనుండి విముక్తి గలుగుటకు సంపూర్ణముగ ఏకాగ్రత గల్గిన జ్ఞేయవస్తువు తప్ప మరి యేమియును గోచరింపదు అదెట్లన, ఏద్దైన పండునుండి రసము పిండుచుండిన పిప్పినుండి వేరుపడునది గనుపించుట లేదా? మనస్సున కెంతకెంతకు ఏకాగ్రత తగ్గి పోవునో, అంతకంతకు అది దేహేంద్రియాది దృశ్యములోనికి దిగివచ్చును అప్పడు జ్ఞేయము లోపించిపోవును దృశ్యము బలపడును అదే దానికి గురుతు

396 ప్రపంచములో గల శాస్త్రములన్నియు సుషుప్తిలోనుండి జీవులను మేలుకొలువునవే అయినను మనశాస్త్రములలో రెండు శక్తులు గల్గి యున్నవి 1 సుషుప్తిలోనుండు జీవుని మూర్ఛలోనికి తీసుకొని పోవునది ఇది పుట్టిన కులమును గాని, స్త్రీ పురుషులను గాని మాత్రము ఆధారపడి చెప్పునది ఇది పాపము, అనుసరింప దగినదిగాదు 2. అజ్ఞానసుషుప్తిలోనుండు జీవుని జాగ్రదవస్థలోనికి తెచ్చునది అంతేగాక అది తురీయము లోనికిని, తురీయాతీతములోనికిని తీసికొని వెళ్లును ఇది కులమును చూడక గుణములను జూచి అధికారముల నిర్ణయించునది ఇది పుణ్యమైనది, అనుసరింపదగినది ఇది అనేక మహాపురుషుల యాశయమై యుండియు, అనేక ఉత్కృష్ట గ్రంథములలో నిరూపింపబడియుండియు నాచరణలోనికి రాకపోయినందుచేతనే లోకమునకింత అధఃపతనము గల్గినది

397 తత్త్వాన్వేషకులకు సత్యాన్వేషణము గూడ గల్గియుండవలెను అలాగున సత్యాన్వేషకులకు తత్త్వాన్వేషణముగూడ గలిగియుండవలెను

అప్పడే అది ఉపయోగపడును నీళ్ళను, నిప్పను సరిగానున్న మాత్రమునగదా స్టీము ఏర్పడి యింజను నడుచుచుండును? తత్త్వాన్వేషణము దైవ విషయమనియు, సత్యాన్వేషణము వర్తనమనియు గ్రహించవలెను

398 సార్వభౌముడు నిశ్చింతగాను, నిర్భయముగాను తనకోటలోపల సుఖముగానుండుటకును, సుఖముగా నిద్రించుటకును దృఢమైన కోటయు, సాయుధపాణులగు కోటసంరక్షక భటులును ఉండవలెను గదా! లేనిచో, శత్రువుల భయముచే నిర్విచారముగా నుండసాధ్యము గానట్లు యోగియైనవాడు (అనగా జ్ఞాని యైనవాడు) ఏలాటి వృత్తులచే గాని, ప్రకృతి వికృతులచేగాని, బాధగలుగక నిరావరణ, నిత్య, శాశ్వత, దైవసుఖములో నుండవలసియుండినచో, చక్కగా వైరాగ్యబోధోపరతులును, సాధనచతుష్టయ సంపత్తియు నుండవలెను లేనిచో ప్రాకృతగుణములచే యోగమునుండి పతితుడు గాగలడు అంతే గాక జ్ఞాన విజ్ఞాన వైరాగ్యాది గుణములు గూడ ధ్వంసములై పోవును

399 సాదకుడైనను, జిజ్ఞాసువైనను, విద్యార్థియైనను తనయొక్క భావి సుఖము నుద్దేశించిన గురువులు గాని, ఆప్తులు గాని తనలో గల లోపమును దిద్దుకొనేలాగున శాసించునప్పడుగాని, ఒకవేళ కోపము చేసినప్పడుగాని, శిక్షించినప్పడుగాని యేలాటి అనిష్టభావములను ప్రకటింపకూడదు అంతేగాక పూర్వముకంటె అధికముగా వినయమును, భక్తి శ్రద్ధలను గల్గియుండ వలయును అట్టైన మాత్రమే మరల మరల మీ యొక్క లోపమును దిద్దుచు మీకు కావలసిన భవిష్యచ్ఛ్రేయోదాయకముల గురించి ప్రయత్నింతురు లేనిచో మీయందు ఉపేక్షభావన గాని, ఉదాసీన స్వభావము గాని వహింపవచ్చును ఈ విషయములో చాలా జాగ్రత్త గల్గియుండుడు చిన్న పిల్లలకు మట్టి తినుట స్వభావముగా నుండును అయితే దానివలన భవిష్యత్తునందు గలుగు దోషమును తెలిసికొనిన తల్లిగాని, సొంతమువారుగాని బిడ్డలను నిరోధింతురు అది బిడ్డకు అనిష్టమును గలిగించును గదా! జిజ్ఞాసువులలో కొందరు నీలాగే యుందురు

400 దనవంతుడై యుండియు, దయా దర్మాదులు లేనివారిని ఆశ్రయించిన దర్మకార్యములు నిర్వహింపగలమని తలంచి ప్రయత్నించుట మేక యొక్క గళమున గల స్తనములనుజూచి వాటినుండి ఎక్కువ పాలు లబించునని ఆశతో పిండునట్లుండును బీదవాడైనను, దయాదర్మాది గుణములు గలవారిని ఆశ్రయించిన అది నిండుగా పాలుగల ఆవు పొదుగును ఆశ్రయించినట్లుండునని మరువకుడు

401 తాను చేయవలసిన కృత్యము చేసిన తర్వాత ఫలప్రాప్తి గలుగనిచో మాత్రమే కర్మముపై ఆదారపడవలయును అట్లు చేయక ప్రాప్తిలేదని గాని, మాకర్మ యీలాగున నున్నదని గాని చెప్పట దర్మరహస్యము తెలియకపోవుటయే యగును ఎట్లన, తాను చేయవలసిన వ్యవసాయాది కృత్యములు చేసి తర్వాత ఫలింపకపోయిన మాత్రమేగదా దైవముపై భారము మోపవలయును! అట్లు స్వకృత్యము నొనర్చక దైవముపై భారమునుంచుట దైవద్రోహమే యగును

402 భక్తులారా! సాధకులారా! గొప్ప గొప్ప సంస్థలను ధర్మకార్యములను స్థాపించుట మంచిదైనను, నిర్వహింపశక్తిగలదా? యని ముందుగా యెూచించుకొనవలయును రాజ్యమును సంపాదించుకొనుట గొప్పకార్యమని తలంపకుడు రాజ్యము గొప్పదిగా నుండినను పాలించెడి రాజు గొప్పవాడు గానిచో అది త్వరలోనే యరాజకమగును ఎన్ని యో రాజ్యములు విధ్వంసములగుట, అరాజకము లైపోవుట చూచుట లేదా? చిన్న రాజ్యమైనను పాలించెడు రాజు గొప్పవాడైనచో శీఘ్రములోనే మహారాజ్యముగా జేయవచ్చును ఆలాగున ఆత్మశక్తి లేక దైవశక్తి లేక తపశ్శక్తి లేక జ్ఞానశక్తి గల్గియుండిన అదియే మహాకార్యముల చేయగలుగును అట్లుగానిచో ధర్మస్థాపనములు భారమగుటయే గాక విశ్రాంతి గూడ గలుగదని జ్ఞాపకములో నుంచవలెను

403 శ్రీరామకోటి, శివకోటి, ప్రణవకోటి మొదలగు మంత్రకోట్లను కొందరు వ్రాయుదురు మరికొందరు జపమాచరింతురు ఇవి యన్నియు

మంచివే, పరమపావనములే అయితే తాము జపము చేయునప్పుడుగాని, వ్రాయునప్పుడు గాని మంత్రాధిష్ఠాన దైవభావములో మనస్సు నిలకడ గలిగియున్నదా? యని జాగరూకతతో చూచుచుండవలెను అట్లయిన మాత్రమే నిర్దిష్టఫలము గలుగును మనము సహస్రములుగాని, లక్షలుగాని, కోట్లుగాని సంఖ్యగల పూజ్యములను (సున్నలను) వేయుచుండిన ఒక్కటైన సంఖ్యకు రాదుగదా? పూజ్యములకు పురోభాగమున ఒకటిగాని, రెండుగాని, మూడుగాని, నాల్గుగాని సంఖ్యలుండినమాత్రమే అది సహస్రముగాని, లక్షగాని, కోటిగాని గణనకేర్పడును అలాగున మీరు దైవభావముగల్గి చేయు జపములుగాని, మంత్రవ్రాతలుగాని సరియగు ఫలమును గలుగచేయునని మరువకూడదు శ్రీ రామకోట్యాదుల వ్రాయువారు తమ కార్య సాఫల్యము కొరకు కొంద రీలాటి యుక్తిని జెప్పుదురు అది యెద్దియన, మనోవాక్కాయములు మూడును ఏకము కావలయుననియే అయితే యథార్థమైన దైవధ్యానములో మనోవాక్కాయములు నిశ్చేష్టత గల్గియుండవలయును అప్పుడే త్రికరణశుద్ధి యగును నిజమైన భజనయు, అలాగున త్రికరణములకు నిశ్చలత గల్గుటయే అయితే యిది సామాన్యులకు ప్రయాసముగా నుండును కావున పై జెప్పిన కార్యములు (జపలేఖనాదులు) చేయుట మంచిదే వ్రాయునపుడు కరమును, దృష్టియు,మనస్సును వ్రాసే అక్షరముపై నిలుచుటచే త్రికరణములు శుద్ధములగునని మాత్రము లోతుగ ధ్యానము చేయువారితో చెప్పకూడదు ఎందుకనగా ఆత్మ యీ త్రికరణములకు అతీతము అచట నిలకడ గల్గుటచేతనే నిజమైన ఆత్మసిద్ధి గల్గును

404 ఏదైన కఠినములగు ఖర్జూరపుకాయలు గాని, కొబ్బెరగాని, గారెలు వగైరా గాని మొదట నమలునప్పుడు కఠినముగా నుండును అదే రెండు మూడు సారులు మరల మరల నమలిన మెత్తబడి చూర్ణమై నీరైపోవునుగదా! అలాగున సాధకుడా! మొట్టమొదట ఏసాధనయైనను లేక సంస్కృతశ్లోకములైనను మీకు కష్టముగా దోచును కొన్ని సారులుగాని,

రోజులుగాని అభ్యసించిన మరల కాఠిన్యము కనుపింపదు అపరిమిత సంతోషము గూడ గలుగును అభ్యాసము వృద్ధికి రాగా రాగా చాల సులభముగా గానుపించును సుఖమునకున్న మేర యుండదు

405 మంచిసారవంతమైన రేగడిభూమియందు కొంచెము వర్షము కురిసినను భూమి జలమును తన గర్భమందు ఎక్కువ కాలమువరకు నిలువ గలుగజేయును అందువలన పైరు బాగుగా పండును సారహీనమైన భూమి యైనచో ఎంత వాన కురిసినను వెంటనే జలాంశము క్షీణించిపోవును అందుచే పైరు ఎండిపోవుట గాని, చక్కగ ఫలింపకపోవుట గాని కలుగును ఆలాగున శాంతి, శమ, దమ, సత్త్వ, దయాది గుణములు గల హృదయములో దైవజ్ఞానము గాని, భగవద్భక్తి గాని స్థిరముగా నిలిచియుండును అట్టిగుణములు లేనివారి హృదయములో వెంటనే క్షయించి పోవుచుండును

406 కాలు చేతులు మొదలైన యంగములకు దెబ్బ తగిలిన గాని, పడిపోయిన గాని, కీలు మొదలైనవి తొలగుటగాని, మెలికిలపడుటగాని గలిగినచో వెంటనే తోమించి చక్కపరచవలయును అయితే అప్పడు అపరిమితముగా నొప్పి గలుగవచ్చును అట్టి వేదనకు జాలిపడి సరిగా చేయనిచో, అంగము లెల్లప్పడు కుంటివి యైపోవును ఆలాగున ముముక్షువులయందుగాని, భక్తులయందుగాని యేదైన ధర్మలోపములు గలిగినచో చక్కగ సరియగు ప్రాయశ్చిత్తవ్రత నియమాదులచే బాగుపరచవలయును అప్పడు అది వారికి కష్టము గలుగునని తలంచి విడిచిపెట్టిన మరల వారు ఋజుప్రవర్తకు లగుటగాని, పవిత్రు లగుటగాని దుస్తరము ఇదే నిజమైన దయయని తలంచవలయును

407 గొప్ప పరీక్షలో నుత్తీర్ణులైన వారును, మేధాసంపత్తి గలవారును నగు న్యాయవాదులలో కొందరు కొన్ని కేసులు ధర్మముగావని తెలిసియు, ధనలాభముకొరకు సాధించుటలో ఏలాగున తమ శక్తినంతయు వాదించుటయందు ధారబోయుచున్నారో, ఆలాగున బ్రహ్మనిష్ఠా మార్గస్థులలో

కొందరు ఏదైన ధర్మవిరుద్ధ కార్యములలో పడిపోయినచో అది ధర్మము గాదని తెలిసియు సాధించుటకొరకు అనేక శాస్త్ర ప్రమాణములును, యుక్తులును, దృష్టాంతములును వినియోగపరచెదరు ఆఖరున ప్రారబ్ధ మనివార్య కార్యమనియు, అది అనుభవించియే తీరవలయుననియు సాహసించి సాధింతురు కావున నీలాటి మాటలచే ముముక్షువులు సంశయింప నక్కరలేదు అధర్మకార్యములు చేయుట యెవ్వరికైనను అనర్థ హేతువే యగును ఇది యొక విధమగు కళంకమనియు, ఆత్మశుద్ధి చక్కగ గలుగనందుచే గలిగినదనియు తప్పక గ్రహించుకొనవలయును పశ్చాత్తాప పడువారు క్రమముగా దైవకృపకు పాత్రులై పరిశుద్ధులగుదురు ప్రారబ్ధమని తలంచి పరిశుద్ధ ప్రయత్నము చేయనివారు క్రమముగా పతితులగుదురు ప్రారబ్ధ శబ్దము అందరికిని వర్తించునది గాదు అది అతీతజ్ఞానము గల బ్రహ్మసాక్షాత్కారము సిద్ధించినవారికి మాత్రమే చెల్లును అట్టివా రరుదుగా నుందురు

408. (1) ఇహమందు ప్రాణికోట్ల కుపకారము చేయుటయు, పరమునందు పరమాత్మను పొందుటయు మన్నుష్యజన్మయొక్క లక్ష్యమని మరువకూడదు ఇది యుత్తమ జన్మము

(2) ఇహమునందు జీవకోట్ల కుపకారము చేయకపోయినను అపకారము మాత్రము చేయక, పరమునందు మోక్షము సిద్ధింపకపోయినను ఉత్తమ లోకప్రాప్తి నొందుటకు తగిన సద్గతిని గలుగజేసుకొనుట మధ్యమ జన్మమగును

(3) ఇహమునం దొక ప్రాణికైనను నుపకారము చేయకపోవుటయేగాక అపకారము చేయుటయు, పరమునందున్నత లోకము నొందక నరకలోకమునకు పోవుటయు అధమజన్మము గలవారి గతి యని జ్ఞాపకముంచవలయును ఇట్టి దుఃఖకరస్థితి కెవరును పోవకుందురు గాక!

(4) ఇహమునందు అన్ని ప్రాణికోట్లను, వస్తువులను

దైవమయముగ జూచువాడు ఇచ్చటను ముక్తుడే, పరమునందు విముక్తుడే ఈ మహాత్మునకు ఇహ పర లోకభేదము లేదు ఈయన ఉత్తమోత్తముడు ఇట్టి జన్మము గలుగుట దుర్లభము కలిగినచో అట్టికాలమే పుణ్యకాలము

409 కరచరణాదులగు అవయవములలో నేదేని ప్రమాదవశమున విరిగిపోయిన సరియైన కట్టు గట్టుకొనినచో ఏలాగున మామూలుగా సరిగనుండునో, ఆలాగున మీయొక్క వ్రతములలో ప్రమాదవశముచే గాని, బుద్ధి నతిక్రమించిగాని భంగము గలిగినచో ప్రాయశ్చిత్తాది సంస్కారములచే శుద్ధి యగును ప్రాయశ్చిత్తము - ఉపవాసవ్రతము, దివ్యమంత్రజపము, దైవచింతన, అన్నశాంతి మొదలైనవి అంగములు విరిగిన భాగము కట్టుగట్టి పథ్యముండనిచో ఏలాగున అనుసంధింపదో, ఆలాగున వ్రతభంగములకు ప్రాయశ్చిత్తాదులు చేయనిచో పూర్వము చేసిన పుణ్యముతో లేక ధ్యానముతో, జ్ఞానముతో అనుసంధానము గలుగదు పశ్చాత్తాపము గూడ ప్రాయశ్చిత్తములో చేరినదే

410 మోక్షవిషయములో రెండు పద్ధతులు గలవు 1 సామాన్యము, 2. విశేషము సామాన్యముగా రైలు పెట్టెలకొక యింజనే యుండును భారమధికముగ గాని, మెరకపై పోవలసినగాని మరియొక యింజనును వెనుక ప్రక్కన తగిలింతురు మొదటి యింజను పైకి లాగుచుండును వెనుక యింజను ముందుకు త్రోయుచుండును ఈలాగున సామాన్యముగ నుండు ప్రపంచవ్యవహారము లుండినను వాటిని సవరణ చేయుటకు ఎక్కువ చూడక దైవవిషయములో మాత్రమూర్ధ్వముగ పోవుచుందురు వీరు గూడ తరింపగలరు రెండవది విశేషమార్గము వీరు పై జెప్పిన వారివలె ముందుకు పోవుటయేగాక ప్రాకృత గుణములను, వృత్తులను, సంకల్పములను, వ్యవహారములను తగ్గింపచూచెదరు వీరు త్వరలో విశ్రాంతి నొందగలరు మొదటివారి యభిప్రాయ మేమన మనము ఉత్తరదేశ కాశియాత్రకు ఎన్ని యడుగులు ముందుకు నడుచుచున్నామో, అన్ని యడుగులు దక్షిణమునకు దూరముగాను, ఉత్తరమునకు దగ్గరగాను చేరుచున్నాము గదా! ఆలాగున

పరమపురుషుని లోనికి ప్రవేశించుటలోనే ప్రకృతి దూరమగుచుండును ఇదిన్ని యొకవిధమగు సులభమార్గమే

411 ఓ సాధకుడా! భగవద్ధ్యానము చేయు భక్తుడా! త్రికరణశుద్ధి గలిగినదా యని ఆత్మలో సతతము చూచుకొనుచుండుము అట్లు కానందుచేతనే కాబోలు మీకు ఫలసిద్ధి గలుగపోవుచున్నదని తెలుసుకొని దాని సిద్ధి కొరకు సతతము ప్రయత్నము చేయుము ఇది సిద్ధి గలుగువరకు యోగముగాని, తపస్సుగాని, భక్తిగాని సిద్ధి గాజాలదు మలినవస్త్రము శుద్ధము గావలసియుడిన నీళ్ళును, సబ్బును, ఉదుకుటయును సరిగా నుండవలెను నీళ్ళు మంచివి గానిచో మంచి సబ్బుగాని, చౌడుమట్టిగాని యుండినను ప్రయోజనము లేదు జలము మంచిదైనను సబ్బుమంచిది గానిచో వస్త్రము శుభ్రము గాదు మంచిసబ్బును, మంచి నీళ్ళును ఉండినను చక్కగా నుదుకనిచో శుభ్రము గాదుగదా! అలాగున నీయొక్క వాక్కును, క్రియయును, మనస్సును (సంకల్పము) శుద్ధము గానిచో పవిత్రాత్ముడు గాజాలవు సుమీ! దీనియొక్క సంపుటమే నిజమైనయోగమని గ్రహింపజాలకపోయిన సిద్ధి గాజాలదు ఇట్టి ప్రయత్నము చాలా కఠినమైనది తక్కిన దేనికిని యింత ప్రయాసము లేదు ఇది వారివారి యాత్మలో ఎల్లప్పుడు కనుగొనందగినది

412 ఆత్మస్వరూపులగు సోదరులారా! సాధకులారా! దైవసాక్షాత్కారము పొందుటయే మనయొక్క లక్ష్యమైనను, విద్యలోగూడ మీరు పారంగతులయ్యేలాగున ప్రయత్నించవలయును దీనితో గూడ అనుష్ఠానములోను శ్రేష్ఠులు గావలయును అంతటితో తృప్తినొందక జనులయొక్కయున్నతస్థితికి గూడ ప్రయత్నించవలయును దీని వలనను మీకర్తవ్యము పూర్తియైనదని తలంపక లోకము అనగా దేశము సహా స్వతంత్రముగా నుండేలాగున యత్నించవలయును సత్యధర్మములను బోధించేలాగున నుండవలెను అప్పడే మీకర్తవ్యము పూర్తి యైనదని తలంచవలయును ఇది ఒక్కొక్కటిన్ని పరస్పరము సంబంధము

గలిగియున్నది ఈ ఐదింటికిని శరీరారోగ్యము చక్కగ గలిగియుండవలెను, లేనిచో పై చెప్పిన ఐదు కార్యములను నిర్వహింపజాలక పోవుదురను తత్త్వమును మరువకూడదు

413 సోదరుడా! మానవసేవ చేయుట మనుజునికి శ్రేష్ఠధర్మము అయితే మానవసేవ చేయుటకు ముందుగా నీవు మానస సేవ చక్కగ చేయుము అట్టినమాత్రమే నీవు మానవసేవ సరిగా చేయగలవు

414 సాధువులు(సన్యాసులు) సంసారులతో చేరినచో సంసారులను సాధుగుణములు గలవారలనుగా చేయవలసినదేగాని, సాధువులు సంసారులుగా మారకూడదను తత్త్వమును సదా జ్ఞప్తిలోనుంచి వర్తించవలయును

415 ఎక్కువ కులములో నుండువారు తక్కువ కులమువారితో సంసర్గము చేసిన తక్కువ కులమువారిని ఎక్కువ కులము వారినిగా జేయవలయునే గాని యెక్కువ కులమువారు తక్కువ కులమువారివలె నుండరాదు

416 మానవులారా! మీరు భూమిలో నిలుచుకొని చుట్టుప్రక్కల చూచిన కొలది దూరము మాత్రమే కనుపించును ఒకగొప్ప మేడపై నెక్కిన మరింతదూరము కనబడునుగదా! అచ్చోటనుండి దానికన్న ఎత్తులోనుండు ఒక సామాన్య పర్వతమునెక్కి చూచిన చాలదూరము వరకు గోచరము గాగలదు ఆలాగున నెంతకెంత యెక్కువ పైభాగమునకు వెళ్ళిన అంతకంత కధికదూరము గూడ గోచరము గాగలుగును ఆలాగున మీ బుద్ధి యెంతకెంత ప్రాకృతగుణములనుండి ఉపరతి నొందుచుండునో, ఎంతకెంత దైవభావములోనికి ప్రవేశింపగలుగునో, అంతకంతకు మీ యొక్క బుద్ధియును, జ్ఞానమును, దైవరహస్యమును తెలిసికొనుటయును అధికముగానే యుండును ఇదే సామాన్యజనులకును, అతీంద్రియ జ్ఞానులకును గల తారతమ్యము, అన్నమయ, ప్రాణమయ, మనోమయ, విజ్ఞానమయ, ఆనందమయ కోశములను దాటి తురీయస్థితిలో నిలకడ

గలిగినప్పుడు ఇట్టి భేదము గలుగుచుండును

417 మంచి గడియారమైనచో నూరు సంవత్సరముల కొకసారి 'కీ' అనగా బీగమిచ్చిన చాలును అటుల గానిది యాభైగాని, ముప్పైగాని, పది సంవత్సరములకు గాని, సంవత్సరమున కొకసారి గాని బీగమివ్వవలయును ఇకను తక్కువైన పనితనముగల గడియారమైనచో 6 నెలలకు గాని, 3 నెలలకుగాని 1 నెలకు గాని బీగ మివ్వవలసియుండును మిక్కిలి తక్కువ లోహమును, పనితనమును అయినచో ఒక పక్షమునకు, ఒక వారమునకు అయినను బీగమివ్వవలసియుండును మరింత హీనమైన లోహమును, పనితనమును గలది యైనచో ప్రతిదినమును బీగమివ్వవలసియుండును గదా! ఆ లాగున ముముక్షువుల, జిజ్ఞాసువుల, భక్తుల యంతఃకరణములో జన్మాంతర సంస్కారము ననుసరించి గురుబోధము గాని, దైవజ్ఞానము గాని ఎక్కువ కాలము లేక తక్కువకాలము నిలిచి యుండి అనుష్ఠానము గలిగియుండును ఉత్కృష్టసంస్కారము, తీవ్రతరవిరక్తియును లేనివారికి ప్రతిరోజును బోధను గలుగ చేయుచుండవలెను లేనిచో బహిర్దృష్టిగలిగి బ్రహ్మనిష్ఠనుండి జారి చిన్నగ విషయములో బడిపోదురు లేనిచో అనుష్ఠానరహితులుగా నైన నుందురు

418 పాప పరిహారార్థమునకు పంచశాంతులు 1 ఉపవాసము, 2 జపము లేక ప్రార్థన, 3 పశ్చాత్తాపము, 4 మౌనము, 5 అన్నశాంతి తప్పిదము ఎంత హెచ్చుతగ్గులుగా నుండునో, ప్రాయశ్చిత్తముకూడ అంత హెచ్చుతగ్గులుగా నుండును

419 ఎవడు తన హృదయకవాటమును సదా తెరచి పెట్టివుండునో, ఆ పుణ్యాత్మునకు ప్రపంచములోగల సమస్త స్థలములోనే గాక, స్వర్గలోక, బ్రహ్మాదిలోక, మోక్షద్వార పర్యంతము సమస్త లోకముల ద్వారములు తెరచిపెట్టి యుండును

420 ఎవనికి తాను మలమూత్రములలో పడినచో కడుగని స్థితి, ముండ్లు మొదలైనవి గ్రుచ్చుకొనినచో తీసివెయ్యని స్థితి కలిగియుండునో,

వ్రణము లేచిన మందు వెయ్యని స్థితి కలిగియుండునో, అట్టి బ్రహ్మవిద్వరిష్ఠస్థితి కలిగినవారికే విషయవాసన గాని, దృశ్యవృత్తిగాని, చెడు సంకల్పము కాని కలిగిన ప్రాయశ్చిత్తము అవసరము లేదు కాని తక్కినవారు అందఱును ప్రాయశ్చిత్తము చేతనే పవిత్రులు కావలసియుందురు ఇట్టి యవస్థ గల వారికి విధినిషేధములుగాని, పుణ్యపాపములుగాని అంటవు

421 దేహమే దేవాలయమనియు, జీవుడే దేవుడనియు, అజ్ఞానమను నిర్మాల్యమును తీసివేసి "సోఽహం" భావమను మంత్రముతో పూజ చేయవలయుననియు చెప్పదురు ఇది గొప్ప విషయము అయితే అజ్ఞానమను నిర్మాల్యమును తొలగించి పూజించవలసినదను రహస్యమును మాత్రము మరచిపోవుచున్నారు దేవాలయములో పూజచేయుటకు ముందుగా నిర్మాల్యము మొదలగు వాటినన్నిటిని తీసివేసి అభిషేకాదులచే శుద్ధపరచిన తరువాత యెట్లు పూజచేయవలసి యుండునో (అనగా నిన్నటిదినం పూజించిన మాల, పుష్పము, గందము మొదలైనవి నిర్మాల్య మనంబడును అవి తీసివేయక అభిషేకము చేయక పూజించుట యెంత తప్పో) ఆలాగున ఇంతవరకు అంతఃకరణములో నుండు విషయమాలిన్యాదులను అన్ని దుర్గుణములను పుణ్యకర్మలచేతను, దైవభక్తి చేతను, ధ్యానయోగముచేతను, శుద్ధపరచిన తరువాత సోఽహంభావమును ఆత్మైక్యమంత్రమును జపము చేయవలెను లేనిచో నిర్మాల్యమును తొలగింపక చేసెడి నికృష్టపూజవంటిది యగును

422. ఏదైనా మంచివస్తువు బరిణయందుగాని, డబ్బియందుగాని యుంచవలసియుండిన ఆపాత్రలు ఏదైన చెడువాసన గలిగి యుండిన పరిశోధించి వాసన యుండినచో ఏలాగున ఒకసారి గాని, రెండు సార్లుగాని, లేక పెక్కుసారులుగాని మరలమరల కడిగి శుభ్రపరచుచుందురో, ఆలాగున నిర్వాసనాస్థితి గలుగువరకు మరల మరల నంతఃకరణమును జ్ఞానధ్యానములచే శుద్ధపరచుచుండవలెను అట్టైన అతని యాత్మజ్ఞానము శుద్ధముగా నుండును

423 మంచి యంకుశము గల మావటివాని చేతిలో నలుగని యేనుగు ఏలాగున యుపశాంతిని పొందదో, చెప్పిన పనిని సరిగ చేయదో, యాలాగున మంచి నిష్ఠగల గురువుల క్రింద నలుగనిచో మీ మనస్సు ఉపరతిని పొందకపోవుటయే గాక స్వాధీనమునందు గూడ నుండదు సుమీ!

424 పంచశీలములు 1 సచ్చిన్తనము 2 సద్గ్రంథపఠనము 3 సత్ప్రవర్తనము 4 సత్కర్మము, 5 సత్సంగము ఈ పంచశీలములను చక్కగా ననుష్ఠించువారలు పంచభూతాత్మకమైన దేహమునకు పంచభూతములు సమానావస్థలో నుండిన ఏలాగున సౌఖ్యము గలిగియుండునో, అట్లు ఆతఃిమసౌఖ్యము గల్గియుందురు వానిలో ఏదైన నొక లోపము గలిగిన శరీరమునకు రోగము గలుగునో, ఆలాగున ఈ పంచశీలములలో దేనికైన కొఱత గలిగినచో నాత్మజ్ఞాన సౌఖ్యములో గూడ హాని గలవారగుదురు

425 బ్రహ్మనిష్ఠులకు అంతఃకరణములో సంకల్పము లుండువఱకు మాత్రమే అవి ఫలమును గలుగచేయును అవి రహితములైన, మరల ఫలములుండవు పైరులలో గల కలుపుగాని, యితరచెట్లుగాని తీసివేయనిచో అవి ఫలించును గాని, వేరుతో ఊడబెరికివేసిన యెడల నశించును గదా! ఆలాగున అంతఃకరణములో ఏయే సంకల్పము లుండునో, అవి మరల లేకుండచేసిన యెడల వాని ఫలములు గలుగవు, జ్ఞానాగ్నిలో దహించిపోవును

426 వైరాగ్యము మూడు విధములు, అది తామసము, రాజసము, సాత్త్వికము సాత్త్వికవైరాగ్యము మాత్రము చెడదు గాని తక్కినవి నిలువవు ఎందుకనగా మలిన వైరాగ్యమనియు, శుద్ధవైరాగ్యమనియు అది రెండు తరగతులు రాజసతామసములు మలినములో చేరినవి సాత్త్వికము శుద్ధము అంతేగాక దీనికి స్వభావవైరాగ్యమనియు, అభావ వైరాగ్యమనియు పేర్లుగలవు వాని లక్షణములు - సమస్త సౌఖ్యములు గల్గియు,

అనుభవించుటకు ఇంద్రియ సౌష్ఠవముండియు, సుఖములో నశ్వర బుద్ధియు, హేయ బుద్ధియు, బంధబుద్ధియు గలిగిన స్వభావ వైరాగ్యము శుద్ధమనంబడును ఈ వైరాగ్యము గలవాడెచ్చటను చెడడు, ఏమియు గోరడు, కోరక వచ్చినను అనుభవింపడు రాజసము - భోగములుండియు, శరీరపుష్టి గల్గియు మానహానిచేగాని, అక్రమకార్యము చేసిగాని దేశములో నుండుటకు వీలుగాక సాధువై లేక భక్తుడై పోయెడివాడు వీడు శుద్ధముగ నుండ జాలడు తామసము - వీనికి విషయసుఖములు అనుభవింపవలెనని కోరికగలదు కాని దారిద్ర్యము చేతగాని, రోగముచేతగాని, అనుభవింప వీలులేక పోవుటచేగాని హత్య, చోరత్వము, జారత్వము మొదలగు దుష్టకార్యములు చేసి ఊరిలోనుండ నవకాశము లేమిచే సాధువులగుట వీరును పరిశుద్ధ జీవితము గడుపుట దుస్తరము ఈ రజోగుణతమోగుణములలో చేరినవే శ్మశాన వైరాగ్యము, పురాణవైరాగ్యము, ప్రసూతి వైరాగ్యము, అభావవైరాగ్యము మొదలైనవి ఇవి నికృష్టములు ఒకవేళ ఏప్రకారమైనను వైరాగ్యము గల్గిన మరల జాగ్రత్తగల్గి మంచి నడతలో ప్రవేశించి బ్రహ్మనిష్ఠ, దైవచింతన గల్గియుండేలాగున చూచినచో దానివలన పాపరహితులై శుద్ధాత్ములు గావచ్చును

427 కొందఱు అపరిగ్రహనిష్ఠగలవారై యెవరివద్దనుండి యేమియు స్వీకరింపని వ్రతము గల వారైయుందురు కాని, ఎవరికి ఏమియు దానధర్మ పరోపకారములుగూడ చేయరు అయితే అపరిగ్రహము మంచిదే, దానివలన పాపము గూడ చేరదు కాని, యింతవరకుండెడి పాపకర్మము ఏలాగున నశించును? ఈ కార్యము మాత్రము మరచిపోవుచున్నారు దానికి పరోకారమున్ను, పుణ్య కర్మమున్ను చేయవలయును క్రొత్తగ అప్పుతీయకుండుట మంచిదే అయితే ప్రాత అప్పు ఏలాగున తీరును?

428 నిర్భయముగలిగి సర్వత్ర సర్వకాలములో జీవించవలసి యుండిన సత్యముపై నాధారపడియుండవలయును అట్టిన ప్రకాశము

దగ్గఱకు తమస్సు రానట్లు భయ మనునది మీ దగ్గరకు చేరజాలదు

429 లోపలను బయటను ఈశ్వరుని దర్శించవలసియుండిన లోపలను బయటను మీరు ఏకరీతిగా ప్రవర్తించిన చాలును అనగా బయట ఒకటి, లోపల మరియొకటి ఉండగూడదు లోపల గాని బయటగాని మరుగుపరచిన, దైవముగూడ మీకు మరుగు పడిపోవును

430 ఓ సాధకులారా! భక్తులారా! మీరు ఏ మంత్రములనుగాని, దివ్యమూర్తులనుగాని, దివ్యపురుషులనుగాని ధ్యానించునపుడు, స్మరించునపుడెల్ల వానిని తేజోరూపములుగాను, జ్ఞానజ్వాలతో గూడినవిగాను, పాపమును నశింపచేయునవిగాను నుండునని బాగుగా బుద్ధిని నిలిపి యభ్యసింపవలయును అప్పడే ఆత్మశుద్ధియు, పాపవిమోచనమును, జ్ఞానమును, దివ్యానందమును గలుగును ఎట్లన, ఇనుము అగ్నిలో జ్వలించునపుడు అగ్నిమయముగా నుండునుగదా? నిప్ప చల్లారిన దాని యందు దహనశక్తి యుండదు ఆలాగున మంత్ర, గురు, దైవ, ఆత్మభావములోను గల్గియుండును

431 బ్రహ్మజ్ఞానము తనయొక్క ఆత్మస్వరూపమును తెలిసికొని యాలాగున వర్తించుటయే యని చెప్పనది నిజమైనచో తనయొక్క కుల గోత్రములను తెలిసికొని వర్తించవలయునని చెప్పినట్లుండును అట్లు గాక తనయొక్క కులగోత్రములను తెలిసికొని యాలాగున నడువరాదని చెప్పన దెట్లుండునో, అదెంత నిజమో, ఆలాగున తనయొక్క యాత్మస్వరూపమును శాస్త్రముల చేతను, అనుష్ఠానములచేతను తెలిసికొని అట్లు వర్తింపరాదని చెప్పనట్లుండునని ప్రతివారును జ్ఞప్తియందుంచవలయును అప్పడు చెప్పవారి యొక్క సత్యములు మీకు గోచరములు గాగలవు

432. కొందరు శుష్కవేదాంతులు ఈలాగున చెప్పదురు అదేమన నిప్ప మండుచున్నప్పడు పొగ బయలుదేరునట్లు బ్రహ్మవిచారము చేయువారి హృదయమునుండి ప్రకృతిగుణములు బయలు వెడలిపోవుచుండును పొగ

లేచిపోయినను అగ్నికి ఏలాగున దానివలన దోషము లేదో ఆలాగున ప్రకృతి గుణములు గలిగినను జ్ఞానికి బాధాకరము లేదు ఇది సరియైన యుక్తి కాదు ఇది కుయుక్తి యనియే సజ్జనులు గ్రహించవలెను ఏలన అగ్నికి పొగ లేదు పొగ కట్టెలలోగల దూషితమైన దోషము అగ్నికి స్వయముగా ప్రకాశమే స్వభావము కనుకనే నిప్పు బాగుగా మండి కట్టెలలో గల దోషములు నశించిన తరువాత కణములు పొగరహితమై కనుపించుచున్నవి ఆత్మస్వరూపమును గురించి చెప్పనప్పుడు పొగ లేని అగ్నివలె నుండునని శాస్త్రసమ్మతము ఆలాగున బ్రహ్మవిచారముగాని, యోగముగాని, తపస్సుగాని, భక్తిగాని అనుష్ఠించెడివారిలో ఎంతవరకు అంతఃకరణమునుండి ప్రాకృత విషయములు గాని ప్రకృతిగుణములు గాని గలుగుచుండునో అంతవరకు పరిశుద్ధాత్ములు కాలేదనియు, పాపము నశింపలేదనియు తెలిసికొని అట్టి దోషములు లయ మొందువరకు బ్రహ్మనిష్ఠయు, తపస్సు, యోగము, భక్తి మొదలైనవి చేయుచుండవలయును సూర్యుడు, విద్యుత్తు, అధూమాగ్ని యేలాగున పొగ లేకయుండునో, ఆలాగున శుద్ధమైన జ్ఞానము గలిగిన ఆత్మయు నుండును

433 కొందరు ఈలాగున చెప్పదురు వారి యందు జ్ఞానాగ్ని యమోఘముగా వెలుగుచున్నదనియు, అగ్నియందు ఏది వేసినను కాలిపోవునట్లు శుభాశుభములు, పుణ్యపాపములు తమకు లేవనియు పలుకుదురు వారు చెప్పినది మాత్రము సత్యముగానే యున్నది కాని యట్టి జ్ఞానాగ్ని ప్రజ్వలనము మాత్రము తమకు గలిగినదా యని వారు చూచుకొనుచున్నారా? యనియు సందేహము గలుగుచున్నది జ్వలించుచుడు అగ్నియందు హోమించిన మంచి పూజాద్రవ్యమునుగాని, చెడుపదార్థమునుగాని రగులుచుండు అగ్ని దహింపచేసి తనయొక్క స్వరూపముగా జేయును అట్టిన మణల శుద్ధాశుద్ధవాసన లుండవు మంచి చెడుగుల వాసన గలిగి యుండినను, కొంతభాగము కాలకయుండినను అగ్ని చక్కగ జ్వలించియుండలేదని గ్రహించవలయును ఈతత్త్వమును

తెలిసికొని మఱల సమిధలు (కట్టెలు) వేసికొని యగ్నిజ్వలించుటకు విసనకఱ్ఱచే విసరవలయును లేక ఊదవలయును ఆలాగున ఎవరి హృదయములోనైన విషయవాసనలుగాని, ప్రకృతి స్వభావముగాని యుండినచో తమయందు జ్ఞానాగ్ని ప్రజ్వలించలేదని గ్రహించి శమదమాది గుణములను సమిధలును, మననిదిధ్యాసనధ్యానాది యోగములును అవశ్యము చేసికొన వలయును అట్టిన ధన్యాత్ములు గాగలరు

434 ధ్యానకాల మెట్లుండవలయునో తెలిసి కొనవలయును పరుసవేదిని తాకిన యినుము ఏలాగున బంగారుమయమై యుండునో ఆలాగున విషయభావముగల జీవుడు ధ్యానకాలములో సాక్షాత్ తురీయస్థితిలో ప్రవేశించి బ్రహ్మములో మునిగి తన్మయుడై యుండవలయును అట్టిన జీవునికి మాలిన్యము గలిగియుండదు శివమై దైవమయమై, జ్ఞానమై వెలుగుచుండును ఇదే దీనికి గురుతు అట్లు శుద్ధాత్ములు గానిచో ఇంకను ధ్యేయాకారస్థితిలోనికి ఆత్మ ప్రవేశింపలేదని గ్రహించుకొనవలయున్నది ఇది యగాధధ్యానము గలవారికి మాత్రమే సిద్ధించును తక్కిన వాఱందరున్ను జ్ఞానజ్వాల దగ్గఱకు వెళ్ళి తిరిగివచ్చుచుందురు

435 భక్తులారా! జాగ్రత్త గలిగి యుండుడు ప్రకృతి కష్టములు, బాధలు, నిందలు మొదలగు భయముల గలుగజేసి మిమ్ములను తనలోనికి వశపరచుకొన జూచును దీనికి మీరు లొంగరని తెలిసిన మఱల నయముచే స్వాధీనము చేసికొనుటకు ప్రయత్నించును భయకారణములు రజోగుణ, తమోగుణములతో గలిసియుండును సత్త్వగుణము సుఖముతోను, ప్రీతితోను, సుకుమారముతోను, బాహ్య విషయములగు సర్వసంతోషదాయకములగు సౌఖ్యములతోను గలిసి యుండును ఇవి ప్రకృతియొక్క నయభాగములని మరువకుడు సామాన్యవిరక్తులు, భక్తులు, జిజ్ఞాసువులందరును ప్రకృతియొక్క భయంకర ప్రవృత్తికి లొంగరుగాని నయస్వభావమగు సుకుమారమునకు వంగిపోదురు బ్రహ్మనిష్ఠులు

చాలమంది ప్రకృతియొక్క నయమునకే వశులైపోవుచున్నారు కనుక భయపెట్టుట యెటువంటిదో నయపెట్టుట గూడ యటువంటిదని మరువబోకుడు ప్రపంచములో నీలాగుననే జనులను వశపరచుకొందరు ఈ రెండింటికిని వశపడనివారు అరుదుగా నుందురు వారు మాత్రమే కార్యమును సాధింపగలరు

436 భక్తులారా! ఇంద్రియచాపల్యము, జిహ్వాచాపల్యము గలవారికి అవి కట్టుబడుట కొక రహస్యము గలదు అదేమన కొందఱు కఠిన పథ్యముచే తీరవలసిన వ్యాధిగలవారు స్వగృహములో నుండిన జిహ్వాచాపల్యముచే ననేక వస్తువుల తినగలమని తలచి మంచి నియమము గల యాస్పత్రి లోనే యుంధురు అక్కడ బయటనుండి యేవస్తువును తీసికొని తినుటకు సాధ్యము గాదు డాక్టరు ఆస్పత్రిలో నియమించిన వస్తువులు మాత్రమే దొరకును అప్పడు రోగము త్వరలో కుదురును అలాగున స్వస్థలములో నుండిన జిహ్వాచాపల్య రాహిత్యము, మనోనిగ్రహమును గలుగుట ప్రయాసమని తలంచువారు మంచి నియమనిష్ఠలు గల గురుకులమున నుండవలయును అచట బయటనుండి యేపదార్థమును తెచ్చుకొని తినుట కనుకూలముండదు అది యాశ్రమముయొక్క నియమము ఆ నిబంధన ననుసరించి యాహారము, నిద్ర, ధ్యానప్రార్థనాదులు జరుపవలసియుండుటచే మనసు తప్పక కట్టువడను లేనిచో కట్టుపడుట దుస్తరము ఇదే సరియైన యుపాయము మొదట కొంచెము కష్టము గల్గియుండినను తరువాత సుఖముగానే యుండును మరల నెచ్చటనుండినను ఆ గురుకులస్వభావము గలిగియుండును

437 కొందరు ఈలాగున చెప్పదురు బ్రహ్మజ్ఞానమునకు ఏకాంత ప్రదేశముగాని, గురుకులముగాని యేల వెళ్లవలయును? స్వగృహము నందేయుండి సాధించుకొనరాదా? కావలసిన వేదాంతగ్రంథముల తెప్పించి యిచటనే చదువరాదా యని ఈ వాక్యము లెటువంటివనగా రోగి

యైనవానితో ఏల ఆరోగ్యప్రదేశమునకును, వైద్యాలయమునకును పోవలయును? స్వంతయింటి యందుండి యౌషధసేవ చేయరాదా! మందులు గావలసిన వ్రాసి తెప్పించుకొనరాదా! అని చెప్పి నట్లుండును లేక ఉన్నత విద్యాభ్యాసము కొఱకు విశ్వవిద్యాలయమునకు విదేశములకు పోవలయునా? ఇంటిలో గూర్చుండి చదువరాదా? ఆ పుస్తకముల నన్నిటి నిచటికి తెప్పించుకొనరాదా? వానిలో గల విషయములకన్న అచ్చటికి వెళ్ళినను క్రొత్తవిషయ మధికముగా వారేమి చెప్పగలరు? అని చెప్పినట్లుండును వీరి మాటలు గూడ కనుక ఉత్తమగురుకులవాసము, పవిత్రమైన యేకాంత స్థలమును సాధకుల కవసరము

438 సాధకులగువారి కాహారనియమమున కన్న నివాసస్థల నియమము మరింత నిర్మలముగా నుండవలయును ఎంత శ్రేష్ఠమైన విత్తనమైనను స్థలము మంచిది గానిచో నేలాగున వృద్ధియై ఫలము నివ్వకపోవుటయేగాక చెడిపోవునో, ఆలాగున యాహారశుద్ధి గలిగియుండినను, నిర్విషయమున కనుకూలము లేని స్థలములో నుండరాదు ఇట్టి దోషముచే పతితులైనవా రనేకులు గలరు వీరాహారశుద్ధి గల్గియుండినవారలే

439 నిరంతరము దైవభావము గలిగి దృశ్యములేని స్థితి గల్గుట కొక యుపాయము గలదు అయితే అది యెక్కువ నిష్ఠ గలవారికి మాత్రమే సాధ్యము గాగలదు దీనిని మీయాత్మలో చూచుకొనుచుండవలయును అప్పుడనుభవముచే తెలుసుకొనగలరు అదేమన దీపములు వెలుగుచుండు వీథిలోనికి మీరు చీకటి మార్గమునుండి వచ్చుచుండిన మొదటి లాంతరు దగ్గఱకు చేరునపుడు మీ వెనుకభాగమున మీనీడ పొడవుగా గనుపించును రెండు లాంతరుల మధ్యమునకు వచ్చిన మీకు యే ప్రక్కచూచినను నీడ గనుపించదు ఈలాగున మీ ముందర భాగమును, వెనుకభాగమును, చుట్టును భగవన్మయముగా జ్ఞానము గలిగిన మఱల మీకు దైవమయము

తప్ప మఱియొకటి గనుపింపదు అపు డీశ్వరమయముసకన్న మీకేమియు గోచరము గాజాలదు

440 తనయందుడు ప్రకృతి దోషము తొలగిపోవుచున్నదా? యని తెలిసికొనుటకీ క్రింది విధముగా చూచుకొనిన చాలును వర్షాకాలమున మేఘంములో జలముండుటవలన ఉరుములు, మెఱుపులును గలుగుచుండును శరత్కాలమైన తరువాత మేఘము తెల్లబడి పలుచగాను, శబ్దమున్ను విద్యుత్తును ఏకమైయుండును అలాగున ప్రాకృత దోషములు తగ్గిపోవుచుండిన మాటలు చాల తగ్గి పోవునదేగాక, ఒక విధమగు మౌనభావము గల్గియుండును పూర్ణమౌనవత్రము గలుగకపోయినను చాల మితభాషిత్వము గల్గును అట్టివారి వాక్యములు సారగర్భితములై యుండును అత్యవసరమునకైనను ప్రయత్న పూర్వకముగానే మాటలు గలుగవలసియుండును ఈ యవస్థ గలిగిన మనసు గూడ చాల నిర్మలముగాను, నిశ్చలముగాను సుఖకరముగాను ఉండును ఇదే దీనికి గురుతు

441 సాధకుడా! నీవు త్రిగుణము లను గూటి నుండి బయటపడితివా? లేదా? అని తెలుసుకొనుట కుపాయము జెప్పెద శుక్ల, కృష్ణ, పీత వర్ణములగు పలురకముల అద్దములతో చేయబడిన యొక గొప్పమహాలులో నున్నట్లూహించుకొనుము ఆ యనేక వర్ణములుగల యద్దముల ద్వారా వచ్చెడు సూర్యప్రకాశ మనేకరంగులుగా గనుపించును అయితే బయట వెలుగుచుండు సూర్యుని జూచిన నా వర్ణము లేవియు గనుపింక పోవుటయేగాక ఒక మహాజ్యోతి స్వరూపముగానే గనుపించును అలాగున త్రిగుణములతో గూడిన శరీరమను గృహములో నీవుండువఱకు సత్త్వరజస్తమోగుణములును, ఈ మూడింటియొక్క కలయికచే గలిగెడు అనేకగుణములును నిన్ను కలవరపరచును కావున నీగుణములు హృదయములో ప్రతీతి గల్గియుండువఱకు నీవు త్రిగుణాత్మకమైన సంసారపంజరమునుండి బయటపడలేదని గ్రహించుకొనుము

మూలప్రకృతిని దాటలేదనియు బ్రహ్మరంధ్రమును భేదించి బయట పోలేదనియు తెలియుము తురీయపదములో ప్రవేశించిన యఖండ జ్ఞానజ్వాలయై నీవు వెలయగలవు అదే శివపదము, స్వయంజ్ఞానప్రకాశము దీనికే చైతన్యధామమనియు, చైతన్యధారాప్రవాహమనియు పేర్లు గలవు

442 పుణ్యము లేనివారికి మంచి మంచి స్వాదుకరములైన యహారములను భుజించుటకు గూడ భాగ్యము గలుగదు గదా! అలాగున సుకృత విశేషము వలవక్వావస్థ గలుగనివారికి కర్ణామృతమగు దైవవాక్యములను, జ్ఞానవాక్యములను వినుటకుగూడ భాగ్యము గలుగదు ఎంత సారవంతమైన యాహారము తినినను అల్పసుఖము గనుపించి మఱల మలమైపోవును జ్ఞానామృత పానమో అటువంటిది కాదు అనేక జన్మములనుండి వచ్చుచుండు అజ్ఞాన మహాఘోర దుఃఖమును శమింపచేయునదేగాక వినినప్పుడును, దేహముతోగూడ నుండునప్పుడును, దేహము పోయినప్పుడును నిత్యానందమును గలుగజేయును ఇట్టివారే యథార్థముగా సుకృతజీవులని చెప్పవచ్చును

443 ఓ సాధకుడా! భక్తుడా! అప్పు తీసి సుఖ భోజనాదులు చేయువానిని జూచి సంతోషపడకుము అది యతనికి ప్రస్తుతము సౌఖ్యముగా గనుపించును తరువాత భరింపరాని దుఃఖమును గలుగజేయును కావున బుద్ధిమంతు లెవరును నాలాటి కార్యముల జేయరు అలాగున నేలాటి పరిశ్రమ జేయకయు, అధికతరమగు తపోధ్యాన నిష్ఠాదుల జేయకయు నితరుల యాహారముల భుజించి కాలముగడుపు సాధువులను, భక్తులను జూచి యది మంచి జీవితమని తలంపకుము అట్టిది పూర్వాపరవిచారముగల యే బుద్ధిమంతులును జేయజాలరు కనుక పరిశ్రమపరుడవై జీవితమును గడపి, బ్రహ్మనిష్ఠ చేయుము,లేక అతీత వైరాగ్యనిష్ఠ గలిగి నిరంతరము ధ్యాననిష్ఠలయందుండుము అట్లు గానిచో, నీయొక్క పూర్వపుణ్యము గూడ నశించును మఱల జీవితము నీకు చాల భారమగును

444 ఎండకాలము ముదిరి రాగా రాగా ప్రపంచములోగల మంచు ఎట్లు క్షయించిపోవుచున్నదో, ఆలాగున విరక్తియును, ఉపరతియును వృద్ధినొంది రాగా రాగా హృదయములోగల దృశ్యవాసనా విషయవాసనలు క్షయించుచు వచ్చుచుండును ఎంత వఱకు విషయవాసనలు సంపూర్ణముగా క్షయము పొందలేదో, అంతవఱకు మీకు విరక్తియు, ఉపరతియు అనగా బ్రహ్మనిష్ఠ తీవ్రతరముగా గలుగలేదని తెలిసికొనవలయును

445 బ్రహ్మోత్సవము మొదలగువానిలో మొదట ధ్వజారోహణ క్రియ యొకటి గలదు అయితే దానివలన ఉత్సవము పూర్తి గాజాలదు ధ్వజావరోహణము గలిగినమాత్రమే యాయుత్సవము పూర్తియగును ఆలాగున 'నేతి నేతి' అను వాక్యములచేతను, ధ్యానముచేతను తన్ను ప్రకృతికి విలక్షణునిగాను, పంచకోశ వ్యతిరిక్తునిగాను, అవస్థాత్రయ సాక్షినిగాను తెలిసికొనిన చాలదు అది ధ్వజారోహణమువంటిదే యగును అట్టి తురీయస్థితినుండి దృశ్యము, పంచకోశములు, దేహత్రయముగూడ ఆశుద్ధచైతన్యాత్మకు అన్యముగా లేవనియెడి విచారణచేతను, నిది ధ్యాసనముల చేతను దృశ్యము గూడ దృక్కగునాత్మ కన్యముగా లేదను జ్ఞానము గలుగవలయును అనగా దైవమున కన్యముగా జగత్తు లేదను స్థితిగలుగవలయును అది ధ్వజావరోహణము వంటిది అప్పుడు పూర్తి యైనది అట్టి మహాత్ముడే పూర్ణజ్ఞాని గాగలడని తెలిసికొనవలయును

446 ముముక్షువులారా! కొందరు కర్మయోగమే గొప్పదనియు, మఱికొందఱు భక్తియోగమే శ్రేష్ఠమైనదనియు,ఇక కొందఱు ధ్యానయోగమే యుత్కృష్టమైనదనియు, వేరుకొందరు జ్ఞానయోగము ముఖ్యమైనదనియు చెప్పెదురు వారును పై వానిలో నేదో యొక దానియందు ప్రయత్నించి మంచి యనుభవము గలవారై యుందురు, పరమానందానుభవము గలిగివారై యుందురు ఎవడో ఒకానొక మహనీయుడా నాలుగింటియం దనుభవము గల్గియుండును కొందరి కొక్కదానిలోను, మఱికొందఱికి

రెండింటిలోను అనుభవము గల్గియుండవచ్చును అవి వారికి ఆనందము గలుగజేయుచునే యుండును ఇతరములు ముఖ్యములు గావని వారు చెప్పదురు అంతేగాక వానిలో తృప్తిగూడ గలుగదు ఇది యెటువంటిదనగా నొకరికి ఇంగ్లీషుమాత్రమే తెలియును ఒకరు ఇంగ్లీషులో మిక్కిలి మనోహరముగా జ్ఞానము నుపన్యసించిన, దానిని విని యాతడు మహానందమును జెందుచుండును అయితే యతనికి హిందీభాష తెలియదు ఇంకొకరు హిందీలో ముందు జెప్పిన వానికంటె నత్యధికముగా జ్ఞానము నుపన్యసించుచుండిన భాష తెలియనందుచే నతని కేలాటి యానందము గలుగదు అంతేగాక విసుగుగూడ గలుగవచ్చును మూడవ వాడొకడు సంస్కృతభాషలో నతి మనోహరముగాను, సారగర్భితముగాను అట్టి జ్ఞానమునే బోధించుచున్నాడు ఆ భాష తెలియనివారికి దానియందు ప్రీతి గలుగదు నాల్గవవాడు మఱియొకడు తెలుగున నతిగంభీరమై, ఆనంద ప్రవాహమైన ఆత్మజ్ఞానోపన్యాసమును చేయుచున్నాడు కాని యాభాష తెలియనందుచే పై ముప్పురికిని, ఏలాటి యానందము గలుగలేదు ఈ భాషలలో ఒకటిగాని, రెండుగాని, మూడుగాని, నాలుగుగాని తెలిసియుండినవాడైనచో నన్ని యుపన్యాసములను విని యానందించును కర్మ, భక్తి, యోగ, జ్ఞానములయొక్క స్థితియు నాలాగున నుండునని తెలుసుకొనవలయును

447 విరేచనమునకు మందు తీసికొని అనుకూలమగు వేడినీటిని పుచ్చుకొని ఊరకుండదలంచినచో నేలాగున కడుపులో బాధ గలుగుచుండునో, శుద్ధముగా కొన్ని సారులు దుర్మలము బహిర్గతమై పోయిన మఱల నేలాగున నిశ్చలముగాను, నిర్మలముగాను నుండవచ్చునో, అలాగున హృదయములో దృశ్యసంబంధ సంస్కారము లుండువఱకు మనోనిశ్చలత్వము గలిగి నిర్మలధ్యాన యోగములో నుండుటకు తరము గాదు కావున తపస్సు చేతను, పుణ్యకర్మానుష్ఠానములచేతను, గురుసేవ, దైవభక్తి వ్రతనిష్ఠాదులచేత స్వరూపానుసంధాన బ్రహ్మనిష్ఠ దృఢముగా

గలుగువఱకు నంతఃకరణములో గల దోషములు నశింపవు కావున మనో నిశ్చలత్వముగాని, నిర్మలదైవసుఖములో నిరంతర ముండుట గాని సాధ్యము గాజాలదు

448. కరచరణాదీంద్రియములతో సదా సత్కర్మల జేయుచు వాక్కుతో సదా ధైవవిషయములగాని, ధైవస్మరణగాని, సత్యధర్మమార్గముల నుపదేశించుట గాని, మనస్సులో నేమాలిన్యము లేక సదా సంయమము గలిగి యితర ప్రాణికోట్లకు మేలు గలుగజేయు స్వభావముతోగాని యుండి దైవభావములో నిలుకడగలిగి జీవితాంతమువఱకు నీలాగున కాలము గడుపువాడే మహాత్ముడనియు, గొప్ప బ్రహ్మాజ్ఞాని యనియు, పరమభక్తుడనియు, యోగి యనియు, జీవన్ముక్తుడనియు గ్రహించు కొనవలయును

449 మనస్సున కుద్రేకరముగలిగి యున్నపుడెవ్వరితోను మాట్లాడకుము అంతేగాక ఆ సమయమున నుత్తరముల గూడ నెవ్వరికి వ్రాయకుము అప్పడు మనస్సు ప్రకృతివిషయములగు గుణములతో గలసియుండుటవలన నిజములు గోచరము గావు నీళ్ళు బురదగా నున్నప్పడు దాని యందుగల యే వస్తువును గనుపింపదు జలము తేటపడిన తరువాత ఏలాగున లోభాగములో గల చిన్నచిన్న వస్తువులు సహితము స్పష్టముగా గనుపించునో,ఆలాగున నీ మనస్సు శాంతము నొందిన తరువాత మాట్లాడుము, సమాధానము చెప్పము అట్టైన ప్రమాదము గలుగదు ఇట్టి యోగ్యత గలుగచేసికొనుటయే సంయమముయొక్క లక్షణముగా నుండును

450 మలిన హృదయముతోను, ప్రకృతి యొక్క తమోగుణముతోను గూడినవారితో శుద్ధహృదయము గలవారును, సాత్త్విక గుణముగల వారును గలసియుండుట యెంత కష్టతరమో ఆబాధ హృదయము నేలాగున బాధించుచుండునో, ఆలాగున విశుద్ధగుణము గలుగునప్పడు, గుణత్రయాతీత స్థితిగలిగే కాలము గలుగునప్పడును, నిస్సంకల్పస్థితి

సిద్ధించునప్పుడును సామాన్యముగా కొంత హృదయశుద్ధియు, కొంత సాత్త్విక గుణమును గలవారితో కలసియుండుట గూడ కష్టముగా నుండును అట్టిస్థితి యాలాటివారికి మాత్రమే తెలియగలదు అట్లుండగా వీరికి రజోగుణము తమోగుణములు గలవారితోను, దుర్గుణములతో గూడినవారితోను గలసియుండుట యెంత బాధాకరమో యోచించుకొనవచ్చును

451 అనేకు లనేకవిధములుగా సాధనల జేయుదురు వానిలో నేసాధనయైన నిజస్థితిలో ననగా జ్ఞేయమగు నాత్మలో నిలకడ గలుగు వఱకును అవి యన్నియు భారముగానే యుండును ఒకని శిరముపై మంచివస్తువుగాని, చెడువస్తువుగాని యుండినను అతనికి బరువుగానే యుండును గదా! ఆలాగున కొందరు కనురెప్పలాడకుండ చూచుచుందురు మఱికొందరు ఉచ్ఛ్వాస నిశ్వాసములలో హంసమును గాని, మఱియేదైన నొక మంత్రమునుగాని కలిపి నుడువుచుందురు ఇక కొందరు భ్రూమధ్యాదియాధారస్థానములలో దేనియందైన మనస్సు నిలిపి యభ్యసింతురు వేరు కొందఱు నాసికాగ్రమున సదా చూపు నిలిపి శీలింతురు ఈ లాగున అనేకు లనేకవిధములుగా నభ్యసింతురు ఈలాటి సాధనలలో నెంతకాలము వఱకుందురో అంతవరకు నీయాత్మకు పూర్ణసౌఖ్యము గలుగదు అవి యన్నియు దృశ్యములతో గూడినవే అవి నెత్తిపై భారమువంటివే అన్ని భావములను విడిచి తాను తానై అనగా సద్వస్తువై నిలువగలుగునప్పుడు మాత్రమే సంతతానందము గల్గును అప్పుడు పెద్ద భారమును మస్తకము నుండి తొలగించిన నెంత హాయి గలుగునో, అంత సౌఖ్యమీయాత్మకు గల్గును అయితే స్వరూపము నందు దైవభావములో నిలకడ గల్గియుండు స్థితి యభ్యాసికి గలుగువఱకు పై జెప్పినవానిలో నేదైన ఒక్కటి యుండవలయును లేనిచో మనస్సు దృశ్యము పైకి పరుగెత్తుచుండును

452. కొందరు దేహమును మఱచి, జీవుని మఱచి అనగా నాత్మను

మఱచి, యీశ్వర భావము గలిగి ఆఖరున దానిని మఱచి, యేమియు తెలియని స్థితియే నిర్వికల్పసమాధియనియు, బ్రహ్మసాక్షాత్కారమనియు, జీవన్ముక్తి యనియు పల్కుదురు అట్టి యేమియు తెలియని యవస్థయే జ్ఞానమని చెప్పినచో నది జ్ఞానము గాదు అజ్ఞానమే యగును ఏలన, తెలియదని చెప్పనది యనుభవము లేనిదానిని గురించికదా! అనుభవము గలదానిని తెలుసుననియే గదా చెప్పదురు చీకటిగదిలో నుండునపుడు తన్ను తాను దెలిసికొనడు ప్రకాశము గల గదియైన తన్ను తాను తెలిసికొనుచున్నాడు దేహమును విడిచినందుచే దృశ్యజ్ఞానముండదు అంతఃకరణమును దాటిన తరువాత సూక్ష్మదేహ సంకల్పములుండవు కారణదేహము నతిక్రమించి నందుచే నజ్ఞానము గలుగదు అనగా నావరణముండదు అందువలన నిరావరణసూర్యునివలె స్వయంజ్ఞానప్రకాశుడై వెలుగుచుండును ఈ దేహములకు సంబంధించిన జ్ఞానము లేకపోయినను పోవచ్చును దానికి ఏమియు తెలియని యవస్థ సమాధి యని చెప్పటయే గాని జ్ఞానమయుమై స్వయంజ్యోతిస్స్వరూపమై, చైతన్యములన్నిటికిని చేతనత్వమును గలుగజేయు బ్రహ్మము అనగా నాత్మజ్ఞానస్వరూపమునే యద్వైతమార్గములో మాత్రము జీవేశ్వరైక్యమని చెప్పదురు అచ్చోట త్రిపుటి నశించినదని చెప్పటచే మఱియొకటి లేని దగుటచే, తన కన్యమై యేమియు లేనందుచే దృశ్యమును తన కన్యముగా చూడనందుచే మఱియొకటి తెలిసికొనుట లేకపోవుటచే సమాధినిష్ఠలో బ్రహ్మసాక్షాత్కారములో నేమియు తెలియుట లేదని చెప్పినదే గాని మఱియొకటి గాదని తెలిసికొనవలయును అట్లుగాక సమాధిలో నుండునపుడేమియు తెలియకయు మఱల నుత్థానదశయందు దృశ్యము లన్నియు గలుగుటయు జాడగా నింద్రియముల నతిక్రమించియో లేక ఇంద్రియం నిరోధబలమువలననో తెలియక పోయెననియేం గ్రహించుకొనవలయును అన్నిటిని ప్రకాశింప జేయునది తానై యుండగా తన్ను తాను ఏల తెలిసికొనకపోవును?

453 జనులందరును తమ తమ బుద్ధియొక్క పరిమాణము ననుసరించియే యీశ్వరునియొక్క మహిమను తెలిసికొనుచున్నారు సర్వజ్ఞుడును, సర్వశక్తుడను, పరమకారుణికుడును నగు సర్వేశ్వరుని పూర్ణముగా దెలిసికొనుట సామాన్య జనులకు సాధ్యమైనది గాదు ఫోటో తీయు కెమేరాయొక్కయు దానిలో గల యద్దము యొక్కయు నాకృతి యెంత పెద్దదో లేక యెంత చిన్నదో దానివలన తీయబడు మనుజునియొక్క యాకారము నంతమాత్రమే యుండును కాలంగుళము వెడల్పుగల ఫోటో గూడ తీయవచ్చును పెద్దదానివలన నెంత గొప్పదానినైన దీయవచ్చును అలాగున వారివారి హృదయ వైశాల్యమును బట్టియు, సంకుచితమున ఁబట్టియు భగవంతుడిచ్చిన జ్ఞానము జీవకోట్లకు గలుగు చుండును కనుకనే ముందుగా బుద్ధిని విశాలముగా చేసికొనుడని చెప్పెడు రహస్యము

454 తెల్లకొంగలును, హంసలును చూచుటకు సామాన్యముగా నొకే విధముగ నుండును కొంగలు బురదనీరు, చిన్న చేపలు, కప్పలు ఉండుస్థలములో చేరియుండును రాజహంసము స్వచ్ఛమైన జలమును, తామరపువ్వులును ఉండు మానససరోవరాదులతో గూడియుండును అలాగున మలినహృదయులయొక్కయు, శుద్ధహృదయుల యొక్కయు హృదయభేదము గుణభేదము గలిగియుండును జ్ఞానియందు శుద్ధ గుణములును జ్ఞానహీనునియం దజ్ఞాన గుణములును గలిగి యుండును దీనిని కనుగొనిన హంసయా? లేక తెల్లకొంగయా? యని తెలిసికొనవచ్చును

455 ఆత్మయొక్క యావరణములు(తామసాది గుణములు) వీడిపోవునపుడు జ్ఞానము ఎక్కువగా ప్రకాశమునకు వచ్చును ఒక గొప్పగ్యాసు లైటు నొక పాత్రలో బెట్టిన నది దానియందు మాత్రమే ప్రకాశించును కొంచమైన దగ్గఱగాని బయటగాని ప్రకాశించదు అచ్చోటనుండి యాదీపమును ఒక గొప్ప యింటిలోపల బెట్టిన దాని యందంతట ప్రకాశించును అచ్చటనుండి గొప్పదైన యొక

నాటకశాలయందుంచిన యావిశాల స్థలమునంతయు ప్రకాశింప జేయును ఆ స్థలము నుండి తీసియొక మైదానములో బెట్టిన నా విస్తీర్ణమైన ప్రదేశమునందంతట వెల్గుచుండును ఆలాగున హృదయములోనుండి యావరణము ఎంతకెంత తొలగిపోవుచుండునో, ఆత్మకును అంతకంత వికాసమును, జ్ఞానమును గలుగును

456 ఏలాగున సముద్రప్రయాణీకులు గాని, నదిలో ప్రయాణమును జేయు నావికులు గాని తుఫానుయొక్క చిహ్నము గనుపించిన వెంటనే యోడ నపాయములేని స్థలమునకు జేర్చికొని బాగుగా కట్టివేయుదురో, ఆలాగున దృశ్యమగు సంసారసాగరములో ముక్తితీరమును జేరునిమిత్తము ప్రయాణము చేయు ముముక్షువులు ఏయింద్రియము దృశ్యవిషయములోనికి లాగుచుండునో బాగుగా గనిపెట్టి వెంటనే యట్టిస్థలము నుండి దానిని మరియొక చోటికి మార్చవలయును అనగా తాను మారవలయును లేనిచో నపాయము గలుగుట నిక్కము కానిచో నా యింద్రియములను నిరోధించి యాత్మలోనికి మరలించు కొనవలయును అట్లు కానిచో తుఫానులో చిక్కుకొనిన నావ సముద్రములో మునుగునట్లు తాను దృశ్యవిషయములో మునిగిపోవుట నిక్కము

457 శ్రేష్ఠుడును, శిష్టాచారము గలవాడును నగు నుత్తమ మానవు డేలాగున జాగ్రదవస్థయందు నికృష్టకృత్యముల చేయుటగాని, నికృష్టపదార్థముల భుజించుటగాని, నికృష్టవాక్యముల నుచ్చరించుటగాని చేయడో, అయితే స్వప్నకాలములో ప్రకృతికి వశుడై యుండుటచేతను, ఆత్మస్మృతి లేక పోవుటచేతను చెడు కృత్యములను చేసినట్లును, చెడువాక్యముల నుచ్చరించినట్లును, చెడువస్తువుల దినినట్లును ఏలాగుననుండునో, అట్లే యెవని యొక్క యాత్మ యెంతవరకు పూర్ణవికాసము నొంది, జాగ్రదవస్థగలిగి ఆవరణరహితము గలిగి యుండలేదో, అంతవఱకే యతనికి జాగ్రదవస్థలో గూడ ప్రమాదములు, చెడు కృత్యములు, చెడు వాక్యములు గలుగుచుండును అట్టివాడు తాను అజ్ఞానమగు నిద్రావస్థ

దాటలేదని జ్ఞాపక ముంచుకొనవలయును దీనిని యోగి యైనవాడు చాల జాగ్రత్త గలిగి కనుగొనవలయును

458 పారుదల యాగిపోయిన కాలువ మొదలగువానిలో ముఱికిగా నిలిచియుండు నీరు మొదలైన వన్నియు మంచినీరు పారుదల గలుగునపుడేలాగున కొట్టుకొని పావుచుండునో, అంతేగాక పారుదలయొక్క వేగము చేత కాలువ యేలాగున విస్తీర్ణము నొందుచుండునో, అలాగున నెవరిహృదయములో బ్రహ్మవిచారము తీవ్రముగా కలుగుచుండునో అప్పడు వారి యంతఃకరణములో గలిగియుండు కల్మష విషయవాసన లన్నియు నశించునదే గాక బుద్ధిగూడ చాలవికాసము నొందుచుండును ఇప్పడు కానుపించెడు గొప్పనదులన్నియు చాలాకాలమునకు పూర్వము చిన్నిచిన్ని కాలువలై యుండినవే అలాగున ఇప్పడు మనకు గనుపించెడు మహనీయులందరు నొకకాలమున సామాన్యమానవులై యుండినవారలే

459 ఓ బ్రహ్మనిష్ఠజేయు భక్తుడా! నీకు సులభమగు నొక విషయమును జెప్పెద దీనిని బాగుగా యోచించుకొనిన ప్రకృతినుండి విముక్తి గలిగినదా? యని గ్రహించుకొన వచ్చును ఎవరితో మనకు బంధుత్వము గలిగియుండునో, వారింటికి మనము వెళ్ళుటయు, మనయింటికి వారు వచ్చుటయు పరస్పరము విందులు జరుగుటయు గలుగుచుండును అయితే బంధుత్వము తెగిపోయిన తరువాత పైజెప్పిన రాకపోకలు గలుగవు అలాగున ప్రకృతినుండి విముక్తి గల్గిన దృశ్యవిషయములలోనికి మనసు వెళ్లదు ప్రపంచవిషయమాత్మలోనికి రాదు అదే దానికి గురుతు అట్లు గానిచో ప్రకృతినుండి విముక్తి గలుగలేదని తెలిసి కొనవచ్చును

460 ఒక దేశపటము (మ్యాపు) ను చక్కగా నొకరికి చూపి తెలుపవలసియుండిన నతనికి నక్షరములు తెలియనిచో నేలాగున నాదేశముయొక్క యాకృతియు, నదులు, పర్వతములు, వీథులు, దేవాలయములు, వనములు, మంటపములు, సరోవరములు,

రాజగృహములు మొదలైనవి లెస్సగా తెలుప సాధ్యము గాదో, ఆలాగున శాస్త్రపరిచయము లేనిచో బ్రహ్మవిద్యయు సాంగోపాంగముగా బోధించుటకు సాధ్యము గాదు కావున బ్రహ్మజ్ఞానము, యోగము, తపస్సు మొదలైనవి చక్కగా గ్రహించుకొనవలసి యుండిన విద్యగూడ ఉండవలయును

అంతేగాక మంచియనుష్ఠానమును, పరిపక్వదశయును గలుగవలయును అప్పడే బోధము గాగలుగును అతీంద్రియనిష్ఠగలవారికి మాత్రము శాస్త్రమవసరము లేదు అట్టివారికి జన్మాంతర సంస్కారము పరిపక్వావస్థకు వచ్చియుండును తక్కిన వారందరికిని శాస్త్రము చాల సహాయము చేయును

461 ఆకాశమండలములో నుండు నక్షత్రాదులకు నీ భూమిలో నుండు దానికివలె దినరాత్రులు గాని, శుక్ల కృష్ణపక్షములుగాని, వర్ష గ్రీష్మ ఋతుభేదములుగాని యుండవు ఆలాగున నో జీవుడా! నీ వెల్లప్పడును లోకోపకారమునుగూడ మరచి చిదాకాశమందే యుంటివేని యీ ప్రపంచములో గల సుఖ దుఃఖములతో, నిందాస్తుతులతో సంబంధము గలిగియుండవు కర్మక్షేత్రములలోనికి దిగి ధర్మముల నుపదేశించుటలో ప్రవేశించునప్పడు సుఖ దుఃఖములు, నిందాస్తుతులు, లాభనష్టాలు గలుగుచుండును ఈ తత్త్వమును జ్ఞాపకములో నుంచి కర్మక్షేత్రమలో ధర్మము నుద్బోధించుటకు దిగుము అట్టి ద్వంద్వములను నిగ్రహించుకొనుటయే యింద్రియ నిగ్రహమనియు, యోగమనియు, జ్ఞానమనియు, తపోబలమనియు గ్రహించుకొనుము అట్టి నిగ్రహము గలుగనిచో యోగములోను, జ్ఞానములోను నీవు జయమును బొందలేదని గ్రహించుకొనుము అయితే నిందకు హేతువైన కార్యమును మాత్రము చేయకుము అంతే చాలును, అప్పడు నీవు కృతార్థుడవు గాగలవు

462 పొయ్యిలో నిప్ప బాగుగా మండుచుండిన దానిపై నుండు పాత్రలోగల పదార్థము లేలాగున పొంగుచుండునో శబ్దమును గలుగజేయునో, ఆలాగున ఏధ్యానము చేసినను, లేక ఏ మంత్రమును

జపమొనర్చినను, లేక ఏభావమున దృఢము గలిగినను అప్పుడు శరీర మాసకలము ప్రతిరోమకూపమును ప్రతి యణువును అట్టి భావముగలదై పొంగుచుండును లేక ప్రతిధ్వనించుచుండును అట్టి జపముగాని, ధ్యానముగాని, నిష్ఠగాని గలిగియుండిన నీ తపస్సు తీవ్రముగా జరుగుచుండునని తెలిసికొనుము

463 మనోనిర్మలత్వము గలుగుటకును, శాంతి సిద్ధించుటకును, ఒక ఉపాయము గలదు మనస్సు యొక ఫోటోటీయు యంత్రము వంటిది దేనిని భావించినను ఆ స్వరూపమును తనలో గలుగజేసికొనగలదు కాబట్టి యసహనము గలుగు సమయమున గొప్ప సహనశీలము గలిగియుండు మహానుభావుని, అశాంతిగలుగు సమయమున మహాశాంతపురుషుని, కాఠిన్యము గలుగు సమయమున పరమ కరుణాస్వరూపుని, ధ్యానము కుదరని సమయమున నిర్వికల్పసమాధి నొందిన యోగిని మనస్సులో భావన చేసికొనిన చాలును అప్పుడు వెంటనే మనస్సు మారిపోవును అనగా శ్రీ ఏసుక్రీస్తునుగాని, శ్రీబుద్ధదేవునిగాని, శ్రీదత్తాత్రేయ, శ్రీగురునానక్, శ్రీకృష్ణచైతన్య, శ్రీశుక, శ్రీ కపిల, శ్రీసనక మొదలగువారినిగాని లేక యితరులైన మహానుభావులనుగాని భావించుకొనవచ్చును అయితే వారిజీవితచరిత్రను చదివి జ్ఞాపకముంచుకొనవలయును లేక యిష్టదేవతా మూర్తులనుగాని భావన చేయవచ్చును ఇదే సగుణభక్తి యేర్పడుటకు కారణము పై జెప్పిన మార్గముగాక తనయొక్క స్వధర్మము నెట్టి విషమ పరిస్థితిలోనైన విడువరాదని దృఢప్రతిజ్ఞ గలవారు అట్టిదానిని నిశ్చయముగా జేసికొనవచ్చును లేక తనయొక్క యాత్మను జ్ఞానస్వరూపమునుగాను, దివ్య స్వరూపమునుగాను, ఇంద్రియాతీత స్వరూపమునుగాను, దైవస్వరూపమునుగాను భావనజేయచ్చును అయితే స్వధర్మమును స్వస్వరూపమును ధ్యానము జేయుట సామాన్యజనులకు సాధ్యము గాదు

464 పుణ్యాత్ములయొక్కయు, పాపాత్ముల యొక్కయు స్వభావమును, లేక దేవతాస్వభావము గలవారియొక్కయు,

అసురస్వభావము గలవారి యొక్కయు స్వభావమును తెలిసికొనుటకు మార్గ వేమన రాక్షసానురులు లోకములో పుణ్యకార్యములను, ధర్మకార్యములను నశింపజేయుచుందురు దేవతలు, ఋషులు, సిద్ధపురుషులు పుణ్యకార్యములను ధర్మకార్యములను వృద్ధిపరచుచుందురు ఆలాగున మానవులలోగూడ పుణ్యకర్మల వృద్ధిపరచువారు దేవలక్షణము గలవారనియు, పాపకర్మముల వృద్ధిపరచుటయు, పుణ్యకర్మల నశింపజేయు స్వభావముగలవా రసురరాక్షసాంశము గలవారని గ్రహించుకొనవలయును పుణ్యజీవియైనచో నేవస్తువును చెరచడు, అనగా నశింపజేయడు పాపజీవియైన తనకు ప్రయోజనము లేనప్పటికిని నన్నిటిని క్షయ మొనర్చుచుండును పుణ్యజీవి ముక్తిని, పాపజీవి దుఃఖముతో గూడిన బంధమును బొందును

465 జ్ఞాన బోధములు మూడు విధములుగా గలవు ఒకటి సామాన్యబోధము, రెడు విశేషబోధము, మూడు అతీతబోధము రోగియైనవా డౌషధసేవా పథ్యములచే నారోగ్యము గలుగజేసి కొనినట్లును, మలినవస్త్రమును చౌడు మొదలైన వానిచే నుతికి శుభ్రపరచినట్లును, తపస్సు, యోగము, భక్తి మొదలగు దివ్యవృత్తులచే నాత్మలోగల యజ్ఞానమును రహిత మొనర్చుకొనుట మొదలైన యుక్తులన్నియు సామాన్య బోధములో జేరినవి దృశ్యాది విషయములకు అనగా మనోబుద్ధ్యాదులన్నిటికిని నాత్మ సాక్షిగా నుండియు, స్ఫటికమణి సన్నిధిలోగల యెరుపు, నలుపు, పసుపు వర్ణములు మణియందు ప్రతిఫలించి శుద్ధస్ఫటిక మణిగూడ అట్టి రంగుల వర్ణములు గలిగియున్నట్లు తోచునేగాని వాస్తవ విచారణచే మణియందు లేనట్లు విచారణ జ్ఞానశక్తిచే నాత్మ సమస్తమునకు విలక్షణమై శుద్ధజ్ఞానమై యుండునని తెలుపుట విశేషబోధ యనంబడును సద్వస్తువగు బ్రహ్మమున కన్యమైనది యణుమాత్రమైన మరియొకటి దృశ్య పదార్థము గలదని తలంచుట భ్రమ యగును రజ్జువునందు సర్పము, అకాశము నందు నీలత్వము వాస్తవముగా లేనట్లు, తనయొక్క, స్వరూపము నిత్యమై, శుద్ధమై,

శివమై యీశ్వరమయమైయుండియు, తన్నుతాను తెలిసి కొనకపోవుటయే బంధమనియు, తన యొక్క స్వరూపమగు బ్రహ్మత్వమును తెలిసి కొనుటయే ముక్తియని తెలిపెడు బోధ యేది గలదో, అది అతీతబోధ యనబడును దీనినే భావాతీతమనియు, అవాఙ్మానస గోచరమనియు గ్రహించుకొనవలసి యుండును అయితే ప్రపంచములో సామాన్యజను లెక్కువగా నుండుటచే సామాన్యబోధ యెక్కువ యవసరమైనది

468 పిచ్చివా రేలాగున తమ శరీరమును కొట్టుకొనుట, గాయపరచుట, రాళ్ళు కొయ్యల మొదలైన బరువుల మోయుట, అనేక దుఃఖములు గలుగుజేసుకొని మరల దుఃఖించుట మొదలగు కృత్యముల జేయుచుందురో, ఆలాగున వివేకజ్ఞానము మనోనిగ్రహమును గలుగని సామాన్యజను లనేకసంకల్పములు, అనేక చింతలు గలుగజేసికొని పై జెప్పిన పిచ్చివారివలె మఱల క్లేశముల గలుగజేసికొని దీనభావమునొంది రోదనము జేసికొనుట, చింతాపరవశులై విషాదము నొందుట మొదలగు నవస్థల బొందుచుందురు ఈవిషయములో మతిభ్రమగల పిచ్చివానికిని మనోనిగ్రహములేని సామాన్యమనుజునికి ఏమి భేదము గలదు? కావున వివేకము గలవారనేక సంకల్పముల జేసికొని దుఃఖము నొందదగదు

469 ప్రపంచములో సమత్వము సమాధానము గలుగజేసికొనుట కొక యుపాయము గలదు మీలో నెరవైన నొక గొప్ప వ్యాపారము జరుగు స్థలమునకు వెళ్ళిచూచిన నచటెన్ని దుకాణములు గలవో, ఏయే వస్తువుల విక్రయించుచున్నారో వాటి నన్నిటిని గనుగొనిన ననేక సామాను లచ్చట నుండుటయు, కొనుటయు గనుపించును ఇవి యన్నియు నేదోయొక విధముగా జనసముదాయమున కుపయోగపడునట్లు గోచరము గాగలదు వెయ్యేల ప్రాత చెప్పలను గుట్టువారును, వీథి నూడ్చువారును, మరుగుదొడ్డిని కడుగువారు గూడ నొక గొప్ప సహాయమును లోకమునకు జేయుచున్నట్లు గోచరమగును ఈలాగున లోకములో ఎన్ని మతములు, ఎన్ని సమాజములు, ఎన్ని సంఘములు, ఎన్ని ప్రార్థనాపద్ధతులు, ఎన్ని

యారాధనవిధులుగలవో, యవియన్నియు మనుజులయొక్క మనః పరిపక్వత ననుసరించి యుపయోగ పడునవియై యున్నవి ఇట్టి విశాల దృష్టి గలుగునపుడే మీకు నాత్మశాంతియు, సమత్వమును గలుగును అంతవఱకు మీ సంప్రదాయము, మీ పద్ధతియు నెక్కువ యను బుద్ధి గలిగియుండును

468 ఒకడు ఒక గొప్ప విశాలమగు స్థలమును కొన్నాడు అతనినుండి అన్ని వర్ణస్థులను, అన్ని యాశ్రమములవారును కొంత కొంత భూమిని తీసికొన్నారు వారు వారు తీసికొనిన భూమికి సరిహద్దుల నేర్పాటు జేసికొనిరి దానికి వారి వారి కులము, కుటుంబము, వృత్తి, పేరులతో గూడ రిజిష్టరు పత్రము వ్రాయించినారు వారు వారు కొనిన భూమిపై నేదైన వ్యవహారము వచ్చినపుడు వారువారు ఇది మాభూమి, వట్టిమాట గాదు మా వద్ద గవర్నమెంటులో రిజిష్టరైన పత్రము గలదు అని వాదించునట్లే, అనంతమైన సచ్చిదానందాత్మయందు నవిద్యచే నేర్పడిన యంతఃకరణములును, తదనుగుణములును భావములై యేర్పడి జనులు సంకల్పములకు వశులై వారివారి భావము ననుసరించి వారి వారిని బ్రాహ్మణాదిజాతులుగాను, బ్రహ్మచర్యాద్యాశ్రమములు గలవారినిగాను, పిపీలికాది జంతువులు గాను, ఇంద్రాది దేవతలుగాను, బ్రహ్మాది దైవములుగాను జెప్పకొనుచున్నారు దానికి తగిన శాస్త్రముల నిర్ణయించియున్నారు కావుననే యేదైన వివాదములు వచ్చినపుడు మేము చెప్పనవి వ్యర్థవాక్యములు గావు మాకనాది యగు శాస్త్రప్రమాణములు గలవు అని వచించుచున్నారు భూమిని వీరు కొనినప్పటికిని దానికంటె పూర్వమేలాగున అది ఒకేవిధముగానే యుండెనో, వీరియొక్క హద్దులు మాత్రమే కల్పితములై యేర్పడినవో, ఆలాగున భావమునకు లోబడిన పరమాత్మయందీ భేదము లన్నియు గలవు కావుననే భావాతీతస్థితి నొందవలయునని చెప్పెడు రహస్యము అందరికిని ఇచ్చిన భూములను మరల నసలువాడు తీసుకొని యింతవరకు వేసియుండు హద్దులను తీసివేసిన మరల పూర్వముండునట్లు ఒకే భూమిగానే యుండునుగదా! కావున భావములన్నియు జీవకల్పితములు

సర్వేశ్వరుడెపుడు నందరి హృదయములోను నొకేవిధముగానే యుంటున్నాడు

469 పరమభక్తోత్తములారా! మీ యాత్మజ్ఞానజ్యోతినేలాగున సంరక్షించవలయునో, దానిని తెలిసికొనుటకు మీరు వైదికములగు కర్మల జేయుస్థలమునకు గాని లేక శ్రీ రామసప్తాహాదులు జేయు స్థలమునకుగాని పోయి చూచిన ముఖ్య పూజ జరుగు స్థలములో బెట్టియుండు నఖండదీప మేలాగున సంరక్షింపబడుచున్నదో, ఒక జాగ్రత గల మనుష్యుని దీపమారిపోవకయుండునట్లు చూచే లాగున యెట్లు నియమించియుందురో యాలాగున మీ యాత్మజ్యోతి నారిపోనీయక మనస్సును జాగ్రత్తతో దానిపై నుంచవలయును గాలి రాని స్థలములో దీపమునుంచుటయు, తైలము నశించిన పోయుటయు, వత్తిపై కొడిగట్టిన కొట్టివేసి పైకెక్కించుటయు నతని కార్యమైయుండును ఆలాగున జ్ఞానజ్యోతి దైవభక్తి కరుణ యనుతైలము క్షయింపకయు, దృశ్యవాసన యను గాలిని ప్రవేశింపనీయకయు, అజాగ్రత్త, మందత, ప్రమాదత మొదలగు దోషములు గలిగిన వెంటనే కనిపెట్టి యనుష్ఠానమునందు జాగ్రత్త గలిగి వర్తించుటయు గలిగియుండవలయును అట్టిన జ్ఞానజ్యోతి యెప్పుడును ప్రకాశించుచునే యుండును

470 శ్రీకాశిలో నివసించువారు తాము మహాపుణ్యక్షేత్రమగు వారణాసియందు నివసించుచున్నామని యైనను మరుపు గలుగక యుండిన శివలోక ప్రాప్తి గలుగనని వదంతి గలదు ఆలాగున గురుపుత్రులందరును, జిజ్ఞాసులందరును, సాధువులందరును కనీసము తాము పై జెప్పినస్థితిలో నుండువారమనియైనను జ్ఞాపకము గలిగియుండవలయును అట్టిన దానివలన పుణ్యలోక ప్రాప్తియైన గలుగును దీనియొక్క సారవేమన అట్టి విచారము గలిగియుండిన నా పుణ్యభావమునకు భిన్నమగు పాపస్వభావము గలుగదు అట్లు గానిచో కాశిలో నుండియు దానిని మరచి హీనకృత్యములో ప్రవర్తించువారికి

కాశీవాస పుణ్యమైనను గలుగదుగదా! కావున మీరుండు స్థితిని మరువక యుండవలయును

471 దైవవిచారణము, భక్తి, కరుణ, లేని వట్టి కర్మకాండ క్రియలుగాని, ప్రపంచవ్యవహారములు గాని, సారము లేనివే అవి సారరహితమైన చెఱుకు పిప్పివంటిదే దైవవిచారము, కరుణ, శాంతి గలిగి జ్ఞానముతో గూడిన యనుష్ఠానములు గాని, కర్మకాండ క్రియలుగాని, సంసార వ్యవహారములు గాని సారముతో గూడినవే ఇదే సంసారములోగల సారము ఇది రసముతో గూడిన మంచి చెఱకు వంటిది కేవలము జ్ఞేయమగు దైవభక్తిగాని, శమదమాదులతో గూడిన సాక్షాత్కార జ్ఞానము మాత్రము గలిగియుండిన నది కేవలసారము మాత్రమేయగును ఇది చెఱుకునుండి తీసికాచిన బెల్లము, కలకంఢ, పంచదారవంటిది యగును వీరు జీవన్ముక్తులు ఇట్టివారి బోధయే యుత్తమమైనది తక్కినవి మధ్యమములుగాను, హీనములుగాను నుండును

472. సోమరితనము తమొగుణముతో గూడినది అది జడము జడమైన రాతిబండ యెల్లప్పడు క్రిందికి లాగుకొనుచుండును సోఽహం పరత్వము సత్త్వగుణాన్వితము అది అగ్నివంటిది చైతన్యము ఎల్లప్పడు పై భాగమునకే పోవుచుండును కావున తమోగుణమును విడిచి త్వరలో సత్త్వగుణము నవలంబించవలయును

473 ఏలాగున రేడియోద్వారా వెలువడు శబ్దములు దానికి అనుగుణమగు యంత్రములు ఎన్నికోట్లు ఎన్నిదేశములలో నుండినను, అవి చిన్నవిగా గాని, పెద్దవిగా గాని యుండినప్పటికిని ఏకకాలములో అన్నిటిలోను ఒకేవిధముగ శబ్దములను ప్రతిధ్వనింపచేయుచున్నవో, ఆలాగున మీరు ఈశ్వరసాన్నిధ్యమును చెందవలసియుండిన వ్యష్టికి సాక్షిచైతన్యమగు మీ యాత్మలోనికి మీ యాత్మసన్నిధానములోనికి ప్రవేశించిన చాలును అదే మిమ్ములను సాక్షిచైతన్యాత్మయగు ఈశ్వరునిలోనికి, ఈశ్వర సన్నిధానము లోనికి తీసికొని వెళ్ళును ఏలన ఈశ్వరుడు బ్రహ్మాది స్తంబ

పర్యంతముగల చరాచర ప్రాణికోట్లయందు అంతర్యామియై వెలుగుచున్నాడు గదా! ఈ తత్త్వమును తెలిసికొనియే యాత్మలో మనస్సును ఐక్యము చేయుమనియు, ఆత్మసన్నిధిలో చేరుమనియు ఉపదేశించెడు రహస్యమైయున్నది

474 ఓ జీవుడా! ముందుకు పోవలసియుండిన నీకు అడ్డు గలిగియుండిన ఏలాగున పోవుట సాధ్యము గాదో, ఆలాగున నీవు కులాభిమానముచేగాని, ధనాభిమానముచేగాని, అధికారాభిమానముచే గాని, విద్యాభిమానముచేగాని ప్రహరి గట్టుకొనినచో ముందుకు పోజాలవని సదా జ్ఞాపక ముంచుకొనుము అనగా పురోభివృద్ధిని పొందజాలక పోవుటయేం గాక బోనులోపడిన సింహామువలె కష్టమనుభవింపగలవు సుమా!

475 ఓ సాధకుడా! పాలు పొంగునపుడు కొంచెము నీళ్ళు చల్లిన, వెంటనే ఏలాగున పొంగు తగ్గిపోవునో ఆలాగున నీయొక్క పవిత్రమైన యనుష్ఠానము చేతను ధ్యాన, జ్ఞాన, తపో, భక్తి మొదలగు వీని మహిమలవలనను నీ యొక్క యశస్సు ప్రపంచములో మిక్కుటముగ ప్రకాశించునపుడు ఓర్వలేనివారు నీపై నిందలను, దోషములను ఆరోపింతురు ఇది నీకు చాల యనుకూల మనియు, సహాయమనియు తెలిసికొనుము ఏలన పాలు పొంగునపుడు నీళ్ళు చల్లకపోయిన పొంగిపోవచ్చును ఆలాగున యశస్సును, గౌరవమును, పూజ్యతయును గలుగునపుడు ఒళ్ళుమరచి యుందువేమో, గనుక భగవంతుడు నీపై కరుణ గలిగి నీ జాగ్రత్తకొరకు ఆలాగున చేయుచున్నాడని గ్రహించుకొనవలెను

476 ఓ జీవుడా! నిన్ను నీవు మరుగుపరచుకొనకుము నిన్ను నీవు మరుగుపరచుకొనుటవలననే నీకు ఈశ్వరుడు మరుగుపడియున్నాడు రాత్రియందు నీచేతిలో నొక దీపముండునని యనుకొనుము అట్టి దీపమును నీవు పాత్రముచే మూసివైచిన నీకు ఏలాగున దీపము కనుపించదో, చీకటిలో నేమియు గోచరము గాదో,

ఆలాగున నీయొక్క అన్నివృత్తులకు సాక్షిగానుండు నాత్మను (దైవమును) నీవు మరుగుపరచుటచేతనే, నీకు ఈశ్వర సాక్షాత్కారము గలుగక పోవుటయు, అజ్ఞానములో మునిగియుండుటయు గలుగుచున్నదని మరువకుము అనగా ఆత్మవంచన లేక యే కార్యమైనను చేయుము

ఉపదేశామృతము ద్వితీయభాగము

సంపూర్ణము





# ఉపదేశామృతము

## తృతీయ భాగము

477 ఆత్మశోధన చేయవలెనని వేదాంతు లనేకులు చెప్పుచుందురు అది మంచిదే అయితే అది పృథివి, అప్పు, తేజస్సు, వాయువు, ఆకాశము, జ్ఞానేంద్రియములు, కర్మేంద్రియములు అంతఃకరణము - వీటియొక్క యుత్పత్తిలయములు లెక్కపెట్టుట మాత్రము కాదు సుమీ! మీ యాత్మలో అనాత్మ గుణము గలుగుచున్నదా, లేక యాత్మగుణముమాత్రము గలిగి జ్ఞానమయముగ నున్నదా? యని యాత్మలో శోదన జేసికొనుడు ఇది యొక్కటి మాత్రమే మీకు ముక్తి గలుగజేయును ఇది లేనిచో తక్కిన యాత్మవిచార మిసుమంతయైనను మీకు సౌఖ్యమును గలుగజేయదు

478 విజ్ఞానము వికసించి రాగా రాగా మానవుడు దేవత్వము నొందును విజ్ఞానము క్షీణించి పోగా పోగా నీ మానవుడే మృగత్వమునకు వచ్చును విజ్ఞానము వికసించినవుడు మానవుని యాత్మపైగల యావరణములు తొలగిపోవుచుండును దీనివలన నాత్మప్రకాశము గలుగును ఆలాగున నజ్ఞానము వృద్ధి గలిగి రాగా రాగా పాపముచే నాత్మప్రకాశము తగ్గిపోవును అప్పడు పాపకర్మలవలన గలిగెడు దోషము లాత్మావరణము జేయుచుండును దీనివలన భూత ప్రేతపిశాచములుగానో, నీచమానవులుగానో మృగములుగానో జన్మ మెత్తవలసియుండును విజ్ఞానము వికసించుటకు ముఖ్యకారణము ఆత్మస్వరూపమును తెలిసికొని

ధ్యానము చేయుటయు, సాత్త్వికాహారము గలిగియుండుటయు, సాత్త్విక ప్రవృత్తి గలిగియుండుటయు, నగును తామ్రమును మట్టిలో బడవేసిన క్రమముగా త్రుప్పబట్టి దానియొక్క స్వరూపము నశించి మట్టియై పోవును అట్టి రాగిని స్ఫుటము జేసిన రసాయన మహిమచే దానియందుగల కల్మషము నశించి అపరంజి బంగారము గాగల్గును జీవునియొక్క పరిణామమున్నూ ఈలాగుననే యుండును దీనివలననే స్వర్గనరకములు, దేవపిశాచ జన్మములు గలుగునని శాస్త్రము జెప్పెడి రహస్యము

479 మనోనైర్మల్యము గావలయునా? నిష్కామకర్మయోగము ననుసరించుము అనగా పుణ్యకర్మచే పాపనివృత్తి గలుగును భగవద్భక్తి గలుగవలయునా? ఈశ్వరసేవ చేయుము అనగా ఈశ్వరోపాసనవలన ప్రకృతిదోషములు క్షయించును చిత్త నిశ్చలత్వము గావలయునా? ప్రాణసంయమపరమగు హంసయోగమును శీలింపుము అనగా హంసయోగముచే మనశ్చలనత్వ ముడుగును మోక్షము గావలయునా? జ్ఞానము నభ్యసించుకొనుము అనగా జ్ఞానమొక్కదానివలన మాత్రమే మోక్షము సిద్ధించును

480 ఈశ్వరమహిమ యనంతమైనది ఒక్కొక్కరును వారి వారి మనస్సనెడు (బుద్ధి)కొలత పాత్రముచేతనే దానిని కొలుచుచుందురు అది యొక గొప్ప ధాన్యరాశివంటిది బుద్ధి కొలతపాత్రము కొందఱు కుంచముచేతను, మఱికొందఱు ముంతచేతను, ఇకకొందఱు మానికచేతను, మఱికొందఱు పడిచేతను కొలుచుచుందురు వారి వారికి తగినంత లాభమును వారు వారు పొందుచుందురు ఇదే ఈశ్వరవిషయలాభాలాభములకు కారణమగుచున్నది అనగా కొందఱు దేహముచేతను, కొందఱు కులముచేతను, కొందఱు దేశముచేతను, కొందఱు అధికారముచేతను, కొంద ఱాశ్రమముచేతను, కొందఱు మనస్సు చేతను, కొందఱు బుద్ధిచేతను కొలుచుచున్నారు వీరెవరును ఈశ్వరుని పూర్ణముగా దెలిసికొనజాలరు

481 ఏలాగున గొప్పభారము గల యింజనుల చక్రము లతివేగముగా దిరుగుచుండునో, దానికి వాటియొక్క లోపలగల యావిరియే యెట్లు కారణమగుచున్నదో, కంటికి గనుపించు ఆ గొప్పయంత్రముల త్రిప్పుచుండు ఆవిరి (స్టీము-కరెంటు) యేలాగున కనుపించునది గాదో, ఆలాగున నీకానుపించు దేహేంద్రియములే గాక మనస్సు మొదలగు నంతరింద్రియములు సహా యాత్మశక్తివలననే పనిచేయుచున్నవి ఆత్మశక్తి లేని వారి మానసేంద్రియములును, దేహమును స్వాధీనములో నుండవు ఆత్మశక్తిగలవారి మానసేంద్రియములు, దేహము, ఎల్లప్పుడు నాత్మకు స్వాధీనములై యుండును దీనివలన నొకరి మనోవాక్కాయవృత్తులు ధర్మమునకును, జ్ఞానమునకును వశవర్తులై యుండిన నతనికి నాత్మశక్తి గలగియుండును అట్లు గాని వానికి నాత్మశక్తి పూర్తిగా వికసించలేదని తెలిసికొనవలయును

482 దుర్బలమైన ఒక స్తంభమునకు గట్టివేసిన సామాన్యజంతువులుగూడ దానిని లాగుకొనిపోవును మిక్కిలి బలముగలదై లోతుగా నాటబడియుండు స్తంభమైనచో దానియందు గజాశ్వములైనను, ఎద్దులనైనను గట్టివేసినను నేలాగున స్తంభమును లాగుకొని పోవజాలక దానిచుట్టును బడియుండునో, ఆలాగున నెవరికి విజ్ఞానాభివృద్ధి గలిగియుండునో వారియొక్క మానసేంద్రియములన్నియు దనకు స్వాధీనములై యుండును అట్లు గానివానికి మానసేంద్రియములు వశవర్తులై యుండవు దీనివలన నతనియొక్క విజ్ఞానశక్తిని దెలిసికొనవచ్చును

483 కంద, పెండలము, పసుపు మొదలగువాని గడ్డలు త్రవ్వి తీసుకొనినను చిన్న చిన్న గడ్డలు భూమిలో పడియుండును అవి వర్షము గురిసినవెంటనే మొలకెత్తును కాని కనిపెట్టి అప్పుడే తీసివేసిన నా విత్తనము మరలనుండదు తీసివేయక పోయినచో నవి మరల వనమైపోవును పరంపరగా నాభూమియందు విత్తనము నశింపజాలదు ఆలాగున

హృదయములో నెంత పరిశీలించినను మరల మరల ననేకజన్మముల సంస్కారము లుద్బుద్ధమగుచుండును వాటినన్నిటిని గనిపెట్టి తీసివేయు చుండవలయును అనగా వైరాగ్యము గలిగి వృత్తుల నిగ్రహించి ధ్యానము చేతను, జ్ఞానము చేతను గలిగెడు నగ్నిలో దహింపజేయవలెను వృత్తులు స్వభావములని తలంచి యూరకుండిననవి వృద్ధియై సంసారారణ్యమగును

484 ఓసాధకుడా? సౌధమును గట్టునపుడు గోడ యేలాగున కొంచెమైనను వంకర లేకుండ గట్టవలయునో, కొంచమైన వంపుబోయినచో నది కొన్నిరోజులకు తప్పక యేలాగున పడిపోవునో ఆలాగున నీవు నిర్మించెడు మోక్షసాధనములో నేలాటి లోపమును గలుగనీయక ఋజు మార్గవర్తనమును గలిగియుండుము లేనిచో కొంతకాలమునకు పతనము గలుగునని నమ్మకము గలిగి వర్తించుము ఈ విషయములో జాగ్రత్త గలిగియుండుము

485 ఆత్మసంస్కారము చేయు బోధకులు మంచి వడ్రంగిపనివారి వలెనుందురు వారు కుప్పలుగా నఱికివేసియుండు ప్రానులలోనే ప్రాను నెట్లుపయోగపరచుటకు యోగ్యముగా నుండునో, వాని లోగల వంకరలను లావులను ఏలాగున గొడ్డలిచేతను, బాడిశలచేతను చెక్కిచక్కబరతురో, ఆలాగున జనులను సంస్కరింపజేసి యుపయోగుల నేలాగున జేయవలయునో ఆలాగున జీవితమున ఋజుత్వపుమార్పులు జేయవలసియుండును ఈసంగతి నితరులు దెలిసికొనజాలరు వారు పనివారు గారు, కొయ్యలను జూచి వెళ్లెడు బాటసారుల వంటివారు వీరేమియు జేయజాలరు

486 ఒకడు కలెక్టరు మొదలగు పనులయందెంత కాలమువఱకుండునో అంతవరకు వాని శాసనము లమలులో జరుపబడును అట్టి యుద్యోగమునుండి విరమించిన తరువాత నాతని శాసనములెవ్వియు నుపయోగములుగావు ఆలాగున బ్రహ్మనిష్ఠజేయు వారెంత వరకు సత్య, ధర్మనిష్ఠ గలిగియుందురో, అంతవరకే వారివాక్యములకు

విలువ గలిగియుండును అంతవరకే వారి వాక్యములు ఫలించును ఎపుడనుష్ఠానములోనుండి జారిపోదురో, అపుడు వారి వాక్యము లెవ్వియు ఫలమును గలుగజేయవు ఇదే యోగములోను తపస్సులోను, గల రహస్యము ఈ విషయమును బ్రహ్మనిష్ఠులు చాల జాగరూకులై కనిపెట్టుచుండవలయును

487 నది చిన్నదైనను తీవ్రముగ ప్రవహించుచుండిన దానియొక్క యాటంకములు తొలగునదే గాక విస్తీర్ణవేర్పడి గమ్యస్థానమగు సముద్రమున కేలాగున జేరుచుండునో ఆలాగున నొకరిమనస్సు దైవ విషయమై యెంతయేకాగ్రతయు, తీవ్రనిష్ఠయు గలిగియుండునో వారికంత దైవప్రాప్తిలోగల విఘ్నములన్నియు, తొలగుటయేగాక దైవప్రాప్తియు గూడ శీఘ్రముగానే కలుగును ఈ విధి దైవ ప్రాప్తియొక్క దానికి మాత్రముగాక యేకార్యమునకైనను చిత్తైకాగ్రతయు, సదా తదేకచింతనయు గలిగియుండిన నా కార్యము గూడ త్వరలో సిద్ధించునదే గాక దానియొక్క ప్రాప్తిలో గల విఘ్నములు గూడ తొలగిపోవును

488. మలము(పాపము) నశించినవారికి శ్రవణమందు బుద్ధి గలుగును విక్షేపము నశించినవారికి మననమందు నిలుకడ సిద్ధించును ఆవరణము పోయినవారికే నిదిధ్యాసనములో రూఢి గలుగును శ్రవణ మా సమయమున మాత్రమే సౌఖ్యమును గలుగజేయును మననము తలంచినపుడెల్ల సుఖమునిచ్చుచుండును నిదిధ్యాసనము కలిగిన, నెల్లపుడున్నూ నిరతిశయ సుఖమును గలుగజేయును అయితే యిది యెటువంటి దనగా నున్నతోన్నత పర్వతపంక్తిగల ప్రదేశములో శరత్కాలచంద్రోదయము వంటిదగును అట్టి చంద్రుని సమీపముననుండు పర్వతముపై కెక్కిన పట్టుకొనవచ్చునని తోచును ఆకొండ యెక్కి చూచిన మిక్కిలిదూరముగా నుండునట్లును, సమీపముననుండు దానికంటె నెక్కువగా గిర్యారోహణము జేసిన చంద్రుని తాకవచ్చునని తోచును ఈలాగున నెంతెంత ఎత్తుపోయినను చంద్రగోళమును స్పర్శించుట ప్రయాస

మని తలంపెట్లు గలుగునో ఆలాగున శ్రవణమందు సులభముగా దోచవచ్చును కాని మననమందు బ్రవేశించిన మఱింత ప్రయాసముగా గోచరమగును అప్పడే చిత్తైకాగ్రత లేనిచో నది సాధ్యము గాదను తెలివి గల్గును నిదిధ్యాపసమున ప్రవేశించిన బ్రహ్మనిష్ఠయొక్క మహిమ గోచరము గాగల్గును అప్పడు సంపూర్ణవాసనాక్షయము, మనోనాశనము గాజాలనిచో నిది లభ్యము గాదని బోధపడును

489 పశుత్వమునకును (జీవత్వమునకును) శివత్వమునకును (ఈశ్వరత్వమునకును) రెండే మార్గములు ఇంద్రియములకు వశపడిన పశుత్వమును, ఇంద్రియముల వశములో నుంచిన నీశ్వరత్వమున్నూ జీవులకు గలుగుచుండును

490 అంగరక్షకులు లేని రాజునకు ప్రమాదము గలుగవచ్చును రాజైనచో అంగరక్షకు లుండియే యుందురు ఆలాగున జ్ఞానబోధ మొకటి మాత్రము గలిగియుండిన చాలదు దానికి పతనము గలుగనీయక రక్షించుటకు 1 వివేకము, 2 వైరాగ్యము, 3 ఉపశమనము, 4 సంయమము-అను నీ జ్ఞానాంగములు సదా గలిగియుండవలయును అట్టి వారికెచటను పతనము గాని, ప్రమాదము గాని గలుగదు

491 ప్రభుత్వము జేయు ప్రభువునకు మంచి మంత్రులుండిన, నేలాగున ప్రభుత్వమున కేలాటి లోపమును గలుగదో, ఆలాగున జ్ఞానము (యోగము) అను ప్రభుత్వమునకు, 1 నిరాశ, 2 తపస్సు, 3 వ్రతనిష్ఠ, 4 ఉత్కృష్ట శాస్త్రవిచారణయు నను నల్వురు మంత్రులు గలిగి యుండవలయును అట్లు గానిచో నాత్మ రాజ్యములో ప్రభుత్వము జేయుటకు యోగ్యత యుండదు మంత్రులెంత యోగ్యులో ఆ ప్రభుత్వము గూడ నంతయోగ్యమై యుండును ఆలాగున పై జెప్పిన నాలుగు జ్ఞానాంగములు ఎంత యోగ్యములై యుండునో వారియొక్క జ్ఞానమును అంత యోగ్యమై యుండును అట్లు గానిచో దుష్టమంత్రులుగల రాజ్యమునకు వలె వీరి జ్ఞానమునకును పతనము గలుగును

492. జీవుడా! నీవు గొప్ప యరణ్య మధ్యములో బడిపోయియున్నావు దీనినుండి బయట బడవలసియుండిన మంచు, గాలి, వాన, ఎండ మొదలైనవాటిని మిక్కిలి సహించుకొని కొంతదూరము వఱకు గులకరాళ్లపై నడుపవలసియుండును అట్లయిన మరల నిత్య సుఖములను గలుగజేయు గృహమునకు జేరవచ్చును అట్లు గానిచో చిరకాలము పై జెప్పిన దుఃఖముల ననుభవించుచు నిచటనే పడియుండవలసివచ్చును అట్లు సంసారారణ్యములో బడిన జీవుడు దానిని దాటవలసి యుండిన యెండ, వాన, గాలి, మంచు మొదలైన వాటిని సహించుకొని, ఆకలి మొదలగువాటి కోర్చుకొని జనుల నిందలను అవమానములను సహించుకొని, బ్రహ్మనిష్ఠ కనుకూలమగు స్థలములను ఏకాంతప్రదేశములను గలుగజేసి కొనవలసియుండును అట్లుగానిచో నీసంసారదుఃఖము శమింపదు దీనిని సహించుకొనిన కొంతకాలములోనే ముక్తిపొందవచ్చును సౌకర్యమును విడిచి నిష్ఠచేయక పోయిన భవారణ్యమును దాటజాలవని జీవునితో సదా చెప్పుచుండవలయును ఇదే విరక్తుల యొక్క స్వభావము

493 శరీరములోపల రోగము గలిగి బయటకి కనుపించక పోయినను లోపల రోగముండువఱకు నాత్మ కేలాగున సౌఖ్యము గలుగదో, అలాగున మీయొక్క దోషములు బయటజనులకు కనబరచక పోయినను మీకు దుఃఖము మాత్రము సదా గలిగియుండుట నిక్కము రోగము కొంచెముగా నుండినను బాధ గలుగునట్లు ప్రాకృతగుణములు లేశమాత్రముండినను నిత్యసుఖమున్ను, ప్రశాంతియు గలుగదు దీనిని కనుగొని యాత్మశుద్ధి చేసికొనుము

494 మానవజన్మము యొక్క లక్ష్యమేమని యనేకు లడుగు చుందురు ఇది సామాన్య విశేషములచే రెండు లక్ష్యములుగా నుండును సామాన్య మితరులకు మేలుచేయుటయే యగును ఏమాత్రమైనను కీడు ఇతర ప్రాణులకు గలుగ జేయగూడదు విశేషలక్ష్యము దుఃఖరహితావస్థను బొందుటయే ఇది ప్రకృతి నశించిన జీవులకు మాత్రమే సిద్ధించును తక్కినవి

లెక్కలో చేరినవి గావు భగవంతుని భజించుటయు, భగవంతునిలో నైక్యమగుటయు, భగవద్ధర్మములననుష్ఠించుటయు, జీవితలక్ష్యమని కొందఱు తలంతురు ఇవి యన్నియు పై జెప్పినవాటిలో నంతర్భూతములే

495 సోమరితనము గల జీవితము, అనగా పరిశ్రమచేయని బ్రతుకు మొదట సౌఖ్యముగా గనుపించినను ఏలాటి యున్నతస్థితి గలుగక పోవుటయే గాక జీవితాంతము వఱకు వరుల నాశ్రయించియే జీవించవలసియుండును పశువునకైన కొంచెము స్వాతంత్ర్యమున్ను, గౌరవమున్ను, కలిగి యుండవచ్చునే గాని యతని కంతమాత్రమైనను మానవత్వ లక్షణము గలిగి యుండదు వీనికంటె ఏ సహాయమును లేని ఆజన్మరోగము గలిగియుండువాడు మేలు ఏలన? అతనిని లోకము నిందింపదు

496 ఓ భక్తుడా! నీవు ఏదైన లోకోపకారమగు ధర్మకార్యములో ప్రవేశించి నీయిష్టమునకు తగినంత సహాయము జనులుచేయక పోయిన, వారికి భక్తిలేదు ధర్మబుద్ధి లేదు అను వాక్యముల చెప్పకుము నీకు ఇంకను ఆత్మశక్తి, దైవశక్తి, జ్ఞానశక్తి, తపశ్శక్తి గలుగలేదని నిన్ను నీవే నిందించుకొనుము అంతేగాని లోకమును నిందింపకుము ఏలన? ఇతరుల యాచించుట నీయొక్క మొదటి తప్పని గ్రహించుకొనుము అధికారహీనములగు వాక్యములను నెవరైన పాలింతురా? అధికారము గలవాని వచనముల నందఱును శిరసావహింతురుగదా? ఇదే నీ కాత్మశాంతి గలుగుటకు గల ముఖ్యోపదేశము ఈతత్త్వము నెఱింగి నీవున్నతస్థితికి వచ్చేలాగున జేసికొనుము

497 మనస్సు దుష్టవృత్తిగల వేశ్యాస్త్రీ వంటిది అట్టి స్త్రీ విటపురుషుడు దొఱికిన నెల్లప్పడు తనయొక్క సౌఖ్యము నిమిత్తము వాని నేలాగున లోబరచుకొనునో, తననుండి విడుదల పొందుటగాని సత్యధర్మమార్గములలో ప్రవేశించుట గాని యెట్లిష్టపడదో, ఆలాగున మలినమనస్సు గలిగియుండువఱకు అది యెల్లప్పడాత్మను దేహసౌఖ్యముల నిమిత్తము లాగి

వేయుచుండును దేహేంద్రియ సుఖములనుండి విడుదలపొందుట కిష్టము గలిగియుండదు ఈసత్యమును తెలిసికొనుటకు తగిన వివేకము గలిగినపుడే జీవుడు శుద్ధుడుగాను, పుణ్యాత్ముడుగాను నగును మనస్సు చేయు ఈ మోసమును తెలిసికొనుట మిక్కిలి కష్టము జీవులు బంధనములనుండి విడుదల బొందక పోవుటకు కారణ మిదే

498 అంతఃకరణములో త్రిగుణములుండువఱకు మాత్రమే అట్టిస్వభావము బ్రహ్మనిష్ఠులకు గలిగియుండును ఎరుపు, తెలుపు పసుపు,నీలము మొదలగు రంగులు గల విద్యుద్దీపముల నొకే స్థలములో నమర్చియుండునట్లు తలంచుడు విద్యుత్తుయొక్క తీగ దేనియందు తగిలి యుండునో ఆదీపము ప్రకాశించును ఏదీపముయొక్కగ్లాసు పగిలిపోవునో అప్పడు దానియందు విద్యుత్తు ప్రవేశించినను చిమ్నియొక్క వర్ణముగా ప్రకాశింపదు కేవలము విద్యుత్తు కాంతిమాత్రమే వెలుగు చుండును కేవలము గ్లాసుమాత్రముచే దీపము ప్రకాశింపదు విద్యుత్తున్ను, లాంపులున్ను గలిగినప్పడు మాత్రమే వెలుగుచుండును ఆలాగున కేవలసాక్షి చైతన్యమున్ను, కేవలము అంతఃకరణమున్ను, ప్రత్యేకించి ఏపనినిన్ని చేయజాలదు సుషుప్తియున్ను, సమాధియున్ను దీనికి దృష్టాంతములు సుషుప్తియందు చైతన్యాత్మ సంబంధము లేదు సమాధియందు జడమగు అంతఃకరణము లేదు ఈ రహస్యమును దెలిసికొనిన నింద్రియాతీతావస్థను గలుగజేసికొనవచ్చును సత్త్వరజస్తమస్సుల స్థితియున్ను గ్రహించు కొనదగును

499 శైశవావస్థలో జీవులు మలమూత్రములలో బడియుండినను కడిగి శుద్ధముజేసి కొనవలయు ననెడు తలంపు వారికి గలిగి యుండదు కొంత శక్తివచ్చిన మలములో నుండుట కిష్టము గలుగక శుద్ధము చేసికొనవలయునని తలంపుగలిగి యెట్లు శుచిగా నుందురో, ఆలాగున జీవుడు బాల్యావస్థలోనుండుం తరుణమున నంతఃకరణములోగల విషయమాలిన్యమును శుభ్రపరచ వలెనను సంకల్పము గల్గియుండడు

ప్రబోదమగు ఆత్మస్వాతంత్ర్యము వచ్చిన మనోవాక్కాయములలో నేలాటి విషయ దోషములుండుటకు నహింపదు దీనివలన ఒకజీవుడు అజ్ఞానదశయగు బాల్యావస్థలోనున్నాడా? జ్ఞానమైన యౌవనావస్థకు వచ్చినాడా? అని కనుగొనవచ్చును

500 ఎంత మాధుర్యముగల వస్తువైనను జిహ్వాసమీపమున నుంచినదైనను, దానియొక్కరసమును నాలుక యేలాగున గ్రహింపజాలదో, నోటిలో నుంచిన మాత్రమే రుచి దెలిసికొన సాధ్యమగునో, అలాగున నెంత వఱకు మనస్సు ధ్యానకాలమున నాత్మలో నైక్యము గాలేదో (స్వరూపస్థితిలో నిలుకడ గలుగదో) అంతవఱకు నమితానందముగల యాత్మసుఖమును యోగి పొందజాలడు

501 కొంత భక్తి యోగానుష్ఠానము గలుగజేసికొన తలంపు గలవారిలో చాలామంది కీలాటి యభిప్రాయము గలదు అయితే రజోగుణముగాని, తమోగుణము కొంతవఱకు గాని యుండువఱకే యట్లు గలుగును అదేమన వారెచ్చటికైన పోవుటకును, వచ్చుటకును, తినుటకును, తిరుగుటకును, క్షౌర, వస్త్రధారణాదుల చేయుటకున్నూ స్వాతంత్ర్య ముండవలయు ననుటయే యథార్థమును విచారించి నదియు నస్వాతంత్ర్యవే, ఏలన ? అవియన్నియు మనస్సు యొక్కయు, దేహముయొక్కయు, ఇంద్రియముల యొక్కయు గుణమునకు లోబడిపోవుటయే యగును ఇది పరాధీనతయేగాని స్వాతంత్ర్యము గాదు ఇట్టివారికి మంచి నియమనిష్ఠగల గురువులవద్దగాని, ఆశ్రమములోగాని యుండి యనుష్ఠానము చేసికొనుట కవకాశము గలుగకపోవుచున్నది ఈసర్వేంద్రియముల సంయమమే (జయమే) నిజమగు స్వాతంత్ర్యమగును పై జెప్పిన గుణమీకాలమున చాలామంది సాధువులలో గనబడుచున్నది

502 కొందఱు తమకులమును గుఱించియు, గోత్రమును గుఱించియు, వర్ణమును గుఱించియు, ఆశ్రమమును గుఱించియు గొప్పగా చెప్పకొని గర్విష్ఠులైయుందురు వివేకదృష్టితో జూచిన నిది

యెటువంటిదనగా, తన దేహమునుండి వదలిపోయిన మలమూత్రముల జూచి స్తోత్రము జేయునట్లుండును ఆత్మకు దేహేంద్రియములన్నియు మాయామలముచే నేర్పడినవిగదా? సూక్ష్మదృష్టి గలుగనందుచేతనే అనేకులిట్టి భ్రమలో పడి జీవితమును వ్యర్థపరచుచున్నారు ఈరహస్యములన్నియు తత్త్వజ్ఞానోదయము గలుగువఱకు మనకు తెలిసికొనతరము గాదు ప్రకృతియొక్క శక్తి యటువంటిది

503 సాధకులు మఱింత జాగ్రత్తతో జూచుకొనవలసిన విషయము మఱియొకటి గలదు అది ధ్యానకాలములో జరుగునవస్థయే నదులు సముద్రమున సంగమించు కొన్ని స్థలములలో నదియొక్క యిరుపార్శ్వముల గొప్ప పట్టణము లుండును, సముద్రమునకు చంద్రోదయమందును అస్తమయసమయము నందును జలము పొంగే స్వభావముండును దీనినే సముద్రము యొక్క "పోటు" అనియు "పాటు" అనియు ననెదరు పాటు సమయమున జలమతి వేగముగా నదులనుండి సముద్రములోనికి పోవుచుండును అత్తఱి సముద్రముఖముగా నావికులు నదిని దాటవలసి యుండిన బహుజాగ్రత్త గలిగియుండవలయును గాలియును అదే ప్రక్కకు తోలుచుండిన మరింత జాగ్రత్త గలిగి తెడ్ల చేతను, చుక్కానిచేతను, పడవను నడుపవలయును లేనిచో సముద్రములోనికి పడవను ప్రవాహవేగము లాగివేయును అదేరీతిగా దృశ్యప్రవాహమునుండి సాధకుడు జపముగాని, ధ్యానము గాని చేయుచుండినను మనస్సు ధ్యేయాకారములోగాని, దైవభావములోగాని, నిశ్చయించిన లక్ష్యములో గాని నిలువక దృశ్యమువైపు సంకల్పములవైపునను పోవుచుండును అట్లు పోనియ్యక అతిజాగ్రత్తతో జ్ఞేయవస్తువునుండిగాని, దైవమునుండి గాని, యిక నేదైన లక్ష్యముండిన దానినుండి గాని మనస్సును పోనీయక జాగ్రత్త వహించవలయును లేనిచో దృశ్యములో మునిగిపోవును అట్టివారికి ఫలమతి స్వల్పముగానే గలుగును

504 కొందఱు మహాశివరాత్రి దినమునగాని, వైకుంఠైకాదశిరోజున

గాని, ఇకనేపైన వ్రతనియమముల ననుసరించి గాని జాగారము చేసెదరు రాత్రులలో నెప్పుడైన నిద్రవచ్చి స్వాధీనము తప్పిపోవుచుండునని తెలిసిన చన్నీటితో ముఖమును కడుగుకొనుటగాని, నీటితో నేత్రముల తుడుచుకొని అచ్చటచ్చటికి కొంత తిరుగుట గాని యెట్లు చేయుదురో ఆలాగున ధ్యానము చేయువారికి గూడ నేమియు తెలియని యవస్థ యొకటి గలుగును అది నిద్రయు గాదు, స్వప్నమును గాదు అప్పుడు స్వరూప జ్ఞానము మాత్రము గలిగి యుండదు అత్తరి అచ్చటనే యుండి వివేకశక్తితో తెలివితెచ్చుకొనిన మంచిది లేక వెంటనేలేచి చన్నీటితో ముఖము కడుగుకొనుటగాని, మంచి గాలియుండు ప్రదేశములో కొంతసేపు తిరుగుటగాని, కీర్తనల పాడుటగాని, ముఖ్యములైన కొన్నియాసనముల నభ్యసించుటగాని, ప్రాణాయామము చేయుటగాని చేసిన యాదోషము తొలగిపోవును కొంచెము మంచినీరు త్రాగినను విరోధము లేదు, అది యొకవిధమగు లయము ఈలాటివి ఎన్నియో దోషములు సమాధికి భంగకరములైనవి గలవు

505 రోగియైనవాడు వైద్యాలయములో నుండినను, వైద్యుని దగ్గఱనుండినను ఔషధ పథ్యములు లేనిచో రోగము బాగుపడనటుల పుణ్యాశ్రమములో గాని, పుణ్యాత్ముల దగ్గఱగాని యుండినను సరియైన సాధానానుష్ఠానములు లేనిచో భవరోగము నశింపదు శాంతి గలుగదు జ్ఞాన ముదయింపదు ప్రసన్నత సిద్ధింపదు

506 భక్తులారా! ఈ చెప్పబోవు విషయములో జాగరూకులై యుండవలయును అట్లయిన మాత్రమే తరణోపాయము గలుగును కామ్యకర్మ పుణ్యములచే స్వర్గలోక ప్రాప్తిగాని, పాపకర్మలచే భూతప్రేతపిశాచములుగా గాని, క్రూరకృత్యముల నాచరించు జంతువులుగా గాని జన్మించినను మనము పరాధీనులముగా నుండవలయును ఈయొక్క మానవ జన్మమునందు మాత్రమే మనకు స్వాధీనత కలిగియుండును పై జెప్పిన రెండు జన్మములలోను ప్రకృతి ననుసరించియే పోవలసియుండును మనుష్య జన్మములో మాత్రమే మంచికర్మలకు గాని,

చెడుకర్మలకు గాని యనుకూలముండును ఎట్లన, మీరు సుషుప్తిలో నేమియు చేయజాలరు అలాగున స్వప్నమునగూడ నేమియు జేయనొల్లరు పశువుల జన్మము సుషుప్తివంటిది గాను, దేవతలజన్మము స్వప్నావస్థవంటిదిగా నుండును మానవసృష్టి జాగ్రదవస్థవంటిది కావున వివేక మార్గము ననుసరించి యీశ్వరుని పొందుటకు నీ నరజన్మ మొక్కటియే సాధనమగుచుండును

507 సాధనపరులారా! పరమ రహస్య మొకటి గలదు ఇదే శాస్త్రములలో జ్ఞానవిజ్ఞానపరులై యుండవలెనని చెప్పెడు రహస్యము ఒకడు విశేషబుద్ధియు, జ్ఞానముకలిగి నూతన యంత్రమును గాని లేక రసాయన విద్యను గాని, లేక ఆహారాది పక్వక్రమమునుగాని తెలిసికొనినను దానికి తగిన సాధన సామగ్రి లేనిచో నేలాగున నవీన యంత్రమును గాని, ఔషధాది రసాయనములగాని, ఆహారాది వస్తువులనుగాని చేయజాలడో అలాగున బ్రహ్మవిచారము చేయువారికి దానికి తగిన యనుష్ఠానమున్నూ, అంతః కరణ పరిపక్వదశయున్నూ తప్పక గలుగవలయును కావుననే వివేక ప్రజ్ఞ యొక్కటి మాత్రమే గలిగిన చాలదనియు, ఆచరణయు మనఃపరిపక్వదశ యున్నూ గలుగవలెననియు శాస్త్రము చెప్పెడు రహస్యము అప్పుడు మాత్రమే ఫలించును లేనిచో సామగ్రి లేని వైజ్ఞానికునియొక్క ప్రజ్ఞావిశేషమువలె నుండునే గాని యేమియు చేయజాలడు ఈ రహస్య మంతయు తెలియకపోవుటే బ్రహ్మవిద్య కింతపతనము గలుగుటకు కారణమైనది

508 భక్తులారా! కృతజ్ఞత (ప్రత్యుపకారము) యొక్క మహిమ చూడుడు మనకుపయోగము లేని, కుడితినీళ్లు, గడ్డి మొదలగు వాటిని గోవుల కిచ్చిన నవి యెంత సుందరమైన అమృతమువంటి పాలను మనకి చ్చుచున్నవో, అలాగున నూడ్చి పారవేయు కుప్పలను పేడను పెట్టిన వృక్షము ఎంత మధురమైన ఫలమును, మనోహరమును, సుగంధమును గల పుష్పములను మనకిచ్చుచున్నవో యెఱుంగుడు జంతువులున్నూ, వృక్షములున్ను, ఈలాటి కృతజ్ఞత కల్గియుండగా, మానవులు ఎంత కృతఘ్నతా

స్వభావము గలిగియుండవలయునో యోచించికొనుడు అట్లైన ప్రత్యేకించి భక్తులును, సాధువులును, ఎటువంటి ప్రత్యుపకార స్వభావము గలిగియుండవలయునో తెలిసికొనవచ్చును

509 సాదనపరులారా! భగవంతుని ప్రార్థించి యెండ, వాన, మొదలగు మార్పులు గలుగజేసి కొనినను చేసికొనవచ్చును కాని భగవంతుడు గూడ బీజమును సామాన్యముగా మార్పుజేయడు అలాగున మీయంతఃకరణములో గల గుణముల ననుసరించిన ఫలమునే భగవంతుడు గలుగచేయునేగాని సామాన్యముగా మార్పుజేయడు కావున హృదయము శుద్ధముగానున్నదా? లేదా? యని సదా జాగ్రత్తగలిగి చూచుకొనుచుండవలయును లేనిచో మీభక్తి గాని, యోగము గాని, తపస్సు గాని, వ్రతము గాని, మంచిఫలమును గలుగజేయజాలదని గ్రహించు కొనవలయును

510 బ్రహ్మనిష్ఠాభిలాషగల జ్ఞానోత్తములారా! మీరు గొప్పకంపెనీలో వ్యాపారము జేయువారివలె నుండవలసినదేగాని, షాపులో నుండి కొద్ది కొద్ది సామానులు తెచ్చి పెట్టుకొని వ్యాపారముచేయువారివలె నుండరాదు కంపెనీ వ్యాపారములో మోసముండదు చిల్లరగా పెట్టి అమ్ము కొంతమందిలో మోసకృత్యములుండవచ్చును అలాగున గొప్ప బ్రహ్మ నిష్ఠులును, దైవానుభవ సాక్షాత్కారము గల వారిని ఆదర్శ పురుషులనుగా చేసికొనవలసినదేగాని, సామాన్యముగా చిన్నస్థితిలో నుండువారిని ఆదర్శ పురుషులనుగా (గురువులనుగా) భావన చేసికొన కూడదు, వారి యాదర్శములు లోకాతీతముగాను, విశాలభావములు గలవిగాను నుండుట దుస్తరము

511 బ్రహ్మనిష్ఠులందఱును గొప్ప మేడకట్టు మేస్త్రివలె యుండవలయును అతడు గోడకట్టునపుడు అప్పుడప్పుడు నీరుమట్టము పెట్టి చూచుచుండును ఎందుకనగా కొంచెమైనను వాటము తప్పిపోయిన యా మేడకు ఎప్పుడైనను నపాయము గలుగును అలాగున మీరు

మోక్షసాధమును నిర్మించుచున్నారు అట్టిస్థితిలో మీయందు ఏదైన సత్యమునకున్నూ ఋజుత్వమునకున్నూదైవమునకున్నూ భిన్నమైన భావము గలుగుచున్నదా యని జాగరూకతతో జూచుకొను చుండవలయును లేనిచో వెనుక కొంతకాలమునకు పతనము గలుగును ఇది నిక్కము

512 యుద్ధములో నొక రాజ్యమును జయించినను సామంతరాజులను, ప్రజలను స్వాధీనపరచుకొని తమశాసనము ననుసరించి రాజ్యపరిపాలనము జేయవలయునన్న కొంతకాలము పట్టవలసియుండును అలాగున మీరు ధ్యాన జ్ఞాననిష్ఠలచే ప్రకృతిని జయించినను లేక దైవకృపచే నాత్మబోధ గలిగినను, జ్ఞేయములో (ఆత్మైక్యజ్ఞానములో) నిలుకడ గలుగజేసికొనినను, నిశ్శేషవాసనాక్షయ మనోనాశములు గలిగి యెల్లప్పుడు దైవభావములో నిలకడ గలిగియుండవలసి యుండిన మఱింత కాలము పట్టవలసియుండును

513 కృషి చేయు వాడొకడు గోధుమ, వరి, సజ్జ, రాగి మొదలగు పైరులు చేయుచున్నచో వానిలో ఏపైరు చెడునో దానిఫలితము మాత్రము వానికి లేకపోవునేగాని తక్కినవాటి ఫలితములు లేకపోవుగదా! అలాగున యొకడు సత్యమును, శాంతమును, కరుణను, వైరాగ్యమును, బ్రహ్మచర్యమును, అహింసను పాలించుచుండిన, వీనిలో దేనికైన భంగము కలిగినచో దానివలన గలిగెడు ఫలము మాత్రము లభింపకపోవునే గాని తక్కిన యనుష్ఠానముల ఫలములు లభింపకపోవు

514 సాధువులారా! ఏవృక్షపు ఆకులైనను పచ్చిగా నున్నపుడు రాలవు, పండునపుడే రాలిపోవును అలాగున సత్త్వగుణము పరిపక్వదశకు వచ్చునపుడే ఇంద్రియములను విషయములు ఆత్మనుండి రాలిపోవును రజోగుణముగాని, తమోగుణముగాని యుండునంతవఱకు విషయములను తొలగింప జూచినను అవి తొలగనేరవు

516. ముముక్షువులారా! ఒక్కరు సౌఖ్యవంతులు గావలసియుండిన ఋణము మాత్రములేక యుండిన చాలదు ధనవంతుడు కావలెను

అట్లుండగా ధనహీనుడుగాను, ఋణస్థుడుగాను నుండిన అట్టివానికి సుఖమెట్లు గల్గును? అలాగున నిత్యశాంతియు శాశ్వత సౌఖ్యమున్ను మీకు కావలసియుండిన ప్రాకృతగుణములు లేక యుండినమాత్రము చాలదు కరుణ, విరక్తి మున్నగు సుగుణ సంపత్తియున్ను గలిగియుండవలెను అట్లుండగా సుగుణ రహితమును, దుర్గుణ సంభరితమునగు హృదయములో ఎట్లు నిత్యశాంతియు, నిరతిశయ సౌఖ్యమున్ను గల్గును? అయితే ఋణము లేనిచో బాధమాత్రము గలుగదు అలాగున విషయదోషము లేనిచో ప్రకృతి బాధ గలుగదు

516 జనులారా! జీవితమంతయు పవిత్రముగ లేనిచో మీరెప్పుడైన మనశ్శాంతి కొఱకు గాని, ధ్యానము కొఱకు గాని వెళ్ళునపుడు మీరొనర్చిన పాపకార్యములు మిమ్ములను బాధించుచుండును అత్తఱి ఇతః పూర్వమొనర్చిన పాపకార్యములన్నియు జ్ఞాపకమునకు వచ్చును దానివలన నిరంతరము మనఃక్లేశము గలుగుటయేగాక చిత్తభ్రాంతి కూడ గలుగవచ్చును అలాగున మీరేకాంతమున బ్రహ్మనిష్ఠ చేయునపుడుగాని, తపమొనర్చునపుడు గాని దీనికి పూర్వము చేసియుండు పుణ్యకర్మములన్నియు జ్ఞాపకమునకు వచ్చి అపరిమితానందమును గలుగచేయును అట్లనే ఎచ్చటికి పోయినప్పటికిని పాపమున్ను అలాగున బాధించుచుండును కావున ఈకార్యములో యెంతో జాగ్రత్త కలిగియుండవలయును కావుననే కొందఱు పుణ్యభూములలోనుండి తపమొనర్చుచున్నను, ఏవైన కష్టములు వచ్చినపుడు తాను పూర్వము చేసిన కర్మలను గుఱించి వ్యాకుల చిత్తము గలిగి క్లేశముతో దుఃఖించు చుందురు కావున తాను చేయు సమస్తకార్యములను సాక్షిరూపముగనుండి సర్వేశ్వరుడు చూచుచున్నట్లు మఱువగూడదు

517 నిర్జలప్రదేశములో ఎంత తిరిగినను దాహముతో తపించుచున్నవారికి దాహశాంతి యెట్లు గలుగదో, పుణ్యనదీజలములోనికి ప్రవేశించిన ఎట్లు దాహశాంతి గల్గునో, అలాగున తురీయములోనికి

ప్రవేశించువఱకును, సంకల్పములుడిగి దైవభావములో నిలుకడగల్గు వఱకును జీవునకు నిత్యశాంతి గలుగదు కావున దాహముతో ఎడారిలో నుండువారు ఎంత త్వరితముగ జలాశయము దగ్గరకు జేర నిశ్చయింతురో, అలాగున బాహ్యకర్మకాండములోను, బాహ్యలోకములోను సంచరించెడి స్వభావముగల జీవుడు అంతశీఘ్రముగ ఆత్మానుసంధానములోనికి ప్రవేశించవలెను అప్పడే బ్రహ్మనిష్ఠ యొక్క పరమసుఖమును అనుభవింపగలుగును అయితే మనస్సు ఉపరతి పొందవలసియుండినను చలన ముడుగవలసి యుండినను వృత్తులు నశింపవలెను వృత్తులు నశించుటకు వైరాగ్యము బాగుగ కలుగవలెను వైరాగ్యము గలుగవలసి యుండిన పాపకర్మలు నశించిపోవలెను అట్టి పాపము నశించవలసియుండిన సత్కర్మలు చక్కగ నాచరించవలెను

518 కొందఱీలాగున చెప్పదురు మాకు ఏలాటి సంకల్పములున్ను, వృత్తులున్ను లేవు కాని ఆత్మశాంతి, నిర్మలసౌఖ్యము కలుగలేదు ఈవాక్యము సత్యమైనది కాదు ఆకాశము నిర్మలముగా నున్నదిగాని సూర్యుడుగాని, చంద్రుడుగాని కనుపించుట లేదని చెప్పినచో ఎట్లు పొసగదో అలాగున నిజముగా హృదయ నిర్మలత్వమున్ను, నిస్సంకల్పమున్ను గలిగిన నిరతిశయ బ్రహ్మసుఖము గలుగకపోదు

519 మరికొందఱిట్లు చెప్పదురు 'మా హృదయములో ఏలాటిగుణములున్ను విషయవాసనలున్ను లేవుగాని, ఆత్మశాంతియు, నిజమగు ఆత్మదర్శనము (దైవభావము) న్ను గలుగలేదు' ఇదిన్ని ఆత్మలో సత్యము గలిగిన వాక్యము గాదు ఇది యెటువంటిదనగా- మా నేత్రములో ఏలాటి రోగములేదు పటలము గాని పొరగాని యేమియు లేదు కాని కన్ను మాత్రము కనుపించుటలేదు, ఇదిన్ని సత్యమైన వచనము కాదు కంటిలో ఏలాటి దోషము లేనిచో కనుపించక పోదుకదా! మీరు సత్యమెఱుంగుటకు లోతుగ విచారించిన నిజము కనుకొనగలరు

520 ఇకకొందఱిట్లు చెప్పదురు "మా యంతఃకరణములో ఏలాటి

సంకల్పములున్ను, కోరికలున్ను, వృత్తులున్ను లేవు కాని నిరాటంకముగా దైవసుఖము గలుగుట లేదు!" ఇదిన్ని సత్యమైన వాక్కుగాదు చెఱువునుండి జలము వచ్చెడు తూములో ఏలాటి అడ్డులు లేవు కాని నీళ్ళు మాత్రము వచ్చుట లేదు! అని చెప్పిన దానికేమి అర్థము గలదు? జలము వచ్చు ద్వారములో ఏదైన అడ్డులేనిచో జలము రాకుండపోవునా? కావున ఈలాగున చెప్పవారు తమ ఆత్మలో బాగుగ పరిశోధన చేసిన, లోపము కనుపించకపోదు అట్టిలోపము నివృత్తిచేసిన నిరతిశయ దైవసుఖము అనర్గళముగ ప్రవహించుచుండును

521 మనోనిర్మలత్వమున్ను, చిత్తశాంతియు గలుగవలయునని తలంచువారికి ఒక ఉపాయము గలదు అదేమన మితభాషణమున్ను, ఏసమయములోను మాట్లాడు నప్పుడుగాని, యితర కార్యములు చేయునప్పుడుగాని ముఖమందేలాటి అప్రసన్న భావము గలుగనీయక చూచుటయు నగును ఈ మొదలగు అభ్యాసములు నేర్చుకొనిన మనోజయము సులభముగ గలుగును చుక్కాణివాడు జాగ్రత్త గలిగియుండిన ఎట్టిగాలిలో గాని, ప్రవాహ వేగములో గాని ఏలాగున కొంచమైనను అపాయము గలుగక ఓడను తీసికొని పోగల్గునో, ఆలాగున ఈ అభ్యాసమున్ను మనుజుని దరిజేర్చగలదు

522 వసంతకాలము వచ్చునప్పుడు ప్రతివృక్షమున్ను ప్రతిసంవత్సరమున్ను పెరిగే స్వభావము గలిగి యుండును కాని వృక్షమూలమునకు ఏదైన కీడు గలిగిన అది పెరుగదు ఆలాగున నిజమైన బ్రహ్మ నిష్ఠ జరుగుచుండిన అది అయిదు అంగములతో ప్రతిసంవత్సరము వృద్ధినొందుచుండు వలెను అట్లు వృద్ధినొందనిచో తన అనుష్ఠానములో ఏదైన లోపము గలదని నిశ్చయించుకొనవలెను ఆ అయిదు అంగము లెవ్వియనగా (1) అచ్చోటకు వచ్చెడు భక్తులకు నివసించుటకు తగిన ఆశ్రమములు (కట్టడములు) గలిగియుండవలెను (2) అచ్చోటనుండు భక్తులకు కావలసిన భోజనాది పదార్థములకు కొఱత గలుగక నుండవలెను

(3) తాను ఏ యనుష్ఠానము చేయుచుండునో దానిలో క్రొత్త క్రొత్త జనులు చేరి సాధన చేయుచుండ వలెను, (4) తనలో తనకు పూర్వాధికముగ పవిత్రతయు, శాంతియు, నిరతిశయసుఖమును గలిగినట్లు తోచవలెను అంతేగాక ఇదివరలో ఏవైన విషయవాసనలు గాని, దృశ్యవృత్తులు గాని ప్రకృతి స్వభావములు గాని ఉండిన, అవన్నియు నశించినట్లు ఆత్మలో గోచరము కావలెను సామాన్యముగ ముముక్షువులగు భక్తులకు, సాధకులకు ఇట్టి ఫలమే కానుపించును (5) ఈ అయిదవ సిద్ధిచాల హెచ్చైన నిష్ఠగల వారికి, ప్రకృతిదోషము నశించిన వారికి మాత్రమే సిద్ధించును అదేదన, తాను తలంచిన సమస్త కార్యములు నిర్విఘ్నముగ జరుగుచుండవలెను ఇది కలిగిన సంకల్పశుద్ధియు, ఆత్మనిర్మలత్వమున్ను కలిగినట్లు తెలుసుకొనవలెను

523 ఈశ్వరుండు కలడా? లేడా? అను విషయమై అనేకులు సందేహపడుచుందురు ఈశ్వరుని తెలిసికొనవలసియుండిన ఎట్టి సాధనలు గలిగిన హృదయము కావలసియుండునో, అట్టి సాధనలు చేసుకొని చూడక, ఏలాగున నిశ్చయించు కొనవచ్చును? రేడియో యంత్ర ముండిన మాత్రమే యచ్చోట ఎంత దూరప్రదేశములో నుండు సంగీతమైనను వినవచ్చును అట్లు రేడియో యంత్రములేనివాడు ఈదినము ఎచ్చోటను సంగీతపు పాటలు లేవనియు, ఉండినయేల వినవచ్చుట లేదనియు, చెప్పిన దానికి ఏయర్థమున్ను ఎట్లు లేదో, అలాగున చిత్తోపరతియు, ఆత్మశుద్ధియు గలిగిన దివ్యపురుషులచే తెలియందగిన దివ్యవిషయము అట్టి పరిపక్వతలేని హృదయము గలవారు ఎట్లు తెలిసి కొనగలరు? రేడియోలో పంపుచుండువార్తలు ఆకాశమండల మంతయు నిండియుండును గదా? కాని యంత్రములేనిచో ఆశబ్దమును విన జాలము అలాగున సర్వేశ్వరుండు సకల చరాచరములగు పరమాణువులో గూడ నిండియుండినను మాయాదోషము గలవారి కాతడు కనిపింపడు

524 సామాన్య శుద్ధజలములోను, వాయువులోను అనేక

సూక్ష్మజీవులు ఉన్నట్లు దుర్భిణి యంత్రము ద్వారా కనుగొనుచున్నాము అట్టి యంత్రము లేనివారి కవి కనుపింపవు ఆలాగున సర్వేశ్వరుండు సకల పరమాణువులలో గూడ వెలుగుచున్నప్పటికిన్ని అతీంద్రియులై అప్రాకృతమైన దివ్యచక్షుస్సు గలవారగు వరకు ఎవరికిన్నీ కనుపించడు గదా! కావున ప్రకృతి రహితావస్థ అంతఃకరణములో గలిగినవాడు మాత్రమే ఈశ్వరుని చూడగలుగును ఋషుల అవస్థ సిద్ధించునపుడు, అతీంద్రియజ్ఞానము గలుగునపుడు అందరికిన్నీ ఆతడు గోచరము కాగలుగును

525 గడియారము మొదలగు యంత్రములకు ఉండవలసిన చక్రములు, గొట్టములు, కమ్మీలు మొదలగు అంగములన్నియు సరిగా నుండిన మాత్రమే ఆ యంత్రము సరిగా పనిచేయగలుగును చక్కగనడుచును ఆలాగున ఊర్ధ్వగతిని పొందవలసిన సంయమికి ఉండతగిన వైరాగ్యాది దైవగుణములన్నియు కొరత గలుగక ఉండినమాత్రమే బ్రహ్మప్రాప్తి బొందగలుగును ఒక చక్రమైనను త్రుప్పుపట్టిన గాని, అరిగిన గాని, విరిగిన గాని యంత్రములు నడువనట్లు, వైరాగ్య, సత్య, శాంత్యాది గుణములలో దేనియందైనను, కొంచెమైనను లోపముగలిగిన నిర్వాణపదవి యోగి పొందజాలడు ముఖ్యచక్రము (మెయిన్ స్ప్రింగ్) సత్యమని మఱువకుడు

526 దేనియందు తన ఆత్మ లయము పొందునో, అదిమాత్రమే తనయందు లయము నొందును రోగి అయినవారికి ఔషధము దేహములో లయ మొందినమాత్రమే, రోగమున్నూ లయించును ఆలాగున విద్యయందుగాని, భక్తియందుగాని, జ్ఞానమందుగాని, ఆత్మలయమొందిన మాత్రమే, అవి తనయందు లయము గాగలుగును అప్పుడుమాత్రమే ఐక్యము గలుగును ఏవస్తువులో లయమొందునో తానున్నూ ఆ వస్తుమాత్రమై ఉండును ఇది పరమరహస్యము

527 శ్రేయోఽర్థులందఱున్నూ తమయొక్కనిష్ఠకు హితమైన కార్యమే చేయవలయును అహితమైనవని ఎప్పటికిని చేయరాదు

ధర్మహీనకార్యములన్నియు తనయొక్క పురోఽభివృద్ధికి అటంకము గలుగజేయును ధర్మయుక్తమైనది తన దైవప్రాప్తికిన్నీ ఇతర శ్రేయోమార్గములకున్ను గలిగియుండు ప్రతిరోధములను తొలగించునదేగాక అది అనుకూలమునుగూడ ఒనగూర్చను పడవప్రయాణమునకు అడ్డుగా గాలియున్నూ ప్రవాహమున్నూ గలిగిన యేలాగున పడవ ముందుకు పోజాలదో, అనుకూలమగు గాలియు, జలవేగమున్నూ ఉండిన తెరచాపవల్లను, జలవేగమువల్లను, గమ్యస్థానము ఎంతత్వరలో చేరవచ్చునో, అలాగున మనోవాక్కాయములచే విహితకార్యములే చేయువలయునుగాని అహితములైన పనులు త్రికరణములచే ఎవరున్నూ చేయరాదు వాక్శుద్ధి కలుగనిచో ఎంత చమత్కారముగ చెప్పినను ఒక్క వాక్యమందైనను జనులకు విశ్వాసముండదు మనశ్శుద్ధి కలుగనిచో ఒక చిన్న సంకల్పమైనను ఫలింపదు కాయశుద్ధి లేనిచో చేసిన ఒక చిన్న పనియైనను నెరవేరదు

528. నేత్రములేనివారైనను ఇతరులనేత్రములతో ఎట్లు చూడజాలరో చెవుడు గలవాడు ఇతరుల కర్ణముల ద్వారా ఎట్లు వినజాలడో, అలాగున ఆత్మజ్ఞానము స్వయముగ తనలో గలుగ జేసుకొనవలసినదేకాని మఱియొక్కరిదానిని చూచి సంతోషించి ఊరకయుండిన ఎవరున్నూ పొందజాలరు అట్టిస్థితి యీజన్మములో గాని, మఱియొక్కజన్మములో గాని తనలో గలుగవలసియుండును

529 జీవులున్నతస్థితిలోనికి వెళ్ల ప్రారంభించు స్థితిలోనుండి మూడు అంతస్థులు గలవు అవి (1) ఉత్తమము (2) ఉత్తమతరము (3) ఉత్తమతమము అనబడును ఎట్లన, ఘంట వాయించవలసియుండిన దానికి కట్టియుండుదారము పట్టుకొని కొట్టవచ్చును ఇక విద్యుచ్ఛక్తి తంతి మార్గమున ఘంట కొట్టవచ్చును ఇపుడు తంతియును అవసరములేని విద్యుత్ప్రవాహరూపముగ కొట్టుచున్నారు అనగా వైర్‌లెస్ మార్గముగ పనిచేయుచున్నారు అలాగున, జ్ఞానారంభములో చేతులతో పటిచ్చినను

ఫలము గలిగెడు స్థితి యేర్పడును ఇది మొదటిది మరియొక యంతస్థులోనికి వెళ్ళునపుడు వాక్కులతో చెప్పేలాగున జరుగు కాలము వచ్చును తరువాత చేతితో ఏకార్యమున్నూ చేయకనే వాక్కుతో చెప్పకనే మనస్సులో సంకల్పించిన జరుగు కాలము వచ్చును ఈస్థితి చాల గొప్పది

530 ఇనుము నేలాగున ఉక్కుఅంపము గాని, ఆకురాయి గాని, కోయుచున్నదో, ఆలాగున మలిన మనస్సును శుద్ధ మనస్సుతో కోయ వచ్చును అయితే ఇప్పుడు ఉక్కుగా పరిణామము పొందినది గూడ ఇనుమే నిప్పులో కాచుట చేతను, పదును ఇచ్చుట చేతను ఇనుమున కట్టిశక్తి గలిగినది, ఆలాగున సామాన్య మనస్సునకే చక్కని సంస్కారము చేతను, తపస్సుచేతను, సత్యధర్మ ప్రవర్తనల చేతను అట్టి శక్తి గలుగుచుండును

531 జనులారా! సబ్బు కొనుటకు లోభము చేతను, చాకలివారికి డబ్బు యియ్యవలయునను విచారముచేతను ఊరక యుండిన మీమురికి వస్త్రము శుద్ధము కానేరదు ఆలాగున పుణ్యకార్యములలో తగినంత త్యాగము లేనిచో మీమలినమైన మనస్సు శుద్ధము కానేరదు

532 ప్రజ్ఞగల నావికుడు చుక్కాణివల్ల జలప్రవాహ వేగముచే గాని, గాలివేగముచేగాని పడవ దారితప్పి పోవుచుండినను సుడిలోనికి వెళ్ళుచుండినను, ఏలాగున తనబలమును వినియోగపరచి త్రిప్పి అపాయములేని మార్గమునకు నడుపుచుండునో, ఆలాగున ప్రజ్ఞానవంతులైన ముముక్షువులు జన్మాంతర వాసనావశమునుండియు, విషయ ప్రకోపమునుండియు మనస్సును బలముగా మరలించి విషయదోషాపాయము లేని శుద్ధ జ్ఞానమార్గములోనికి త్రిప్పవలయును

533 ఈశ్వర చింతనయొక్కయు, గురుసేవయొక్కయు, ధర్మానుష్ఠానముయొక్కయు సారము తెలిపెద ఒక సేవకుడు తనయొక్క యజమానుని కార్యములో నిరంతరము అతి శ్రద్ధతో ప్రయత్నించుచుండెను యజమానుని పనిలోనే కాలముగడుపు ఆతడు తనకేదైన యాపత్తు కలుగునపుడు ఆయజమానుని గురించి ఈలాగున తప్పక చింతజేయును

"జీవితమంతయు మీకొరకే వినియోగపరచితిని ఏలాటి సహాయమును చేయకపోయెదరా?" యని దుఃఖముతో హృదయములో తలంచుచుండును అట్లు సత్యముగాను, ధర్మముగాను చేయనిచో ఆలాటి తలంపుగలుగదు అదేప్రకారము నిరంతరము దైవమును ధ్యానించువారును, ధర్మకార్యములోను, అనుష్ఠానములోను, కాలము గడుపు వారుకూడ ఆత్మశాంతి లేనప్పుడును, అట్లే దైవసాక్షాత్కారము గలుగనప్పుడున్నూ, ఏవైనా విపత్తులు తటస్థించి నప్పుడును దైవమును గురించియు, సత్యమును గురించియు, ధర్మమును గురించియు, తమయొక్క శుద్ధమైన అనుష్ఠానమును గురించియు యోచించిన, ఈశ్వరచింతనలో మనస్సు లగ్నము కాగలుగును ఇదే పవిత్రానుష్ఠానము యొక్క ప్రయోజనము యజమానుని కార్యములో సత్యముగా ప్రవర్తింపని వాడైనచో అతనికి యజమానునిపై ఏలాగున రక్షణ విషయములో మనస్సు తీవ్రముగా ప్రవర్తింపజాలదో ఆలాగున సత్యధర్మానుష్ఠానములున్నూ, నిజమైనభక్తియున్నూ, శుద్ధమైన ఆచరణమును లేనివారికి ఈశ్వరునితో తనయొక్క మనఃక్లేశమును చెప్పుటకు గాని, తలంచుటకు గాని మనస్సు గలుగదు ఎంత కఠినమైన స్వభావము గల యజమానుడైనను తన్ను నమ్మిన సేవకుని విడువజాలడు అట్లుండగా పరమకారుణికుడగు సర్వేశ్వరుండు తనభక్తులపై ఎంత దయగలిగి యుండునో యోచించుకొనవచ్చును ఇది భక్తియోగములో గల యొక రహస్యము

534 ఆత్మజ్ఞానము తనలో ఉండినదైనను అద్దానిని యనుభవమునకు తీసికొనిరానిచో ఏలాటి లాభమును గలుగదు అపుడది లేనట్లే తలంచవలయును ఎట్లన బాటసారులు కొందరు భోజనము మూటకట్టి యెత్తుకొని వెళ్ళుదురు కాని దానిని భుజింపనిచో వారి ఆకలిబాధ యెట్లు శాంతికాదో, తమవద్ద నుండియు ఎట్లు దానిచే ప్రయోజనము లేదో, ఆలాగున దైవజ్ఞానముయొక్క స్థితియునని గ్రహించుకొనవలయును

535 స్వాధీనములో నుండని పశువులు జనుల పైరుపంటలను

మేయుటచే బందెల దొడ్డిలోనికి తోలబడుచున్నవి, అచట మేతయు, నీరున్ను సరిగా దొఱకక ఎంతో కష్టపడవలసియుండును ఒకవేళ డబ్బుయిచ్చి విడుదల చేయించిన సౌఖ్యము గలుగును లేనిచో కొన్నిరోజు లాదొడ్డిలోనే పడియుండి సంకటపడిన తర్వాత వేలము వేయబడును వేలము వేయబడునవి స్వల్పమైన వెలకు దొఱకును కాన వానిని కసాయివారే యెక్కువగ కొనెదరు వారు వాటినెట్లు హత్యయొనర్చెదరో ఆలాగున నియమములేని సాధువులుగాని, ఇతరులుగాని ధర్మవిరుద్ధ కార్యములలో ప్రవేశించిన దుఃఖము పొందవలసియుండును బందెలదొడ్డినుండి విడుదల చేయించిన పశువులు సుఖమును పొందవచ్చును లేనిచో ప్రాణహాని కూడ అచ్చట కలుగును అట్లు ఒకవేళ ప్రమాదము గలిగినను, అజాగ్రత్త కలిగినను, ప్రాయశ్చిత్తము చేసికొని మరల శుద్ధవర్తనము గలిగి యుండినచో సుఖింపవచ్చును లేనిచో పతనము గలుగునదే గాక జీవితము కూడా నశించిపోవును

536 ప్రాథమిక శాస్త్రపారము నుండి శాస్త్రాంతపారము వఱకున్న పరీక్షలు గలవు ప్రతి తరగతిలోను 100 కి 40 మార్కులు వచ్చినచో పాసుకాగలుగును మొదటితరగతిలోనివారు గూడ పరీక్షలో ఉత్తీర్ణులైన వారిని పాసయినట్లు చెప్పదురు ఇతర తరగతులలోను ఉత్తీర్ణులైన వారిని అదే విధముగా పాసయినట్లు వచింతురు ఆవాక్యమునే విచారణపూర్వకముగా తెలిసికొనవలసియుండును ఇదే దీనిలో గల రహస్యము ప్రథమ తరగతిలో నుండువారికిని మార్కులు 40 వచ్చిన ప్యాసయినట్లనుకొనియెదరు ఆ 40 మార్కులే ఐ సి యస్ ప్యాసయినవారికిగూడ నుండును మహామహోపాధ్యాయునకు గూడ నంతియే అదేరీతిగా ఒకే నామస్మరణముమాత్రముచేతనే మోక్షము కలుగును ఒక ఏకాదశీ, ఉపవాసవ్రతముచేతనే ముక్తిగలుగును ఒక గంగాస్నానముచేతనే సాయుజ్యము లభించును ఒక బిల్వపత్రపూజచే, ఒక తులసీ అర్చనచే శివలోకప్రాప్తియు, విష్ణులోకప్రాప్తియు గల్గునని శాస్త్రములో కలదు దీనికి అర్థవాదమనిపేరు అర్థవాదమనియు, విధివాక్యమనియు

వాక్యములలో రెండుతరగతులు గలవు మాహాత్మ్యములన్నియు అర్థవాదవాక్యములు వేదాంత వాక్యములు విధివాక్యములనంబడును ఈలాగున లేనిచో మోక్షమార్గములో, పుణ్యకార్యములో జనులకు ప్రవేశము కలుగదు ఇట్టి దైవభక్తి, సత్కర్మలు ఆచరించి రాగా రాగా అంతఃకరణశుద్ధి గలుగును అప్పడు బ్రహ్మనిష్ఠలో ప్రవేశింపదగిన యోగ్యత జీవునకు లభించును అత్తఱి హృదయశుద్ధి సంపూర్ణముగ కలిగి, వృత్తులన్నియు నశించి, ఆత్మయొక్క అవరణములన్నియు క్షయించి, జీవేశ్వరుల ఏకత్వమగు దైవసాక్షాత్కారము కలుగువరకు జీవునకు మోక్షము కలుగదనియు, సంకల్పములన్నియు నశింపవనియు, క్లేశములు నిశ్శేషముగా తొలగవనియు వేదాంత శాస్త్రముపదేశించును దీనికే విధివాక్యమని పేరు శాస్త్రములోగల ఈరహస్యము తెలిసికొనక పోవుటచేతనే కొందఱికి దైవభక్తిలోను, యోగసాధనలోను, పుణ్యకర్మానుష్ఠానము లోను విశ్వాసము కలుగక పోవుటకున్ను, సందేహము కలుగుటకున్ను కారణమగుచున్నది

537 జనులారా! నిజమైన ముముక్షువుయొక్క లక్షణము తెలిపెద రోగియైనవాడు ఆసుపత్రిలో నుండునపుడు రోగము నుండి త్వరలో విముక్తి పొందవలయుననెడి మనస్సు గలవాడైనచో, ఎట్లుండిన శీఘ్రముగా ఆరోగ్యము కలుగునో, ఏ నడతచేతగాని ఆహారముచేతగాని రోగ విముక్తిగలుగునో అట్లే ప్రవర్తించును కాని వేఱువిధముగా ఏమియు చేయడు కొందఱు బయటకుపోయిన అంత సుఖము గలుగదను తలంపుగలవారు ఆసుపత్రిలోగల సుఖమును చూచి రోగము బాగుపడవలయునని తలంపు లేనివారై ఆరోగ్యము కొఱకు యత్నింపకయు, పథ్యము నాచరింపకయునుందురు ఆలాగుననే సాధువులయినను కొందఱు తీవ్రవైరాగ్యము గలిగి వచ్చినవారు కారు కారణాంతరముచే త్యాగమో, సన్యాసమో చేసినవారై యుందురు

538 సముద్రమున కన్యముగా తరంగములు లేనప్పటికిన్ని సముద్రమునకు తరంగము లాధారములు కావు తరంగములకు

సముద్రమాధారముగా నుండును అంతేగాక కల్లోలములు సముద్రమును చలింపజేయు శక్తి గలిగియుండవు కాని సముద్రము తరంగములను చలింపచేయ కలుగును మఱియు తరంగములు సముద్రముయొక్క లోతునుగాని వైశాల్యమునుగాని తెలిసికొన జాలవు సముద్రము తనలోగల అనంత కెరటములను తెలుసుకొనును కాని ఈ భేదము అలలు ఉండువరకు మాత్రమే యుండును అలలు శాంతించిన సముద్రమున్ను తరంగములున్ను ఒకటియే యగుచుండును అలాగున ఈశ్వరునకన్యముగా జీవులు లేనప్పటికిన్ని జీవులు ఈశ్వరున కాధారములు కారు జీవుల కీశ్వరుడే ఆధారభూతుడు ఈశ్వరునియొక్క అనంతశక్తిని జీవులు సంపూర్ణముగా ఎఱుంగజాలరు జీవులయొక్కశక్తి సర్వేశ్వరుడెఱుంగగలడు కాని, జీవుల కుపాధి నశించినపుడు ఈశ్వరునకన్యముగా జీవుడు మఱియొకడు ఉండడు, అంతవఱకు భేదమ కలిగి యుండును అపుడు అలలు శమించిన మహాసముద్రమువలె నుండును

539 దుర్వృత్తి కోతివంటిది క్రొత్తగా ఒక గ్రామమున గల వృక్షమున క్రొత్త కోతి వచ్చిచేరినచో వెంటనే దానిని తరిమి వేసిన మరల రాదు ఒకరోజు గాని రెండుమూడురోజులు గాని స్థిరపడిన మరల ఆవాసరము ఆస్థలమును విడిచిపెట్టి పోవుట దుస్తరము ఒకవేళ దానిని దూరముగా తఱిమినను మరల వచ్చిచేరుచుండును అలాగున ఏదైన దురలవాటు అను కోతి హృదయవృక్షములో ప్రవేశించిన వెంటనే దూరీకరించినచో ప్రయాసములేకనే యది వదలిపోవును అట్లు చేయక ఆదుర్గుణము అలవాటు పడిన మరల వదలిపోవుట కడు దుస్తరము కావున శుద్ధాత్ములు గావలయునని తలంచువారందఱున్ను ఈ విషయములో అతి జాగ్రత్త వహించుచుండవలయును

540 రోగులైనవారిలో కొందఱు స్వగృహములో నుండిన ఔషధసేవా పథ్యాదులు సరిగా జరుగవని తలంచి వైద్యాలయమునకు వెళ్ళుచుందురు

అది మంచిజ్ఞానముతో కూడిన పనియే అని చెప్పవచ్చును అయితే వైద్యాలయము ప్రవేశించిన పిమ్మట ఇక ఔషధమేల? పథ్యమేల? నియమమేల? అను తలంపు కలుగుటలో ఆశ్చర్యము కలుగని వారుందురా? అదేరీతిగా గృహస్థాశ్రమములో నుండి బ్రహ్మనిష్ఠచేయుటకున్ను, బ్రహ్మచర్యము శీలించుటకున్ను, ఇంద్రియనిగ్రహము కలుగజేసికొనుటకున్ను, నిశ్శబ్దముగా నుండుటకున్ను భూతదయ, సత్యాదులను పాలించుటకున్ను సాధ్యము కాదని తలంచి త్యాగులో, సన్యాసులో, ఏకాంతవాసులో అగుటయో, ఏదో ఆశ్రమములో చేరుటయో, మఠములో ప్రవేశించుటయో చేసిన తరువాత ఇక మాకు అనుష్ఠానమేల? నియమమేల? ధ్యానమేల? అని తలంచుటలో అత్యాశ్చర్యము కలుగనివారు కలరా? అయ్యో! ఇది ఎంత విపరీతమగు జ్ఞానమో యోచించుకొనవలయును

541 బ్రహ్మ విచారమునకు తగిన సంకల్పము మాత్రమే కలిగి యుండవలయును అనగా శుద్ధవాసనయుండిన మాత్రమే యుపయోగపడును ఎట్లన, ఒక అడవిలో గాని, ఇతరములగు కంపలు ముండ్లు కాల్చివేయునపుడు గాని, గాలి యొక్క వాటము ననుసరించియే నిప్పంటించవలయును అట్లయిన త్వరలో ప్రజ్వలించి భస్మమైపోవును అట్లు కాక ప్రతికూలమగు గాలియైన ఎట్లు దహింపదో, అలాగున బ్రహ్మనిష్ఠ చేయువారున్ను, వేదాంతవిచారము చేయువారున్ను, తపస్సు యోగాదులు సల్పువారున్ను దానికనుకూలమైన సంకల్పములు, నిర్మల గుణములు కలిగి యుండవలయును అట్లుగాక మలిన సంకల్పములుగలిగియున్నచో అజ్ఞానారణ్యము దహింపజాలదు అపుడు కర్మములను కట్టెలున్ను భస్మములు కాజాలవు కావున అనుష్ఠానమునకనుగుణమగు శుద్ధ సంకల్పములే యుండవలయును

542 నిప్పదగ్గర నుండినదైనను, నిప్పను చూచినదైనను లోహము గాని, కట్టెలు గాని ఏలాగున అగ్నిమయము కాజాలవో, అగ్నిలో ప్రవేశించినది మాత్రము ఎట్లు అగ్నిమయమై పోవునో అలాగున ఈశ్వరుని స్మరించినను,

ధ్యానించినను, జపించినను, ఈశ్వరమయమై యుండుట కలుగదు ఈశ్వరమయముగాను, తేజోమయముగాను, చైతన్య మయముగాను తన యాత్మను బాగుగా భావన చేయవలయును అట్లయిన మాత్రమే జీవించియున్నప్పుడు మీ యాత్మయు దైవమయముగా మీకు గోచరము కాగలుగును అప్పడు శుద్ధ చైతన్య స్వరూపమే మీ యాత్మ స్వరూపమని మీకు గోచరము కాగలుగును అపుడానందమున్ను, మిక్కిలి శాంతియున్ను, ప్రసన్నతయు జ్ఞానమున్ను కలుగును అవుడగ్నిలో ప్రవేశించిన లోహేంధనాదులు అగ్నిమయముగా నుండునట్లు మీరున్ను దైవమయముగా మిమ్ములను కనుకొనగలరు ఇదియే భావనయొక్క మహిమ యని తెలియ దగినది

543 తీవ్రముముక్షుత్వముగలిగి మౌనముతో గాని, లేక ఏకాంతస్థలములో గాని కన్నులు మూసికొని కొందఱు ధ్యానము చేయుదురు అది చాలా గొప్ప స్థితి యని వారు తలంతురు కాని అది ముముక్షుత్వములో వైరాగ్యములో గొప్పదిగా తలంచినను వాస్తముగా అట్టి స్థితి గొప్పది గాదు ఏలన శూకాది వక్షులు గాని సింహాదిజంతువులుగాని లేతప్రాయములో కన్నులు తెరువవు ఒకే స్థలములోనే యుండును నిశ్శబ్దముగా నుండును కాని ఆయవస్థ వాటికి బాల్యమేగాని యౌవనదశ కాదు బుద్ధాది ఋషులే దీనికి తార్కాణము ఆత్మశక్తి కలిగి దివ్యదృష్టి యుదయించువఱకు మాత్రమే వారు మౌనము, ఏకాంతవాసము ఆశ్రయించియుండిరి తరువాత ప్రబోధకులై ధర్మము నంతటను ఉపదేశించుచుండిరి శ్రీ ఏసుక్రీస్తు, శ్రీ మహమ్మదునిబి, శ్రీ ఆదిశంకరులు మొదలగు ప్రవక్తలందఱు అలాగుననే యుండిరి ప్రారంభదశలో తీవ్రనిష్ఠ కలవానికి పై జెప్పిన నిర్జనస్థలవాసము, వాఙ్నియమము మంచిదే, గాని అట్టి యవస్థ గొప్పదనియు, తాము గొప్పవారమనియు మాత్రము తలంపక యుండిన చాలును

544 బహ్మనిష్ఠులగు గురుశిష్యుల ధర్మము గొప్ప కుటుంబములోగల

అత్త కోడలు న్యాయముగా యుండును అత్త ఎంత మంచిదైనను కోడలికి కొంత భారముగానే యుండును సోమరితనము, సుకుమారత్వము గల కోడలైనచో నిర్వహింపజాలక కష్టముగా భావించును అయితే కోడలు మరల అత్త యగునపుడు దీనియొక్క గొప్పతనము తెలిసికొనును గొప్పసంసార నిర్వహణము కొఱకు అత్త తన కోడలిని తయారుచేయునట్లు గొప్పవాడగు గురువు తన శిష్యులను లోకోద్ధారకులుగ చేయునపుడు సోమరితనము, సుకుమారత్వము గల శిష్యులైనచో నిర్వహించుట చాలకష్టముగానే యుండును కాని శిష్యుడు గురునియొక్క స్థానమునకు వచ్చినపుడు గాని లేక గురునివంటి అవస్థ కలుగునపుడు గాని లేక గురువు నిర్వహించేలాగున గొప్ప సంస్థను స్థాపించునపుడుగాని గురువు యొక్క మాహాత్మ్యము గోచరించును

545 గీతాపరనము గాని, ఉపనిషత్పారాయణము గాని, తనయొక్క అనుష్ఠానము గాని రాళ్లు ముళ్లు మోడులుగల త్రోవలో నడిచినట్లుండును చాల నిదానముగాను, ముళ్ళు మొదలగునవి తగులునను భయముతోను నడువవలసియుండును ఆ మార్గముననే మరల అవుడపుడు నడుచుటచేతను, శుద్ధ పరచుటచేతను ఏలాగున నిర్భయముగా నడవవచ్చునో కన్నులు మూసికొని ఏలాగున సంచరింప వచ్చునో, ఈ పారాయణాదులున్నూ, అనుష్ఠానములున్నూ ఆలాగుననే యుండును అభ్యాసమువల్లనే ఏదిన్ని ప్రయాసము లేకపోవును

546 పూర్వీకులగు వేదాంతులకున్ను ఇపుడున్నవారికిన్ని ఇట్టి భేదము గలిగి యున్నది పురాతన ఋషివర్యులు ఫలము నభిలషించువారితో వృక్షమును బెట్టి చక్కగ పోషించ నుపదేశించువారు ఇప్పటి వారు వేదాంతము వాక్కుతో మాత్రము చెప్పువారు వీరు జనులతో మీకు కావలసినది ఫలముగదా! చెట్టుతో సంబంధమేమి? చెట్టుపెంచిన ఆయాకులుగాని పుల్లలుగాని తిందురా యని చెప్పచున్నారు ఈ రెండింటిలో ఏది సరియైనదో విజ్ఞు లూహించుకొనవలయును

547 విద్యార్థులైయుండని వారెవరను మాస్టర్లు గాలేరు విద్యార్థులైయుండిన వారే మాస్టర్లు(ఉపాధ్యాయులు) అయిరి ఈతత్త్వమును బాగుగా జ్ఞాపకము చేసికొనిన మాత్రమే మీరు బ్రహ్మనిష్ఠుల దగ్గర నుండనిచో లోకములో ఏకాలమందున్ను బోధకులగు గురువులు కాజాలరని యెఱుంగగలరు లోకములో గల యుద్యోగులందఱును స్కూలులో చదివియే డాక్టర్లు, సూపరింటెండెంటులు, జడ్జీలు, కలెక్టర్లు మొదలగు యున్నతోద్యోగముల నొందిరి అట్లుకానివారెవరును ఉద్యోగులై యుండలేదుగదా? దీనిని మీరు లెస్సగా విచారణ చేసికొనదగినది

548 కోపశమనోపాయము - - 1 కోపముపై కోపము చేయుట 2. కోపమువచ్చినపుడు నిగ్రహింపశక్తి లేనిచో 10 నిముషములు మౌనముగా నుండి దివ్యమంత్రము జపము చేయుట 3 కోపమువచ్చినపుడు మనోనిగ్రహము కలుగచేసి కొనుటకు శక్తిలేక పోయినచో ఆస్థలము వదలిపోవుట మొదటిది యుత్తమము, రెండవది మధ్యమము, మూడవది కనిష్ఠము, ఈ మూడింటికి విలక్షణమైన దొకటి కలదు అది తన స్వమహిమయందు నిలుచుటయే అట్టిస్థితి యందున్న వారికి కోపము కలుగదు అది శాస్త్రములో పేర్కొనబడియుండలేదు పాపములన్నిటికిన్ని కోపమే కారణము ఇదిగలవారికి ప్రపంచములో నుండువారందఱును శత్రువులగుదురు,

549 రోజు నూరుచుండెడు కత్తి ఎట్లు నిరంతరము మంచివాడి కలిగియుండునో యాలాగున గురువు దగ్గఱ నుండి గురుకార్యము చేయువాని మనస్సు బహుతీక్ష్ణమై జాగ్రత గలిగియుండును నూరక కట్టిపెట్టియుండు కత్తి ఏలాగున వాడిమి తగ్గిపోయి చిలుముపట్టి తెగకయుండునో యాలాగున గురుసన్నిధికి దూరముగనుండి జాగ్రత్తతో అనుష్ఠానము చేయనివాని మనస్సు మందమై జాగ్రతలేనిదిగా మారిపోవును మరింత మందమైన చెడిపోవుటకు కూడ అవకాశము కలుగును

550 రత్నములు సానపెట్టి హారముగ చేయువారు ఏలాగున

నుందురో, యాలాగున ఆత్మసంస్కారము చేయువారుగూడ తమ మనస్సు మొదలగు గుణములన్నిటిని మంచి సంస్కారము కలదిగా చేయుచుందురు హారము కొనువారు ఏలాగున, ఎత్తిచూచునపుడు చొట్టపోయినది గాని, పగిలిపోయినది గాని, ఏదైన చుక్కపడినది గాని చక్కగా ప్రకాశము లేనిది గాని యుండిన, తీసివేసి మంచి మణులను భర్తిచేసికొనిపోయెదరో, ముముక్షువులున్ను ఆలాగున తమయందేవిదమైన ప్రకృతిగుణములు గాని, లోపములుగాని లేకుండా యుండేలాగున చూచుచుండవలయును

551 యుద్ధమునకు సంబంధించిన సైన్యములుగాని, పోలీసువారుగాని, ఏలాగున ప్రతిరోజున కవాతు చేయుచుందురో, ఆలాగున బ్రహ్మనిష్ఠులుగూడ ప్రతిరోజును, తమయనుష్ఠానమును తప్పక చేయుచుండవలయును రోజున్ను కవాతు చేయకపోయిన, దేహేంద్రియములు ఏలాగున మొద్దుబారిపోవునో, ఆలాగున అనుష్ఠానము తప్పక ప్రతిరోజును చేయనివారి మనస్సు మందత్వము నొందును అజాగ్రత్త, అలసట వృద్ధియగును ఇది మఱువకుడు

552 సముద్రములో అనేక భయంకరజంతువులుండినను, ఆమహాసాగరమును దాటుటకు చిన్న నావయుండిన చాలును ఈశ్వరసృష్టి యొక్క మహిమ దీనిని చూచి గ్రహించుకొనవచ్చును సముద్రాంతర్భాగములో గల గొప్పగొప్ప తిమింగిలములు, మొసళ్లు, సర్పములు, అన్నియు ఒడలో పోవువారికి ఏలాటి బాధలున్ను కలుగజేయవు కాని ఓడనుండి సముద్రములో జారిపడిన వారిని వెంటనే యా క్రూరజంతువులగు మకరి మొదలగునవి మ్రింగివేయును ఆలాగున సంసారసాగరములో పరమేశ్వరధ్యానమను పడవనెక్కి పోవువారికి అజ్ఞానమను మకారజంతువులచే భయములేదు ధ్యానమునుండి ఆచరణనుండి జారి ప్రకృతి విషయములోనికి పడిపోయినవారిని వెంటనే మాయ యను మకరి మ్రింగివేయును ఓహో! ఈశ్వరసృష్టి యొక్క మహిమ ఎటువంటిదో దీనివల్ల గ్రహించుకొనవచ్చును

553 గృహస్థాశ్రమములోనుండి మోక్షము పొందకూడదా! యని యనేకులు ప్రశ్నింతురు వారికిట్టి సమాధానము చెప్పిన చాలును దేహముమాత్రము గృహములోనుంచినను, హృదయముమాత్రము వనములో తపమొనర్చెడు ఋషియందు చేర్చవలయును గృహస్థుడైనను, బ్రహ్మచారియైనను, వనస్థుడైనను, యతియైనను తనచేతిలో నుండు దర్పణముమాత్రము నిర్మలముగా నుండవలయును లేనిచో స్వశరీరము కనుపించదు అలాగున బ్రహ్మచర్య, గృహస్థాశ్రమాదులలో దేనియందుండినను హృదయముమాత్రము మల, విక్షేప, ఆవరణరహితమై యుండిన చాలును

554 ఆత్మ పుణ్యపాపకర్మలకు సాక్షిగా నుంటున్నదని తెలిసికొనిన చాలుననియు, అందువల్ల ఇంద్రియములు చేయు శుభాశుభ కర్మలు ఆత్మకు సంబంధింపబడవనియు చెప్పవాక్యమొకటి కలదు ఇది సరియైనది కాదు ఎట్లన, పడవలో ప్రయాణముచేయువారు పడవ కుమార్గములోనికి పోవుచున్నదని తెలిసి దానిని సరిగా నడుపకపోయిన దానివల్ల గలిగెడు అపాయము వారికి లేకపోవునా! అదేరీతిగా గుఱ్ఱములు కుపథములోనికి పోవుచున్నవని తెలిసికొనిన, దానివల్ల రథమునకున్ను రథికునకున్నూ గలిగెడు యాపత్తు తప్పిపోవునా? కావున తెలిసినదానికి గుఱుతు ఏమన, పడవను, అశ్వములను కుమార్గమునుండి తప్పించి సన్మార్గములో నడుపుటయే యగును లేనిచో ఆపత్తు తప్పక కలుగును

555 సొరకాయగాని,పీచుతోగూడిన టెంకాయగాని, ఎంతకెంతకు పండి ఎండుచుండునో, అంతకంతకు నీటిలో వేసిన పైకితేలు చుండును వానిలో మఱల నీరుఎక్కి తడిసిన మఱల నీటిలోపలికి దిగిపోవుచుండును అలాగున ఆత్మఎంత కెంతకు పరిశుద్ధత నొందుచుండునో, అంతకంతకు ప్రకృతి నుండి దూరమగుచుండును మఱల ఎంతకెంతకు మలినపడునో అంతకంతకు లోకములోనికి దిగిపోవుచుండును

556 సాధువులైన తరువాత, సన్యాసులైన పిమ్మట, గురుపుత్రులైన

తదనంతరము అట్టివారికి మఱల నియమములు, నిష్ఠలు ఎందుకని సాధారణులైన కొందఱిని కొందఱు సాధువులడుగుదురు నియమములు, నిష్ఠలు సంసారులకే గాని సాధువులకు గాదని చెప్పవారు కూడ గలరు ఇది ఎటువంటిదనగా, గవర్నమెంటు ఉద్యోగములో చేరువఱకే రాజ శాసనము పాటించవలసినదే కాని తరువాత రాజశాసనముతో పనిలేదని చెప్పినట్లే యుండును యథార్థముగా విచారించిన యుద్యోగు లందఱును రాజశాసనము పాలించుటకున్ను, ఆశాసనము ప్రజలకు తెలిపి వారిని సన్మార్గములో నడుపుటకున్ను ఏర్పడినవారు తాము ఆచరించుటయు, ఇతరులచే ఆచరింపజేయుటయు వీరియొక్క పని ఆలాగున, దైవధర్మముల నాచరించుటకున్ను, జనులకు బోధించి వారివల్ల ఆచరింప జేయించుటకున్ను సాధువులగుటయు, గురుపుత్రు లగుటయునగును భగవంతుడు గూడ ధర్మమును సంరక్షించుటకొఱకే అవతారము లెత్తుచుండును ఆలాగున భగవదంశములో జన్మించిన సాధువులుకూడా భగవద్ధర్మమునను॰ష్ఠించుటకు, జనులకు బోధించి అనుష్ఠింపచేయించుట కొఱకే ఏర్పడినవారనెడి దర్మరహస్యమును మఱువకుడు

557 కొందఱు వేదాంతముమాత్రము చదువుకొని సరియైన ఆచరణలేని వారు నీతివిరుద్ధకార్యములు చేయునపుడు, అది ప్రారబ్ధమనియు, లేక అది ఇంద్రియముల స్వభావమనియు, అట్లుగాక ఇంద్రియములకు సాక్షి ఆత్మ యగుటచే ఆగుణములు ఆత్మకు బంధము గలుగచేయవనియు చెప్పదురు ఈ వాక్యములు ఉత్తమవేదాంత శాస్త్రమునకు విరుద్ధములు ఏలన, ప్రారబ్ధకర్మ జన్మాంతరములో చేసినది అది సూక్ష్మదేహమును అంటి యుండును స్థూల సూక్ష్మ కారణములనెడు మూడు దేహములున్ను జ్ఞానాగ్ని యందు దహించిన వారికే జీవన్ముక్తి గలుగును అపుడు సూక్ష్మదేహము జ్ఞానాగ్ని దగ్ధమగుటచే దానినాశ్రయించియుండు సంస్కారములుగూడ భస్మమగును వేయించిన విత్తనములు మొలకెత్తని చందమున అతనికర్మలు గూడ భస్మములై పోవలసియుండును అట్టిన స్థూలదేహ మ్ముంటున్నదిగదా? యని

సంశయింప నక్కరలేదు అది అగ్ని దగ్ధపటమువలెను, నిప్పులో కాలిన త్రాడు వలెను ఉంటున్నదని శాస్త్రము చెప్పచున్నది దానికి విరోధము లేదు దగ్ధరజ్జువు బంధించుట కుపయోగపడని చందమున, చూచువారికి దేహము కన్పించినను, ఇతరుల దేహములవలె విషయాది వృత్తులు గలదిగా నుండదు వృత్తులు దృశ్యము లగుటచే దృక్కగు ఆత్మకు బంధము లేదని చెప్పట సరి గాదు ఇది త్రిపుటితో గూడినది బ్రహ్మసాక్షాత్కారస్థితిలో దృక్కు, దృశ్యము, దర్శనములనెడి త్రిపుటియుండిన అది పూర్ణజ్ఞానము గాదు భక్తి మార్గములో భగవత్స్వరూపమున కన్యముగా మఱియేమియు నుండరాదు అదే పూర్ణమైన పరమభక్తి యనంబడును అగ్నిదగ్ధము కాని బీజములు భూమిలోనుండి మొలకెత్తునట్లు, జ్ఞానాగ్ని దగ్ధముగాని సూక్ష్మశరీరమునుండి సంస్కార, సంకల్ప, వాసనారూపములగు వృత్తులు పుట్టుచుండును ఇపుడుగల వేదాంతులకు పైజెప్పిన పొరపాటు కలుగుటకు కారణమేమన, వీరిలో చాల మందిన్ని ముముక్షు స్థితిలోను, అభ్యాసస్థితి లోను, జిజ్ఞాసుస్థితిలోను ఉండవచ్చును ఈ స్థితిలో నుండువారికి ప్రారబ్ధ కర్మలననుసరించి, హృదయ సంస్కారము ననుసరించి వృత్తులు గలుగును అట్టివారు తమ్ము జీవన్ముక్తులనియు, విదేహముక్తులనియు తలంచుటచేతనే అట్టి ప్రమాదము గలుగుచుండును జీవన్ముక్తుల గుఱించి చెప్పిన భావము సాధకులగు వీరు అవలంబించియుండుటచేతనే సాధులోకము, భక్తలోకము పతనమగుటకు కారణ మగుచున్నది కావున ఇట్టి అపాయమును పొందక జీవన్ముక్తి గలుగు వఱకు, మహనీయులస్థితి కలుగు వఱకు శమదమాది సాధనాపరులై నిష్ఠలనుపూర్తిచేయవలయును అపుడే పతనమైన జ్ఞానలోక ముద్ధరింపబడును వివేకవంతులకు సాధువులపై భక్తులపై విశ్వాసమున్ను గలుగును

558. త్రాడుకట్టిలాగిన పశువులుగాని, పక్షులుగాని, మనుష్యులుగాని మఱి యే వస్తువులుగాని, ఆత్రాడునను సరించిపోవుచుండును అగ్నిలో దహించిన పాశమైనచో, అది దేనినైనను లాగవీలుండదు అలాగున దృశ్యాది ఏవిషయములవైపునకైనను వాసనా రూపపాశము లేక సంస్కారము లేక

కర్మము తన్నుపట్టి లాగుచుండిన ఇకను తనయొక్క జన్మాంతర సంస్కారాదికర్మలు జ్ఞానాగ్నిచే దహింప బడలేదని బాగుగా జ్ఞాపకము చేసికొనుడు అగ్ని దగ్ధపాశమైనచో అది ఎట్లుకట్టి లాగుటకు శక్తికలిగి యుండును? ఈవిషయమును బాగుగా యోచించి బ్రహ్మజ్ఞానాగ్నిని మఱింత రగుల్కొల్పి విషయసంస్కారమను త్రాడును భస్మంబొనర్పుడు దృశ్యవిషయముల లోనికి మిమ్ములను విషయవాసనా తంతువు లాగుచుండిన ఇకను బ్రహ్మజ్ఞానాగ్నిలో లింగ దేహము నాశ్రయించియుండు జన్మాంతర కర్మవాసనలు భస్మము కాలేదని తలంచి యనుష్ఠానమందు మఱింత తీవ్రతను పొందువారు ధన్యులయ్యెదరు లేనిచో మఱింత బద్ధులయ్యెదరు గాని ముక్తులు కాజాలరు

559 ఆత్మోన్నతి కోరెడు సాధువులారా! మీశక్తి యంతయు మీరు చెప్పేలాగున చేయుటయందే నిలిచియున్నది దీనిని ఎల్లప్పుడు చింతన చేయుటకన్న మఱి యొక బ్రహ్మచింతన పెద్దదికాదని తలంచువారు తాము తలంచుదానిని పొందగలుగుదురు అట్లు కాని శాస్త్రవాక్యములుగాని, వన్యాసధోరణులుగాని, గ్రంథరచనాశక్తులుగాని లోపలగింజలేని వట్టిపొట్టుయొక్క కృషివంటిదని మఱవు కలుగనివారు ధన్యులగుదురు మీ దైవశక్తియంతయు మీరు చెప్పేలాగున చేయుటలోనే నిలిచియున్నది అది మాత్రమే జీవముతో కూడియుండును తక్కిన వన్నియు నిర్జీవములు, యంత్రములు ధ్వనిచేసే లాగున ప్రాణములేని వాక్యములని మఱువకుడు

560 ముముక్షువులారా! ఒక రహస్యమును జెప్పెద ఎంత శ్రేష్ఠమైన విత్తనము పెట్టినను, పోషణకూడ దానికి అనుసరించినదే అయి యుండవలయును విరుద్ధమైన పోషణ అయినచో చెట్టు చచ్చిపోవుటగాని లేక పెఱుగక పోవుటగాని జరుగును ఆలాగున మీరు ఎంత శ్రేష్ఠమైన ధ్యానము గాని, వేదాంతవిచారము గాని, యోగసాధన గాని దైవభక్తి గాని చేయుచుండినను మీయొక్క మనోవాక్కాయకర్మములన్నియు వాటికనుకూలములు గానే యుండవలయును లేనిచో అనుష్ఠానములు

ఫలమును కలుగజేయక పోవుటయో లేక క్షయించి పోవుటయో కలుగవచ్చును కావుననే సహకారము ప్రతిదానికిన్ని అనుకూలమైనది యుండవలయునని చెప్పెడు రహస్యము

561 కాపరిలేని పశువులున్ను, చుక్కానిలేని పడవయు, ఇంజినుశిథిలమైన యంత్రాలయమున్ను చూడుడు ఏలాగున ఆపశువులు ఛిన్నాభిన్నములై పోవునో - పడవచక్కగా నడువజాలదో యంత్రములన్నియు పనిచేయక స్తంభించిపోవునో ఆలాగున ధైవకార్యములన్నిటిలోను ధర్మకార్యములన్నిటిలోను -మత ప్రబోధకార్యములన్నిటిలోను - ముఖ్యముగా గురుశిష్య సంప్రదాయములన్నిటిలోను, సరియైన మార్గదర్శకులు లేనిచో పై చెప్పేలాగున సరిగా జరుగక పోవును కావున అన్ని కార్యములలోను నాయకులు - ఎంతో జాగ్రత్త వహించవలసియుండును విషయములను నిగ్రహించుట చాలకష్టసాధ్యము పై జెప్పిన నియంతలు కనకకాంతలలో మునుగక చూడవలయును ఇది దైవకారుణ్యము గలవారికి మాత్రమే సాధ్యమగును ఏలన సృష్టి యొక్క శక్తి ఆలాగున నుంటున్నది ఇది స్త్రీపురుషులు ఉభయులకున్ను సంబంధించి యుండును

562 నేత్రములలో నలుసుపడిన ఎంత నొప్పియో, అట్లుండగా ఇకేదైన, తీక్ష్ణక్షారవస్తువులు పడిన వేదన యెంత అధికమో, నేత్రములో రోగములు వచ్చిన ఎంతబాధయో ఆలాగున హృదయములో కలిగెడు ప్రకృతి గుణములు దుఃఖమునే కలుగచేయును దుష్టగుణములు మఱింత బాధనొనర్చును విషయదోషము పరమకష్టమును కలుగుజేయును నేత్రరోగమైన కన్నే కనుపించనట్లు విషయదోషములు కలవారికి తమయొక్క స్థితులే మఱపు కలుగును కావున హృదయమలో ప్రకృతి సంకల్పమేది కలిగినను, దుఃఖము కొఱకని తెలుసుకొనవలయును

563 వ్యవసాయముజేయు స్వభావము గలవారు పైరులోగల కలుపులు చక్కగాతీసి వేయుదురు అట్లు ఈసంవత్సరము తీసివేయక

పోయినచో ఈసంవత్సర ఫలితము తగ్గిపోవునదియేగాక, వచ్చే సంవత్సరమునకు భూమి కసువులచే నిండిపోయి భూమికూడ చెడిపోవును ఆలాగున హృదయ క్షేత్రము లోగల వృత్తులను నిశ్శేష రహితమొనర్చకుండిన, అవి జన్మాంతరమునకు మఱింత వృద్ధియై జన్మపరంపరలను గలుగజేయును ఈజన్మములో ఆత్మశాంతియు గలుగదు సోమరి మానవులు ఈలాగుననుందురు

564 పాలు, కల్లు, సారాయి మొదలగువాని యొక్క సారము తెలిసికొనుటకు ఏర్పడిన మీటరు యొక్క నంబరు ఆయావస్తువుల సారస్థితి అనుసరించి యేలాగున మనము ముంచిననపైకిలాగినను చేయివిడిచిన వెంటనే ఆ డిగ్రీని అనుసరించి నిలుచునో ఆలాగున సత్త్వరజస్తమో గుణస్వభావము గలవారు వారివారి స్వభావములో నిలిచెదరేగాని మరియొక గుణములలో నుండ మరియొకరు ప్రయత్నింపజేసినను నిలువరు దానియందే వారికి ప్రీతి గలిగియుండును మాయాశక్తిచే అట్లుండడమే సరియని తోచును

565 సముద్రమునుండి ఆవిరిరూపముగా పరిణమించి మేఘమై పర్వతములో కురిసిన జలము ఒక్కొక్కబిందురూపమైనను ఆజలము మరల సముద్రముఖముగా ప్రయాణము సాగినచో ఏలాగున కొన్ని జలబిందువులుచేరునప్పడు ఒకసన్నని జలధారగాను, మరింత ప్రయాణము చేయునప్పడు కొన్ని జల ధారలు చేరి మరింత పెద్దధారగాను రాగా రాగా అనేక ధారలు చేరి పెద్దకాలువగాను తరువాత పెద్ద చెఱువుగాను అచ్చటినుండి చిన్నయేరుగాను అట్లు అనేకములైన యేరులుచేరి గొప్పనదిగాను పరిణామము పొందినదై మహాశక్తితో ప్రవహించి కట్టకడకు మహాసముద్రమై మారుచుండునో ఆలాగున అనంతమైన దివ్యశక్తినుండి మాయామహిమవల్ల జీవోపాధినొంది కించిజ్ఞుడైయుండు జీవుడు సంసారారణ్యమునందుండి నను తనయొక్క దైవత్వమునొంద ప్రయత్నించిన క్రమక్రమముగా వికాసము నొందుటయు,

ఆత్మశక్తిగలుగుటయు గలుగునదెగాక ఆఖరున సముద్రమగునట్లు అనంతశక్తి గలదైవముతో నేకత్వము నొందును కాని ఎచ్చట కురిసిన వర్షజలము అచ్చటనే నిలిచిపోయిన యేలాగున విశాలము నొందదో అంతేగాక యెంతవరకు వెళ్ళి యెచ్చట నిలిచిపోవునో అంతటితో సరిపోవునేకాని మహానది గాని, సముద్రమునుచేరుటగాని గలుగదు అదేరీతిగా ఈజన్మలో జీవుడు ఎంతవరకు ఆత్మోన్ముఖముగ పోవునో అంతదైవశక్తియు, దైవజ్ఞానము గలుగును అంత్యమువరకు చేరిన అనంత దైవత్వమునొందును ఇదే సాధకులు గ్రహించదగినది

566 జనులారా? భయపడకుడు, కాలకూటము మొదలగు విషము లన్నిటికిని ప్రతివిధి గలదు (అనగా విరుగుడు ఉన్నది) అట్లుండగా మీరు అజ్ఞాన కారుచీకటిని గురించి యేలభయపడవలయును? సంధ్యాసమయము వచ్చునపుడు యేలాగున మన ముసలమ్మలు, ఆడపిల్లలు, దీపము వెలుగింతురో చూచుట లేదా? ఇదే చీకటిని తొలగించు ఉపాయము అదేతిగా అజ్ఞానమును బారదోలుటకు దైవజ్ఞానజ్యోతిని వెలిగించవలయును మరల భయపడ నక్కరలేదు

567 దీపపు సెమ్మెలోగల తైలమున వత్తి మునిగియుండిన మాత్రమే ఆదీపము చక్కగా వెలుగుచుండును అట్లు కానిచో ఆదీపము సరిగా నుండదు అదేరీతిగా మనస్సు అగాధధ్యానములో మునిగి బ్రహ్మమయమైన మాత్రమే సదా ప్రశాన్తమగు ప్రబోధమను జ్ఞానజ్యోతి వెలుగుచుండును

568 శివజీవుల ఐక్యము పరమరహస్యమైయున్నది సృష్టికర్తయొక్క మహిమాతిశయము దీనియందు కనందగును అణువులో విభువున్ను, విభువులో అణువున్ను కలసియుంటున్నవి అనగా! జీవునియందు ఈశ్వరుడును, ఈశ్వరునియందు జీవుడున్ను గలడు మఱ్ఱివిత్తనమునందు మఱ్ఱిచెట్టు నిగూఢమై యున్నది వటవృక్షము వటబీజములోను గూడియుంటున్నది, మఱ్ఱి విత్తనము ఒక్కటి కాదు సర్వబీజములలోను ఈరహస్యతత్త్వము గనందగును అయితే అవస్థ మార్పులోనే బీజము గాను

వృక్షము గానునుండును ప్రబోధములో ఈశ్వరతత్వముగాను, ఆవరణములో జీవుడుగాను నుండును

569 ప్రకృతి రహితమైన పరమాత్మస్థితిలో నిలకడ గల్గుటకు సుతీక్ష్ణమైన వ్రతమొకటి గలదు ఇది పరిశుద్ధురాలగు పతివ్రతయొక్క దర్మమువంటిది అదేమన చిత్తముతో దైవచింతన తప్ప మఱియొక్క చింతనచేయగూడదని శాసించుట అనగా మనస్సుతో బ్రహ్మమును గుఱించి మననము చేయవలయునని ఆజ్ఞాపించుట, మఱిదేనిని గుఱించియు, మనన చేయగూడదనియు నియమించుట, ఈవ్రతము దృఢపడినవారి జన్మము ధన్యము, సంశయము లేదు ప్రకృతిని జయించవలసియుండిన ఇది ఒకటే గొప్పమార్గము, పతివ్రతయైనను, ఎప్పడైన పరపురుష విషయమై మనస్సున నేదైన సంకల్పము గల్గినచో వెంటనే వివేకజ్ఞానము చే మనస్సును మరలించుకొనునో, ఆలాగున వివేక వైరాగ్యనిష్ఠ గలవారైనను ఆత్మభావననుండి అనాత్మభావనలోనికి గాని దృశ్యవృత్తిలోనికిగాని మనస్సు మరలుచుండిన వివేకజ్ఞానముచే మఱలించుకొనవలయును

570 రోగముగలవారితో రోగమును విడిచిపెట్టుడని చెప్పినను లేక స్వయముగా తాను రోగమును త్యజించతలచినను రోగము వదలి పోవునది కాదు రోగరహితమగు మార్గము నుపదేశించినను రోగము నశించువిధానమును అనుష్ఠించిన మాత్రమే రోగరహితమగును ఈలాగున ప్రకృతి దోషములను విడిచి పెట్టుమన్నను లేక తనయందుగల దోషము త్యజించ సంకల్పంచినను అది పోదు దానికి సరియైన అనుష్ఠాన ముండవలయును అపుడే సరియగు ఔషధసేవయు, పథ్యమున్ను ఉండినను రోగము స్వయముగా ఎట్లు నశించునో ఆలాగున జీవునియొక్క భవరోగమున్ను తెలిసికొన దగినది

572 సామాన్యముగా తనయందు ఏదైననొక దోషము ప్రమాదము వలన గలిగిన, అది యితరులపై మోపి తాను నిర్దోషిగా ప్రకటించెడు స్వభావము గలదు అది యెటువంటిదన విషయుక్త వస్తువును భుజించి

తాను విషముతో కూడిన పదార్థము భుజించలేదనియు, అతడే భుజించెననియు మరియొకని చూపునట్లుండును తాను ఆ మాటను సమర్థింప గలిగినను విషముచే గలిగెడు అపాయము తనకే గలుగునుగాని, ఎదుట తాను నిరూపించిన వానికి గలుగదు

572. ఉత్తము డెప్పడును అన్యుని దోషిగా చేయడు తనయందు దోషము లేనప్పటికిన్ని యితరుల క్షేమమునుద్దేశించి యైనను తన్ను దోషిగా నంగీకరించును మధ్యముడు ఉన్నదున్నట్లు అంగీకరించును అధముడు తనయందే దోషముండినను లేదనియు, యెదుటనుండు కక్షియందే యున్నట్లును ప్రకటించును మొదటివాడు దేవమనుష్యుడు రెండవవాడు నిజమైన మనుజుడు మూడవవాడు అసురస్వభావముగల మానవుడని గ్రహించ దగినది

573 పుస్తకములు చదువుట మస్తకమున దలించుటకొఱకే, అనగా యావాక్యములను శిరసావహించి ఆచరించు నిమిత్తమే యని మరువగూడదు అట్లయిన రోగి కొఱకు వైద్యుడు చెప్పిన పథ్యౌషధము లన్నిటిని ఆచరణలో పెట్టినవానివలె ఆరోగ్యము నొందును

574 ఒక భూమియందు నొకరకము విత్తనమువేసి, సరిగా పండనిచో కర్షకులు ఏలాగున బీజములు మార్చిమార్చి పరిశోధన సలిపి యనుకూలమైన విత్తనములను చల్లి పండించెదరో, ఆలాగున విజ్ఞానవంతులు ఒక కార్యములో ప్రవేశించి ఫలసిద్ధిగలుగక పోయిన మరియొక కార్యములో యత్నించి కార్యసిద్ధిని బడయుదురు అది యెన్నిసార్లయినను ఫలిసిద్ధి గలుగువఱకు మార్చి మార్చి యత్నము చేయవలెను ఆత్మశుద్ధిగలిగి దైవజ్ఞానము సంపాదించుటకు అనేక పద్ధతులు గలవు

575 శుద్ధిద్వయము గలవాడే ముక్తిద్వయమునొందగలడు శుద్ధిద్వయమనగా జిహ్వేంద్రియ శుద్ధియనియు గుహ్యేన్ద్రియ

శుద్ధియనియు తెలియందగినది సత్యవాక్కుచేత జిహ్వేంద్రియ శుద్ధియు బ్రహ్మచర్యముచేత గుహ్యేంద్రియశుద్ధియు గలుగవలయును వీనికే వాక్ శుద్ధియనియు, కౌపీన శుద్ధియనియు పేరు గలదు ముక్తిద్వయమనగా। జీవన్ముక్తియనియు, విదేహముక్తి యనియు గ్రహించదగినది ఈ రెండువిధముల శుద్ధిగలవానికి మోక్షమార్గము శుద్ధముగా నుండును లేనివారికి మోక్షము చాలా యశుద్ధమైనది దానివలన ఆ మార్గము గమన యోగ్యము కానందున ఎవరున్నూ మోక్షమునకు వెళ్లజాలరు కావున ఎవరైతే మోక్షమందు అక్కర గలిగి యున్నారో వారి మార్గమును శుద్ధము చేసికొనవలయును లేనిచో నష్ట తగులును

576 యోగమునకును, జ్ఞానమునకును ఈలాటి సంబంధము గలదు అదెట్టిదనిన, దీపమునకు చిమ్నీకిన్ని గల సంబంధము వలెనుండును దీపము లేనిచో చీకటి నశించదు వస్తువులు కనుపించవు అయితే చిమ్నీ లేనిచో దీపము గాలివలన ఆరిపోవును చిమ్నీ మాత్రము మంచిదిగాను గట్టిదిగాను యుండినను, చీకటి నశింపజేయుటకుగాని వస్తువును ప్రకాశింపచేయుటకాని సమర్థత గలిగి యుండదు కావున అంధకారమున సంచరించువారికి దీపము చిమ్నీ గలిగియుండ వలసినట్లు, మాయలో నుండు జీవుడు జ్ఞానమును యోగమును గలిగియుండేలాగున చూడవలయును అప్పుడే ఆత్మదర్శనము లభించును అజ్ఞానము నశించును యోగము జ్ఞానమునకు సహాయసాధనము

577 ఈశ్వరదృష్టి, జీవదృష్టి యను రెండు దృష్టి భేదములు గలవు ఈశ్వరదృష్టి సమష్టి గాను, జీవదృష్టి వ్యష్టి గాను ఉండును ఏలన వ్యష్టి బ్రహ్మచైతన్యమే జీవుడు సమష్టి బ్రహ్మచైతన్యమే యీశ్వరుడు ఇది వారి వారి ప్రకృతి వలన తెలిసి కొనవచ్చును దీనిని బట్టి వారు జీవదృష్టి గలవారా? లేక యీశ్వరదృష్టి గల వారా? యనిగ్రహించుకొనవచ్చును రేడియో సొంతముగా పెట్టుకొని శబ్దము వినుచుందురు ఆకాశము సర్వులకున్ను వినేలాగున యవకాశము గలుగజేయును పంకాలు స్వంతము గాలి కొఱకు

పెట్టియుందురు వాయు వందరికిన్ని అవకాశ మిచ్చుచున్నది దీపము స్వంతము వెలుతురు కొఱకు పెట్టుదురు సూర్యుడు సర్వులకున్ను ప్రకాశ మిచ్చుచుండును జలమును పైరులకు, పుష్పములకు, ఫలములకు మాత్రమే మోటచేతగాని, యింజన్ చేతగాని, చేతితో యెత్తి పోయుటకుగాని చేయుదురు వర్షమో? చరాచరములన్నిటికిని జలమునిచ్చును భూమి వారి వారిది యని హద్దు ఏర్పరచు కొనెదరు కాని అది మనుష్య కల్పితము ఈశ్వరకల్పితములో ఏకముగానే యుండును దీనియందు మరల ఉత్తమోత్తమ, ఉత్తమ, మధ్యమ, అధమ భేదములుగూడ గలవు ఉత్తమోత్తముడు జనులందరకును ఒకే విధముగా నుపకారము చేయును ఉత్తముడు తనదేశమువారికి మాత్రమే సహాయము చేయును మధ్యముడు తన జాతికి మాత్రమే యుపకారమొనర్చును అధముడు తనవారికి మాత్రమే సహాయపడును అన్నిటికి అతీతుడు సమస్త ప్రాణులకుగూడ సహాయ మొనర్చును అతడు మనుష్యుడైనను, పరమాత్మ స్వరూపుడు

578 దేవళములోగాని, మహాత్ములసన్నిధిలోగాని పుష్పములు, పండ్లు, కర్పూర హారతి, టెంకాయ కొట్టుట మొదలగు కార్యములు జరుగుచుండును లేక ఫల పుష్పములు సమర్పించుచుందురు ప్రపంచములోగల సకల స్థూల కర్మలున్ను, సూక్ష్మము కనుగొనుట కొఱకేర్పడినవి పుష్పములలో తెలుపు, యెరుపు, పచ్చ, నీలము, మొదలగునవిగూడ గలవు దీనివలన మీయొక్క దృశ్య వాసనలన్నియు, ప్రకృతిగుణములన్నియు ఈశ్వరార్పణము చేయుటకున్ను, లేక గురుపాదములో సమర్పించుటకును లేక, యీలాగున కర్మ ఫలమునుగూడ దైవార్పిత మొనర్చుటకున్ను, ఫలమునుకోరక నిష్కామపరుడై యుండవలెనని గ్రహించుట కొఱకున్ను చేయడమైనది కొబ్బరికాయ పైనుండు పీచు (నార) తీసి వేయనిచో యెంత కొట్టినను పగలదు అదేరీతిగ హృదయగ్రంథులు మనస్సంకల్పములు, చిత్తవృత్తులు, నశింపనిచో హృదయగ్రంథి విచ్ఛేదము గలుగదు అనగా యావరణము నశింపదు మంచి హారతి కర్పూరమైనచో కాలిన తరువాత కొంచమైనను మశి(బొగ్గు) నిలువదు మలిన కర్పూరముగాని, నేతివత్తి గాని

హారతియిచ్చిన మశి నిలుచును శుద్ధహారతి కర్పూర మైనచో నేమియు మశి యుండదు కర్పూరము దేవునకు లేక మహనీయులకు హారతి యిచ్చెదరు ఇది భగవంతునియందు లేక మహనీయుడగు గురువునందు ఐక్యమును (ఏకత్వమును) ఉపదేశించుచున్నది ఆత్మశుద్ధి కానిచో మశి నిలుచునట్లు, కర్మశేషము నిలుచును అట్టివారికి శివ జీవైక్యముగాని, గురునియందు ఏకత్వజ్ఞానముగాని సిద్ధించదు వీరికి పునర్జన్మము గలుగును కర్మశేషము లేనివారికి పునరావృత్తిలేదు వారికి ఐక్యము గలుగును

579 బ్రహ్మచర్యము నాలుగు - విధములు ఒకటి నైష్ఠిక బ్రహ్మచర్యము రెండు గృహస్థ బ్రహ్మచర్యము, మూడు విధుర బ్రహ్మచర్యము, నాలుగు అఖండ బ్రహ్మచర్యము ఇది పురుషుల కేలాగున నుంటున్నదో, స్త్రీలకున్ను అలాగుననుంటున్నది 1 నైష్ఠిక బ్రహ్మచర్యమందు శుకుడుండెను 2 గృహస్థ బ్రహ్మచర్యమందు జనకుడుండెను 3 విధుర బ్రహ్మచర్యమందు యాజ్ఞవల్క్యుడుండెను 4 అఖండబ్రహ్మచర్యమందు శ్రీకృష్ణుడొక్కడే యుండెను అలాగున స్త్రీలలో 1 నైష్ఠిక బ్రహ్మచర్యమందు "గార్గి" యుండెను ఇది బృహదారణ్యకోపనిషత్తునందు కనందగును 2 గృహస్థబ్రహ్మచర్యమందు 'చూడాల' యుండెను ఇది శ్రీ యోగవాసిష్ఠమున కనందగును 3 విధుర బ్రహ్మచర్యమందు "మైత్రేయి" యుండెను ఇదియు్ను బృహదారణ్యమునందు చూడందగును 4 అఖండ బ్రహ్మచర్యమందు 'పాతమసి" యుండెను ఇది ఆత్మపురాణమందు కనందగును మోక్షవిషయములో వీరందరున్ను సమానులుగా నుండినను నైష్ఠిక బ్రహ్మచర్యములో నుండువారి ఆత్మశక్తి యితరులకు గలుగదు అదే దీనిలోగల రహస్యము

580 ప్రపంచములోగల దేనికిన్ని లొంగకుము లొంగనివానికి ఈలోకము లొంగి పోవును అట్లుగాక ఏ విషయమునకైన లొంగినచో, ఎట్టి చిన్నస్థితిలో నుండువానికిగూడ లొంగి యుండవలసియుండును

581 గర్వమడగు ఉపాయము - మిణుగురు పురుగు

సంధ్యాకాలమున అచ్చటకిచ్చటకి అతివేగముగా తిరుగుచుండును కొంతచీకటి పడినపుడు నక్షత్రములు బాగుగా ప్రకాశించును ఆ నక్షత్ర ప్రకాశము చూచినపుడు ఈ మిణుగురుపురుగు, క్రిమిత్వము గలిగి యొక ప్రదేశమందుండిపోవును అపుడు నక్షత్రములు తామే గొప్ప ప్రకాశముగల వాటిమని తోచేలాగున ప్రకాశించుచుండును చంద్రుడు ప్రకాశించునపుడు నక్షత్రములు తమ గర్వమును అణుచుకొనేలాగున తోచునట్లు వాటి ప్రకాశమును తగ్గిపోవును అత్తరి చంద్రుడు గొప్ప ప్రకాశవంతుడై తోచేలాగున నుండును అత్తరి సూర్యుడుదయించునపుడు చంద్రుడు గొప్పతనము అణుచుకొన్నట్లు కాంతి శూన్యమైపోవును కావున సామాన్య జనులయందు కొంచెము జ్ఞానముగలవాడు తాను గొప్పవాడనని తలంచును తనకన్న గొప్పవారిని చూచునపుడా గర్వమడగును అలాగున ఒక్కొక్కరు తమకన్న గొప్పవారిని చూడందగును అట్లు చూడ కపోవుటచేతనే తాను గొప్పవాడనని అహంకరించుటకు కారణము కావున తనకన్న గొప్పవారిని చూచుచుండవలయును అపుడే తన గర్వమడగును

582 వేదాన్తాది గ్రంథముల నభ్యసించు వారిలో మూడు తరగతులవారుగలరు (1) ఉత్తములు- వీరు చదివిన దానిలో ఒక అక్షరమునైనను వ్యర్థపరచక యాచరణలోనుంచి బాగుగ అనుష్ఠించి జన్మసాఫల్యముగావలయునని తలంపుతో జదువుదురు (౨) మధ్యములు మధ్యమతరగతిలోనుండు వారు సాధ్యమైనంత వఱకాచరించ వలయుననియు, అంతేగాక యితరులకు బోధించి వారిని గూడ ననుష్ఠాన వరులనుగా జేయవలయునను తలంపుతో జదువుదురు (3) కనిష్ఠులు-వీరు తామనుష్ఠింపవలయు నను విచారము లేక యితరులకు బోధింపవలయును సభలో నుపన్యసింపవలయును దానివలన విఖ్యాతి గాంచవలయునని తలంపుతో జదువుదురు ఇక నాల్గవతరగతిలో జేరినవారు కొందఱు గలరు వీరు పై మూడు తరగతులలో నుండువారితో బోల్చదగరు వీరి నధమ తరగతిలో జేర్చవలసియుండును వీరు కొంచమైనను ఆచరింపవలయునను తలంపులేనివులేనివారై పుణ్యాత్ములతో

వాదముల జేసి వారి పరిశుద్ధాచరణలను దూరీకరింపవలయునని దలంపుతో జదువుదురు వీరు నరకగాము లగుదురు

583 సుషుప్తిలోనుండు వాడెంత గొప్పవాడైనను స్వయముగ సమయమునకు లేచుట గాని, నిద్రలోనుండు ఇతరులను లేపుటకు గాని శక్తిలేనట్లు, అజ్ఞాన నిద్రలో నుండువారు, తానెవడు? ఎచటుంటున్నాడు? దేనికొఱకు వచ్చియున్నాడు? అనితెలియ జాలడు జాగ్రదవస్థలో నుండువాడు సామాన్య మనుజుడైనను, ఎంత గొప్పవారినైనను నిద్రలోనుండువారిని లేపగలుగును

584 బంధింపబడినవాడు బంధనములో నుండు ఇతరులను బంధవిమోచనమును జేయంజాలడు బంధనములేనివాడు సామాన్యుడైనను బంధనములోనుండు వారి నెంతగొప్పవారినైనను విమోచనము జేయశక్తి గలిగి యుండును

585 భావనావిశేషము నాలుగు విధములుగా గలదు ఇది ఒక్కొకటిన్ని యొకదానికన్న మఱొకటి వేయిరెట్లధిక ఫలము నిచ్చును (1) సామాన్య మనుజులకన్న తాను ఋషివంశీయుడనని తలంచుట (2) తాను ఈశ్వరాంశుడనని తలంచుట, మొదటిదానికిని, ఈ రెండవదానికిని అగ్ని గుండమునకును, అగ్నిఅణువులకును గల భేదముండును దానికన్నను ఈశ్వరుండే అందఱి హృదయములో నుండు వాడగుటచే తనయందుండువాడు గూడ ఈశ్వరుడని తలంచుట మూడవదగును ఇయ్యది యనేక పాత్రలలోగల జలములందు సూర్యుడొక్కడైనను అప్రతిబింబములు ఈరూపముగ నుండునని దలంచుట వంటిదగును దీని నంతర్యామిత్వమని యందురు నాల్గవది యీశ్వరమయమే అంతయును, దానికన్యమైనది మఱియొకటి లేదని నిశ్చయించుకొనుట ఈ స్థితిలో తనకు ఇపుడేయవస్థ గలిగి యుండెననియు, ఏ యనుభవము గలిగియున్నదనియు యోచించు కొనవలయును ఋషివంశమని తలంపు గలగనిచో బ్రయోజనము లేదు ఋషివంశమని దలంపుగలిగిన తన

జీవితము ఋషిజీవితమువలె నుండవలయును సంకల్పము చెప్పనపుడు గోత్రము చెప్పటకు కారణమిదే

586 అమనస్కము నాలుగువిధములుగా నుండును ఒకటి మనస్సు సదా తనకు స్వాధీనమైయుండుట రెండు మనస్సు మొదలగు ఇంద్రియములకు తాను సాక్షిగ నుంటున్నానని జ్ఞానము గలుగుట మూడు మనస్సు ధ్యానమువలన పరమాత్మయందైక్యము గలుగుట నాలుగు మనస్సను ఒక వస్తువే లేదు అది సంకల్పమాత్రము రజ్జువు నందు గనుపించిన సర్పము త్రికాలములందును లేదు అవిచారణచేత సర్పప్రతీతి యగుచున్నది బ్రహ్మమందు జగత్తు కాలత్రయమందును లేదు ఆ విద్యచే గల్పితమని దెలియుట

587 దేహమొక వనము వంటిది వనములో అనేక వృక్షము లుండునట్లు ఈదేహవనములో అనేక గుణములు గలవు వనము లోగల తరువులలో కొన్ని వర్షఋతువులోను, కొన్ని శరదృతువులోను, కొన్ని వసంత ఋతువులోను పుష్పించునట్లు తమోగుణములనెడు చేదైన ముష్టి చెట్టు మొదలగునవి పుష్పించు కాలమొకటి గలదు మఱల రజోగుణములను పుల్లని చింతచెట్టు మొదలగునవి పూచెడి కాలమొకటి గలదు సత్త్వ గుణము లనెడు మల్లిచెట్టు మొదలైనవి పూచెడికాల మొకటి గలదు క్రూర స్వభావములగు పాపగుణపుష్పములు శరీరమందెపుడు పూయు చుండునో అపుడు తమోగుణకాలమని గ్రహించుకొనవలయును అహంకారమమకార కర్తృత్వాది గుణములు దేహ, ముఖ, నేత్రాదులలో ఎపుడు స్ఫుటతరముగా ఎఱ్ఱని పూవులవలెబుట్టు చుండునో, అపుడు రాజసస్థితిలో నుంటున్నట్లు దెలిసికొనవచ్చును వసంతకాలమువచ్చునప్పడు మల్లిచెట్టు మొదలగునవి తెల్లనిపుష్పముల బూయు చుండునట్లు ఎవని ముఖ, నేత్రాదులలో శాంతి, కరుణ, విరక్తి మొదలగు ప్రసన్న భావములు గానుపించునో, అపుడు సత్త్వగుణము గలిగి నటుల గ్రహించుకొనవచ్చును పూలన్నియు రాలిపోయిన తరువాత ఏలాగున కాయ ఏర్పడునో, అలాగున సత్త్వగుణ స్వభావము గూడ

పూర్ణముగ వికసించిన తరువాత ఆసత్త్వగుణమును గూడ దాటి విశుద్ధ గుణము గూడ గలుగునపుడు గుణత్రయా తీతమగు తురీయ పదవిలో బ్రవేశించును అపుడు బ్రహ్మముయొక్క నిజ స్వభావమగు స్వప్రకాశ జ్ఞాన స్థితిలో నిలకడ గలుగును

588 సారవంతమైనదియు, సకాలవర్షము గలదియు, జంతువుల బాధ గలుగ నట్టిదియునగు భూమిలో జేసిన కృషి ఏలాగున శుద్ధముగ ఫలించునో, భూమ్యాదులు శుద్ధములు గానిచో ఏలాగున కృషి చక్కగ ఫలింపదో, అట్లే హృదయశుద్ధియు, ధర్మబుద్ధియు గలవారు ప్రారంభించెడి సర్వ కార్యములున్ను నిర్విఘ్నముగ ఫలించును ఇదియే దానికి గురుతు

589 గృహస్థాశ్రమములో నుండి ధ్యానము జేయువారు గ్రహించవలసిన ధర్మము పక్షులు మనకుపదేశించుచున్నవి విహంగములన్నియు ఎచ్చోట నుండినను ఏకార్యమును జేయుచుండినను, అస్తమయమగుటతోడనే నివాసమునకువచ్చి చేరుచున్నవి మరల సూర్యోదయముకాగానే వెళ్ళిపోవుచుండును ఆలాగున గృహస్థ బ్రహ్మనిష్టుడుండవలయును

590 ఆత్మజ్ఞాన విషయములో, జాగ్రదవస్థలోనికి వచ్చిన వారియొక్కయు, అట్టి ఆత్మజ్ఞాన విషయములో సుషుప్తిలో నుండువారి యొక్కయు, స్వభావము తెలిసికొనుటకు గల రహస్యము ఈక్రిందివిధముగా నుంటున్నది జాగ్రదవస్థలో నుండువారు, గుఱక పెట్టుటగాని, పండుకొనినపుడు కరచరణములు స్వాధీనము లేకయుండుట గాని, ధరించిన వస్త్రములు సరిగా లేకపోవుటగాని గలిగియుండరు నిద్ర లోనుండువారికి గురకపెట్టుట, కరచరణములు స్వాధీనము లేకపోవుట ధరించిన వస్త్రము సరిగా లేకపోవుట మొదలగు వికారములు గలుగుచుండును ఆలాగున, ఎవని ఆత్మ జాగ్రదవస్థలోనికి రాలేదో వాని యింద్రియములన్నియు అస్వాధీనములై యుండును అట్లు కానివారి యింద్రియములు సదా స్వాధీనములైయుండును ఈ గుఱుతును

చూచుకొనిన చాలును

591 కృత, త్రేతా, ద్వాపర, కలియుగములలో మోక్ష నిమిత్తము కృతయుగమున సత్య, జ్ఞాన, దయాదులున్ను, త్రేతాయుగమున, తపో, ధ్యాన, యోగాదులున్ను, ద్వాపరమున యజ్ఞ, దాన, జపార్చనాదులున్ను, కలియుగమున భక్తి, దాన, పుణ్యకర్మాదులున్ను విధింపబడినవి కొన్ని శాస్త్రములలో కలియుగమున భక్తియనియు, కొన్నిటిలో దానమనియు, అనగా పుణ్యకర్మలనియు కలదు దీనియొక్క సారవేమన కలిగియుగమున భక్తిదానాది పుణ్యకర్మలు కలియుగమును దాటించి ద్వాపరమున జేర్చును యజ్ఞజపార్చనాదులు ద్వాపరమును దాటించి త్రేతాయుగమునకు జేర్చును తపోధ్యానయోగాదులు త్రేతాయుగమును దాటించి సత్యయుగమునకు జేర్చును సత్య, జ్ఞాన, దయాదులు కృతయుగ ధర్మములగుటచే, అపుడు మోక్షము గలుగును కావున సత్యమును, ఆత్మసాక్షాత్కార జ్ఞానమును, భూతదయయున్ను గలిగిన మాత్రమే మోక్షము గలుగును ఈపైజెప్పిన నాలుగున్ను ఒక్కొక్కదానికి నొకటిసోపాన క్రమముగాను, ఒక్కొక్కదానికి ఒక్కొక్కటి సాధారముగా నుండును ఈ నాల్గింటిలో ఎవరు ముఖ్యముగా ప్రవర్తించెదరో, వారు ఆయా యుగములో నుండువారలని గ్రహించుకొనవలయును ఒక్కొక్క యుగమున మోక్షమని చెప్పదాని రహస్యవేమన ఆ యా యుగములనుండి విముక్తిని గలుగజేయునని యర్థమని గ్రహించవలయును

592 ఉత్తమ ప్రవృత్తియగు పరిణామము వలన అంతిమజాతి యందుండు జీవుడు శూద్రత్వమున్ను, శూద్రత్వము నందుండు జీవుడు వైశ్యత్వమునున్ను, వైశ్యత్వమందుండు జీవుడు క్షత్రియత్వమునున్ను క్షత్రియత్వమునందుండు జీవుడు బ్రాహ్మణత్వమునున్ను, బ్రాహ్మణత్వ మునందుండు జీవుడు బ్రహ్మత్వమునున్ను బొందుచుండును ఈ పరిణామము పుట్టిన కులమునను సరించునది గాదు గుణసంస్కారముల ననుసరించునదిగ నుండును ఇది క్రింది తరగతి లోనుండు

ఉద్యోగిసత్ప్రవర్తనవలన యున్నతోన్నతమగు తరగతిలోనికి పోవునట్లుండును

593 ఎల్లపుడు దైవభావములో నుండుటయే ముఖ్యకార్యమైనను అగి అభ్యాసకులకు సాధ్యము గానందుచే, వారు జప, ధ్యాన, పారాయణకాలమందైనను దైవభావమును మరుపు గలుగనీయక చూడవలయును ఈ యభ్యాసము బలపడి రాగారాగా సదా దైవభావములో నుండుటకు సాధ్యమగును

594 కర్మను అందఱును నిర్లక్ష్యము జేయగూడదు కర్మ అనునది గొప్పశక్తిగలది దీనిని ఉపదేష్టలు మఱువ గూడదు విషమునకు మరణధర్మమున్ను, అమృతమునకు మరణరహితధర్మమున్ను ఉండునది నిజమైనచో, పుణ్యపాపకర్మల ఫలమున్ను దప్పక ఫలించును అదేరీతిగా చీని విత్తనమునకు మధురఫలమున్ను ముష్టివిత్తనమునకు చేదైనఫలమున్ను గలుగునట్టి విధిసృష్టి యందుండెనేని సుకృత దుష్కృత ములకు సుఖదుఃఖములు తప్పక గలుగును కావుననే శాస్త్రములో అధికారి యిటులుండవలయునని నిరూపించబడినది ఇపుడు గల ధన బలమునుగాని, జనబలమునుగాని, యధికార బలమునుగాని జూచి దర్మోల్లంఘనము జేయరాదు ధర్మవిస్మృతిగలగి వర్తించినచో విషము గలిసిన మధుర పదార్థముల భుజించినటులే యుండును తత్క్షణమున దెలియకపోయినను తరువాత బాధపడవలసియుండును కనుకనే ప్రపంచములో ఎన్నియో మతములు, సంఘములు, సమాజములు విఖ్యాతములై యుండినవి కూడ నామ రూపములైనను నిలువక సమూలముగ నశించి పోవలసివచ్చినవని మరువకూడదు కావున దైవధనము లేనివారై ప్రపంచధనము గలవారిని సంఘములో జేర్చిన గొప్ప లాభము గలుగునని దలచినను అది నష్టమునే గలుగజేయును ఆలాగున ప్రపంచములో గొప్ప అధికారము గలవారిని సంఘములో చేర్చిన గొప్ప లాభము గలుగునని తలంచి చేర్చకుడు తన ఇన్ద్రియములపై అధికారము గలిగినవారిని చేర్చవలయును అట్టి కార్యము త్వరలో నభివృద్ధి

నొందునదేగాక అక్షయముగనుండును

595 బ్రహ్మవిద్య కొంత గోప్యముగా నుండవలయును అపుడే అది పరిమళించును అది యెటువంటి దనగా సుగంధధూపపు వత్తివంటిది అది వెలుగుచున్నపుడు మండుచుండెడు స్వభావము గలిగియుండును అట్టైన సుగంద వాసన యుండదు కావున దానిని వెలిగించువారు మండుచుండిన వెంటనే ఆర్పివేయుదురు అపుడు సుగంధధూపము అంతటను వ్యాపించును మండుచుండిన సుగందవాసన యుండదు ఆలాగున బ్రహ్మవిద్యాసాదకుడు తనసాధనానుష్ఠానమును గుప్తముగా నుంచుట మంచిది అపుడే ఆసాధకుని పవిత్రత, మహిమ లోకములో వ్యాపించును అట్లు అణచివేయుటకు శక్తిలేక అహంకరించి విచ్చలవిడిగ బైట పెట్టినచో దానియందుగల పవిత్రత తగ్గిపోవును

596 సుగంధవస్తువులను చూడుడు అవి యెల్లప్పుడును గాలి తగులక మూసియే యుంతురు అందువల్ల వాటియొక్క సుగంధము ఎల్లప్పడుండును మూసివేయక గాలి తగిలేలాగున నుండినచో వెంటనే సువాసన నశించి పోవును ఆలాగున తనయొక్క ధ్యానానుష్ఠానములు గుప్తముగానే యుండేలాగున చూచుట క్షేమకరము లేక అభిమాన పరులై బయట గొప్ప బ్రహ్మజ్ఞానివలె నటించినచో అది యుపయోగము లేకపోవును

597 సర్వేశ్వరా! నాకు మోక్షము నిమ్ము. మీలోనైక్య పరచుకొనుము నాకు దర్శనమిమ్ము అని ప్రార్థించువారలకన్న సర్వేశ్వరా! నన్ను విడనాడకుము సత్యము నుండి నన్ను దూరునిగా జేయకుము ధర్మమునుండి నన్ను వేరు పరచకుము అని యిట్లు ప్రార్థించువారే యెన్ని యోరెట్లు శ్రేష్ఠులు ఏలన వారు ఈశ్వరుని యొక్క మహిమ నెఱిగినవారు అంతేగాదు ఈశ్వరుడు సత్యస్వరూపుడని తెలిసికొని యున్నందుచే సత్యప్రవర్తకులే యీశ్వరుని పొందగలరను జ్ఞానము గలిగినవారు, ఆలాగున భగవంతుడు ధర్మస్వరూపుడు, ధర్మానుష్ఠాన పరులు మాత్రమే యతని

కరుణకు పాత్రులగుదురని నిజమెఱిగినవారు ఆలాగున నన్ను కరుణకును, ప్రేమకును దూరునిగా జేయకుము ఏలన నీవు కరుణాసముద్రుడవు ప్రేమసాగరుడవును అగుటవల్ల కరుణయు ప్రేమయు గల వారినే నీవు నీలో చేర్చుకొనగలవు ఏలన నీటిలో నీరును, తైలములో తైలమును ఐక్యమగునేగాని నీటిలో తైలముగాని తైలములో నీరుగాని కలియదుగదా అని ప్రార్థించవలెను

598 ఆత్మస్థితిలో నిలకడ గల జ్ఞానులు ఈలాగున విచారణచేయవలయును దైవము జ్ఞానస్వరూపము అజ్ఞానములేనివాడు ప్రకాశములో ప్రకాశమును, చీకటిలో చీకటియును ఐక్యమగునే గాని ప్రకాశములో తమస్సును తమస్సులో ప్రకాశమును ఎట్టైక్యము గాజాలవో జ్ఞానాజ్ఞానముల స్థితులును ఈలాగుననే యుండునని చింతన చేయుచుండవలయును

599 ఆత్మజ్ఞానులమని తమలో తాము తలంచు వారు గూడ ఈలాగున చింతనచేయ వలయును ఆత్మజ్ఞాన మమృతము అమృతము నుండి విషమేవిధముగ పుట్టజాలదో ఆలాగున జ్ఞానులమగు మననుండి విషయము గలుగకూడదు ఏలన కలకండనుండి చేదు వగరు కారము పుట్టజాలవు ఆలాగున ఆనందస్వరూపుడగు ఆత్మయగు తననుండి రాజస తామస ప్రకృతిగుణములు పుట్టగూడదని మననము చేయవలయును లేనిచో జ్ఞాన మజ్ఞానమే యగును

600 జీవితము శుద్ధముగా గడుప సంకల్పము గలవానికి నొక యుపాయము గలదు అది తాను చెప్ప ప్రతివాక్యమును ఆచరించ వలయును ఒక అక్షరమునైనను విడిచిపెట్టరాదు ఈసంకల్పమువల్ల వాఙ్నియమముగలుగును దానివల్ల తక్కిన సర్వేంద్రియములును స్వాధీనములగును రైలుయింజను గమనము ననుసరించి తక్కిన పెట్టెలు ఎట్లు నడుచునో, ఆలాగున శరీరయంత్రమునకు వాగింద్రియము యింజను వంటిది దాని యొక్క నియమము వల్ల తక్కిన సర్వేంద్రియములును

స్వాధీనములగును ఏది యైనను ఒక సాధనవల్లనే సాధింపగలుగును

601 ప్రపంచములో ఎంత మంచికార్యమున ప్రవేశించినను, దూషణ భూషణములు, లాభ నష్టములు, సుఖ దుఃఖములును గలిసియే యుండును దానికి భయపడి కర్తవ్యకార్యమును నిర్వహింపక పోయిన అంతఃకరణశుద్ధి గలుగని కారణమువల్ల మనస్సు నిర్మలముగా నుండదు ఈ రెండింటిలో నాలోచించిన ద్వంద్వములను సహించి కర్తవ్యమును నిర్వహించుటయే ధర్మమగును సహనముచే తరింపవలసినదేగాని ప్రపంచజన ప్రసన్నతచే గాదు ఎట్లన వ్యాధిగ్రస్తుడు ఔషధసేవ చేయనిచో రోగము కుదురదు ఔషధసేవ చేయవలసి యుండిన సహనము వహించి పథ్యమును కాపాడుకొనవలసి యుండును లేనిచో రోగముచే తప్పక బాధపడవలసియే తీరును

602. మంచి మావటి వానిచేతిలో మెలిగిన గజమునకున్ను అడవిలో స్వేచ్ఛగ సంచరించు ఏనుగకున్ను ఎంత తారతమ్యముగలదో, యాలాగున నుత్తమ బ్రహ్మనిష్ఠుడగు గురువుదగ్గర తయారైన వానికిన్ని, అట్లు గురువు సన్నిధిలో తయారుగాని మానవునకున్ను మార్పు గలుగును

603 నిష్ఠజేయువారు సంధ్యాసమయమగునప్పటికి తమ సమస్త పనులను పూర్తిజేసికొని యనుష్ఠానములో బ్రవేశింపవలయును మఱల రాత్రి నాల్గవయామారంభములో లేచి నిష్ఠను పూర్తి జేసికొని సూర్యోదయమగునప్పటికి వారివారి లోకవ్యవహారములలోనికి వెళ్ళుచుండవలయును దీనికొఱకే కోళ్ళను పరమ కారుణికుడగు సర్వేశ్వరుడు సృష్టించెను ఉత్తమమగు కోడి రాత్రి మూడవ యామములో గూయును అపుడు లేచి యనుష్ఠానము జేయువా డుత్తముడు ఆ కోడి కొంచెము విశ్రమించి నాల్గవఘంట బ్రారంభించునపుడు కూతవేయును అపుడన్ని కోళ్ళను గూయుచుండును ఆలాగున మందగుణముగలవారు నాలుగు గంటలకులేచి ధ్యానమారంభించెదరు కోళ్ళు దీనికొఱకే సృష్టించబడినవని యింద్రాహల్యా గాథవలన దెలిసికొనవచ్చును

604 ఉత్తమ గురుశిష్యుల ధర్మము గ్రహించదగినది ఉత్తమగురుడు తానాచరించుదాని వదహారింటిలో నొకభాగమైనను శిష్యులా చరింపగలరో! అను భావముతో అనుష్ఠానము జేయుచుండును ఆలాగున యుత్తమశిష్యులు గురుదేవులాచరించు దానికన్న రెండురెట్లధికముగ ననుష్ఠింపవలయునని దృఢవిశ్వాసము గలిగియుందురు

605 అస్త్ర శస్త్రములను ధరించియుండు మహాయోధుడు, సింహ, శార్దూల, భల్లూక, గజాదులు గల అరణ్యమున సంచరించుచున్నప్పటికిన్ని, యేలాగున దుష్టజంతువులచే బాధనొందక నిర్భయము గలిగియుండునో, ఆలాగున శాస్త్రములో చెప్పియుండు సాధనానుష్ఠానమందు నిష్ఠగలిగినవాడు ధర్మబోధనార్థము కామ, క్రోధ, మోహ విషయాదులతో గూడిన సంసారజనాకీర్ణ స్థలములో నుండినను భయపడనక్కరలేదు బాణతూణీరములను ధరింపనివాడును, యోధుడు కానివాడును, దుష్టజంతుసముదాయముగల అరణ్యములో సంచరించిన నేలాగున క్రూరమృగములచే బాధపడవలసియుండునో! ఆలాగున అనుష్ఠానమందు నిష్ఠలేనివాడు, విషయులగు జనుల మధ్యనుండిన యింద్రియ విషయములచే బాధితుడగును

606 సామాన్యజ్ఞానమనియు, విశేషజ్ఞానమనియు జ్ఞానము ఇరుతెగలు సామాన్య జ్ఞానము సర్వజనులకున్ను గలదు విశేషజ్ఞానము బ్రహ్మచింతన వల్లనే గలుగును ఇట్టి జ్ఞానమువల్లనే అజ్ఞానము నశించును ఎట్లన సామాన్యాగ్ని యనియు, విశేషాగ్నియనియు అగ్ని రెండు విధములు కట్టెలు అన్నిటిలోను సామాన్యముగా నిప్పు గలదు కాని అది కర్రను కాల్చుట లేదు ఎండిన కర్రను అరణిచేసికొని మథించునపుడు ఉత్పత్తియగు అగ్ని కర్రను భస్మమొనర్చును ఇచట యెండినకర్రయని విశేషించి చెప్పటచే, తపోధ్యానాదులచే హృదయదోషము నశించినవాడు గావలయును అట్లు కానిచో పచ్చికర్రను అరణిగావించి తఱచినను నిప్పు ఉత్పత్తికానట్లు మనోనిర్మలత గలుగనివాడు బ్రహ్మవిచారము జేసినను జ్ఞానోత్పత్తి గలుగదు

మానవు లందరికిన్ని "నేను, నేను" అను జ్ఞానము గలదు గాని అజ్ఞానము ఏ నేనును పలుకుచున్నదో అది మాత్రము విచారణ జేయుటలేదు అది బ్రహ్మచింతనగలవాడు మాత్రమే విచారణజేసి తన ఆత్మగా దెలిసి కొనుచుండును

607 అద్దములో తన ముఖము శుద్ధముగా అగుపడవలసి యుండిన అద్దము మాత్రము శుద్ధముగా నుండినచాలదు నేత్రములు గూడ శుద్ధముగా నుండవలయును ఆలాగున తన యాత్మను దర్శింపవలసియుండిన హృదయము నిర్విషయము గలిగి నిర్మలముగా నుండిన చాలదు తీవ్రమగు బ్రహ్మ జిజ్ఞాసయు గలిగి యుండవలయును దర్పణము నిర్మలముగా నుండినను, నేత్రములు నిర్మలముగా నుండనిచో కనుపింపదు నేత్రములు నిర్మలముగా నుండినను దర్పణము స్వచ్ఛముగా లేనిచో కనపడదు ఆలాగున హృదయనిర్మలత యొక్కటి చాలదు బ్రహ్మజిజ్ఞాసయు తీవ్రముగ నుండవలయును నేత్రములున్ను దర్పణమున్ను స్వచ్ఛములుగనుండిన స్త్రీలు గాని, పరుషులు గాని, గృహస్థులు గాని, సన్యాసులు గాని, బ్రాహ్మణులు గాని, బ్రాహ్మణేతరులు గాని వెయ్యేల యెవరైనను తమ ముఖమును స్పష్టముగా జూడగల్గునట్లు, ఆత్మనున్ను ఎవరైనను జూడగల్గుదురు

608 ఎంతమంచి ప్రూనులగు చందనము, టేకు మొదలైనవి ఐనను, మంచి స్తంభము చేసి హర్మ్యమునకుపయోగ పరచవలసివచ్చిన, మొదట గొడ్డలిచే కొట్టి బాడిశచే చెక్కి, రంపముతో కోసి, వులితో చక్కపరచి, త్రోపుడుతో నైసుచేసి, తరిమణిపెట్టునపుడు మాత్రమే సుందరమగు స్తంభమగుచుండును అప్పడందరును దానిని చూచి హర్షింతురు ఆలాగున, ఒక్కమనుజుడు, మంచివంశములో మంచివాడై జన్మించినను, సంసారమునుండి విముక్తి పొందవలసియుండిన అనేక సాధనలు చేసుకొని, శుద్ధాంతఃకరణుడై ఆత్మసాక్షాత్కార జ్ఞానమును పొందునపుడు మాత్రమే లోకమున కుపయోగపడును అప్పడు వానిని అందరున్ను చూచి

ఆనందింతురు అట్లు తయారుకానిచో మంచికులమున పుట్టినను, సుందరాంగుడై జన్మించినను సంస్కారముచే శుద్ధుడు గాకపోయిన, పనిచేయని ప్రూనువలెనే యుండును దేనికిని ఉపయోగపడడు

609 శరీరములో రోగమున్ను మనస్సులో అశాంతియున్ను గలవాడు ఎంత జ్ఞానవంతుడైనను ఏలాగున సుఖముగా ధ్యానములో నుండుటకున్ను ధర్మమునువదేశించుటకున్ను శక్తుడు కాడో, అలాగున, అజ్ఞానగుణములుగలవాడును, మనోనిశ్చలతగలుగనివాడును, నిర్మలదైవభావములో నిలుచుటకున్ను, దైవభావమును జనులకు బోధించుటకున్ను యోగ్యుడు గాజాలడు

610 మాయను మాయమొనర్చుట, అనగా మాయను రహితమొనర్చుట సామాన్యమైన పని కాదు మాయను సృష్టించిన యేబ్రహ్మదేవుడు గలడో, అట్టి బ్రహ్మదేవునితో సమానుడు గావలెను అంతమాత్రము చాలదు కొంచెము అధికుడుగానే యుండవలెను ఎట్లన, ఒక్కదుష్ట రాజ పరిపాలన ముండిన, దానిని నివృత్తిచేసి శిష్టపాలన యేర్పరచవలసిన, ఆరాజ్యమును ఏప్రకారమైనను జయించవలెను జయించవలసి యుండిన, దానికన్న శక్తి అధికము గాని లేక కనీసము సమానమైన నుండవలెను ఆలాగున ఏ తపోబలముచే బ్రహ్మదేవుడు జగన్మాయను సృష్టించెనో, అట్టి తపోబలమున్ను, ఆత్మశుద్ధియున్ను గలుగవలయును అయితే బ్రహ్మకున్నంత శక్తి అవసరము లేదు బ్రహ్మ, ఈలోకమునంతయు స్వాధీనముచేసుకొన్నవాడు ముక్తునికి అంతపని లేదు తన యొక్క ఆత్మను మాత్రము మాయారహిత మొనర్చుకొనినచాలును కాని ఆత్మశుద్ధియు, దానికి తగిన తపస్సు తప్పక యుండవలెను లోకములోగల, చీకటి నశించుటకు, సూర్యునివంటి ప్రకాశముకావలెను గాని ఒకయింటిలోగల చీకటి నశించుటకు మంచిదీపము ఒకటి యుండిన చాలును

611 ప్రకృతిలో జయము గలుగవలసి యుండిన, ఆలస్యము

(సోమరితనము), అజాగ్రత్త అనునది తన శరీరములోగల ఏరోమకూప మందయినను దాగియుండుటకు అవకాశము గలుగజేయకూడదు పై చెప్పిన ఈమూడు పదములున్ను ఒక్క దానిని గురించినవే క్రొత్తగా రాజ్యమును జయించు వాడు శత్రువుయొక్క పురుగునైనను ఎట్లుంచడో, అనగా శత్రుపక్షమువానినొక్కనినైన నుంచడో, ఆలాగున అజ్ఞానమునకు ముఖ్యకారకులు పై జెప్పినవారలే వీరెల్లప్పడును మోక్షకార్యమునకు అడ్డుపడుచునేయుందురు వారిని నిర్మూలించవలయును

612 ధ్యానకాలదృష్టి మూడువిధములు దానికి, అమావాస్య దృష్టియనియు, పాడ్యమిదృష్టి యనియు, పూర్ణిమదృష్టియనియు పేర్లు గలవు నేత్రము మూసుకొనుట, అమావాస్య దృష్టి యగును సగము తెరచి, భ్రూమధ్యమున చూపు నిలుపునది పాడ్యమి దృష్టియగును నేత్రము బాగుగా తెరచియుండునది పూర్ణిమ దృష్టియనంబడును సాధారణముగా అందరున్ను కన్నులు మూసుకొనియే ధ్యానము చేయుదురు పారాయణ ప్రార్థనకాలములో గాని, వేదాంత శ్రవణకాలములో గాని అట్టివారలలో కొందరికి నిద్రవచ్చుటకూడ గలదు ముఖ్యముగా, ప్రాతఃకాలపారాయణ ప్రార్థనకాలములోనే అట్లు నిద్రవచ్చును కారణాంతరముచే రాత్రులలో నిద్ర సరిగా లేనివారికి అసమయమున తూగువచ్చును సాధారణముగా అందరున్ను కండ్లు మూసుకొనియే ధ్యానింతురు కాని అప్పడు నిద్ర వచ్చేలాగున చూచినచో, నేత్రములు తెరచుకొని ధ్యానము చేయవలెను అయితే, కన్నులు మూసుకొని ధ్యానము చేసెడు సుఖముగాని, జ్ఞేయభావముగాని, అప్పడుండుటకు ప్రయాసము కాని, కన్నులు మూసుకొని కొంతసేపు ధ్యానించి, మరల కన్నులు తెరచుకొని, ఆ దైవభావము మరుపు గలుగనీయక భావనను అభ్యసించవలెను కన్నులు మూసుకొని ధ్యానించునపుడు సుఖముగా నుండినను కన్నులు తెరచినప్పడు దృశ్య ప్రతీతిగలుగును నేత్రములు తెరచి దృశ్యమునుగూడ దైవభావన చేయశక్తిగల ధ్యానమలవడిన మరల యెప్పడున్ను, దైవభావము

గలిగియుండును ఈధ్యానమే గొప్పది కన్ను మూసికొని ధ్యానము పామరులుగూడా చేయుదురు ఇది ప్రయాసమైనపనికాదు, కన్ను తెరచి ధ్యానముచేయు వారికి తురీయజ్ఞానము గలుగవలెను, లేనిచో ధ్యేయము గోచరము గాదు పై చెప్పిన ప్రార్థన పారాయణకాలములో, నిద్ర వచ్చి కన్ను మూతబడువారు మాత్రమే, కన్ను మూయకనే దృఢము చేసుకొని, ధ్యానము అభ్యసింపవలెను ఏలన ఇంటిలో నుండు వారు నిద్రించియుండిన దొంగలు ప్రవేశింతురు, నిద్రపోవకయుండిన దొంగలు ఎట్లు ప్రవేశింపగలరు? అనగా ప్రవేశింపరు ప్రాతఃకాలప్రార్థన పారాయణ కాలములో కొంతగొప్పవారికి గూడ కన్నులు మూసిన నిద్రవచ్చు స్వభావము గలదు వీరు నేత్రములను బాగుగా వికసింవచేసేలాగు, చేసికొనిన నిద్రరాదు వీరికి ద్వంద్వాతీతస్థితియగు, తురీయమందు నిలకడయు అంతయు దైవభావనచేయుశక్తియు త్వరలో గలుగును అయితే చిరకాలము ధ్యానముచేసి అట్టిఅనుభవము గలుగవలసియుండును అట్టి వారికి మాత్రమే ఇది సాధ్యమగును

613 దృశ్యములో ఒక్కొక్క దానిని బాగుగా ఆలోచించి చూచుకొనిన బ్రహ్మతత్త్వము, గోచరముగాగలుగును ఫలవృక్షములుగాని, పూలచెట్లుగాని, ఫలపుష్పములు తగ్గిపోయిన, మరల బాగుగా ఎరువుచే బలపరచిన యెట్లు మరల, వృక్షము బాగుగా బలపడి, ఫలములున్ను పుష్పములిచ్చుచుండునో ఆలాగున ఆత్మజ్ఞానములో శాంతిలో ప్రసన్నతలో, కొంచెముకొఱత గలిగినవి యని తోచిన వెంటనే, జాగ్రత్త గలిగి బాగుగ అనుష్ఠానమును శాంతిని, వైరాగ్యమును, దీర్ఘసమయధ్యానమును, తపస్సను, అవలంబించవలెను అప్పడు ఉన్నతస్థితిలోనికి రావచ్చును అయితే కొన్ని చెట్లు బాగుండినను, పురుగులు పట్టిన చెడిపోవును ఆలాగున కొన్ని దుర్గుణములు గలిగినను జ్ఞానము నశించును కావున, దానిని గూడ కనిపెట్టి నివృత్తిచేసుకొన వలసియుండును

614 సామాన్యముగా కొందరు చదువులోను, సంధ్యలలోను, ఏమి

ఉన్నదని చెప్పదురు అది సరియైనది కాదు ఏలన అనేక రైలు బండ్లకూటమియగు, ఒక గొప్ప జెంక్షన్‌లో వెళ్లినవాడు, అచ్చట వ్రాసియుండు బోర్డులైన చూడవలెను లేక గైడు అయిననుచూడవలెను లేక ఎవరినైనను అడుగవలెను లేనిచో ఏబండి ఏసమయమున ఎచ్చోటకు, బయలుదేరునని, ఎట్లు తెలుసుకొన గలుగును? అలాగున బ్రహ్మప్రాప్తిని గోరువాడు వేదాంత శాస్త్రమైన చదువవలయును లేక అనుభవజ్ఞులగు మహనీయుల బోధయైన యుండవలెను లేనిచో ఎట్లు తెలిసి కొన గలుగును అయితే జన్మాంతర పుణ్యవిశేషముండిన చాలును గదా అని యడుగుదురు అప్పుడు గూడా ము, ధ్యానము చేసియుండ వలసియుండును పై చెప్పిన విధముగా చెప్పవారిలో చాలామంది విద్య లేని వారుగానే యుందురు అయితే వారు గూడ ఏదైన ఒకమంత్రమునుగాని, లక్ష్యమును గాని, భావమునుగాని, అనుష్ఠానమును గాని గలిగియే యుందురు అదివారికి ఎచ్చట నుండి దొరకెను? శాస్త్రమందైన యుండవలెను లేక యెవరైన జెప్పినదిగానే యుండ వలయునుగదా! అప్పడున్ను, శాస్త్రమును అంగీకరించియే యుండవలెను శాస్త్రమును జదివియు ఆచరణలేనిచో ప్రయోజనము లేదు కనుకనే శాస్త్రములో ఏమున్నదని అడిగెడి స్వభావము గలగినది

615 మానవుడు చేయుచుండు సమస్త మానసిక సంకల్పములను మనస్సునకు సాక్షియై చూచుచుండు దైవశక్తి యొకటికలదు దానికి తెలియక యెవరున్ను ఏకార్యమున్ను చేయజాలరు అదే యీశ్వర స్వరూపము జనులు ఎవరికి తెలియనీయక తనయొక్క బుద్ధి చాతుర్యముచే ఏ కార్యమైనను చేయతలంచినను, తనయాత్మకు తెలియనీయక చేయజాలరు కర్మయొక్క ఫలాఫలములను నిజముగా నిచ్చువాడు ఆ ఈశ్వరుడే అతని దివ్యదృష్టి నుండి యెవరున్ను తప్పించుకొనజాలరు ఈ సత్యము నెరింగి జీవింప ప్రయత్నించునపుడే జీవుడు సత్యపథములో నడువగలుగును అట్లుగాక ప్రయత్నించెడు యత్నములన్నియు, తాను కన్నుమూసిన లోకమంతయు చీకటిమయముగా నుండునని తలంచెడు పిల్లితలంపు కన్న అధికమైనవి గావు

616 మనుజుడా! నీకర్మానుసారముగా నిన్ను సృష్టించిన దైవశక్తి యొకటి కలదు నిజముగా దానిశక్తివల్లనే నీవు జేయు సర్వకర్మలున్ను జరుగుచున్నవి ఈసంగతి తెలిసికొనినపుడే నీసామర్థ్యములన్నియు, అసమర్థములని నీకు జ్ఞానము గలుగును అంతవఱకు సూత్రధారి యాడించెడు బొమ్మలు ఆసంగతి తెలిసికొనక తామే యాడుచున్నట్లు తలంచెడు తలంపుకన్న నీతలంపు అతిశయించినది కాదను తలంపు నీకు గలుగును అపుడే నీయహంకారములన్నియు నిన్ను వదలిపోవును అపుడే నీ జీవితము ప్రశాంతముగాను, ఆనందముగాను ఉండును

617 మనము ఏదైననొక వంతెనకు గాని, కమానునకుగాని, విగ్రహమునకుగాని, మొట్టమొదట నొక మూస గట్టెదము ఆమూసపై వంతెన గాని, కమానుగాని కట్టెదము అయితే అది తీసివేయవలసినదియే కాని అదిలేనిచో దీనిపై దేనిని గూడ నిర్మింపజాలము ఆలాగున మనయోగము, ధ్యానము, తపస్సు మొదలైనవన్నియు సాధనములే ఇవి యన్నియు నాత్మ గాదు అయితే ఇవి లేనిచో నాత్మను పొందజాలము ఈ తత్త్వమును బాగుగా తెలిసికొనిన మనతవస్సులోను, యెాగములోను, వ్రతములోను, వైరాగ్యములోను గలగర్వము నశించును అనుష్ఠానము లేనిచో నాత్మజ్ఞానము గలుగదను తత్త్వము గోచరము కాగలదు

618 సుషుప్తిలో నుండునప్పడు తానెవరని తెలియుట లేదు జాగ్రదవస్థకు వచ్చునపుడు తానెవరని యెట్లు తెలియుచున్నాడో, ఆలాగున ఎంతవరకు ఆత్మస్వరూప ప్రబోధముగలిగి తాను ఆశుద్ధ బ్రహ్మస్వరూపమని బోధము గలుగలేదో, అంతవరకు ఆత్మసుషుప్తినుండి జాగ్రదవస్థకు రాలేదు జాగ్రదవస్థలోనికి వచ్చునపుడు తాను అట్టి దివ్యాత్మ స్వరూపమున కన్యము కాదని అదే మనకు తెలుపుచుండును అట్టి బోధము గలుగుటయే నిజమగు శ్రవణమగును అంతవరకు చేయుశ్రవణములన్నియు సుషుప్తిలో నుండు వానికి చెప్పనట్లుండును ఈ స్థితి గలిగిన మరల శ్రవణము చేయనక్కరలేదు అప్పడే గురువునందును ఈశ్వరునియందును, తనయందునుగల

చైతన్యాత్మ ఒకటియే అను అనుభవము కలుగును

619 గృహస్థులు మామూలుగ సాధువులకు (సన్న్యాసులకు) ముందుగా భోజనములు పెట్టిన తర్వాత భుజింతురు ఈ విషయమును సాధువులు తెలుసుకొని ప్రాతఃకాలములో సంసారులు లేచుటకు ముందుగా లేచి స్నానాది అనుష్ఠానములను పూర్తిచేసుకొనవలయును అనగా గృహస్థులకు ముందుగా వీరి అనుష్ఠాన దైవకార్యములను పూర్తిచేసుకొనవలయును కాని గృహస్థులకు సమానముగా లేయుటగాని అనుష్ఠానములు నిర్వహించుటకాని చేయకూడదు

620 ధ్యానాదులచే మనస్సులో గలిగెడు మార్పు ఎట్లు తెలుసుకొనవచ్చునని కొందరు అడుగుదురు అది బంగారుపనివారి దగ్గరికిన్నీ ఇనుము పనివారి దగ్గరికిన్నీ వెళ్ళి చూచినచో, గోచరము కాగలదని సమాదానము చెప్పిన చాలును అనగా వారు బొగ్గులో కొంచెము నిప్పు వేసివూదుచుండిన నల్లని ఆబొగ్గులన్నియు ఏలాగున ఎఱ్ఱగా అగ్నిమయమైపోవుచున్నవో ఆలాగున అదివరకు గలిగియుండు మనోవృత్తులన్నియు మార్పుగలిగి ప్రశాంతియు, ప్రసన్నతయు, దివ్యచైతన్యమును కలుగవలయును అట్టినమాత్రమే ధ్యానోత్కర్షత జరుగుచున్న దానికి గుర్తని సాధకులు గ్రహించుకొనదగును

621 ఏద్దైన రెండు త్రుప్పపట్టిన ఫుక్కుకడ్డీలుగాని, ఇతర లోహములెవ్విగాని ఒకదానితో నొకటి రాసుకొనిన అనగా రుద్దుచుండిన రెండింటియొక్క త్రుప్పలు వదలిపోయి శుద్ధమగుచున్నవి ఆలాగున జీవేశ్వరుల ఐక్యాను సంధానానుష్ఠానము నిరన్తరము చేయుచుండిన జీవునియొక్క యవిద్యోపాధియు, యీశ్వరునియొక్క మాయోపాధియు నశించి యేకమైన శుద్ధజ్ఞాన పూర్ణస్వరూపమగు బ్రహ్మస్వరూపము మిగులుచుండును త్రుప్ప సంపూర్ణముగా నశించువరకు ఎట్లు కర్షణము చేయవలయునో, నిశ్శేషముగా ప్రకృతి నశించువరకు బ్రహ్మచింత నాపరమగు ధ్యానమాచరించవలయును

622. కొందరు నిద్రించియుండు స్థలములో వారిలో నెవరైన ఒకరు నిద్రలో ఆస్వాధీనేన్ద్రియములు గలవాడై మాట్లాడే స్వభావము గలిగియున్నది ఆమాట్లేమైనవని అతనిని అడిగినచో తనకు తెలియదనియు, నిద్రించు నితరుల నడిగిన వారికిన్ని తెలియదనియు చెప్పదురు ఆలాగున చక్కని ఆచరణగాని, ఆత్మానుభవముగాని లేనివారి దర్మోపన్యాసములన్నియు, శాస్త్రపరనములన్నియు వారికిన్ని, వినేవారికిన్ని ఏమియునుపయోగపడవు

623 ప్రపంచములో నెన్నియో మతములు గలవు పూర్వముండు మతకర్తలతో వెనుకనుండు మతప్రచారకులు అనేక ప్రశ్నలజేసియుందురు ఆప్రశ్నలన్నిటికిని సమాధానములుజెప్పి తృప్తిపరచియుండిన మరల మతము లేర్పడియుండవు పూర్వపూర్వముగా నుండు మతప్రవక్తలుగూడ వెనుకనుండు మతప్రబోధకులను తృప్తిపరచజూచి యుండలేదు తమ తమ మతాభిప్రాయములు మాత్రము దెలిపియుందురు దానికిష్టమైన వారు ఆ యామతములలో జేరియుందురు ఇష్టపడనివారు మానియుందురు లేక ఇతర మతములలో జేరియుందురు అట్లును గానిచో స్వయముగా నొకమతమును నిర్మించియుందురు కావున నిప్పడుగూడ మిమ్ములనెవరు ఏప్రశ్నచేసినను ప్రశ్నించినవారిని తృప్తిపరచవలెనని తలంచనక్కరలేదు వారి ప్రశ్నలకు మీ యాశయము మాత్రము తెలిపినచాలును పృచ్ఛకులుకూడ నిష్టపడిన అంగీకరింపవచ్చును లేనిచో మానవచ్చును అంతేగాని కలహమునకు కాలుదువ్వుట తగదు

624 సాధకులారా! వర్షజలదార చేసెడు ఉపదేశమును చూడుడు అనంతమగు సాగరమునుండి మేఘమై పరిణమించి వర్షబిందువులై భూమిలోపడి కొంచెము కొంచెముగా ముందుకు నడువసాగిన ఒకచిన్న జలధారయై అచటనుండి మరికొంత ముందుకు వెళ్లిన ఒక చెరువై, అచ్చోటనుండి పయనమైన పెద్ద కాలువయై, అచటగూడ నిలువక యాత్రచేసిన గొప్పనదిలోకలిసి అచటగూడ ఆగక నడుచుచుండిన తన స్వస్థానమగు మహాసముద్రము లోచేరి అక్షయమైన స్థితిగలిగి

నిలిచిపోవును ఆలాగున అనంతజ్ఞానసాగరమగు సర్వేశ్వర స్వరూపమునుండి మాయవల్ల జీవరూపులైనవారు అనుష్ఠానమువల్ల పై జెప్పిన జలధారలైనట్లు కొంచెము హెచ్చుస్థితికివచ్చునపుడు ఇంకను చెరువువలెమారి అధికస్థితిగలిగినను, దానికన్న గొప్పస్థితియగు పెద్దకాలువ స్థితికివచ్చినను, ఇంకను ధ్యానసమాధుల మహిమాతిశయము సిద్ధించినను, ఇంకను మహానదివలె లోకవిఖ్యాతిగలిగినను నిలువక నది సముద్రములో గలియువరకు ఎట్లు దీర్ఘప్రయాణమును చేయుచున్నదో అదేరీతిగ పైజెప్పిన సిద్ధులచేతను, మహిమలచేతను ఆగగూడదు ఏలన, మొదటినుండి ఒక్కొక్క యున్నతస్థానము గలిగిన అవియన్నియు త్వరలో నశించిపోవును కట్టకడకు నదియొక్క స్థితిలోనికి వచ్చినను చాలదు అదిన్ని యెండాకాలమున క్షయించును నది సముద్రము చేరిన మరల క్షయము గలుగదు అట్లు బ్రహ్మాత్మైక్యముగలుగువరకు తన అనుష్ఠానము పూర్తి యైనట్లు తలంపవలదు

625 ఆత్మశుద్ధిగలిగినదా లేదా! అని తెలిసికొనుటకు మంచి యుపాయ మొకటి గలదు ఆత్మశుద్ధి యనియు, హృదయ శుద్ధియనియు, చిత్తశుద్ధి యనియు - ఈ పదములన్నియు ఒకటియే యగును సానుకూలమగు సుక్షేత్రములో వేసిన విత్తన మేలాగున శుద్ధముగా పెరిగి మంచిఫలము నిచ్చునో, ఆలాగున తాను సంకల్పించిన సంకల్పము గాని, ప్రారంభించిన పనిగాని, ఏ విఘ్నము గలుగక సాగుచుండిన హృదయశుద్ధి గలిగినట్లు నిశ్చయించుకొనవచ్చును అట్లుగాక ఊషరక్షేత్రములో వేసిన విత్తనము యెంత పోషణ జేసినను చక్కగ పెరిగి ఫలించనట్లు హృదయశుద్ధి లేని వారు ఏది సంకల్పించినను, యేది ప్రారంభించినను, ఎన్ని ప్రయత్నములు జేసినను చక్కగ జరుగక యుండిన చిత్తశుద్ధి గలుగలేదని నిశ్చయించుకొనవచ్చును ఇదే దానిగురుతు ఆ సత్యము నెరింగి యితరులపై నిందారోపణ చేయక తన యాత్మశుద్ధికొరకు యత్నించు వాడు ధన్యుడగును వానికి మోక్షము విషయమై ఏమియు విచారము గలుగ నక్కరలేదు

626 సామాన్యముగా జనులు హీనజాతుల అన్నాదుల భుజించిన పాపము గలవారల మైతిమని తలంతురు దీనివల్ల పాపము గలుగదు హీనకృత్యములు చేసివచ్చెడు అన్నాదులను భుజించువారు తప్పక పాపాత్ము లగుదురను సంగతి లోకములో చాలమందికిన్ని తెలియదు అనగా అధర్మమార్గముగా వచ్చెడు దనముచేగాని, లేక వస్తువుచేగాని జీవులు పాపులగుదురు తక్కువజాతి వారిచ్చెడు శుద్ధజలముచే హాని గలుగదుగాని, ఎక్కువకులములో నుండువారు ఇచ్చెడు క్షీరాదులు విషము గలసియుండిన ఎట్లు ప్రాణాపాయమో, అలాగుననే పైనచెప్పినదియున్ను ఉంటున్నది

627 నేత్రములు లేనివాడు తాను నడచునపుడు మార్గమున కడ్డుగా నుండు దానిని తగులు నపుడే తెలిసికొనును, కొంచము చూపుగలవాడు దగ్గరకు వెళ్ళునపుడే అడ్డును కనుకొని తప్పించుకొనిపోవును బాగుగా చూవుగలవాడు దూరము నుండియే ఆటంకమును తెలిసికొని యామార్గమున వెళ్ళడు ఆలాగున తమోగుణస్థుడు ప్రమాదములో పడిపోయిన తరువాత తెలిసికొనును సత్త్వరజోగుణమిశ్రమముగలవాడు కొంతవఱకాత్మ శుద్ధిగలవాడగుటచే విషయాది ప్రమాదములో అంటీ అంటక యుండునపుడే నివృత్తి చేసుకొనును శుద్ధసత్త్వముగలవాడు విషయాది ప్రమాదములన్నింటిని దూరమునుండియే తెలిసికొని విషయాది ప్రమాదముల దగ్గఱకైన వెళ్లడు దీనిని కనుగొనిన ఒక్కడు ప్రవర్తించెడు స్థితిని తెలిసికొన వచ్చును

628 ఘంటలు, పాత్రలు, కుండలు మొదలగునవి కొనేవారు కొట్టి చూచెదరు కొంచెమైనను వోటుపోయినచో ఏలాగున మంచి నాదము గలుగదో, అట్టి ఘంట, పాత్ర, భాండాదులను ఎట్లు ఎవరున్ను తీసికొనరో, ఆలాగున విద్యయందును, అనుష్ఠానమందును, ఏ లేశమాత్రమైన లోపము గలిగియుండిన అతడు లోకమున కుపయోగపడడు కంటికి కనబడనంత ఓడు పోయినపుడే ఉపయోగములేనప్పడు, కంటికి కనబడునంత నెర్రిగాని, పగులుగాని యుండిన మఱల చెప్పవలయునా? అదేరీతిగ బయటకు

తెలియని దోషవేంద్యైన హృదయములో నుండిన అతడు ఉపయోగములేనపుడు, స్పష్టముగా కనబడు లోపముండిన అతని నిరుపయోగము గురించి మఱల జెప్పవలయునా!

629 యుద్ధములో చేరతలచు వారిని డాక్టర్లు పరిశోధించి యేలాటి రోగములేనివారిని మాత్రము ఎట్లు చేర్చుకొందురో, అలాగున ప్రకృతిని జయించుటకు తగిన ఆత్మధ్యానయోగమనెడి యుద్ధములో జయము నొంద తలంచెడు వారికి భవరోగ చిహ్నములు అంతరములో నుండినను పనికిరారు అట్లుగాక బాహ్యములో గనబడుచుండగా నట్టివారిని గురించి యేమి చెప్పవలసియుండును? కావున ప్రకృతిని జయించుటకు ఆత్మయుద్ధములోనుండువారు ఎంత వైరాగ్యమున్ను, హృదయశుద్ధియున్ను, శ్రద్ధయున్ను గలిగియుండవలయునో యోచించికొనుడు

630 ఉపశమనమును బొందిన జ్ఞానియొక్క హృదయము నిర్మలాకాశమువలె నుండునని చెప్పుదురు దీనియందు చాలా అర్థము గలదు నిర్మలాకాశమున సూర్యుడు లెస్సగా ప్రకాశించుచుండును అలాగున జ్ఞేయ బ్రహ్మము నిరావరణముగ చిదాకాశమున వెలుగుచుండవలెను మబ్బుతో గూడుకొనిన ఆకాశమున సూర్యుడు కనపడకపోవుటయేగాక, ఉఱుములు, మెఱుపులు గలిగి వానయున్ను కురియుచుండును మేఘావరణము గలిగి యుండును ఈ నాలుగు దోషములు శుద్ధజ్ఞాని యందుండరాదు చంచలత అనే మెఱుపున్ను, కోపమను ఉఱుమున్ను, క్లేశమను వానయున్ను, మోహమను మేఘమున్ను, ఉండరాదు ఇట్టి స్థితి హృదయమందు గలిగినదా! అని బ్రహ్మనిష్ఠులు ఆలోచించుకొను చుండవలెను ఆత్మజ్ఞానియందు ఏసంకల్పములు గాని, సంస్కారములు గాని, వాసనలు గాని, విషయబుద్ధి గాని యుండగూడదు దీనికన్న మరియొక గొప్ప అర్థముగూడ గలదు ఆకాశ మేలాగున అన్నిటిలో నుండి దేనిని అంటకుండనుండునో, ఆలాగుననే తన ఆత్మయు అంతటిలో నుండియు దేనిని అంటకయుండు స్థితి గలిగియుండుటయే నిజమైన

ఆకాశ దృష్టాంతమగును ఇట్టి స్థితియందు మాత్రమే హాయి గలుగును

631 సామాన్యముగా కొందరకు సంస్కృత శ్లోకములతో గూడిన గీతాపారాయణలు చేయునపుడు శుద్ధముగా ఉచ్చారణలేకుండ నుండును అట్టివారు ఆలాటి శ్లోకములను ప్రత్యేకముగా వ్రాసికొని శబ్దశుద్ధి గలవారివద్ద కొన్నిసార్లు ఉచ్చరించి అభ్యసించిన శుద్ధమగును వడ్లుదంచువారు బియ్యమును శుద్ధపఱచునపుడు కొన్ని బియ్యముగాక వడ్లు గానుండును వానిని వేరుతీసి మరల దంచుదురు అపుడవిన్ని పొట్టుపోయి యెట్లు బియ్యమగుచుండునో, పరిశ్రమయొక్క స్థితియున్ను ఆలాగున నుండును ఏకాదశస్కంధమున అవధూతుడు ఈలాగున 24 గురువులను చేసుకొనియే శుద్ధాత్ముడయ్యెను శుద్ధముగా ఉచ్చరించుటకు సాధ్యముగాని శ్లోకములను మాత్రము వ్రాసికొనిన చాలును శబ్దము శుద్ధముగా ఉచ్చరించు వారిదగ్గఱ చదివిన మాత్రమే ఆదోషము తెలిసికొన సాధ్యమగును

632 శరీరమున కనుకూలమైన అన్నమున్ను, జలమున్ను, గాలియున్ను స్థలమున్ను ఉండిన ధ్యానానుష్ఠానములకు ఎంతను కూలమో, ఆహ్లాదకరముగా నుండునో, ప్రతికూల ఆహారమున్ను, ప్రతికూలజలమున్ను ప్రతికూలవాయువున్ను, ప్రతికూలస్థలమున్ను ఉండినచో, ధ్యానాదులకు ఎంత ప్రతిబంధమో, నిరుత్సాహమో, నీరసమో, బుద్ధి మాంద్యమో, బద్ధతయు గలిగి యుండునో ఆలాగున సాధకునికి ఫలాపేక్షలేని పుణ్యకర్మము, దైవకార్యములన్నియు, ధ్యానమున కనుకూలమునే గలుగజేయును ఆలాగున దుష్టగుణములు, ద్రోహవృత్తులు,క్రూరస్వభావములన్నియు ధ్యాననిష్ఠకు ప్రతికూలమునే కలుగజేయును

633 భోగముకులము వారైనచో తమ కన్యకలు ఇతర పురుషుల జూచి నవ్వుట, విషయచేష్ట గలిగి యుండుట, కిటికీలద్వారా వీథిలో బోవుచుండు పురుషులను జూచుట, తలుపు దగ్గఱ నిలిచిచూచుట, మొదలగు దుశ్చేష్టలను జూచిన వారితల్లి అది తమకులవృత్తి యని తలంచి యూరకుండును, ఆడపిల్లలను ఆలాటి దుష్టవృత్తులలోనుండి నిరోధించుట

గాని మందలించుటగాని, దండనము చేయుట గాని చేయరు ఉత్తమ కుటుంబములో గల కుల స్త్రీలైనచో నాలాటిదుష్టచేష్టలు తమ ఆడపిల్లలలో కనుపించినచో వెంటనే యెట్లు దండించెదరో మనకులమేమి? ఇట్టి విఖ్యాతి వంశములో బుట్టి యీలాటి నీచగుణములు ఉండవచ్చున నా యని తెలుపుచూ పిల్లలనట్టవానినుండి మానిపింతురు అదేరీతిగా నింద్రియములకు వృత్తులు స్వభావము ఆయా యింద్రియములువానిని స్వభావ వృత్తులలో విహరించినను, సాక్షియగునాత్మకు వాటివల్ల పోనిలేదని చెప్పవారి స్థితియని గ్రహించుకొనవలయును వరమఋషి సంప్రదాయులైనచో, శ్రేష్ఠగుణములు గల గురువులైనచో తమ శిష్యులను సదా యింద్రియ వృత్తులలోనికి మనస్సును పోనివ్వక నిర్విషయాత్మ జ్ఞాననిష్ఠ లోనికే నడుపు చుందురు వృత్తులు, విషయములు మాయయొక్క స్వభావమని తెలపుదురు అంతేగాక అదియే యజ్ఞానమనియు బంధమనియు బోధింతురు మరియు శిష్యులకు మనయొక్క వంశమెటువంటిది? పవిత్రమైనది మనగురుసంప్రదాయమెంత శుద్ధమైనది? దయతో గూడినది అని తెలుపుచూ ముముక్షువులను సన్మార్గములో నుంచెదరు

634 కార్యనిర్వహణదక్షులు తమకలిమి ననుసరించియే ఖర్చు చేయవలయును ఏకార్యమున్ను జేయని, దేశతిమ్మరులు, సంకుచిత హృదయులనియు, లోభులనియు, విశాలభావములేనివారనియు, త్యాగము లేని వారనియు, కార్యదీక్షగల వారినిగూర్చి చెప్పవచ్చును దానిని విని ఉన్నదంతయు నొకేసారి కొల్లబెట్టి ఖర్చు జేసిన తలపెట్టిన కార్యమును పూర్తిచేయక పోవుదురు అది విశాల భావము గాని, కార్యదీక్షగల స్వభావముగాని కాదు దీర్ఘచింతకులయొక్క గుణమున్ను గాదు అట్లు చేయుట యెటువంటిదనగా! చెరువులోగల మితమైన జలమును మిక్కిలి జాగరూకతతో వాడినమాత్రమే పెట్టిన పైరు పండును అట్లు గాక జలము నమితముగా ఖర్చుచేసిన జలము చాలక పైరుపండుక పోయెడు గతియే బట్టునని మఱువకూడదు అయితే జలము దండిగా నుండి పైరును ఎండబెట్టే

స్వభావమున్ను గూడదు కావున కలిమికి తగినట్లు త్యాగమున్ను, విశాల భావమున్ను ఉండక యుండరాదు

635 ఋషుల సంఘమందు, సిద్ధపురుషుల సమూహమునందొక రహస్యము గలదు దీనికి బ్రహ్మతంతువనియు, బ్రహ్మసంతతియనియు పేర్లు గలవు ప్రపంచములో మహాప్రజ్ఞయు, ధర్మబుద్ధియు, ప్రభుత్వమందు ప్రీతియుగలవానిని గవర్నమెంటువారే, సొంతముగా చదువు చెప్పించి, గొప్పఉద్యోగిగా చేయునట్లు, ఋషులకు, సిద్ధపురుషులకు ప్రీతిగలుగు ఏవ్యక్తియందు సత్య, దయా, శాంతి వైరాగ్యాదులు గలిగియుండునో, అట్టివారికి దివ్యశక్తిని కలుగజేసి ఋషి సంఘములో చేర్చెదరు ఇది పరమ రహస్యము కనుకనే కొందరతిత్వరలోనే, అమానుషీయజ్ఞానము గలిగి ప్రబోధకులగుటకు కారణము దీనికి విద్యగాని, జాతిగాని ముఖ్యములు గావు సత్య, వైరాగ్య, కరుణాదులే కారణము

636 కోడిగ్రుడ్లుగాని, బాతుగ్రుడ్లుగాని, ఎన్ని రోజు పొదుగుపెట్టలేదో, అంతవఱకు పిల్లలు గావు ఆలాగున నెంతవఱకు గురువు అనుగ్రహమునకు పాత్రుడు గాడో, గురువు ఆజ్ఞలోనుండి సాధన చేయలేదో అంతవరకు ఆవరణము తొలగి ఆత్మసాక్షాత్కార స్వరూప జ్ఞానము కలుగదు జీవిత మంతయు కొద్ది మందును దీర్ఘ వ్యాధి గలవాడెట్లు అతిజాగ్రత్తతో వాడునో అట్లుండవలయును భవరోగము దీర్ఘవ్యాధివంటిది జీవితమో స్వల్పకాలముండునది అట్లు గానిచో నెక్కువరోజులు తినవలసిన మందును, త్వరలో తినివేసిన, రోగము శమించని వానిగతివలె నుండునని మఱువకూడదు ఖర్చున్ను అటువంటిదే

637 ప్రపంచములో సాధారణముగా చదువుకొనినవారు ఏలాటి పవిత్రకార్యమును చేయకయుండియు, కొద్ది చదువుండినవారు, లేక బొత్తుగ చదువు ఉండనివారు ఎక్కువ పుణ్యకార్యములు చేయునపుడు చూచి, అతనికి విద్యా విషయము తెలియదు విశాల భావములేదనియు లోక జ్ఞానము తెలియదనియు, తమ్ముగురించి ప్రగల్భముగా వచించు కొందరు

అదెట్లన, ధనవంతుడై యుండియు ఒకపైసనైనను దాన ధర్మములుచేయక, కొద్ది ధనము గలిగినవాడుగాని, లేక నిర్ధనుడై యుండువాడు గాని నిరంతరము శక్తికొలది, దానధర్మములు చేయుచుండగా ఇతడు స్వల్పధనముగలవాడు, ఇతడు బీదవాడు అని వాగునట్లుండును

638 ముముక్షువులారా! బ్రహ్మనిష్ఠలో నొక పరమరహస్యము గలదు ఈ కీలకమును తెలిసికొనిన మఱల మీకు ఈశ్వర జ్ఞానవిషయములో ఏలాటి ప్రతిబంధములున్ను గలుగవు అదేమన అంతఃపురములో నుండు రాణిగారిని అందరున్ను దర్శింప సాధ్యము గాదు వారియొక్క అన్నదమ్ములుగాని, బిడ్డలు గాని యెపుడు తలంచిన అప్పుడు దర్శింపవచ్చును అన్ని సంగతులు మాట్లాడుకొనవచ్చును ఆలాగున మీ యాత్మ యీశ్వరస్వరూపముగాని, లేక యీశ్వరాంశముగాని, భక్తిమార్గమైన, మీరు యీశ్వరసంతానమనిగాని, భావన సదా గలిగియుండేలాగున చూడవలయును అట్టైన మీకు మాయావరణములగు అడ్డులుండవు శాస్త్రములన్నియు మీరు ఈశ్వరాంశులనియే చెప్పుచున్నవి వేదాంత శాస్త్రము మీరున్ను ఈశ్వరస్వరూపులనియే నిశ్చయించుచున్నది భక్తి యోగమున్ను మీరు ఈశ్వర సంతానములనియు తెలుపుచున్నది

639 బంగారు లేనప్పటికిన్ని జీవింపవచ్చును కాని యినుము లేనిచో జీవింపజాలరు క్షీరాన్నము, పిండివంటలు, పలహారములు లేనప్పటికిని జీవింపవచ్చును కాని యేద్దైన అన్నము లేనిచో జీవింపజాలరు పట్టుపీతాంబరాదులు లేనప్పటికిన్ని జీవించవచ్చును కాని యేదైన వస్త్రము లేనిచో జీవింపజాలరు విద్యలేనప్పటికిన్ని జీవింపవచ్చును కాని జ్ఞానము లేని జీవితము మరణమున కన్న కష్టతరము

640 పాలు లేనప్పటికిన్ని జీవింపవచ్చును గాని జలము లేనిచో జీవింపజాలరు పంచదార లేనప్పటికిన్ని జీవించవచ్చును కాని లవణములేని జీవితము కష్టతరము పుత్రులు లేనప్పటికిన్ని జీవింపవచ్చును అనుష్ఠానములేని జీవితము దుర్భరము కన్ను లేనప్పటికిన్ని జీవింపవచ్చును

భక్తిలేని జీవితము దుఃఖకరము

641 వర్షములేని కాలములో గల జీవిత మెటువంటిదో, చంద్రుడు లేని రాత్రిలోగల సంచార మెటువంటిదో, రోగముతో గూడిన బ్రతుకు ఎటువంటిదో, శాంతిలేని జీవితమున్ను అటువంటిదే

642 ద్వంద్వమే బంధమనియు, సంసారమనియు పెద్దలు చెప్పదురు ద్వంద్వాతీతమే ముక్తియనియు, కైవల్యమనియు, ఋషులు వచింతురు అట్టి స్థితి తమకు గలిగినదా! యని ఆత్మలో విచారణ సలుపుచుండవలెను సుఖము వచ్చినపుడు సంతోషము, దుఃఖము వచ్చినప్పడు క్లేశమున్ను, లాభము వచ్చినపుడు సుఖ సంతోషమున్ను, నష్టము వచ్చినప్పడు దుఃఖమున్ను, స్తుతిజేయునపుడు సంతోషమున్ను, నిందజేయునపుడు దుఃఖమున్ను గలుగుచుండిన, ద్వంద్వమును (సంసారమును) తరించలేదని తెలిసికొనవచ్చును, ఏలన పైజెప్పిన గుణములు సన్యాసులకే యుండదగును అట్లుండిన ఎట్లు సన్యాసియగును కావుననే పై జెప్పిన ద్వంద్వములలో సమస్థితి గలుగజేసికొనవలెను ఇది సామాన్యమని తలంచరాదు జప, ధ్యాన, భజన, యోగాదులు సామాన్యములు ఈ ద్వంద్వసహనము చాలకష్ట సాధ్యము క్రమముగ విచారణశక్తి వల్లను, సహనబలము వల్లను ఇట్టి స్థితి పొందవలెను ఇదే జ్ఞానియొక్క ఆత్మానాత్మ విచారణము అగును అట్లగాక పంచీకరణము మాత్రము వల్లించియుండుట ఆత్మ విచారణము గాదు

643 గ్రుడ్డివాడు ఎల్లప్పడున్ను నేత్రముగల మరియొకని సహాయముచే మాత్రము ఎట్లు యావజ్జీవితము నడువవలసి యున్నదో, ఆలాగున ఎంత తపస్సు గాని, యోగము గాని, భక్తి గాని గలవాడైనను, వేదాంత శాస్త్రవిచారణచే, గలిగెడు జ్ఞానప్రకాశము, నిరావరణముగ ప్రకాశించువరకున్ను, పరాధీనుడయ్యే యుండవలసియుండును అంతః కరణశుద్ధి గలుగుటకొరకు యోగధ్యానాదులున్ను, తపస్సున్ను, భక్తియున్ను, ఉపయోగపడును తరువాత వేదాంతశాస్త్ర విచారణ యుండవలయును

అంతఃకరణశుద్ధి గలుగనిచో, శాస్త్రవిచారణజ్ఞానము శుద్ధముగా నుండదను తత్త్వము ముముక్షువులు జ్ఞాపకములో నుంచవలెను

644 ముందుచూచెడు రెండుకన్నులుగలవాడు సంసారి యగును వెనుకను గూడ రెండు నేత్రములు గలవాడే సన్యాసి యగును ముందుండు నేత్రములు వర్తమానమును మాత్రమే చూచును వెనుక ఏర్పడు రెండు నేత్రములు భూతమును, భావినిగూడ చూచునవిగా నుండవలెను మరియు మామూలు గాగల రెండు నేత్రములు పశుపక్ష్యాదులకు గూడగలవు అవి జడములగు దేహాదులనుమాత్రమే చూచెడు శక్తి గలిగియున్నవి మూడవ నేత్రమగు జ్ఞానదృష్టి గలుగవలెను అదే చైతన్యాత్మను చూచెడు శక్తిగలిగియుండును రెండు నేత్రములుగలవాడు జీవుడగును మూడవ నేత్రము గలుగునప్పడు శివుడగును కావుననే శివుండు త్రినేత్రుడగుటకు కారణము

645 మలమూత్రముల విసర్జన సంకల్పము గలిగిన వెంటనే విసర్జించినచో ఏలాగున ఆరోగ్యము గలిగియుండునో, ఆటంకము గలిగిన ఎట్లు బాధాకరమో, అంతేగాక, ప్రాణాపాయముగూడ గలుగునో, ఆలాగున ఏసమయమున ఏపనిచేయవలయునో, ఆ సమయమున అట్టికార్యము చేయవలయును లేనిచో, ఆపత్తు సంభవించునదేగాక, ప్రాణాధారము గూడ లేకపోవును, ఇదిన్ని సామాన్యము ఉత్తముడయినను జాగ్రత్త గలిగియుండవలెను అది యెటువంటిదనగా శ్వాసోచ్ఛ్వాసములకు కొంచెము సమయమైనను ఆటంకముగలిగిన తప్పక యెట్లు ప్రాణహాని గలుగునో, ఆలాగున ఎప్పడు చేయవలసిన పనిని అప్పడే చేయవలయునని సంకల్పము గలిగియుండవలెను వీడే మెలకువగలవాడు

646 ఒక్క వేగముగా పోవుచుండెడు పడవకు వెనుక కట్టబడియుండు మరియొక పడవలో నుండువారికి ఏలాటి శ్రమలేకనే ముందుగా పోవుచుండు పడవ ననుసరించి ఇది ఎట్లు వెళ్ళుచుండునో, ఆలాగున ఒక్క సంస్థను నడుపుచుండు గురువులు మొదలైన

వారిననుసరించు నడచెడు శిష్యులకుగాని ఇతర స్థాపనముల ననుసరించి నడుచువారికిగాని, దానియొక్క ప్రయాసము తెలియదు స్వయముగా పడవ నడుపుటకు ఎంత సామగ్రి కావలయునో, అపాయములో పడనీయక చుక్కానివాడు ఎంతజాగ్రత వహించవలసియున్నదో, అదంతయు అప్పుడు తెలియదు తాను స్వయముగా నడుపునప్పుడుమాత్రమే తెలిసికొనును

647 మనుజుడు ఎంత మోటువాడైనను, చక్కని అనుష్ఠానము గలిగివుండిన కొంతకాలమునకు తప్పక బుద్ధిశుద్ధమై సూక్ష్మగ్రహణ శక్తిగలవాడగును తీక్ష్ణమైన వ్రతములుగాని, తపస్సుగాని వుండిన మఱింత జాగ్రత్తయు, గ్రహణశక్తియు గలుగును ఎట్లన ఎంత తెగనిమోటుకత్తి యైనను బాగుగా వదును పెట్టినచో ఎట్లు మంచి వాడిమిగలిగినదిగా మారుచుండునో, ఇంకను తెగని మహా మోటుకత్తియైనచో కొలిమిలో కాచికొట్టినచో యేలాగున తీక్ష్ణవాడిమి గలుగునో, మానవులయొక్క బుద్ధియు నాలాగునే యుండును

648 క్రొత్తకోడెదూడను పనినేర్పునప్పడు ప్రాత ఎద్దుతో గట్టిన మాత్రమే పనినేర్చుకొనును కాని స్వయముగా కోడెదూడ ఎటుల ఎఎఎఎనేర్చుకొనజాలదో, అలాగున క్రొత్తగా ముముక్షుత్వము గలవాడుగాని, సాదనము జేయ ఇచ్ఛగలవాడుగాని స్వయముగా నుండి అనుష్ఠానము చేయదలంచినను అది మంచిది గాదు ఇదివరలో అనుష్ఠానముగలిగి యుండు వారి దగ్గర కొంతకాలముండి అలవాటు చేసుకొనవలయును లేనిచోసాధు వృత్తి గాని, సాధన గాని అలపడదు

649 పొలములో విత్తనము విత్తక పొలమును మాత్రము శుద్ధపరచి గడ్డిమొదలగు దానిని తీసివేసి శుభ్రపరచినను, ఎరువు మొదలగువాటిని వేసి చక్కపరచినను, ఫలము ఏలాగున గలుగదో అలాగున వర్తనముమాత్రము శుద్ధముగా గలిగినను, సత్యధర్మములతో ప్రవర్తించినను, దైవచింతన గాని, దైవధ్యానము గాని లేనిచో దైవప్రాప్తి, దైవజ్ఞానము ఎట్లు కలుగును? అయితే భూమిలో మంచివిత్తనమును విత్తినను భూమిని

శుద్ధపరచనిచో, ఎరువు పెట్టి పోషింపనిచో, కలుపు తీసి వేయనిచో అదిన్ని ప్రయోజనపడదు కావున క్షేత్రశుద్ధియు, శ్రేష్ఠవిత్తనమున్ను, చక్కనిపోషణము గలిగిన మాత్రమే ఫలప్రాప్తి గలుగునట్లు చక్కని వర్తనమున్ను, సరియగు బ్రహ్మ చింతనయున్ను గలిగియుండిన మాత్రమే బ్రహ్మప్రాప్తి గలుగును

650 1 లక్షణా వృత్తివల్లనే శివజీవైక్యము తెలియనగును

2 మహావాక్యముమాత్రమువల్లనే బ్రహ్మతత్త్వము బోధపడును

3 యోగసాధన వల్లనే చిత్తము అణగును

4 భక్తివల్లనే అహంకారము నశించును

5 నిష్కామ పుణ్యకర్మముచేతనే అంతఃకరణశుద్ధి కలుగును

6 ఉత్తమ గురుసేవచేతనే సాధు ధర్మము గోచరమగును

7 ఉపనిషత్పరనము చేతనే బుద్ధి వికసించును

8 దేశ సంచారము చేతనే లోక జ్ఞానము తెలియనగును

ఉపదేశామృతము తృతీయభాగము

సంపూర్ణము





# ఉపదేశామృతము

## చతుర్ధ భాగము

651 ఆశ్రమమును స్థాపించుటలోను, ధర్మముల బోధించుటలోను కొందఱు అట్టి స్థాపకులపై, బోధకులపై అక్షేపణల జేయుచుందురు ఆలాగున స్థాపన, బోధన చేయనిచో అబ్రహ్మధర్మము నశించిపోవునని వారు తలంపరు రైలుబండి పోవునప్పుడు మధ్య ఒక్కొక్కదానికి తగిలించి యుండు గొలుసును తెగగొట్టినచో అందువలన ఏలాగున ప్రయాణీకులు గమ్యస్థానమును జేరక నిలిచిపోదురో ఆలాగున జీవులు ముక్తిస్థానమును జేరకపోదురు మరియు అది ఒకరు ఒక నదికి గట్టియుండు వంతెనను దాటిన పిమ్మట దానిని విరగగొట్టినట్లుండును ఈలాగున పరంపరగా బ్రహ్మాస్త్రములను, దివ్యాస్త్రములను బోధింపక పోవుటయే పూర్వముండిన దివ్యాస్త్ర ప్రయోగములు ఇప్పుడెవరికిని తెలియకపోవుటకు కారణమైనది ఆ దివ్యాస్త్ర ప్రయోగములు వారితోగూడ విలయమైనవి బ్రహ్మవిద్య ఇంతవరకైనా కొంచమైనను ఉండుటచేతనే భారతీయులు సజీవులై యున్నారు బ్రహ్మవిద్యయు నశింపక యున్నది

652. మానవుల బుద్ధి రెండు విధములుగా నుండును (1) న్యాయవాదిబుద్ధి, (2) న్యాయాధిపతి బుద్ధి వకీలుబుద్ధి ఎట్టిదైనను తన పక్షమును నిలపెట్టవలయు ననియే యుండును న్యాయాధిపతి ధర్మాత్ముడైనచో వాద ప్రతివాదులు ఉభయుల వాక్యములలో గల సత్యాసత్యముల నిర్ణయించి ఏది సత్యమని తనకు తోచునో దానిని

నిశ్చయించును కావున న్యాయవాది (వకీలు) బుద్ధి యుండరాదు న్యాయాధిపతి (జడ్జి) బుద్ధియే యుండవలయును లేనిచో వెనుక దుఃఖము పడవలసి యుండును తన పక్షము, ఇతర పక్షమను బుద్ధి సత్యశీలుర కుండరాదు తనది గాని, అన్యముగాని యేది సత్యమని తోచునో ఆపక్షమున జేరవలయును అట్టిన మాత్రమే సత్యస్వరూపుడగు సర్వేశ్వరుని చేరగలుగును

653 సూర్యకిరణములయందును, వాయువునందును, భూమియందును, జలమునందును అనేక విధములగు రసపదార్థ పరమాణువులు గలవు అనగా రసద్రేణువులు గలవు కాని మదురామ్లకటుతిక్తాది బీజములు వానికి సంబందించిన రసాంశముల మాత్రమే తనలో చేర్చుకొనును అనగా మదురమును గలుగజేయు బీజములు పంచభూతములలో నుండు మధురాంశముల మాత్రమే గ్రహించును పుల్లని బీజము పులుపు రసమును మాత్రమే గ్రహించును చేదు బీజము చేదు రసమును మాత్రమే గ్రహించును వగరు బీజము వగరు రసమును మాత్రమే గ్రహించును ఆలాగున అనేక గుణములు గల సంసారుల మధ్య సాధువులుండినను తనకు సంబంధించిన శాంతి, కరుణ, విరక్తి,సత్య, జ్ఞానముల మాత్రమే గ్రహించుకొనవలయును కాని పామరుల ప్రకృతి గుణముల తనయందు చేరేలాగున చేయరాదు మఱియొక విధము గూడ గలదు బీజములు ఏగుణమును గలిగియున్నవో అవి భూమి సూర్యాదులలో షడ్రసములు తమలో చేరినను ఆ షడ్రసములును తనయొక్క స్వరూపముగా మార్పు చేసుకొనుచుండును అనగా ఏరసమైనను తమ రూపముగా చేసుకొనునట్లు ఏస్థలమందైనను, ఏజనసంఘ మందైనను, ఏ స్వభావముగల జనులతో గూడినను విరక్తుడు తనయొక్క స్వభావమునకు మార్పు గలుగనీయక చూడవలయును వారి ప్రకృతి గుణములనుగూడ తనయొక్క జ్ఞానరూపముగా మార్పు జేసుకోవలయును ఈ పరమ రహస్యోపదేశమును సస్యములు మనకు ఉపదేశించుచున్నవి

655 మాతాపితరులను పుత్రులు తరింపజేయవలయునని చెప్పే వాక్యములో నాలుగు భాగములు గలవు (1) శ్రీరామచంద్రుడు కౌసల్యకున్ను, శ్రీ కపిలముని దేవహూతికిన్ని ఇచ్చటనే బ్రహ్మతత్త్వమునుపదేశించి వారి యాత్మలకు పరమాత్మయందు ఏకత్వము గలుగజేసి తరింపజేసిరి ఇది ఉత్తమపక్షము అధ్యాత్మరామాయణమునందును, భాగవతమునందును ఈ గాథలు గనందగును

(2) శ్రీ శంకరాచార్యులు తన తల్లి యగు ఆర్యాంబకు ఈశ్వరభక్తిని ఉపదేశించి కైలాసమునకంపెను ఇది మధ్యమ పక్షము అయితే శంకరులు గూడ బ్రహ్మతత్త్వమును మాతృ దేవికి ఉపదేశించినను తల్లి దానిని గ్రహింపజాలక పోవుటచే అట్టి ఉపాసనామార్గమువల్ల ఈశ్వరలోకప్రాప్తిని గలుగజేయుటకు కారణమైనది ఇది ఆశంకర విజయమునందు గనందగును

(3) సత్కర్మలు, పుణ్యతీర్థావగాహనములు, పవిత్రములగు వ్రతములు మాతాపితరులచే చేయించి వారిని స్వర్గలోక ప్రాప్తికి అర్హులుగా జేయుట కనిష్ఠ పక్షము ఇది పుణ్యాత్ములగు పుత్రులు చేయించుచుందురు ఈ విధానము ధర్మశాస్త్రము లన్నిటిలోను వివరింపబడియున్నది

(4) జీవించి యున్నప్పుడు తల్లిదండ్రులకు ఉత్తమ పక్షమగు బ్రహ్మజ్ఞానమున్ను, మధ్యమ పక్షమగు దివ్యమంత్రోపదేశ దైవోపాసనయు, కనిష్ఠ పక్షమగు కర్మానుష్ఠాన వ్రతాదులును జేయనీయక మరణానంతరము మాత్రము ఏదైన కొంత పితృకర్మలను, స్వల్పమైన దానములున్ను నిండుభక్తి శ్రద్ధలతో చేయక సామాన్యముగ జేయుట సామాన్యధర్మమగును

జీవించియున్నప్పుడు తల్లిదండ్రులను ఆదరింపకయు, మరణానంతరము పితృకర్మల సరిగా జేయకయు నుండు పుత్రులు మృతప్రాయులు వారిని గురించి మృగప్రాయులని మాత్రము శాస్త్రములో తెలుపడమైనది

655 ఏలాగున గొప్పరైల్వే జంక్షనులోను, గొప్ప జనసముదాయము గల ఉత్సవములలోను, సంతలలోను గూఢచారులగు పోలీసువారు ఒకరిపై దొంగతనపు సంశయము గలిగి యుండిన, వారికి దూరముగా నుండి వారి ప్రవర్తనల చూచుచుందురో, అలాగున తనయందుగల ఏగుణము సరిగా లేదో, లేక యేప్రవర్తనము శుద్ధముగా లేదో, లేక యే శబ్దోచ్చారణము శుద్ధముగా లేదో వానిపై సర్వదా దృష్టి యుంచి చూచుచుండిన త్వరలోనే యన్నియు శుద్ధములగును ఏలాగున పోలీసువారు ఒక్కొక్క దొంగను పట్టుకొనుచు కట్టకడకు అందఱిని యెటుల పట్టుకొనెదరో అలాగున ఒక్కొక్క గుణమును శుద్దపరచుచును, ఒక్కొక్క శబ్దమును శుద్ధముగ నుచ్చరించుచును వచ్చినచో కొంతకాలమునకు అన్ని శబ్దములు శుద్ధము లగును

656 కొందఱు ఈశ్వరు డేల భేదములతో నీ మానవులను సృష్టించవలయుననియు, అందఱిని సమానముగా నేల సృష్టించరాదనియు చెప్పెదరు దీని రహస్యము మాయను దాటువఱకు తెలియదు సృష్టిస్థితిలయము లన్నియు మాయలోనే జరుగుచున్నవి మాయలో నుండు వరకు అతనికి దైవసృష్టియొక్క మహిమ నెఱుంగ సాధ్యము గాదు, తాను ఏ వర్ణముగల అద్దముల ద్వారా చూచునో, అయద్దపు రంగువలెనే దృశ్యమంతయు నతనికి గోచరించును మాయయొక్క మహిమయు అలాగున నుండును అట్లు ప్రశ్నించువారు ఈలాగున భేదముగా సృష్టించెడు ఈశ్వరుని ఎవడు సృష్టించెనో వానిని కనుగొనిన మాత్రమే ఈరహస్యము తెలియనగును అప్పడు జీవుడున్ను, ఈశ్వరుడున్ను అనాదిమూర్తియని జ్ఞానము గలుగును అప్పడు పై జెప్పిన కార్యములన్నియు మాయలో గలవని నిజము బోధపడును ఈశ్వరుడు జీవులయొక్క కర్మానుసారముగా స్థూల సూక్ష్మకారణ శరీరముల మాత్రమే సృష్టించినాడనియు, ఆత్మ అనాది జ్ఞానస్వరూపమనియు నిజార్థము గలుగును

657 ధ్యానమందుగాని, ప్రార్థనయందుగాని, శ్రవణమందుగాని,

సేవయందుగాని, పవిత్రమందు గాని ప్రవర్తింపకుండుటచే పావనమగు మానవ జన్మము వ్యర్థమైపోవుచున్నదని ఎప్పుడు మనస్సులో నిజముగా సంకల్పము గలుగుచున్నదో అప్పడే యతని చిత్తము నిర్మలమైనదానికి గురుతుగా నుండును అప్పడతడు వ్యర్థపు మాటలచే గాని, వ్యర్థ క్రియలచేగాని, వ్యర్థముగా ఒక నిమిషకాలమైనను పోగొట్టడు ఒక వేళ వ్యర్థముగా కాలము వ్యయమైపోవుచుండిన లోకమును మోసము జేయుచుండునట్లు అతనికి తోచును అట్టివాడే శుద్ధాత్ముడు మానవ జన్మమహిమ నెఱింగిన వానియొక్క యాత్మ నిరావరణముగ ప్రకాశించుచుండును అతని కెల్లప్పడు ఈశ్వరుడు స్వాధీనపడియుండును అతని యానందమునకు కొఱతయే యుండదు ఇట్టి యవస్థ గలుగనివారు తమోగుణము సంపూర్ణముగా నశింపనివారుగాను, దేహాభిమానము పూర్తిగ తొలగనివారుగాను, మనుష్యజన్మముయొక్క మహిమను తెలిసికొనని వారుగను నుందురు అంతేగాక నిర్మలజీవితముయొక్క మాహాత్మ్యము గోచరించనివారుగా నుందురు లోభి దనార్జనమందును, జిజ్ఞాసువు శాస్త్రపఠనము నందును, తీవ్రముముక్షువు బ్రహ్మనిష్ఠయందును ఎటుల ఒక క్షణమైనను కాలము వ్యర్థపరచక చూచుచుండునో ఆలాగున నితడున్ను ఉండును

658 ముముక్షువులారా! శూరులారా! నిర్మలాత్ములారా! మంచి యౌవనకాలములో నుండు కోడెదూడను (ఎద్దును) మీరు చూచి యున్నారుగదా! ఓహో! దాని యుత్సాహము, ధైర్యము, బలము, గమనవేగము, నలుగురు మనుష్యులు త్రాడు వేసికట్టి నిలువజూచినను నెటుల లాగుకొనిపోవుచుండునో, అట్టిదానికి ముక్కుకుట్టి దారము వేసిన ఎటుల దీనావస్థను పొందుచుండునో, ఎట్టి చిన్నపిల్లవానికిగూడ లోబడిపోవునో, ఆలాగున ఎంత జాతి శ్రేష్ఠత్వముగాని, తపోమహిమగాని, విద్యాధిక్యతగాని, యోగబలముగాని, ధీరత్వముగాని, జ్ఞానశక్తిగూడిన ఆనందభరితత్వముగాని యుండినను తనయొక్క వ్రతమునకు భంగము కలిగిన అతడు సర్వదా

మిక్కిలి దీనుడుగాను, ఎల్లప్పుడు తాను జేసిన తప్పిదమును గురించి విచారగ్రస్తుడై గొప్పవారి దగ్గఱకు పోవుటకు సిగ్గు గలిగియుండి దుఃఖజీవితము గడుపవలసియుండును దీనిని పలుమారు తలంచుకొనుచు ఖిన్నుడై యుండును అయితే తనదోషము లోకములో తెలియువరకు ఈ భయంకరావస్థ గోచరము గాదు తన తలంపు లన్నియు నిర్విఘ్నముగా జరుగుచున్నవనియు, తన కోరికలన్నియు సర్వేశ్వరుడు నెరవేర్చు చున్నాడనియు తోచును వ్రత భ్రష్టత్వము గలిగి లోకములో అది తెలిసినప్పడే పై జెప్పిన సంకటము లన్నియు గలుగును అప్పడు తన యాత్మను పలుమారు నిందించుకొనుచుండును ఈలాటి విషయములలో కొందరు అవమానమును సహింపజాలక దేశాన్తరము వెళ్లినవారు గలరు ఉన్నత స్థానమునుండి పదభ్రష్టులైన వారున్ను గలరు ఆత్మహత్య జేసుకొన్న వారున్ను ఉంటున్నారు కావున నిది మిక్కిలి జాగరూకతతో గ్రహించుకొనవలసిన విషయము

659 దూరదేశప్రయాణమునకు సరిపోవు పెట్రోలు మాత్రము గలిగిన మోటారు డ్రైవర్‌గాని, విమానపైలట్ గాని పెట్రోలు జాగ్రత్తతో నుపయోగపరచులాగున, దేహసంరక్షణముకొఱకు మాత్రము ఎంత యాహారము కావలయునో, అంతమాత్రము భుజించు స్వభావము గలవాడే యీ జన్మములోనే ముక్తిని బడయగలడు అట్లు గానివారందఱు ప్రయాణదూరమునకు మాత్రము ఏర్పరచిన పెట్రోలును వ్యర్థపరచిన వాడున్ను, మరల ఎచ్చటను పెట్రోలు దొరకనివాడున్ను ఎటుల గమ్యస్థానమును జేరక సంకటపడునో, అట్లే పరమ శాంతమగు మోక్షమును పొందక దుఃఖము ననుభవింపవలసియుండును

660 జీవుడా! గ్రుడ్లులను భేదించి పక్షు లేలాగున బయలు దేరుచున్నవో, బీజముయొక్క పొట్టును భేదించి వృక్షమెటుల బయలుదేరుచున్నదో, మావిని భేదించి శిశువు లేలాగున బయటికి వచ్చుచున్నారో, ఆలాగున నీయొక్క ఆవరణ మేదియో, నీయాటంక మేదియో,

వీటికన్నిటికిని కారణమగు హృదయ గ్రంథిని (జీవోపాధిని) ధ్వంస మొనర్చిన మాత్రమే జీవోపాధి నుండి శివుడు గాగల్గును అణుత్వమునుండి విభుత్వమును బొందగల్గును ఆత్మనుండి పరమాత్మను జెందగల్గును అట్లు మీ ఆవరణములను ధ్వంసము గావింపనిచో బీజము బీజముగాను, అండము అండముగాను, పిండము పిండముగాను, ఎంత కాలమునకున్నైనా యుండునేగాని, అండము పక్షియై ఆకాశమున కెగురుటకుగాని, విత్తనము చెట్టై ప్రబలమగుటకుగాని, గర్భములోగల పిండము పూర్ణావయువ వికాసమునొంది పూర్ణమ్మైన మానవాది జీవులగుటకు గాని అవకాశము లేదని మరువకుడు

661 ఓ మానవుడా! మీ జీవితము అన్ని విషయములలోను శుద్ధము కావలసియుండిన ఒక్క ఉపాయము జెప్పెద నూలు చిక్కులు పడియుండిన ఏలాగున ఆ ముడులను (చిక్కులను) నింపాదిగా స్వయముగా గాని, లేక మఱియొకని సహాయముతో గాని విడదీయవలసియుండునో, అట్లు విడదీయనిచో ఆనూలు ఏలాగున ఉపయోగపడక పారవేయవలసి యుండునో, ఆలాగున మీయొక్క వర్తనముగాని, పరుసశబ్దోచ్చారణము గాని, మనస్సుగాని, శుద్ధముగా లేనిచో సావదానముగా దానిని స్వప్రయత్నముచే శుద్ధపరచుకొనుము లేనిచో మఱియొకరి సహాయముతో నైనను శుద్ధపరచుకొనుము అప్పడే మీ జన్మము సాఫల్యము నొందును లేనిచో ముడిపడిన దారము వ్యర్థమైపోవునట్లు మీ జన్మము గూడ నిరర్థకమగునను సత్యమును మరువకుము

662 గురువులు శిష్యులగా ఏలాగున తయారు చేయవలయునో, ఆరహస్యము బాణము చేయు శిల్పిదగ్గరనుండి నేర్చుకొనవలయును అదెటులన బాణము చక్కగా ఉన్నదా, లేదా అని సూక్ష్మదృష్టితో అప్పడప్పడు చూచుకొని ఏదైన కొంచమైనను వంకర యుండిన సుత్తితో తిన్నగా కొట్టిగాని, లేక కొలిమిలో కాచిగాని ఎట్లు శిల్పి ఋజువుగా చేయుచున్నాడో, అట్లు చేయనిచో ఆ బాణమేలాగున లక్ష్యములో చక్కగా ప్రవేశింపజాలదో,

ఆలాగున శిష్యులయందు ఏలాటి వంకర స్వభావము గలిగియుండినను గురువు జాగరూకుడై చక్కపరచుచుండవలయును అట్లైనమాత్రమే అతడు ఋజుమార్గముగా ప్రవర్తించి బ్రహ్మపదమును పొందగల్గును అట్లు గానిచో వంకరగల శరములు లక్ష్యములో ప్రవేశింపక తప్పిపోవునట్లు అతని జీవితము దైవలక్ష్యమునుండి తప్పినదై ప్రకృతిలో పడిపోవును

663. జనులారా! హోమగుండములో గల అగ్ని తనలో హోమింపబడు సకల వస్తువులను అనగా ఎన్ని రకములగు కట్టెలను గాని, మంచి, చెడు హోమద్రవ్యములను గాని తనవలెనే యేలాగున జేయుచుండునో అనగా అగ్నివలెనే మార్పును జేయుచుండునో, ఆలాగున జ్ఞానాగ్ని ప్రజ్వలించుచుండు మహనీయుడు గూడ తన దగ్గఱకు జేరుచుండు భక్తులను తన వలెనే జేయుచుండును దేహముతో దగ్గఱనుండునని అర్థము గాదు ఆత్మలోనికి దగ్గఱ చేరవలయునని ముముక్షువులు గ్రహించుకొనవలయును హోమ ద్రవ్యములు కొన్ని చెడువాసనలు గల మాంసాదులు గలవు ఇవి యజ్ఞములోను, అభిచార హోమములోను వేయుచుందురు వాటిని నేతిలో వేయించి హోమింతురు వాటినన్నిటిని అగ్ని దహింపజేసి తనరూపముగా జేయును భూమియు ఆలాగుననే జేయుచున్నది సుగంధవస్తువులనైనను, దుర్గంధ వస్తువులనైనను మఱి కొన్ని రోజులకు జీర్ణము జేసి తనరూపమగు మట్టిగా మార్చుచున్నది ఆత్మజ్ఞానులుగూడ తనతో జేఱుచుండు భక్తులందఱిని తనవలెనే మార్పు జేసుకొనవలయును ఇచ్చటగూడ తన ఆత్మలోనికి జేరవలయునని మరువకూడదు మట్టిలోనికి జేరనిపదార్థములను మట్టి తనరూపముగా జేయజాలదు ఆత్మసాధనలో నుండనివారిని మహనీయులగు గురువులుగూడ ఏమియు జేయజాలరు ఇదే దీనిలో గల రహస్యము ఈ తత్త్వమును మరువగూడదు

664 బ్రహ్మనిష్ఠులలో కొందరికి ఈలాటి సందేహము గలదు అదేమన తాను అనుష్ఠించి వచ్చెడు అనుష్ఠానములను ఎవరికిని జెప్పకనే తన కాలము గడుపుటయే వైరాగ్యమనియు, భక్తులకు ముముక్షువులకు

బ్రహ్మవిద్యను ఉపదేశించుటగూడ బన్ధమనియు తలంతురు ఈ విషయమై సృష్టియొక్క రహస్యమును పరిశోధన సల్పిన సందేహము నశించును సృష్టిలోగల యే ప్రాణిగాని, క్రిమిగాని, పశుపక్ష్యాదులుగాని తన వంశమును నశింపజేసి పోవుట లేదు

665 నవీనములగు గొప్పయంత్రములను కనిపెట్టువారు ఆ యంత్రములను నిర్మించి తగిన వారికి దానిని నడుపుటకు నేర్పుదురే కాని వారు మాత్రము ఎప్పుడున్ను ఆ యంత్రములను నడుపుటయే పనిగా పెట్టుకొనిన మఱేదైన యంత్రములను నిర్మింపజాలరు ఆలాగున మహనీయులందఱు గొప్ప సంస్థలను ఏర్పఱచి తగిన భక్తులకు దానిని నడిపేలాగున యేర్పాటు చేసి పద్ధతిమాత్రము తెలుపుచుందురే కాని, దానిని నిర్వహించుండరు అట్టిన మాత్రమే క్రొత్త క్రొత్త కార్యములను ఏర్పాటు చేయుటకు సాధ్యమగును మఱియు వారియొక్క ఆత్మశాంతికి భంగము గలుగకయుండును ఆత్మశాన్తి కన్న గొప్పదియగు మఱేయొక్క కార్యమున్ను వారికి గొప్పదిగా తోచదు ఈతత్త్వము అట్టి యాత్మానుభవులకు మాత్రమే గోచరమగును

666 జీవుడా! ప్రకృతిలో కనుపించినవన్నియు మీకు దైవసన్నిధిలో చేరుట కుపదేశమగును ముందుగా వచ్చినవారు ముందుగానే యుందురు వెనుక వచ్చినవారు వెనుకనే యుండిపోవలసి యున్నారు దీనిని బాగుగా విచారణ జేసికొనుము దేవాలయములో దైవదర్శనమునకు ముందుగా పోయినవారు దేవుని దగ్గరగానే యుందురుగదా! ఆలాగున ధర్మోపదేష్టలగు గురువుల ధర్మోపదేశసమయమున ముందుగా వచ్చినవారు గురువుల దగ్గరగానే కూర్చుండుట చూచుట లేదా! వెనుక వచ్చిన వారు దూరముగా వెనుకనే యుండుటయున్ను కానుపించుట లేదా! దీనికన్న మీకు ఏమి యుపదేశము కావలయును? కావున అన్నిటిలోను ముందుగానే శ్రద్ధ గలిగి వెళ్ళే లాగున చేసికొనుము అట్టిన నెల్లపుడును నీవు దైవసన్నిధిలోనే యుండగలవు

667 సాధకులారా! మిక్కిలి జాగ్రత్తపడుడు మీరు చాలాకాలము దృఢవైరాగ్య మవలంబించి గాఢరూపముగా సాదన చేయుచు వచ్చినను సంపూర్ణముగా నవిద్య నశించువరకు ధ్యానాద్యనుష్ఠానములను విడువరాదు ఏలన జలము లేక తీక్ష్ణమైన యెండచే సొర, గుమ్మడి తీగలు శుష్కించియుండినను, మరల వర్షము గురియునపుడు ప్రబలముగా పెరుగునట్లున్ను, మంచి యౌషదపథ్యములచే, రోగాణువులు సూక్ష్మములై యుండునపుడును, దారుణ రోగమునశించునట్లు తోచినను, మఱల నపథ్యము జేసిన కొన్ని రోజులకు రోగము అభివృద్ధి నొందునట్లున్ను మీ సాధనబలముచే నవిద్య యణగియుండినను, మఱల నియమపాలనానుష్ఠానము లేకపోయిన నజ్ఞానము అభివృద్ధి నొందును ఇందువల్లనే కొందఱు సంయములయ్యు,నియమ పాలనము లేకపోవుటచేత మఱల సంసారములో పడిపోవుచున్నారు కావున సంపూర్ణముగా వృత్తులు నశించువరకున్ను, జీవన్ముక్తి గలుగువరకున్ను సాధనలను మానకుడు

668 సోదరా! నీవు సంసారమునుండి దూరము పోయినను చాలదు అందువలన జన్మరాహిత్యము కానేరదు, అంత:కరణ సంస్కారమును తపస్సనెడు జ్ఞానాగ్నిలో దహింపజేసి, యవిద్యనుండి దూరముగా పోవలయునని మఱువకుము బీజము వృక్షమునుండి దూరము పోయినను అంకు రము నశించదు వేగిన మాత్రమే యంకురము నశించును

669 జీవుడా! గృహమును త్యజించి యెచ్చటైనా ఆశ్రమములోగాని, మఠములోగాని, యేకాంతములోగాని పోయిచేరినను చాలదు దూరముగా వెళ్లిపోయి అవిద్యనుండి జ్ఞేయబ్రహ్మమును లేక ఈశ్వరుని పొందవలయునని మరువకూడదు లేనిచో గృహము విడిచి దిమ్మరిగా తిరిగెడు సోమరులవలె చెడిపోయెదవు అట్టి వారు సోహంఽ పరత్వమును బొందజాలరు

670 సామాన్యముగా జనులలో కొందఱు కొన్ని కష్టములు

వచ్చినపుడున్ను, మఱికొందఱు కొన్ని దుష్టప్రవర్తనలో పడిపోవునప్పుడున్ను ఇది మాప్రారబ్ధకర్మ యని చెప్పదురు కొందఱు వివేకానుష్ఠానము గలవారుకూడ అట్లే చెప్పదురు ఇది కొంత దీర్ఘముగా విచారించవలసిన విషయము ప్రారబ్ధమనగా వర్తమానకాలములో ననుభవించవలసిన సుఖదుఃఖ భోగరూపమైనది అంతే కాని ఆగామికారణమగు వర్తమాన, క్రియమాణ కర్మమునకు సంబంధించినది కాదు ఇదే దీనిలో గల రహస్యము అట్లుకానిచో పూర్వజన్మకర్మ ప్రకారము ఇప్పడున్ను, ఈజన్మకర్మ ప్రకారము మరుజన్మమందును జన్మపంపరగా ననంత కల్పముల వరకు వచ్చుచుండునే కాని కర్మరాహిత్యమునకుగాని, పాపకర్మము నుండి పుణ్య కర్మమునకు మారుటకుగాని కాలముండదు అపుడు పురుష ప్రయత్నము లేకపోవును అత్తఱి, ఏవృక్షముయొక్క విత్తనము అదే రూపముగాను, ఏ జంతువు యొక్క సంతతి అదేరూపముగాను, అనంత కాలమువఱకు నుండునేగాని, మార్పు గలుగుటకు నవకాశమే లేకపోవును కర్షకులు తమభూమిలో నేవిత్తనము వేసిన బాగుగా పండునో దానిని తెలిసి కొని యేలాగున విత్తనమును మార్పు చేసికొని విత్తుదురో, ఆలాగున హృదయపరివర్తనము చేసికొనవలయును అయితే దీనికి ముందుగా పండిన ధాన్యము ననుభవించుకొని, క్రొత్త పైరు పెట్టవలయును అట్లైనను ఇది పండివచ్చు వరకు గత సంవత్సరపు ధాన్యమునే అనుభవించ వలయును ఇదే కర్మలోగల రహస్యము కావున నీతత్త్వము నెఱింగి ధర్మమునుండి చలింపక, సహనము గలిగి యాచరించు చుండ వలయును

671 ఓజనులారా! మీకు సులభముగా గోచరమయ్యేలాగున నొక సంగతి చెప్పెద మీలో నెవరికైనను చేతిలో ఏదైన చమురు అంటుకొనిన, అది వట్టినీటిలో గడిగిన ఎట్లు శుభ్రముగా తొలగిపోదో, ఉడుకునీటిలో కడిగిన ఏలాగున వదలిపోయి శుభ్రమగునో లేక సబ్బువేసి కడిగినను శుభ్రమగునో, ఆలాగున అనాదికాలమునుండి హృదయము నంటుకొనియుండు విషయ వాసన సామాన్యముగ దొలగునది గాదు మంచి తపస్సు వలన మాత్రమే అది వదలిపోవును లేక యోగసాధనమైనను యుండవలెనని మరువకుడు

672. పునర్జన్మరహితమైన మోక్షము ఈ జన్మములో గలుగునా? లేక పునర్జన్మము గలదా? యని తెలిసికొనుట కొక యుపాయము దెలిపెద మీరు ఎచ్చటికైన వెళ్ళునప్పుడు మూసివేసి యుండు ద్వారము తెరచివెళ్ళు నప్పుడున్ను మరల వచ్చునప్పుడున్ను అదే ప్రకారం మూసివేసి వచ్చిన వారైనచో మీకు పునర్జన్మము లేదు అట్లుగాక వెళ్ళునప్పుడు మూసి యుండుద్వారము తెరచి, మరల వచ్చునప్పుడు అదేప్రకారము చక్కగ మూయనిచో పునర్జన్మము కలుగుట నిశ్చయము అదేమోస్తరుగ మీరు జన్మించిన ద్వారము మరల తెరవక పోయినచో మీకు పునర్జన్మము లేదు

673 జీవుడా! నీ రూపమును నేరులో ఒక విధముగాను, అద్దములో మరియొక విదముగాను చేయగలవా? అనగా జూడగలవా? కురూపియైన వాడు తనకు అద్దములో సురూపునిగా, నల్లనివాడు తెల్లనివానిగాను ఎట్లు చూడజాలరో ఆలాగున నీభావము లన్నియు శుద్ధముగా లేనిచో, నీవు శుద్ధుడుగా నటించినను అట్లు గానేరవని బాగుగా జ్ఞాపకము చేసికొనుమా! లేనిచో జీవించియున్నపుడున్ను, అంత్యకాలమందున్ను, పరలోకమందున్ను, మఱియొక జన్మ వచ్చినప్పుడున్ను దుఃఖమునే బొందవలసియుండునని మఱచిపోకుము అనగా వర్తమాన కాలమందును, అంత్య కాలమందును, పరలోకమందును, భావిజన్మమందును, మొత్తము నాలుగు జన్మములలోను నిన్ను నీవు జెరచు కొనువాడవు గాగలవు నీపై కరుణ గల్గి తత్త్వజ్ఞానులు ఈ పరమరహస్యమును నీకు జెప్పుచున్నారని మఱచిపోవలదు

**మనస్సమాధానమున కుపాయము** - ప్రపంచములో ఆహార వస్త్రాది విషయములలో ఒకరికి ఒకటి ప్రీతికరముగను, అదే మఱియొకరికి అప్రీతిగను ఉండును ఆలాగున ఒకరు జేసిన పనిని ఇంకొకరు బాగుగా లేదని జెప్పిన చేసినవాడు తనకు బాగుగనున్నదని వాదింపగూడదు అతని గుణమున కది సరిపోవచ్చును, మరియొకరి గుణమున కది సరిపడక యుండవచ్చును సరిపడనివాడు సరిపడలేదని చెప్పిన, వానిపై కోపము జేయరాదు ఏలన ఇతని యొక్క ప్రకృతి స్వభావమునకు ఇది బాగుగానే

యుండవచ్చును అతని ప్రకృతికి బాగులేక యుండవచ్చును ప్రకృతి స్వభావము సత్త్వరజస్తమో మిశ్రగుణములబట్టి అనేక విధములైనందునే తన స్వభావమున కనుకూలముగానే అందఱి ప్రకృతియు నుండవలయునని తలంచుటయే అశాంతి కలుగుటకు కారణము కావున, ఇట్టి పరిస్థితులలో ఉభయులును మనప్రకృతి యీలాగుననున్నది, వాని ప్రకృతి ఆలాగుననున్నది అని తెలిసికొనిన మాత్రమే శాంతి గల్గును ఇట్టి ప్రకృతి భిన్నత్వము మహనీయులగు మతోద్ధారక పురుషులలో గూడ గలదు ఇదియెఱింగిన మాత్రమే శాంతియు, ప్రసన్నతయు జీవులకు గల్గును నూనెయందు నూనెయు, నీటియందు నీరున్ను ఐక్యమగుట మీరు చూచుట లేదా! నూనెలో నీళ్ళు, నీటిలో నూనెయు కలియకపోవుటయు మీరు చూడలేదా?

674 బుద్ధియొక్క విశాలభావము, సోదరభావము, పవిత్రభావము తెలిసికొన దగినది తనశరీరమున ఏదైన ఒక భాగమున కురుపు లేచినను, ముల్లు గ్రుచ్చుకొనినను, గాయము గలిగినను చేతులు వెళ్ళి దానిని తోముటయు, శాంత పరచికొనుటయు, నేత్రము వెళ్ళి చూచుకొనుటయు, నాసిక వాసనచూచుటయు ఎట్లు చేయుచున్నవో ఆలాగున తాముండు సంఘములో ఎవరికైన యేయొక్క భంగము వాటిల్లినను లేక బాధ కలిగినను తనకు కలిగినట్లే సేవ చేయుటయు, ఇంకను బుద్ధి విశాలావస్థను నిర్మలభావమును బొందిన, యేమానవునికైనను కష్టము కలిగినపుడు తనకు గలిగినట్లు తోచుటయే గాక తన కరనేత్రాదులచేతనే శాంతికి సేవ జేయును ఇకను బుద్ధి విస్తరించి మానవునికే గాక పశుపక్ష్యాదులకు గూడ దుఃఖము గలుగునపుడు తన యవయములకు బాధ కలిగినపుడు తక్కిన అవయవములెట్లు సేవచేయునో, ఆలాగున సేవ జేయునపుడే నిజమైన హృదయ పరిశుద్ధతయు, కరుణయు, సోదరభావమున్ను గలిగినట్లు తెలిసికొనవలయును ఈ నాలుగవస్థలలో మనమెంతవఱకు సేవ చేయుచున్నామో తెలిసికొనిన మనయొక్క అవస్థను మనము

తెలిసికొనవచ్చును మొదటిది మృగావస్థయనియు, రెండవది మానవావస్థయనియు, మూడవది దేవతావస్థయనియు, నాలుగవది దైవావస్థయనియు గ్రహించుకొనదగినది ఈ దైవావస్థ గలుగునపుడే దైవప్రాప్తిని పొందగలరని తెలియ దగినది ఎక్కువ అవస్థను పొందకపోయినను, తన సంఘములో నున్నవారినైనను తన వలెనే జూచే స్థితిలోనికైనను రావలయునుగదా! ఇదే భగవద్గీతలో " విద్యావినయసంపన్నే" అను శ్లోకముచే శ్రీకృష్ణభగవాను డుపదేశించిన సత్యమని గ్రహించేది

675 సాంఖ్యమును మాత్రము విచారణ చేసి తృప్తిపొందువారిలో గల లోపమేమనగా, వారు ఇరువదినాలుగు తత్త్వములచే ఏతత్త్వములు ఏర్పడుచున్నవో వానిని మాత్రము తెలుసు కొనిన చాలునని చెప్పటయే అప్పడు తత్త్వములు మాత్రమే గోచరముగా గలవు దీనితో తృప్తి నొందరాదు ఏలన మూడు గుణములనుగూడ తెలుసుకొనవలయును లేనిచో తానేగుణములతో కూడియున్నాడో తెలుసుకొనడము ప్రయాసము ఈ గుణములను తెలిసికొనక పోయిన తనయందు రజోగుణాంశము గాని, తమోగుణాంశము గాని ఉన్నచో తెలిసికొనజాలము సాంఖ్య విచారణాపరులలో కొందఱియందు తమోగుణ రజోగుణ ఆహార వ్యవహార గుణములుండుటకు కారణమిదే కట్టకడకు సత్త్వగుణముకూడ దాటవలయునని శాస్త్రము విధించుచుండగా సత్త్వగుణ ఆహార వ్యవహారస్థితికి రానివాని సాంఖ్యవిచారణ యేస్థితిలో నుంటున్నదో విజ్ఞులు తెలిసికొనగలరు రజోగుణ తమోగుణస్థితిలో నుండు వారి తపస్స్వాధ్యాయములన్నియు రాక్షసాసురుల వంటివే యగును అవి జ్ఞానమును కలుగజేయజాలవు సత్త్వాది మూడుగుణములు గీతాది శాస్త్రములలో విపులముగా తెలుపబడియున్నవి, సత్త్వగుణము గూడ బంధమని తెలుపుచుండగా అట్టి స్థితిలోనికైన రానివారి బ్రహ్మజ్ఞాన మెట్టిదో ఆత్మవేత్తలు యెఱుంగుదురు గాక! ఈ సత్త్వగుణముకూడ రహితమై విశుద్ధగుణములో నుండువలయునని శాస్త్రము విధించుచున్నది దాని లక్షణ మిట్టిది

విశుద్ధసత్త్వస్య గుణాః ప్రసాదః
స్వాత్మానుభూతిః పరమా ప్రశాంతిః ।
తృప్తిః ప్రహర్షః పరమాత్మనిష్ఠా
యయా స చానందరసం సమృచ్ఛతిః ॥

మరియు సాంఖ్యములో గల లోపము ప్రకృతియు పురుషుడు అనాదులనుటయే ఇది వేదాంతశాస్త్ర మంగీకరించదు దృశ్యదృక్కు లుండునప్పుడు త్రిపుటి రహితము గాజాలదు అప్పుడు అంతయు బ్రహ్మమని, లేక భగవత్స్వరూపమని వచించెడు వేదాంతమునకే భంగము గలుగును అట్లు అంతయు బ్రహ్మముగా భావన చేయకపోవుట చేతనే దృశ్యగుణములను రహిత మొనర్చుటకు సాంఖ్యులు ప్రయత్నింపక పోవుచున్నారు అందువల్లనే వారు త్రిగుణములను దాటలేకపోవుచున్నారు మఱియు ఈ గుణముల విచారణచేతనే తృప్తి పొందేలాగున ఋషులు చేసియుండలేదు ఏలన అట్టిన వారు దీర్ఘకాలము తపోధ్యానాదులొనర్చి యుండరు అదే దాని గురుతు మఱియు దృక్కైన యాత్మయే తన స్వరూపమని యెఱింగినచో తనకును ఆ స్వభావముమాత్రమే గలిగియుండవలయును మఱల త్రిగుణములలో గల రజోగుణాంశము గాని, తమోగుణాంశము గాని యుండరాదు సత్త్వగుణము దేహముండువరకుండును ఏలన చతుర్దశ భువనములు, వానిలోగల జీవులదేహములన్నియు మూడుగుణములతో కూడినవే ఇది తెలిసికొనినపుడే ఆత్మ త్రిగుణాతీతమగు జ్ఞాన స్వరూపమని బోధము గలుగును

676 పంచీకరణ సంప్రదాయులు ఇంకొక కారణముకూడ చెప్పదురు ఈ వాదమున్ను అపాయకరమే అదేమన ఒక్కొక్క యింద్రియమునకున్ను ఒక్కొక్క యధిదేవత గలదనియు, ఆయధిదేవతల ప్రేరణ చేతనే ఆయాయింద్రియములు ప్రవర్తించుచున్న వనుటయే మనస్సునకు చంద్రుడు అధిదేవత యనియు, బుద్ధికి బృహస్పతి యనియు, కొందఱు బ్రహ్మమనియు చెప్పదురు అలాగున జిహ్వేంద్రియమున కధిదేవత

వరుణుడనియు, గుహ్యేంద్రియమునకు ప్రజాపతి యనియు తెలుపుదురు ఆయా యింద్రియాధిష్ఠాన దేవతలు జేయు కార్యములో మీరు అభిమానించుటచేతనే బంధము గలుగుచున్నదనియు, అభిమాన రహితు లైనచో బంధము లేదనియు వచింతురు ఈ వాదమున్ను గొప్ప ప్రమాదమును గలుగజేయునదే అట్లు చెప్పవారిని ఇట్లడుగవలయును ఈయధిదేవతలలో మంచివారున్ను, చెడ్డవారున్ను గలరా! ఏలన కొందరి మనస్సు ప్రసన్నముగాను, ప్రశాంతముగానుండుటకు కారణమేమి? అలాగున కొందఱి జిహ్వేంద్రియము శుద్ధసాత్త్విక పదార్థములను, మరికొందరి జిహ్వేంద్రియము నీచమైన తామసాహారములను గోరుటకున్ను కారణమేమి? అలాగున కొందఱి గుహ్యేంద్రియము సంపూర్ణ విరక్తి గలిగియుండుటకున్ను, మరికొందఱి యుపస్థేంద్రియము విషయలోలత్వము గలిగి యుండుటకున్ను హేతువేమి? ఇద్దరధి దేవతలుండి రనిన నీచాధిదేవతను త్యజించి శుద్ధాధిదేవతనేల గ్రహించుకొనకూడదు? అలాగున కొందఱి బుద్ధి ప్రకాశమై మహాగ్రహణశక్తి గలిగియుండుటకున్ను, కొందఱికి మందబుద్ధియు మూఢత్వమున్ను గలుగుటకు కారణమేమి? ఇచ్చోటకూడ సత్త్వగుణము, రజోగుణము, తమోగుణమున్ను గ్రహించుకొనకపోవుటయే ప్రమాదమునకు కారణమగుచున్నది అయితే యింద్రియాధిదేవతలను నిరూపించుటకు కారణమేమన సమష్టిలో గలవన్నియు వ్యష్టిలో గలవని నిరూపించుటకొరకు చెప్పినదేగాని మరియొకటి గాదని తెలుసుకొనవలయును

677 పంచీకరణ శాస్త్రము త్రిగుణములపై ఆధారపడినమాత్రమే శుద్ధమగును సాంఖ్యము గూడ త్రిగుణముల నాధారము చేసుకొనియే సిద్ధిని పొందియున్నది లేనిచో దానిపై వచ్చెడు ప్రశ్నపరంపరలకు అది సమాధానము చెప్పజాలదు ఎట్లన ఆకాశములో సంచరించెడు విహంగజాతులలో రాజహంసము, రామచిలుక, కోయిల,కాకి, బోరువ మొదలుగుపక్షి వర్గములలో తెలుపు, ఎఱుపు, పసుపు, నలుపు రంగులేర్పడుటకు కారణమేమి? అలాగున స్థావరములలో పనస, కమల, నారంజి, చింత, ముష్టి వీటిలో తీపి, పులుపు, చేదు మొదలగు గుణములు

గలుగుటకు కారణమేమి? ఆలాగున శుక్ల, రక్త, పీత, నీల వర్ణములుగల పుష్పములుండుటకు హేతువేమి? ఆలాగున శిలావర్గమును పరిశోధించిన ఆశిలాజాతి యంతయు మాణిక్యాది రత్నములు, స్ఫటిక మణులు, నల్ల రాళ్లు, మోటు బండరాళ్ళు, వేర్వేరు విధముగా నేర్పడుటకు కారణమేమి? అదే రీతిగా జంతువర్గములలో గోవు, కస్తూరిమృగము, చమరీమృగము, అశ్వము, గజము, సూకరము, శునకము మొదలగు వర్గములు భిన్న భిన్నస్వభావము గలిగియుండుటకు కారణమేమి? అదే ప్రకారము మనుష్యవర్గములో కొందరికి పరమశాంతియు, కరుణయు, విరక్తియు, విజ్ఞానమున్ను దేనివల్ల గలిగెను?, సామాన్యులు ధర్మాత్ములుగను, ధర్మప్రకారము గృహస్థాశ్రమమును నిర్వహించుకున్న, ఇంక కొందఱు పామరులుగాను క్రూరులుగాను ఉడుటకు కారణమేమి? వీరిలో సాత్త్విక, రాజస, తామసాహారపరులై యుండుటకున్ను భేదమేమి? ఆలోచించు కొనిన ఇవియున్నియు త్రిగుణముల పరిణామము వల్లనే ఇట్లేర్పడుచున్నవని గోచరమగును మనసాంఖ్యులలో కొందఱు ఈ విచారణ చేయకపోవుటే పరమ ఋషుల ఈ యాచరణ లేకపోవుటకున్ను, పరమ మునీంద్రులు పొందిన సత్త్వగుణమున్ను విశుద్ధగుణమున్ను, ఏర్పడకపోవుటకున్ను కారణమగుచున్నది పరమ ఋషులు పొందిన పరమ నిర్వాణమును పొందకపోవుటకున్ను, విజ్ఞానవంతులకున్ను, సదాచార సంపన్నులకున్ను వీరిపై విశ్వాసము లేకపోవుటకున్ను, బ్రహ్మవిద్యయందు జనులకు ప్రీతిగలుగక పోవుటకున్ను కారణ మిదియే

678 ఒకడు విధిప్రకారము సన్న్యసించి వచ్చినచో అతని తండ్రియు, తాతయు, ముత్తాతయు కూడ నమస్కరించవలయునని శాస్త్రవిధి గలదు అట్లు శాస్త్రము విధించుటకు కారణమేమన పిత్రాదులు వయస్సులో నధికులైనను పుత్రుడు గృహస్థ, వానప్రస్థాది రెండాశ్రమములకు పైనుండు తురీయాశ్రమములో నుండుటచేతను, మఱియు దేహము నుత్పాదనము చేయుటలో మాత్రమే తండ్రి మొదలగువారు కారణులగుటచేతను, ఈ దేహము జడము కాన తండ్రికిగాని, తాతకుగాని ముత్తాతకుగాని,

ఆత్మతత్త్వజ్ఞానమగు చైతన్యమును జ్ఞానోపదేశముచే పుట్టించుటకు ఈ యతివర్యుడు కారణు డగుటవల్లను పిత్రాదులకు కూడా పూజ్యుడయ్యెను ఇదియే దీనిలోగల రహస్యము

679 అగ్నిహోత్రము ప్రజ్వలించుచుండు దానికి గురుతు ఏమని తెలుసునా? ప్రజ్వలించు అగ్నియైనచో దానియందు హోమించెడు మంచి చెడువస్తువు లన్నిటిని భస్మము చేయును అలాగున జ్ఞానాగ్ని జ్వలించెడు హృదయమైనచో స్తుతినిందలు, లాభనష్టములు, శుభాశుభములు అనెడు ద్వంద్వములన్నింటిని భస్మము చేయు శక్తి గలిగియుండును అదే దానికి గురుతు అట్టి స్థితి గలుగని హృదయమైనచో ఇంకను జ్ఞానాగ్ని బాగుగ రగిలించే లాగున సాదన చేయవలెను యజ్ఞము చేయునపుడు అగ్నులలో శ్రేష్ఠమైనహవిస్సున్నూ, నికృష్టమైన హవిసున్నూ , నికృష్టమైన మాంసమున్నూ హోమము చేయుదురు ఈ శుద్ధాశుద్ధములను జ్వలించెడు అగ్ని భస్మమొనర్చును ద్వంద్వాతీత జ్ఞానాగ్నిగల స్థితి గలిగిన అట్లుండును

680 సామాన్యముగా జనులందరున్నూ (వేదాంతులు) ఇదంతయు భావనామాత్రమని సులభముగా చెప్పదురు దానియొక్క అర్థము భావన కతీతమైన తత్త్వమని వారు తెలిసికొనుట లేదు అనగా ఇంద్రియ నిగ్రహము, ఆహారభేదము ఇవన్నియు భావన యని చెప్పట చాల సలుభము అట్టి స్థితి వారికి గలిగియుండిన అట్లు చెప్పరనియే తలంచెదను ఆకలిచే మలమల మాడునప్పడు తాను సుఖముగా భుజించెనని గాని, ఆత్మకు క్షుద్బాధ లేదనిగాని వారు భావింపగలరా? అలాగున దాహముతో గొంతు ఎండిపోవునప్పడు చల్లని పానీయమును త్రాగినట్లు గాని లేక ఆ దాహపీడ ఆత్మకు లేదని గాని నిశ్చయించి సౌఖ్యముగా నుండగలరా? అలాగున దారుణరోగముచే బాధింపబడునప్పడు ఆత్మకు అదిలేదు, అది దేహధర్మమని తలంచి ప్రసన్నులై యుండగలరా? నిప్పపై కూర్చుండి చల్లగా నుండగలరా? ఇదంతయు భావన యని చెప్పచు అతిపవిత్రమగు వేదాంతమును కల్మషపరచుచున్నారు అది వారికి సంతోషముగా తోచుచుండినను అట్టిది

పాపమే యగును ఆకలి గలవారు అన్నమును భుజించినను, దాహము గలవాడు నీటిని త్రాగినను, రోగముగలవాడు దివ్యౌషధమును సేవించినను భావన చేయకనే ఎట్లు శాంతిని,, సౌఖ్యమును పొందుచున్నాడో, ఆచరణయు ఇటువంటిదని మరువకుడు వాక్కుతో భావన యని చెప్పిన చాలదు, అది యొకవిధమగు ద్రోహమే సుమా! వేదాంతము అపవిత్రమగుటకు అది యొక ముఖ్యకారణము చెప్పేలాగున చేయవలెను అప్పుడు మాత్రమే ఇది ఫలవంతమగును లేనిచో అదిన్ని యొక విధమగు ఆత్మవంచనయే యగును ఇందువలననే బ్రహ్మవిద్యయందు విద్యావంతులలో కొందరికి ప్రీతి గలుగకపోవుటకు కారణము

681 మీరు రూపాయలనుగాని, నోట్లనుగాని తీసికొనునప్పుడు ఏలాగున శుద్ధముగా నున్నదా అని త్రిప్పి త్రిప్పి చూచుకొనుచున్నారో, ఆలాగున మీరు పఠనము చేయు వేదాంతశాస్త్రములు గాని, శ్లోకములుగాని, మీ యనుష్ఠానములో నుంటున్నవా అని ప్రతిపదము నుచ్చరించునపుడున్నూ ఆత్మలో ఆలోచించు కొనవలయును అట్లుగాక శ్లోకములను పఠించుటలో మాత్రము కాలము గడపినచో దొంగనోట్లను గాని, దొంగరూపాలయను గాని మూట గట్టుకొనునట్లుండును అది మీకేదైన సహాయము చేయునా? అపాయమును గూడ గలుగజేయవచ్చును

682. హిందూమతస్థులు జడవాదులగు చార్వాకాది మతములను ఖండించి చైతన్యమగు ఆత్మ మతమును నిలపెట్ట యత్నించిరే గాని కట్టకడకు వారు చైతన్యమును మఱచి పోయి జడవాదమునే ఆచరణలోనికి తెచ్చిరి అదే హిందూమతము క్షీణించుటకు కారణమైనది అదేమన చైతన్యమగు ఆత్మను అందరికిన్నీ బోధింపక వారు వారు పుట్టిన జాతికి సంబంధించిన దేహమగు జడమును గురించియే చెప్పంబూనిరి అనగా నీవు ఆ జాతి, నీవు ఈ జాతి, మీకు ఇంతే హక్కు, మీకు ఇంతే అధికారము అని బ్రాహ్మణేతరుల గురించియు, స్త్రీలగురించియు చెప్పినందుచేతనే వారున్నూ జడప్రాయులైరి అట్టి జడవాదము చెప్పిన వారినిగూడ

జడములోనికి తెచ్చెను అది ప్రకృతియొక్క నియమముగదా! " యద్భావం తద్భవతి" ఇకి మీద నైనను ఈ జడభావమును త్యజించి చైతన్యమగు శివస్వరూపమగు ఆత్మను గురించి బోధించిన అప్పుడు లోకము చైతన్యవంతమగును

683 హిందువులు తమది వేదమతమని చెప్పదురు, వేదమనగా జ్ఞానమని యర్థము అట్టి దైవజ్ఞానమును, ఆత్మజ్ఞానమును అందరికిని బోధింపక అజ్ఞానరూపమగు తాను పుట్టిన జాతిని గురించియే అధికారము నిర్ణయించుటే వీరుగూడ అజ్ఞులై పోవుటకు కారణమైనది ఆత్మజ్ఞానమే నీస్వరూపము దైవజ్ఞానమే నీ స్వరూపము ఈశ్వరజ్ఞానమే నీజాతి నీవు దానిని మరచిపోయినావు నీవు అజ్ఞానమగు దేహమును తలంచుటచేతనే అజ్ఞాని వైనావు నీదేహోపాధి ఏ జాతితో సంబంధించినదైనను, అది స్త్రీ రూపమైనను లేక పురుషరూపమైనను అజ్ఞానమే అది నీవు కాదు నీవు పరిశుద్ధ జ్ఞానస్వరూపుడవు ఇదే వేదమతము దీనిని చెప్పవారే వేదమతస్థులు వారే వైదికులు తక్కినవారు అవైదికులు అయితే దానిని పొందవలసియుండిన యెట్టి ఆచరణ గలిగియుండవలయునో దానియందుగూడ నీవు అప్రమత్తుడవై యుండేలాగున చూడవలయును అట్లు గానిచో మంచి రోగికి ఔషధము కావలసియుండినను దానికి తగిన పథ్యమున్నూ వుండునట్లుగూడ జ్ఞాపకము నుంచవలయును

684 ప్రచారము చేయవలెనని నిన్ను అనేకులు తొందరచేయుదురు అది మంచిదైనను నేను మాత్రము అట్లు చెప్పట లేదు ఆచరణచేయుము, ఆచరణచేయుము, అనుష్ఠానము చేయుము అని మాత్రమే తెల్పుచుందును పుష్పము వికసించి మధుర మేర్పడునప్పడు భ్రమరములు తమకు తామే వచ్చుచుండును ఆ భృంగములే మధుపానము చేసుకొని వెళ్ళి పోవుచుండును ఆలాగున మీ హృదయము ఆచరణచే వికసించి అమృతమావిర్భవించిన, కరుణారసము ఊరిన, భక్తిరసము గలిగిన, ప్రేమరసము ఉద్భవించిన, అప్పడు భక్తులు వచ్చి దానిని పానము చేసికొని

లోకములో మారుమూలలలోనికి తీసుకవెళ్లి ప్రచారము చేయుచుందురు అట్టి స్థితి గలిగినప్పుడు నీవు గూడ లోకములోనికి వెళ్లి ప్రచారముచేయుదువుగాక! అప్పుడు నీవాక్సూతమును గ్రోలుటకు భక్తులు గుంపులు గుంపులుగా వచ్చుచుందురు

685 గొప్పదగు గిడ్డంగి అనగా గొప్ప గొప్ప సామానులు గలిగిన దుకాణమునుండి యితర దుకాణము వారందరు వచ్చి సామానులు తీసుకవెళ్లి వ్యాపారము చేయుచుందురు అదే ప్రచారము యొక్క రహస్యము ఆలాగున నీవు జ్ఞాన వైరాగ్యాదులతో గూడిన భక్తి దయాదులతో గూడిన గొప్ప గిడ్డంగిగా తయారయ్యేలాగున చూడుము అప్పడనేకులు వచ్చి తీసుకొనివెళ్లి ప్రచారము చేయుదురు మీ దుఖాణము ఖాళీగా నుండిన సామానులు కొనుట కెవరు వచ్చెదరు? అప్పడు ప్రచారమెట్లు జరుగును? ఇవన్నియు జ్ఞాపకము చేసికొనుము

686 ఈజీవులన్నియు పంచభూతాత్మకము లైనను, అవి సత్త్వ రజస్తమోగుణముల భేదములచే మూడువిధములుగా నుంటున్నవి ఆయాగుణములతో గూడిన జీవులు మాత్రమే ఆయా జీవులతో గూడి సుఖముగా నుండగలవు అనగా సత్త్వగుణజీవి సత్త్వగుణము గల దానితోను, రజోగుణజీవి రజోగుణముగలదానితోను తమోగుణజీవి తమోగుణము గల దానితోను మాత్రమే సుఖముగా నుండగలదు మానవులలోను ఆలాగుననే యుండును పంచభూతాత్మకమైన యీ దేహములోను ఇట్టి భేదము గలదు ఒక్కొక్క తత్త్వముగల మానవులలోనే ఆయా తత్త్వము గలవారు సౌఖ్యముగా నుందురు మరియొక్క తత్త్వము గలవారికి ఐక్యము కుదురదు 1 పృథ్వీతత్త్వములో నుండువారు అట్టితత్త్వముగలవారితో కలసి ఐక్యమైయుందురు ఎట్లన భూతత్త్వము గల మృత్తికలో మరియొక మట్టి కలసిపోవును గాని, భూతత్త్వమునుండి జలతత్త్వపరిణామము పొందిన మానవుడు పై జెప్పిన వారితో కలసి యుండడు ఎట్లన జలములో మట్టి గలియదు రాళ్ళు ఇసుక మొదలైనవి నీటిలో కలియక అడుగున నుండి

పోవును 2. జలతత్త్వము ఉండువారితో అగ్నితత్త్వము గలవారు ఐక్యపడరు ఎట్లన జలములో జలము కలియునుగాని అగ్నిని జలము ఆర్పివేయును 3 అగ్నితత్త్వము గలవారు అట్టి స్వభావము గలవారితో ఐక్యమొందుదురే గాని, వాయుతత్త్వము గల వారితో ఐక్యము నొందరు, ఏలన వాయు వగ్నిని ఆర్చివేయును ఏలాగున గాలి దీపమును ఆర్చివేయుచుండునో ఇదిన్నీ అలాటిదే 4 వాయుతత్త్వములో నుండువారికి ఆకాశతత్త్వములో నుండువారితో స్నేహము కుదరదు ఎట్లన వాయుతత్త్వమగు పొగ మొదలైనవానిని ఆకాశము వేరుపరచును అది తనలో చేర్చదు వంటయింటిలోను, దీపముయొక్క చిమ్నీలోను పొగ గలిగియుండుటకు అదేకారణము వాయువులో వాయువున్నూ, ఆకాశములో ఆకాశమున్నూ కలసిపోవును అగ్నిలో అగ్నియు, జలములో జలమున్నూ, మట్టిలో మట్టియు ఐక్యమగును ఇదియే ఒక్కొక్క గుణము గలవారిలో తక్కిన గుణము గలవారు ఐక్యపడకపోవుటకు కారణము, ఇదే రీతిగా భూతత్త్వము చలనరహితమగుటచే అది తమోగుణమని గ్రహించతగినది జలతత్త్వము కొంచము చలనము గలిగినదగుటచే తమోరజముల మిశ్రమము గలిగియుండును అగ్ని తత్త్వము తీక్ష్ణ దహనశక్తి గలిగిన దగుటచే అది రజో గుణముతో కూడినది వాయువునందు రజస్సత్త్వగుణములుండుటయే కొంతవరకు వాసనతో కూడియుండుటకు కారణము ఎట్లన గాలి వాసనను కొంతవరకు తీసికొని వెళ్లి మరల వదలి వేయును 5 ఆకాశము కేవల సత్త్వగుణము కావుననే అన్నిటిలో నుండియు దేనిని అంటకయుండుటకు కారణము అలాగున సత్త్వగుణము గలుగునపుడు దేనితోను సంబంధము కలుగక నిస్సంగుడై యుండును కావున ఆయాగుణములు గలవారు మాత్రమే ఆయా జనులతో నుండవలయును లేనిచో శాంతి యుండదు కలహమే యెప్పుడును సంభవించును ఒక్కరు అవును అని చెప్పిన తక్కినవారు కాదని వెంటనే చెప్పదురు ఒకరు చేయవలయునని చెప్పినచో మరియొకరు వెంటనే కూడదని వచింతురు ఈలాగుననే అన్నియున్నూ తెలిసికొనవలసినది కావుననే రావణ కుంభకర్ణ విభీషణాదులు ఒక్కతల్లి

బిడ్డలై యుండియు వేరుపడిరి అలాగున హిరణ్యకశిపుడు ప్రహ్లాదుడు తండ్రిబిడ్డలై యుండియు భిన్నభావము గలిగియుండుటకు కారణమిదే అదేప్రకారము పాండవ దుర్యోధనాదులు పెద్దతండ్రి పినతండ్రి బిడ్డలై యుండియు, విరోధము గలిగియుండుటకు కారణమైనది ఒక్కొక్క గుణముతో సంబంధము లేనివారు వేరువేరుగానే యుండవలయును అప్పడే శాంతియు ప్రసన్నతయు గలిగి యుండును ముఖ్యముగా ఈ విషయము శాంతిని కోరు బ్రహ్మనిష్ఠులు గ్రహించుకొనవలయును అట్లు గానిచో ఉభయులకున్నూ సంకటమే గలుగును వారివారి గుణములతో గూడియుండిన వారలైన యుభయులకున్నూ శాంతియే ఐకమత్యమే, ఆనందమే లేనిచో గుఱ్ఱముతో ఎద్దును ఒక బండికి కట్టినట్లుండును గుఱ్ఱముతో గుఱ్ఱమున్నూ, ఎద్దుతో ఎద్దున్నూ బండికి కట్టిన వాని గమనములు సరిగా నుండుటచే రెంటికిన్ని సౌఖ్యమే అదేరీతిగా మహిషముతో వృషభమున్ను బండికి కట్టిన రెంటికిన్ని సంకటమే మహిషముతో మహిషమున్నూ, వృషభముతో వృషభమున్నూ కట్టిన రెండిటియొక్క వేగము ఒకే ప్రకారమగుటచే ఉభయత్ర సౌఖ్యమే అశ్వమునకు వేగముగా పరుగెత్తిన సంతోషము ఎద్దునకు కొంచము నెమ్మదిగా నడచిన సుఖము మహిషమునకు మరింత నిదానముగా నుండిన సుఖము సత్త్వ, రజ, స్తమోగుణములయొక్క భేదమీలాగున నుండును శ్రీకృష్ణభగవానుడు గీతలో ఈతత్త్వము నుపదేశించెను

**రజస్తమశ్చాభిభూయ సత్త్వం భవతి భారత।**
**రజస్సత్త్వం తమశ్చైవ తమస్సత్త్వం రజస్తథా॥ ( 14-10)**

సత్వగుణము రజస్తమస్సులను అతిక్రమించి యుండును ఆలాగున రజోగుణము సత్త్వతమస్సులను తిరస్కరించియుండును అట్లే తమోగుణము సత్త్వరజస్సులకు వేరుగా నుండును

687 వేదాంతములో గల మరియొక అపాయ మేమనగా సత్తనియు, అసత్తనియు, మంచిదనియు, చెడ్డదనియు చూడపని లేదు

అంతయు బ్రహ్మమే అంతయు సద్వస్తువే దీని అర్థము వీరు చెప్పరీతి గాదు అంతయు బ్రహ్మమే మాయ యను నది లేదు అంతయు సద్వస్తువే, అసద్వస్తువే లేదు ఆలాగున అంతయు మంచిదే చెడ్డదిలేదు ఈలాటి భావన చేయ వలయునని వేదాంత ముపదేశించుచున్నది ఇది వేదాంతములో గల కొనభాగమే గాని సామాన్యమైనది కాదు ఇట్టి భావన చేయుటకు ముందుగా సత్తును గ్రహించుటయు, అసత్తును త్యజించుటయు అభ్యాసి నేర్చుకొనవలయును ఆలాగున చెడ్డదానిని విడుచుటయు, మంచిదానిని గ్రహించుటయు గలిగియుండవలయును అప్పడు చెడ్డదంతయు తొలగిపోవును అప్పడే వేదాంతము శుద్ధమగును అప్పడే గౌరవనీయులకు వేదాంతమందు గౌరవభావ ముదయించును సత్తులో అసత్తు ఎట్లుండును? మంచిదానిలో చెడు ఎట్లు నిలుచును? అమృతమందు విషముండునా? జ్వలించెడు అగ్నియందు చల్లని నీర మెట్లుండును? మండుచుండు నిప్పలో కోమలమైన తీగలు ఎట్లు పెరుగును? కావున సత్యమందు అసత్యమునకు చోటు లేదు ప్రకాశచీకట్లు ఎట్లు కలసి యుండును? ఇట్టిభావన చేయగలుగునపుడే సత్యమైన దైవభావన గలుగును అతీతావస్థలో చెప్పిన వాక్యములు సామాన్యజనులు అర్థము చేసుకొను శక్తిలేక పోవుటచేత భావము చెడిపోవుచున్నది ముక్తావస్థలో బోధించిన విషయము ముముక్షావస్థలో నుండువారు అర్థము చేసికొనక పోవుటచేతనే యీ సత్యము తెలియకపోవుచున్నది అభ్యాసులు, సాధకులు, జిజ్ఞాసువులు వుండవలసిన రీతి విడిచి జీవన్ముక్తులు విదేహముక్తులు విధించిన భావము గ్రహించుటచేతనే విపరీతావస్థ పొందుట జరుగుచున్నది కావుననే వేదాంత శాస్త్రమిట్లుపదేశించినది

**వేదాంతానామనేకత్వాత్ సంశయానాం బహుత్వతః ।**
**వేద్యస్యాప్యతిసూక్ష్మత్వాన్న జానాతి గురుం వినా॥**

వేదాంతము అనేక ముఖములుగా నుండుటచేతను, సంశయములు బహువిధములుగా నుండుటచేతను, గ్రహించవలసిన జ్ఞేయవస్తువు మిక్కిలి

సూక్ష్మమగుట చేతను, శ్రుతి సారమెఱింగి బ్రహ్మనిష్ఠుడైన గురుదేవుని సహాయముతో తప్ప ఇది బోధపడునది కాదు ఇట్లు అనుభూతి ప్రకాశము

688 ఏలాగున మనస్సు, బుద్ధి విస్తరింపబడునో అనగా శుద్ధమగునో, ఆ విషయమును తెలిపెద ఒక గ్రామము మొదట చిన్నదిగా నుండునపుడు మంచి నీరుకొఱకు ఒక చిన్న గుంట ఉండును కాని ఆ చిన్న గ్రామము కొన్ని జనులచేగాని, రైల్వేజంక్షనుచేగాని అభివృద్ధినొందుచుండగా ఆ మంచినీళ్ళ గుంటను ఏలాగున విశాలపరచుచుండిన అనగా త్రవ్వుచుండిన విస్తీర్ణ మగుచుండునో, సర్వజనులకు కావలసిన జలమేర్పడి స్నానపానాదులకు ఉపకరించునో అలాగున బ్రహ్మనిష్ఠులు ఇప్పడు గలిగియుండు ధ్యానాదులచేగాని, పఠించిన శాస్త్రములచే గాని తృప్తినొందక అనాత్మభావములు గాని, ప్రాకృత భావములుగాని యుండిన వానిని దూరీకరించిన ఇప్పడుండు స్థితికన్న ఎంతయో విశాలభావమున్ను, విజ్ఞానశక్తియున్ను, అగాధబోధమున్ను గలుగును ఏలన ఆత్మ అనంతమైనది ఆనందఘనీభూతమైనది గదా!

689 తీవ్రముముక్షుత్వముగలవా రెట్లుండవలయునో ఈక్రింది విధము తెలుపుచున్నది అదేమన, విత్తనము వేయు మఖకార్తి కాలమందుగాని, వరినాటు కాలమందుగాని, ఇకవారి వారి దేశానుసారము విత్తనములు వేయు కాలమందుగాని ఏలాగున కృషిచేయువారు ఇతర కార్యము లన్నిటిని నిలువుదల చేసి వ్యవసాయమందే రాత్రింబవళ్ళు నిమగ్నులై యుందురో ఆ వ్యవసాయపు పని పూర్తియగువఱకు సకాలభోజనమునుగాని, నిద్రనుగాని లక్ష్యపెట్టరో అలాగున యౌవన కాల మారంభించి ముగియు లోపలనే ఆత్మ సాక్షాత్కారము కలుగుటకు తగిన ధ్యానము, తపస్సు, యోగము, శాస్త్ర పఠనము చేయువారే తరించగలరు అట్లు చేయని వారికి సమయమున సరిగా ఋతుకాలము ననుసరించి పైరు చేయక అలసులై యుండు కర్షకుల గతియే పట్టును కాలమతిక్రమించి ఒకవేళ వ్యవసాయముచేయ

యత్నించినను అదేలాగున సరిగా ఫలమును గలుగజేయక పోవునో, ఆధ్యాత్మిక ప్రయత్నమున్ను బాల్యకాలమందుగాని, యౌవనకాలమందుగాని చేయనిచో గొప్పఫలమును గలుగ చేయదు అకాలమున చేయు కృషికి ప్రయత్నము అధికముగా చేసినను స్వల్పముగానే ఫలమునిచ్చును ప్రపంచములోగల ఏ మహాత్ములైనను విద్యయందుగాని జ్ఞానమందుగాని ఉన్నతస్థితి పొంది యుండినచో బాల్యమందుగాని, యౌవనమందుగాని ప్రయత్నము సలిపేయుందురు సకాలమున చేయు కృషికి ప్రయత్నము స్వల్పమైనను ఫలమధికము అకాలమున చేయు కృషికి యత్నమధికమైనను ఫలము స్వల్పము ఆధ్యాత్మజ్ఞానము సంపాదించిన పిమ్మటనే యితర కార్యములలో ప్రవేశించిన చాలును కర్షకులు వ్యవసాయపుపనిని పూర్తి జేసిన తరువాత మాత్రమే ఇతర కార్యములు చేయుదురు ఇదివరలో ధ్యానమునకే యాధిక్యము నివ్వడమైనది ఇక పఠనమునకే యాధిక్యము నివ్వవలయును ఏలన కాలము ఈలాగున మారిపోయినది ఎట్లన, అన్న సత్రాదులు విద్యార్థులకున్ను, బ్రహ్మనిష్ఠులకున్ను ఏర్పడినప్పటికిన్ని ఇప్పుడు ఏలాగున వారిలో సోమరులు నిండిపోయిరో ఆలాగున ధ్యానమునకు ఆధిక్యమిచ్చిన ఆ నెపముచే సోమరులు దానియందు ఎక్కువ ప్రవేశించుట కవకాశము గలుగును పఠనమున కాధిక్య మిచ్చిన సోమరుల కచట చోటు దొరకదు

690 జీవన్ముక్తి కలుగునపుడు గల స్థితిని దెలిపెద పక్షులు గ్రుడ్లరూపముగా నుండునవి కొద్దిరోజులు పొదిగిన తరువాత జడరూపముగానుండు ఆయండము, చైతన్య రూపముగలదై, తన యావరణ రూపమగు గ్రుడ్లయొక్క పెంకును భేదించి యెగిరి పోవుచున్నట్లు, బీజములోపల నిగూఢమైయుండు వృక్షము కొంతకాలము బీజమును భూమిలో నుంచినపుడు అది విత్తనమును భేదించి వృక్షాకారముగా పరిణమించి బీజమును తనలో నైక్యపరచికొని, మహత్తైన వృక్షాకారముగా పరిణమించుచున్నది ఆలాగున జడప్రాయముగా నుండు జీవుడుగూడ కొంత కాలము ఏకాంతమున బ్రహ్మనిష్ఠ చేసినచో, చైతన్యవంతుడై

హృదయగ్రంథియగు ఆవరణమును భేదించి, ముక్తుడై బయలు వెడలగల్గును ఆలాగున జీవుడుగూడ, విజనస్థలమున కొంతకాలముండి ధ్యానము సల్పిన బ్రహ్మత్వమునొంది, జీవత్వము రహితమై జ్ఞానమయుడు కాగల్గును బీజము వృక్షమగునట్లు గ్రహించుకొన వలయును

691 సామాన్యముగా జలము నదులలోనికి కాలువలద్వారా ప్రవహించునప్పుడు కట్టకు లోబడియే ప్రవహించు చుండును కాని వెల్లువలు వచ్చునవుడు కట్టలను ముంచి దాటి పారుచుండును ఆలాగున గుణత్రయాతీతస్థితి గలుగువఱకు మాత్రమే, హద్దులలోపల నిలకడ గలిగి బ్రహ్మనిష్ఠులుందురు గుణత్రయాతీతస్థితి గలుగునపుడు బ్రహ్మము ఏలాగున హద్దును దాటియుండునో, అనగా దేశ, కాల, అవస్థాతీతమై యుంటున్నదో, ఆలాగున ముక్తాత్ముడు గూడ అట్టి అవస్థ గలిగియుండును అయితే అది అనీతిప్రవర్తనము గాదు అతీతావస్థగా నుండునని యెఱుంగదగినది అట్టి ముక్తాత్మునకు విధి నిషేధములు లేవని తెలుపబడు దానియొక్క రహస్యమీలాగున నుండునని గ్రహించేది

692 అహింసావిషయమై కొందరీలాటి కుయుక్తులు చెప్పుదురు అదేమన, కూరగాయలలోను, జలములలోను, వాయువులోను జీవాణువులు లేవా? అది మాత్రము హింస కదా! అని వారివాదము ఈలాటివారి కిదివరలోనే సమాధానము వ్రాయబడియున్నది ఇపుడు నూతనముగా మఱియొక ప్రశ్న బయలుదేరినది అదేమన, కొందఱు అహింసాపరులని చెప్పుచు అపక్వాహార పరులై యున్నారు ఐతే వారు కొబ్బరి, బాదం, జీడిపప్పు మొదలగు గింజలను, గోధుమ, పెసలు, మొదలగు ధాన్యములను తిని లోకమునకు ఎంతో నష్టము జేయుచున్నారు ఒక్క కొబ్బరికాయ గాని, బాదంగింజ గాని, జీడివిత్తనముగాని, చెట్టయి ఫలించినచో వాటివల్ల ఎన్నియో బీజము లేర్పడి యెందరో మానవుల కాహారమేర్పడును గదా! ఈలాటి ప్రశ్న చేయువారితో ఇట్లు సమాధానము జెప్పిన చాలును భూలోకములో అహింసాధర్మ పరులలో శ్రీ గౌతమబుద్ధుడు అగ్రగణ్యుడు

వారుగూడ ఇంత దూరము పోలేదు వారికన్న మీవిచారణజ్ఞానశక్తి అధికమైనది ఐతే బీజములను నశింపజేయక మీరు జీవించేలాగున ఆచరించి లోకమునకు మార్గదర్శకులుగా చేయవలెను బీజనాశనము చేయకనే జీవించవచ్చును బత్తాయి, నారింజ, మామిడి, పనస, అరటి వగైరా పండ్లను, గుమ్మడి, దోస మొదలగు కాయలను, గెనుసు, కఱ్ఱపెండలము మొదలగు దుంపలను దిని జీవించేలాగున చేయవలెనని జెప్పినచాలును ఈపై జెప్పిన వాటి గింజలు మానవులు భుజించ నవసరము లేదు ఒక దర్మము ననుష్ఠించునప్పడు కొంత సహనము లేక యెట్లు సాధ్యమగును అని జెప్పిన చాలును

693 వ్యాదిచే నాలుక చెడినవారికి ఎంత మంచి పదార్థముల నిచ్చినను అనిష్టముగాను, అరుచిగాను దోచును అలాగున ఒకడు మంచివాడై యుండియు మరల మనోనిర్మలత్వము తగ్గిపోయిన తరువాత ఎంత ధర్మవాక్యము లుపదేశించినను అతని కది వెగటుగానే దోచును అట్టివారితో ఏమియు చెప్పక యుండుట మంచిది ఆకలి గల్గిన వారికి మంచి భోజనవస్తువు లిచ్చిన ఎట్లు సంతోషముతో భుజింతురో అలాగున జిజ్ఞాసావస్థలోనుండు వారికి జ్ఞానవాక్యములు ఆత్మసౌఖ్యమును గలుగజేయును "అజీర్ణే భోజనం విషం" అని తెలుపుటకు కారణమిదే

694 సత్యమైన ఆత్మస్థితియందు నిలుకడ తపస్సుచే గలుగని వారికి ఎల్లప్పడున్ను వ్యాకులత్వము గల్గును అంతేగాదు, వారు సార్వభౌములైనను, ఎంతో చిన్నస్థితిలో ఉండు వానిని చూచినను భయముగల వారగుదురు ఏలన, అవిద్యలో నుండువారి కెల్లప్పడును, భయము గల్గుచుండును గదా! సత్యమగు జ్ఞేయ బ్రహ్మములో నిలకడగలవానికి చక్రవర్తిని చూచినను భయముగల్గుటకు కారణము లేదు అంతేకాదు, అతని దివ్యదృష్టికి చక్రవర్తికూడ అవిద్యలో నుండువాడగుటచే, చాల దీనావస్థలో ఉండువానివలెనే గనపడును ఇది అహంకారము కాదు సోఽహంకారముయొక్క మహిమాతిశయమే యగును అది

అమృతనిలయమగుటచే అచ్చోట నిరతిశయానందమే గలుగుచుండును అవిద్య దుఃఖమును, దీనత్వమును, క్లేశమును గలుగ జేయునదగుటచే దానిలోనుండు వానికిన్ని దీనత్వము తప్ప మఱియేమి గల్గును? అమృతత్వమున్ను, జ్యోతిర్మయమున్ను జ్ఞేయములో నిలకడ గలవానికి మాత్రమే సిద్ధించును వాడు సంసార సాగరమును తరించినవాడు తక్కిన వారు సార్వభౌములైనను, శాస్త్రము మాత్రము చదివిన పండితులైనను, భయంకర సముద్రములో పడిపోయిన వారివలె క్లేశమునే పొందగలరు

695 బ్రహ్మవిద్య నుపదేశించు విషయములో స్థూలారుంధతీన్యాయ మొకటి గలదు వివాహ కాలములో కన్యకలకు అరుంధతీనక్షత్రమును దర్శనము చేయింతురు అరుంధతీ నక్షత్రము సూక్ష్మమగుటచే సమీపమందుండు సప్తఋషి నక్షత్రమును ముందుగ జూపి తరువాత అరుంధతీ నక్షత్రమును జూపునట్లు, పంచకోశములు, దేహత్రయము, చతుర్వింశతి తత్త్వములును, జీవత్రయము, అష్టాంగయోగము, సప్తజ్ఞాన భూమికలును, జీవేశ్వరస్వభావములును, వారి ఐక్యమును, మూలప్రకృతిని, సాధన చతుష్టయము మొదలగువానిని జూపి అనగా నిరూపించిన తరువాత సాక్షిచైతన్యాత్మను బోధించవలయును అదెట్లన, ఒకరికి ఒక జాబు వ్రాయవలసియుండిన అతని పేరు మాత్రము వ్రాసి పోస్టులో వేసిన అదెట్లు అతనికి చెందజాలదో, అట్లు గాక యెవరికి ఆవుత్తరము చెందవలయునో, వారిపేరు, తండ్రి పేరు, ఇంటి పేరు, గ్రామము పేరు పోష్టాఫీసు పేరు, జిల్లాపేరు, రాజధాని పేరు మొదలైనవి వ్రాసిన ఎట్లు ఆవుత్తరము ప్రయాసము లేక వారికి చేరునో అలాగుననే తత్త్వములు, సాధనలు, గుణత్రయము మొదలగు వాటిని ఉపదేశించిన పిమ్మట గుణత్రయాతీత ఆత్మనుపదేశించిన అది బోధపడును కావుననే ఋషులు ఆశ్రమములను నిర్మించి ముముక్షువులకు మోక్షోపదేశమును జేయుచుండిరి

696 సత్యమే ప్రకాశము ప్రకాశములో నుండువారికి ఏలాగున అన్నియు గనపడునో, అంతే గాక భయముగూడ నుండదో, చీకటిలో

నుండువారికి ఎట్లు ఏమియు గనపదో, అదిన్ని గాక భయము గలుగుచుండునో, ఆలాగున సత్యములో నుండువారికిన్ని, అసత్యములో నుండువారికిన్ని సంభవించునని సర్వదా మరువకుడు నిర్భయముగాను నిర్మలముగాను ఉండవలసియుండిన సత్యముతోనే బ్రతుకవలెను అట్లు గానిచో ఎల్లప్పడును దిగులున్ను, భయమున్ను, క్లేశమున్ను జీవులను విడువకనే అంటియుండును దానివల్ల మనోవ్యాకులతయు, శరీరవ్యాధియున్ను గల్గును జీవిత మెంతయో దుఃఖమై మారును మనశ్శాన్తిగాని, ఆత్మసుఖముయొక్క లేశముగాని అత డనుభవింపజాలడు

697 బ్రహ్మదృష్టిగలవారికిన్ని, రాజ్యమున సార్వభౌమ దృష్టిగలవారికిన్ని చాల మార్పు గలదు అందువల్లనే బ్రహ్మదృష్టి గలవాని దృష్టిలో చక్రవర్తి గూడ దీనస్థితిలో నుండువానివలె గోచరించును ఎట్లన ఒక చక్రవర్తి, ఒక శ్రీమంతుని గుమస్తాను ఎట్లు చూచునో, ఆలాగున అనంత బ్రహ్మాండములను తన ఆత్మలో నిలిపి అన్ని లోకకార్యముల నిర్వహించెడు ఆ పరమాత్మయే, ఆ సర్వేశ్వరుడే తన ఆత్మగా నుంటున్నదని తలంపు గల్గినను, లేక ఆ సర్వేశ్వనియొక్క యాజ్ఞను ప్రపంచములో బోధించుట కేర్పడిన ప్రవక్త యని గాని, ప్రబోధకుడని గాని భావన గల్గినవాడు చక్రవర్తి ప్రధానమంత్రిగ నుండేలాగున నుండును అట్టి అఖండ బ్రహ్మాండ రాజ్యప్రభువు యొక్క మంత్రిదృష్టిలో ఒక చక్రవర్తి మంత్రికిన్నీ, జమీందారు దివానుకున్నూ, శ్రీమంతుని గుమాస్తాకున్నూ అంత తారతమ్యము గలదు అట్టి బ్రహ్మానుభవము గలవాడు విద్యలేని వాడైనను, ప్రపంచములో ఏ ధనము లేనివాడైనను పండితులను, చక్రవర్తులను గూడ దీనజీవులుగానే తలంచును ఏలన? అతడు ఆత్మలో బాగుగా చదివినవాడును, ఆత్మధనము గలవాడగుటచే అట్లగుటకు కారణమైనది సార్వభౌముడైనను, మహాపండితోత్తముడైనను ఆత్మజ్ఞానములేనిచో, అవిద్యలో నుండువారు గదా! అవిద్య దీనభావము, క్లేశభావము గలదగుటచే దానిలో నుండువారెవరైనను వారందఱికిన్ని అట్టి స్థితియే గలుగును

698 ఇది గృహస్థదంపతులను గురించి అనేకులు అపుడపుడు అడుగుచుండెడు విషయము, కొందరు స్త్రీలు విషయాసక్తలై యుందురనియు, అట్టివారిని ఉత్తమగృహస్థ బ్రహ్మచర్యములో నిలబెట్టుటకు సాధ్యము గాక యున్నదనియు కొందరు సాధనపరులు వచింతురు దీనికి సమాధానము, అట్టి నారీమణులుండిన వారితో మీరొక సంగతి చెప్పవలయును అదేమన, నేను ఆరోగ్యవంతుడనై పూర్ణాయుస్సు కలవాడనుగా నుండుట మీకు ఇష్టమా? లేక శోకగ్రస్తుడనై, అల్పాయుస్సు గలవాడనై త్వరలో మరణించవలయునని యభిప్రాయమా? అని యడిగిన చాలును అత్తరి ఎటువంటి స్వభావముగల వనిత యైనను మీరు ఆరోగ్యవంతులై, పూర్ణాయుస్సు గలవారై యుండవలయుననియే సమాధానము చెప్పను అత్తరి పురుషుడు ఇట్లనవలయును అట్టైన సంపూర్ణ బ్రహ్మచర్యము అనుష్ఠించుటకు ప్రయాసమైనచో, గృహస్థబ్రహ్మచర్యమైనను అనుష్ఠించవలయునే గాని, వేరుమార్గము లేదని చెప్పిన చాలును అంతేగాక అల్పాయుస్సు కల్గి రోగ పీడితులై నిరంతరము తల్లిదండ్రులకు దుఃఖమును గలుగజేయు బిడ్డలు పుట్టకయుండవలసి యుండిన, గృహస్థబ్రహ్మచర్య పాలనము లేనిచో, సాధ్యము కాదనియు, ఉత్తమసంతానము గలుగవలసియుండిన గృహస్థ బ్రహ్మచర్యమైనను పాలించుట తప్ప వేరు ఉపాయము లేదనియు తెలువవలయును బ్రహ్మచర్యమునకు సంబంధించిన ధర్మమును తెలిపెడు "ఈశ్వరకృప" యను గ్రంథమును చదివిన, బ్రహ్మచర్యముయొక్క మహిమ గోచరము గాగలదు అయితే ఈ విషయములో స్త్రీలనుమాత్రము దోషయుక్తులుగా చెప్పం దగదు మంచివారున్ను, చెడ్డవారున్ను అందరిలోను గలరు గృహస్థ బ్రహ్మచర్య మనుష్ఠించవలయునని భర్తలకు హితోపదేశము చేయు మహిళామణు లెందరో గలరు అట్టి పావనమగు వాక్యములను లక్ష్యపెట్టని పురుషులు గూడ అనేకులుంటున్నారు పురుషులైతే స్వంతంత్రులై యుందురు స్త్రీలో, అస్వతంత్రలగుటవల్ల, వారి నీతి వాక్యములన్నియు అరణ్యరోదనములగు చున్నవి మరియు గృహస్థబ్రహ్మచర్యమును ఉపదేశించెడు నారీమణులతో

ఈ క్రిందివిధముగా వచించే పురుషులు గూడ గలరు వారు చెప్పనది యేమన, మాకు గ్రహస్థాశ్రమములో ఇంకను ప్రీతి గలదు దానికి అనుకూలముగా నీవు ఉండనిచో, మేము వేరు వివాహము చేసికొనుటగాని, లేక మరియొక యభిమాన స్త్రీని ఉ౹౹చుకొనుటగాని జరుగునని చెప్పనపుడు, వేరు మార్గము కనపడకపోవుటవలన, స్త్రీలు నిరంతరము విషయములోనే పడియుండవలసివచ్చుచున్నది ఇదిన్ని గాక మాంసభక్షణకులమున బుట్టినను నారీమణులు కొందరు అహింసావ్రతనిష్ఠ గలవారై యుండిన, కొందరు కఠిన హృదయులగు నరులు ఆ నారీమణులతో మేము మాంసభక్షణజాతిలో జన్మించినవారము, మాతో పాటు మాంసభక్షణము చేసిన మాత్రమే మనకు సంసారము సరిపోవును కావున నీవు మాంసభక్షణము చేయని బ్రాహ్మణ జాతిలో చేరినదానివి కావున బ్రాహ్మణస్త్రీలతో శూద్రపురుషులు కాపురము చేయుట ధర్మవిరుద్ధము అందువలన మీ ఇష్టానుసారము తపమో, జపమో, గీతాపఠనమో చేసికొనవచ్చును నేను మరియొక స్త్రీని వివాహము చేసికొనెదను అను కరుణారహితమగు కర్ణకఠోర వాక్యములను వినునపుడు మరేమియు తోచక, దైవమా! నీవేగతి యని మనస్సులో తలంచుచు, భర్తవాక్యముల నుల్లంఘించిన ఏమి కీడు మూడునో అని భయపడి భర్తఇష్టానుసారముగ మాంసభక్షణము చేయు పతివ్రతలగు నారీమణులుగూడ గలరు పై చెప్పిన వన్నియు భార్యాభర్తలకు తగిన వివేకజ్ఞానమును, సజ్జన సంసర్గమున్ను, ఉత్తమ గ్రంథపఠనమున్ను లేకపోవుటచే గలిగెడు దోషములే ఈ క్రింద వ్రాయబడు శ్లోకము మామూలు గృహస్థాశ్రమస్థులకు చెప్పినదే సాధకులు ఇంకను విరక్తి నియమమవలంబించవలయును సంపూర్ణ విషయ విరక్తి అవలంబించినపుడే హృదయము నిర్మలమై, బుద్ధి శుద్ధమై బ్రహ్మచింతనమునకు అర్హత గలుగును యోగులకున్ను, తపస్వినులకున్ను బ్రహ్మచర్యవ్రతము పూర్ణముగా నుండినమాత్రమే యోగసిద్ధియు, తపస్సిద్ధియు గలుగును

**ఋతుకాలాభిగామీ యః స్వదారనిరతశ్చ యః ।**
**స సదా బ్రహ్మచారీ చ స విజ్ఞేయో గృహాశ్రమీ॥**

ఋతుకాలమున మాత్రము, స్వభార్య యందు చేరువాడు సదా బ్రహ్మచారివంటివాడే యగును అట్టి నారీమణిగూడ బ్రహ్మచారిణివంటివారే ఇదే యుత్తమ గృహస్థాశ్రమముయొక్క లక్షణము బ్రహ్మచర్యవ్రతము లేనిచో బ్రహ్మభావన జేయుటకు తగిన మనోబలము, ప్రజ్ఞావిశేషము గలుగదు అదేటీనిలో గల రహస్యము ఋతుకాలధర్మము "తమోభాస్కరాది" గ్రంథములలో కనుగొనవచ్చును

699 శ్రద్ధయొక్క స్వరూపము ఇది 1 వస్తుస్వరూపముతోను, 2. క్రియాస్వరూపముతోను, 3 కాలస్వరూపముతోను కూడి యుండవలయును ఎట్లన ముఖ్యులగు కొందఱు బంధువులకు విందు జరుపులాగున నిశ్చయించుకొని భోజనాదులలో క్షీరాన్నమును గూడ పాకమును చేయుటకు నిశ్చయించిరి కాని ఆ బంధువులు 11 ఘంటలకు రైలులో వెళ్ళవలసినవారైయుండిరి కాని భోజనములు తయారైనను పరమాన్నము పాకము కాలేదు అయినను ఇతర పదార్థముల భుజించి వారు వెళ్లిరి భోజన వేళకు పరమాన్నము కానందుచే అది ఉపయోగపడక పోయెనుకదా! క్షీరాన్నమునకు పాలు, చక్కెర, రవ్వ మొదలైన సామగ్రులుండిన చాలదు సకాలమునకు పచనమును గూడచేయవలయును అంతటితో పూర్తికాదు శుద్ధముగా నుండవలయును లేనిచో మాడిపోవుటగాని, సరిగా నుండకపోవుటగాని తటస్థించును పైనజెప్పిన మూడున్ను సరిగా నుండిన మాత్రమే ఉపయోగపడును అలాగున జ్ఞానామృతమును పొందుటకుగూడ శాంత శమ దమాదులు మాత్రము చాలవు శ్రద్ధాభక్తులతో గూడిన అనుష్ఠానము చాలదు కాలసమయములకు తప్పక తన ధ్యానాది దినకృత్యములను గలిగియుండవలయును అప్పడే అది మోక్షమును గలుగజేయును ఇట్టి లక్షణములు కలిగి ఆచరించిన మాత్రమే శ్రద్ధ యనంబడును ఏలన ప్రపంచకార్యములలో గూడ కొందఱు శ్రద్ధ గలిగి

ప్రవర్తింతురు అయ్యది శ్రద్ధావాక్యములలో చేరదు ఏలన వారు జేయు కార్యము శ్రద్ధతో గూడినదైనను మిథ్యాకార్యమగుట చేతను, నశించునది యగుటచేతను, సత్యమైన దైవకార్యము గాకపోవుట చేతను,అసత్యమగు మాయా ప్రపంచకార్యమగుటచేతను సత్యమునుపదేశించెడు శాస్త్రము దానిని శ్రద్ధలో చేర్చదు ఆలాగున ప్రాపంచిక విద్యలయందుగాని, యన్త్రనిర్మాణమందుగాని, సూక్ష్మవిషయమును కనిపెట్టెడు విషయములో ప్రవర్తించెడు మహాసూక్ష్మ బుద్ధిగాని బుద్ధి యనబడదు ఏలన వారు కనిపెట్టినవి అశాశ్వత వస్తువుల గురించినవే దానివలన ఆత్మశుద్ధి గలుగనందుచే అతనికి ఆత్మసుఖము గలుగుటగాని, ఆత్మశాంతి గలుగుటగాని, పరలోకసుఖము గలుగచేయుట గాని లేనందుచే దానిని బుద్ధియని పరిగణింపరు ప్రకృతిదోషరహితమై వైరాగ్యదయాదులతో గూడి బ్రహ్మనిష్ఠకు ఉపయోగపడు బుద్ధి మాత్రమే బుద్ధి యనబడును

700 ముండకోపనిషత్తునందు సంపూర్ణవిరక్తిలేనివారు దృఢముకాని పడవనెక్కి సముద్రమును దాటతలంచువారివలె నుందురని గలదు దానిని గురించి ఆలోచించిన, వారు రంధ్రముగల ఓడనెక్కి సాగరమును దాటతలంచువారివలె నుందురని అర్థమగుచున్నది ఇచ్చట శరీరము ఓడగాను, ఇంద్రియములు ద్వారములుగాను గ్రహించు కొనవచ్చును దృశ్యమే సముద్రము శరీరమే ఓడ దశేన్ద్రియములే ద్వారములు నవద్వారములు తొమ్మిది యిన్ద్రియములు స్పర్శేన్ద్రియములతో చేరినప్పడు దశేంద్రియములగును స్పర్శేంద్రియము శరీరమంతట వ్యాపించినది కావుననే సర్వేన్ద్రియని గ్రహము గలిగి యుండవలయునని యోగశాస్త్ర ముపదేశించుచున్నది ఈ యింద్రియములలో ఏ యిన్ద్రియములు నిగ్రహింపబడలేదో అన్ని రంధ్రములు మన సముద్రప్రయాణపు ఓడకు గలవని గ్రహించుకొనవలయును ఒక్క రంధ్రమయినను గలిగియుండిన తద్వారా క్రమముగా నావలోనికి జలము ప్రవేశించి సముద్రములో మునిగిపోవునటుల ఈసాధకుడు సంసారములో మునిగిపోవును (ప్లవాహ్యేతే అదృఢా యజ్ఞరూపాః)

701 గీత 17వ అధ్యాయమున ఎవరెవరి స్వభావము ఏలాగున నుండునో దానిని కనుగొనిన అట్టివారు అట్టిస్వభావము గలవారని గ్రహించుకొనవచ్చునని గలదు ఎవరు ఏ పిండివంటలు చేయుదురో, ఏ ఆహారమును వండుదురో, ఎవరితో సహవాసము చేయుదురో, ఎట్టి పుస్తకముల పఠింతురో, దానిని గనుగొనిన వారు అట్టి స్వభావముగల వారని తెలిసికొనవచ్చును ఆలాగున ప్రపంచములో ఎవరెవరు ఏయే కార్యముల గాని, అనుష్ఠానములగాని చేయుదురో, అట్టివారున్ను ఆయాస్థితిలో నుండువారని గ్రహించుకొనవచ్చును ఇందువలన వారి పరిపక్వస్థితియు నెఱుంగ వచ్చును

**సత్త్వానురూపా సర్వస్య శ్రద్ధా భవతి భారత।**
**శ్రద్ధామయోఽయం పురుషో యో యచ్ఛ్రద్ధస్స ఏవ సః॥**

702 వివేక చూడామణియందు నదిలో తేలియుండు గొప్ప మొసలిని జూచి ఇది నది దాటుటకు మంచి ప్రూనని తలంచి దానిపై ఎక్కి నదిని దాటతలంచువానివలె సంసార సుఖము ననుభవించుకొని మోక్షమును పొందవచ్చునను తలంపుగూడ నుండునని చెప్పడమైనది మొసలియొక్క స్వభావము నదిలో దిగిన వారిని పట్టి తినుట గదా! అట్లుండగా దానిపై నెక్కినవానిని అది మరల తినివేయునని వేరు చెప్పవలయునా! ఆలాగున సంసారములో నుండువారిని ఆ సంసారము భక్షించునని వేరుగా చెప్పవలయునా! అనగా సంసార సుఖము ననుభవించువానిని సంసారము భక్షించును అది అనుభవించని వారిని సంసారము రక్షించును ఇదియే దీనిలో గల మర్మము

**శరీరపోషణార్థీ సన్ య ఆత్మానం దిదృక్షతి ।**
**గ్రాహం దారుధియా ధృత్వా నదీం తర్తుం స గచ్ఛతి ॥**

703 శాస్త్రమున రాతిబండనెక్కి నదిని దాట తలంచువా డెట్టివాడో, సంసారభారమును భరించుచుకొని మోక్షము పొందవచ్చునని తలంచువాడును అట్టివాడే యని తెలుపబడినది రాయియే నీటిపై పెట్టిన

తోడనే అప్పుడే మునిగిపోవుచుండగా దానిపై నెక్కినవాడు మునుగునా యని సందేహింప పనిగలదా! ఆ రాతిబండ నీటిలో మునుగక యుండినగదా తానును మునుగకయుండును రాతిబండనెక్కి నదిని దాటు కాలమెప్పడు కలదో, అప్పడే సంసారమునుండి తరింపవచ్చునని తలంచు కొనవలసినది

704 విషయతృష్ణయొక్క బలాబలములను లేక జయాపజయములను తెలిసికొనుటకు ఒక యుపాయమును తెలిపెద విషయతృష్ణాదృష్టి వలన స్త్రీ పురుషుల పరస్పరావలోకనములో ఎవరు వశపడక యుందురో వారే తక్కిన వారిని జయించినవారు అనగా స్త్రీ యొక్క అవలోకనమునకు (చూపులకు) వశపడిన తన్ను ఆ స్త్రీ జయించియున్నట్లు పురుషుడు కనుగొనవలయును పురుషుని అవలోకనమునకు స్త్రీ వశపడినచో ఆస్త్రీ పురుషునిచే జయింపబడినటుల గ్రహించేది ఎవరు ఎవరి విషదృష్టిచే వశపడరో, అట్టివారెవరైనను వారిని జయించిన వారని ఎఱుంగవచ్చును స్త్రీ యొక్క వీక్షణమునకు పురుషుడు వశపడనిచో, ఆ స్త్రీని పురుషుడు జయించిన ట్లనుకొనవలయును ఆలాగున పురుషునియొక్క విషయదృష్టికి స్త్రీ స్వాధీనము గానిచో, ఆ పురుషుని స్త్రీ జయించనటుల నిశ్చయించుకొనవలయును ఉభయులును, పరస్పరావలోకనమలకు వశులయినచో ఇరువురును అపజయమును బడసినవారలే దీనివలన ప్రకృతిని జయించినది లేక జయించనిది తెలిసికొవచ్చును ఎట్లన కుస్తీపట్టువారు ఎవరిని జయింతురో వారే శక్తిమంతులు, తక్కినవారు శక్తిరహితులని తెలిసికొనవచ్చునుగదా! దీని వలన తనలోగల ఆత్మశక్తియు, ప్రకృతి శక్తియు తెలిసికొనవచ్చును ఈ విషయమై పాతంజలయోగశాస్త్రమున ఒక సూత్రము గలదు (వితర్క బాధనే ప్రతిపక్ష భావనమ్) తనయందు ప్రకృతిభావన గలిగినదానికి విరుద్ధమగుదైవ భావమును గలుగజేసికొనవలయును ఆలాగున ప్రతి అశుద్ధభావనకున్ను శుద్ధభావనము, పాపభావము గలిగిన పుణ్యభావమును గలుగజేసికొనినచో ప్రకాశముచే చీకటియు, అమృతముచే విషమున్ను తిరస్కరింపబడునట్లు

తన వ్రతమునకుగాని, బ్రహ్మచర్యమునకు గాని, బ్రహ్మనిష్ఠకుగాని సత్యమునకుగాని, దయకుగాని లోపము గలుగదు

705 జనులారా! ఋణము చేసి చేయు వివాహాది ఆడంబరములు గాని, దేవాలయ నిర్మాణములు గాని, మఠములు కట్టుట గాని, యితర కట్టడములుగాని ఈలాటివన్నియు సాధారణ స్త్రీలు పెండ్లిండ్లు మొదలగు కార్యములకు అన్యుల ఆభరణములను ధరించి దొంగలు ఉండు స్థలములకు వెళ్ళునట్లుండునని మరువకుడు అది సదా భయకారణముగదా! నిరాడంబరముతో ఈశ్వరుడిచ్చిన ధనముతో చేయు వివాహాదులుగాని, దేవాలయ నిర్మాణములుగాని, స్వంత గృహ కట్టడములుగాని, ఇతర కట్టడములుగాని మితమైన స్వంత నగలు వేసికొని సజ్జనులుండు ప్రదేశమునకు పెళ్ళికొఱకు వెళ్ళినట్లుండును దీనివల్ల ఏలాటి భయమున్ను లేకపోవుటయే గాక అమితమైన సంతోషముగూడ గల్గును గదా!

706 దృశ్య విషయములో తగులుకొనియుండు మనస్సును, ధ్యానమందు స్థిరముగా చేయుటకుగాని, ఈశ్వరభావములో నిలుపుటకు గాని, సంకల్పరహిత మొనర్చుటకు గాని యెంత ప్రయత్నించినను సాధ్యము గాదు ఎట్లన ఒక చెట్టుకు కట్టివేసిన పశువును ఎంత తోలినను, కఱ్ఱతో ఎంతకొట్టి తఱిమినను ఏలాగున ఆచెట్టు చుట్టును తిరుగవలసినదేగాని దూరము పోజాలదో, ఆత్రాడును విప్పివేసిన యేలాగున నిర్దిష్టస్థానమునకు తోలుకొనిపోవచ్చునో, అట్లు దృశ్యవృత్తినుండి విముక్తి నొందింపబడిన మనస్సైనచో ప్రయాసము లేకనే సంకల్పరహితముగాను, ధ్యానమందైక్యముగాను జేయవచ్చును అట్టి విముక్తి పొందిన మనస్సుగల వారికి మోక్షముగూడ లభించును పాశముతో కట్టుబడి యుండువారే పశుప్రాయులనియు, అట్టి పాశమును ఛేదించువారే సంసార పాశవిముక్తులగు ముక్తాత్ములనియు గ్రహించుకొనవలయును

707 ఎంత మలినసంస్కారమైనను, అది శుద్ధసంస్కారమువల్ల నిర్మల మగును కొన్ని కాలువలలో ఎండాకాలము జలమంతయు

మలినమైయుండును వర్షకాలపు క్రొత్తజలము వచ్చిన వెంటనే, పంకిలజలము కొట్టుకొనిపోయి శుద్ధజలమయమగుచున్నది ఆలాగున అశుద్ధ సంస్కారముగూడ శుద్ధసంస్కారముచే శుద్ధమగుచుండును అయితే జలమువలె, మానవ సంస్కారము అంతత్వరలో మారునది కాదు అది సామాన్యముగా అస్థిగతమగు దీర్ఘపురాణ వ్యాధివంటిదే కావున కొంతకాలము, ఔషథ ఆహారసేవ ఇంజక్షన్ చేయుట మొదలగు క్రియల చేతనే మారుచున్నట్లు ఇట్టి మార్పున్ను కొంతకాలము సాధనవల్లనే గలుగుచుండును వ్యాధులు ఈజన్మ ప్రభృతినుండియే వచ్చుచున్నవి సంస్కారమో, పూర్వజన్మమందుండిగాని, దానికన్న పూర్వమందుండు జన్మము నుండి గాని లేక అనేక జన్మములనుండి గాని వచ్చుచుండును కావున, కఠిన సంస్కారము మానుటకు కొంతకాలము తప్పక అనుష్ఠానము గలిగియుండవలెను కాని ఎట్టి సంస్కారమైనను, మధ్యకాలమున జేరినదగుటచే, తప్పక దానికి మార్పు గలుగును మార్పులేనిది ఆత్మ యొక్కటియే దానియొక్క స్వభావము జ్ఞానము

708 తనయొక్క స్వరూపస్థితిలో నిలుచుట కనేక ఉపాయములు శాస్త్రములలో నిరూపించడమైనది వాటిలో నన్నిటిలోను, ఈక్రింది విధముగా భావన జేయుట సులభము సాధారణముగా ఒక మనుష్యుడు గవర్నరుజనరల్‌గాని లేక ప్రధానమంత్రి యగుటగాని, లేక జడ్జి యగుటగాని, కలెక్టరు అగుటగాని, అయినచో ఆ వాక్యమెవరైన నుచ్చరించునపుడు, తానే ఆపేరు గలవాడనని యెట్లు జ్ఞాపకమునకు వచ్చునో, అట్టి అధికారము గలవాడే తానని యెట్లు జ్ఞాపకము చేసికొనునో, ఆలాగున ఇదివరలో తానెవరైనను, గురూపదేశ సంస్కారమువలనను, అనుష్ఠానము వలనను, మహావాక్యోపదేశము పొందిన అట్టిభావము ఎల్లపుడున్ను గలిగియుండును అనగా ఆత్మయే తానను బోధము మరపు గలుగక యుండును ఆత్మయందు ఈశ్వరభావము గలుగుటకు ఇంతమాత్రముకూడ ప్రయాసము లేదు ఏలన, పై జెప్పిన వారికి ఇదివరలో పేరున్ను, స్థానమున్ను ఉండలేదు అది మధ్య వచ్చినది ఆత్మయో శుద్ధమయమై, తానై, అనాది కాలమునుండి

యుంటున్నది నిజముగా అదే తనస్వరూపమై యుంటున్నదిగదా! మరచి పోయిన దానిని జ్ఞాపకమునకు తెచ్చుకొనునంత ప్రయాసమే యుండును అయితే ఒకడు నిద్రలో నుండువరకు అతని అధికారమునుగాని, పేరుగాని చెప్పి పిలిచినను అతనికి అది జ్ఞాపకము చేసికొనుటకు శక్తి యుండదు ఒకవేళ అతనిని లేపినను నిద్రామైకము బాగుగా వీడిపోవనిచో అనగా నిద్రావస్థలో నుండి బాగుగా మేల్కొననిచో, అతడు తన యవస్థను జ్ఞాపకము చేసికొనజాలడు కావున అజ్ఞానమైకము సంపూర్ణముగా వదలిపోవువఱకు మంచి తపస్స్వాధ్యాయేశ్వర ప్రణిధానములు చేయుచుండవలయును లేనిచో, చిన్నపిల్ల వారిని నిద్రలోనుండి లేపినను, బాగుగ మైకము పోవనిచో చెప్పిన మాట లేవియో, ఎట్లు జ్ఞాపకము చేయజాలరో అట్లు అనుష్ఠానముచే పరిపక్వములేని వారికి మహావాక్యము నుపదేశించినను బోధము నొందజాలరు

709 ఆత్మసంయమముచే గలిగెడు మహిమను దెలిపెద ఎవరైన మాట్లాడు నప్పుడుగాని, యుపన్యసించునపుడుగాని యేమరుపాటు గలుగక కర్ణేంద్రియమందు మనస్సును ఏకాగ్రపఱచిన మాత్రమే ఆశబ్దములన్నియు స్పష్టముగా వినుటకున్ను, అర్థమును గ్రహించుటకున్ను సాధ్యమగును ఏమరుపాటుగా నుండిన, ఆవిషయ మేలాగున సుస్పష్టము కాదో అదేరీతిగా, ఘ్రాణేంద్రియమును, జిహ్వేంద్రియమును, స్పర్శేంద్రియమును, నేత్రేంద్రియమును, ఏమరుపాటు లేక చేసి తత్తత్స్థానములలో మనస్సును సంయమ మొనర్చిన మాత్రమే తత్తద్విషయములు గోచరమగును లేనిచో కాదు కారణమేమన కర్ణమందు నాకాశతత్త్వమున్ను, స్పర్శమందు వాయుతత్త్వమున్ను, నేత్రమందు అగ్నితత్త్వమున్ను, జిహ్వయందు జలతత్త్వమున్ను, ఘ్రాణమందు పృథివీతత్త్వమున్ను గలవు అందువల్ల తత్తదంశమును గ్రహించు శక్తి గలిగినది ఆలాగున జీవాత్మయందు పరమాత్మాంశము గలదు అనగా జీవాత్మ పరమాత్మాంశమే కావున పై జెప్పిన కర్ణేంద్రియములను తత్తదంశములలో సంయమ మొనర్చుటవల్ల ఆయావిషయములెట్లు గ్రహించగలిగెనో అదేరీతిగా ఆత్మను పరమాత్మ

యందు సంయమ మొనర్చిన పరమాత్మ సంబంద జ్ఞానముకూడ గలుగును యోగులకున్ను, ఋషులకున్ను గల అప్రాకృతశక్తి యిదియే అయితే పైనుదాహరించిన కర్ణేంద్రియాదులకు ఏదైన రోగము గలిగియుండిన, సంయమమొనర్చినను సూక్ష్మశబ్దాదులెట్లు గోచరము కావో ఆలాగున ఆత్మయందుకూడ అజ్ఞానమను భవరోగ ముండిన పరమాత్మతో సంయమము చేసినను పరమాత్మ సంబందజ్ఞానము కలుగజాలదు ఇదే దీనిలో గల రహస్యము ఈ తత్త్వము ఏకాగ్రత యొనర్చి యాలోచించిన అందటికిన్ని గోచరము కాగల్గును

710 సృష్టిలో మానవుడు తప్ప, తక్కిన యేజంతువైనను స్వయముగా తన కేర్పడిన యాహారాది వస్తువులను ఆలాగున తిను స్వభావము గలిగి యున్నది మనుజుడైతే ఏయాహారములో ఏ పదార్థము కలిపిన రుచికరముగా నుండునో, ఆలాగున కలిపి తినుటకు యోగ్యత గలిగియున్నాడు అంతేగాక యే యే విదమున పక్వము చేసి తినిన ఆరోగ్యముగాను, రుచికరముగాను చేయగల్గునో, ఆలాగున పచన భేదములు కూడ మనుజుడు చేయగల్గును దీనినిబట్టి యాలోచించిన సకలప్రాణికోట్లు తమతమ స్వభావము ననుసరించియే జీవించ గలుగుననియు, తన పూర్వజన్మ కర్మననుసరించియే జీవించు చున్నవనియు, తన స్వభావమును మార్చుకొను శక్తి సృష్టిలోనే లేదనియు అర్థమగుచున్నది మనుజు డట్లు కాదు తనయొక్క పూర్వజన్మ కర్మలను, మార్పుచేయుటకున్ను, సంస్కారమును మార్చుకొనుటకున్ను, స్వభావమును సంస్కరించు కొనుటకున్ను శక్తి గలిగియున్నట్లు అర్థమగుచున్నది అయితే ఈలాగున స్వభావమును సంస్కరించుశక్తి గలిగినపుడే మానవత్వమునకు తగిన జ్ఞానము వికసించినవాడుగా గ్రహించుకొనవలయును అట్టి ఆత్మసంస్కంణముగలుగ జేయుశక్తి యేమనుజునకు కలుగలేదో, అతని యాత్మ ఇంకను మృగావస్థలోనే యున్నట్లు మనము గ్రహించుకొనవలయును

711 పామరులు తమ సంతానముల నెట్లు పెంచుదురో, పండితులు అనగా వివేకులు ఎట్లు పెంచుదురో అది తెలియందగినది పామరులు దేహసుకుమారమును దేహాలంకారము దృష్టితో మాత్రమే చూచుచుందురు పండితులు ఆత్మసంస్కారము, ఆత్మజ్ఞానము దానికి తగిన విద్య, తపస్సు, సత్యము, శాన్తి, కరుణ, విరక్తి కలిగేలాగున సదా దృష్టియుంచి పెంచుదురు దీనికి దృష్టాంతము ఋషిబిడ్డలను, కొందఱిషాహుకార్ల బిడ్డలను చూచిన తెలిసికొనవచ్చును దేహాదులు నశ్వరములు, అసత్యములు ఆత్మ శాశ్వతము, సత్యమున్ను అగును ఆత్మ శుద్ధమయిన మాత్రమే శాంతియు సౌఖ్యమున్ను గలుగును ఇది విజ్ఞులెఱుంగుదురు తక్కినవా రెఱుంగజాలరు

712 బధిరుని కర్ణమందు ఎంత సారమగు సంగీతమును గాని మంచి మాటలనుగాని పాడినను చెప్పినను ఎట్లు తెలిసికొని సంతోషించజాలడో, ఆలాగున ఎంతసుందరమైనచిత్రములనుగాని విగ్రహములనుగాని అంధునికి చూపినను ఎట్లానందింపజాలడో, అదేరీతిగా ఎంత సుగంధమైన వస్తువుగాని పుష్పముగాని యుండినను ఘ్రాణేంద్రియనష్టము కలిగినవాడు సంతోషింపజాలడో, అదేరీతిగా జిహ్వేంద్రియము చెడిన వానికి ఎంత రుచికరమగు మధురమైన పిండివంటలుగాని, ఫలములుగాని యుండినను ఏలాగున వాటిరుచి నెఱింగి ఆనందింపజాలడో విద్యలేని వాడుకూడ ఆలాగున శాస్త్రములలో గల జ్ఞానసారమును, భక్తిరసమును ఆస్వాదింపజాలక వేదాన్తార్థము నెఱుంగ నొల్లక ఆ యుపనిషత్సుఖమును పొందకనే యుండును

713 సామాన్యజనులు సకాలమున సుఖముగా భుజించెడు ఆనందమే గొప్పదిగా తలంతురు ఇది సామాన్యముగా జనులందఱికిని గలదు అందువల్ల దీనియందు గొప్పతనమేమియు లేదు దానికన్న పండితులున్ను, పరమభక్తులున్ను అనుభవించెడు శుద్ధ బ్రహ్మానందము అధికమయినది అదేరీతిగ పరమైకాంతభక్తులు, సాకారముగాను, అప్రాకృతముగాను అనుభవించెడు భగవద్రూప నేత్రానందము గొప్పది ఈ మూడు

ఆనందములకన్న యోగులు, మునులు అనుభవించెడు మనస్సంయమనానందము మిక్కలి యధికమైనది కర్ణానందమనియు, నేత్రానందమనియు, హృదయానందమనియు చెప్పెడు రహస్యమంతయు ఇదియే మఱియొక యానందమున్ను కలదు అది విషయాసక్తు లను భవించెడు విషయసుఖము ఇది తక్కిన జ్ఞానసుఖములతో చేర్చలేదు

714 మంచిసాధకుడున్ను, గొప్ప ప్రజ్ఞయును గల ఒక యుత్తమశిష్యుడు తన ఆత్మగురువును, మహాత్ముడునగు మునిసత్తముని సమీపమునకు వెళ్ళి సాష్టాంగముగ నమస్కరించి, గురువరేణ్యా! ఇంద్రియనిగ్రహము, మనోనిగ్రహము గలుగుట చాల ప్రయాసముగ నున్నదని వినయముతో తెలుపగా ఆచార్యుండు ఆత్మపుత్రుడా! సాధారణ జనుల వలన జయింపనలవిగాని రాజును యుద్ధములో జయించువాడు గదా మహా యోధుడుగా విఖ్యాతినొందును! సామాన్యులను జయించుటలో గొప్పతనమేమి గలదు? అని సెలవిచ్చిరట కావున సామాన్యులకు మనోజయమున్ను, విషయ నిగ్రహమున్ను జేయ సాధ్యము కానందుననే ప్రకృతిని జయించిన మహాపురుషులకు సర్వలోకమును జయించిన చక్రవర్తులు గూడ పాదాక్రాన్తులగుటకు, భక్తులగుటకున్ను కారణమని తలంచి పూర్వకాలపు చక్రవర్తులున్ను, మహారాజులున్ను, ఋషులకున్ను, శంకరాచార్యులకున్ను, శిష్యులగుటకున్ను, భక్తులగుటకున్ను కారణమని సెలవిచ్చిరట

715 నిష్కామ కర్మయోగము మన ఉచ్ఛ్వాస నిశ్వాసముల వలె కొంచెమైనను కాలవిలంబనము లేక నిరాటంకముగ జరుగవలయును అట్లయిన అది చాలా ఆనందముగా నుండును అట్లుగాక సకాలమున చేయనిచో శ్వాసోచ్ఛ్వాసములు సరిగా నడవని వానికష్ట మెట్లుండునో వీరిగతియు నట్టిదే, అకార్యములలో సోమరితనమునకు గాని, అలసటకుగాని, అజాగ్రత్తకుగాని అచ్చోట చోటులేదు అట్టి కర్మయోగము ఫలాపేక్ష లేక శ్రద్ధతో చేయుచు రాగా రాగా అదే జ్ఞానయోగముగా మారును

కర్మయోగమందు కొంచెము రజోగుణముండునని లోకులు చెప్పదురు కాని పరిపక్వావస్థలో అది నశించి శాంతియు, సౌఖ్యమున్ను గల్గును మామిడికాయ పచ్చిలో కొంత పులుపుండినను పక్వమగునప్పుడు అది లయించి మధురమగును గదా।

716 మనుజులు సంసారములో శాంతి పొందుట లేదని చెప్పదురు వాస్తవముగా అలాగుననే కనుపించుచున్నది శాంతికి ఉపాయమొకటి గలదు అదేమన సృష్టిని పరిశీలించుకొనిన జాలును అలాగున చేయకపోవుటయే పుత్ర, పౌత్ర, బంధుజనులతో గూడి సంసారపాశము నొక దానితో నొకటి పెనవేసుకొని చిక్కులో (బన్ధనములో) పడియుండి దుఃఖము నొందుటకు కారణము సృష్టిలోగల పశు, పక్షి, మత్స్యాది సర్వ జంతువులున్ను తమ పిల్లలు స్వయముగా అపాయములో పడిపోవక, స్వశక్తిపై జీవించువఱకు మాత్రమే దగ్గఱనుంచుకొనును స్వశక్తిపై జీవించుకొనుకాలము వచ్చునపుడు సంతతిని వదలివేయును అందుచే వాటికి సంసారదుఃఖము ఏమియు లేదు మానవుడో పుత్రులు, పుత్రికలు పెరిగినను, పౌత్ర పౌత్రికలు ఏర్పడినను సంసారాసక్తిని (మమత్వమును) విడువజాలక భవపాశముతో కట్టబడి క్లేశము నొందుచున్నాడు పుత్రులకు విద్యాబుద్ధులు చెప్పించి స్వయముగా జీవించువరకు లేక వివాహము జేయువఱకు మాత్రమే చూడవలయును పుత్రికలను అలాగున విద్యాబుద్ధులు గఱపి పెండ్లిచేసి యిచ్చువఱకు మాత్రమే ఆసక్తి నుంచుకొనవలయును ఈ సత్యమును తెలిసికొనిన సంసారములో ఏలాటి దుఃఖము గలుగదు అట్లుగాక వెదుర్లు ఒకదానితో నొకటి అల్లుకొని పెద్దగుమియై మఱియొకదాని రెమ్మలు, ముండ్లు పెనవేసియుండునట్లుండిన సంసారబన్ధము ఎప్పుడు తొలగును? వెదురుగుములవలె సంసారారణ్యము ఎల్లప్పుడును పెరుగుచునే యుండును మఱియు శాస్త్రోక్త ప్రకారము యౌవనకాలము దాటిన తల్లిదండ్రులు గూడ సంసారమాలిన్యము రహితమగుటకొఱకు ఆత్మశుద్ధియు శాంతియు గలుగుట కొఱకును, అంత్యకాలమున మోక్షము గలగుటకొఱకు వాన ప్రస్థము

నవలంబించవలయును ప్రస్తుత కాలస్థితికి ఏకాంతస్థలము తోటలు మొదలగునవి అని తలంచవలయును

717 త్రికరణశుద్ధి గలిగిన దానికి గుఱుతు మనస్సులో ఎల్లప్పుడును దైవభావము మరుపు గలుగకయు, వాక్కుతో చెప్పనవి అన్నియు పరప్రాణులకు హితముగాను, దైవప్రీతికరముగాను, సత్యముతో గూడినవిగాను, చేయు సమస్త క్రియలు లోకముయొక్క మేలుకొఱకు గాను, ఫలాపేక్ష లేనిదిగాను, ధర్మముతో గూడినదిగాను ఉండినచో మనోవాక్కాయంము లన్నియు నిర్మలములుగా నేర్పడినవని నిశ్చయించుకొనవచ్చును కావున సాదువు లెల్లప్పడును ఇట్టి స్థితి తమకు గల్గెనా యని ఆత్మలో విచారణ సల్పుచుండవలయును

718 పిల్లలకు పండ్లు పలాహారములు దొరికిన ఎంత సంతోషమో, సామాన్య స్త్రీలకు ఆభరణములు దొరికిన యెంత ఆనందమో, దరిద్రులకు లోభులకు దనము లభించిన యెంత సంతోషమో, ఆలాగున విరక్తులగు జిజ్ఞాసువులకు మంచి జ్ఞానముగల శ్లోకములుగాని, పద్యములుగాని, వచనములుగాని దొరికిన అంత ఆనందముగా నుండవలయును ఇట్టి స్థితి ముముక్షువులకు గలుగునప్పడే ఆత్మశుద్ధి గల్గిన దానికి గుఱుతుగా నుండును దానిని చదివి చింతనజేయుటయు, ఆచరించుటయు నుండవలయును అంతటితోను తృప్తినొందక దానిని పదిమంది భక్తులకు చెప్పటయు ఆచరింపజేయుటయు గూడ ఆహ్లాదకరముగా నుండవలయును అదే శుద్ధాత్ములయొక్క గుఱుతుగా నుండును

719 కర్మయోగమున్ను, జ్ఞానయోగమున్ను చాల ప్రయాసకరము లయినవి ఈ రెండున్ను సమానములే రెండింటియొక్క ఫలమున్ను ఒకటియే కర్మయోగమందు కార్యశూరత్వమున్ను, జ్ఞానయోగమందు బుద్ధి శుద్ధియు, చిత్తైకాగ్రతయు, గ్రహణశక్తియు, మనస్సంయమమున్ను గలిగి యుండవలయును కర్మయోగమునకు దేహేంద్రియముల సంయమమున్ను, జ్ఞానయోగమునకు మానసేనియముల సహనమున్ను కావలయును

కావుననే మానసేన్ద్రియముల నిగ్రహమగు శమమున్ను, దేహేన్ద్రియని గ్రహమగు దమమున్ను ఉండవలయునని శాస్త్రము విధించుచున్నది ఈ రెండు మార్గములున్ను కఠినములగుటచేతనే సామాన్యులకు భక్తియోగమున్ను, ధ్యానయోగమున్ను ఏర్పడినవి వీనియందు పైజెప్పిన రెండు యోగముల యందువలె అంత తీవ్రత లేదు తీవ్రత ప్రజ్ఞావిశేషము ఈ రెండు యోగములకు అంత అక్కఱలేదు జ్ఞానయోగము మిక్కిలి ప్రజ్ఞావంతులకు మాత్రమే సాధ్యము ఏలననగా ఈ కనబడినదంతయు కనపడకుండ చేయవలయును కనపడని దానిని కనపరచవలయును అది అంత సుసాధ్యమయిన పని కాదని విజ్ఞు లెఱుంగవలయును

720 ముముక్షువులారా! మీరు కర్మయోగపరులై, ధర్మబోధకులై యుండవలసినచో నీటిపాములవలెనుండక, త్రాచుపాములవలె నుండవలయును నీటిపాములైన పిల్లలు మొదలయినవారు రాళ్లను రువ్వుదురు త్రాచుపాము అయినచో దూరముగానే యుందురు దగ్గఱకు ఎవరును రారు అయితే త్రాచుపామువలె మీకు విషముండరాదు ఏలన మీరు నిర్విషయులై యుండవలసినవారు కార్యనిర్వహణమునకు మాత్రమే మీకు త్రాచుపాము ఆకారము మాత్రము ఉండవలసి యున్నది ఈకర్మయోగమునకు శూరులై, ధీరులై యుండినమాత్రమే సిద్ధి గల్గును అయితే మీ యాత్మధర్మమునుండి చలింపని మెలకువయు సదా గలిగియుండే లాగున చూచుకొనవలయును

721 చక్కగా వెలుగని లైట్లను సరిగా నవరించిన, సరిగా పనిచేయని ఇంజనులను రిపేరు చేసిన, తర్వాత ఎటుల శుద్ధముగా దీపము వెలుగుచుండునో, యంత్రము పనిచేయుచుండునో అలాగున సంస్కారము లేక సరియైన స్థితిలో లేని మానవుడుగూడ మంచి బ్రహ్మనిష్ఠులచే సంస్కరింపబడిన శుద్ధపరచబడిన లైట్లవలెను, యంత్రము వలెను సరిగా నుండును ఇదియే సంస్కారముచే గల్గిన పరిణామము అని జిజ్ఞాసువులు తెలిసికొనవలయును

722 సర్వేశ్వరుడిచ్చిన కాలమును వ్యర్థపరచక యేదైన సత్కర్మలు సదా చేయుచుండు వారు కాలుని అనగా యముని చూడరు అట్టి వారు యమలోకమును పొందరు స్వర్గమునే పొందుదురు వీరికి యమదర్శనము ఉండదు ఇది సామాన్యధర్మము విశేషధర్మము మఱియొకటి గలదు అదేమనగా కాలమును జయించువాడు అనగా కాలముతో కలియనివాడు కాలాతీతమగు బ్రహ్మమును పొందును కాలమనగా మూలప్రకృతి, మాయ, అవిద్య అను పేర్లు గలిగినది సర్వకాలములలోను కాలాతీతమగు ఆత్మలోను, ఆత్మభావములోను నిలకడగలవాడు కాలమున కతీతమగు జ్ఞానమును పొందును దానికి కాలమును వ్యర్థపరచక సదా చూచుచుండవలయును అట్టివానికి కాలాతీతమగు దైవస్థితిలోనే సదా నిలకడ యుండును

723 ఒక యింటిలో గాని, లేక ఆశ్రమములో గాని లేక మఠములోగాని, లేక ఒక గురుపుత్రులలోగాని లేక ఒక తల్లిబిడ్డలలోగాని యుండువారైనను పరస్పరైకమత్యము కొందఱికి ఉండుటకును, కొందఱికి లేకపోవుటకున్ను కారణము గలదు అది వారివారి ఆత్మయొక్క పరిపక్వావస్థ ననుసరించి యుండును ఎట్లన లేత సొరకాయగాని లేక లేత టెంకాయగాని జలాశయములో వేసిన అడుగునకు పోయి నిలుచును కొంత ముదిరిన కాయ అయినచో జలముయొక్క మధ్యప్రదేశములో నిలుచును బాగుగా పండి యెండినకాయ అయినచో నీటిమీద తేలుచుండును కారణమేమన ఆకాయయొక్క ఆవరణ జలాంశముకన్న కాయయందుగల జలాంశము అధికమయిన బరువుగలది అగుట చేత మునిగిపోవును అట్లుగాక కాయ ఆవరణజలాంశముతో సమానమయినచో మధ్యలో నిలుచును కాయ ఆవరణ జలాంశము కన్నకాయలోని జలాంశము తక్కువైనచో పైకి తేలిపోవును ఇదియే దీనిలో గల రహస్యము లేతకాయ భారమగుటచే మునుగుటకున్ను, ముదిరినకాయ చాలవరకు జలాంశము తగ్గియుండుటే జలమధ్యమున నుండుటకును, పండి ఎండిన కాయయందు జలాంశము లేకుండుటే పైన తేలియుండుటకును

జెప్పిన మానవులలో గల విభేదమునకు గుణభేదములే కారణమని వేదాంత శాస్త్రము తెలుపుచున్నది సత్త్వరజస్తమో విశుద్ధగుణముల భేదములచేత ఒక్కొక్కరికి పరస్పరము ఐకమత్యము గలుగక పోవుచున్నది లేత కాయలన్నియును నీటి అడుగుభాగమును జేరుచుండును ముదిరిన కాయలన్నియు నీటినడుమన నుండిపోవును పండి ఎండిపోయిన కాయలన్నియును జలముపైనే తేలుచుండును కావున ఆయా గుణములు గల వారెంతమంది అయినను వారికి వారు ఐకమత్యముతో నుందురు అట్లు కానివారు పరస్పరము మైత్రి గలిగియుండరు ఇదియే దీనిలో గల రహస్యము

724 బుద్ధియొక్క ఆవరణములున్ను, మాలిన్యములున్ను నశించి రాగా రాగా త్రికాలజ్ఞాన మేర్పడగలదు ఇది తపస్సువలనను, యోగ సాధనవలనను గల్గును దీనికొక దృష్టాంతమును తెలిపెద మీలో ఎవరైనను నిన్నటిదినము ఏమి భోజనము జేసినారో లేక నిన్నటిదినము ఏమి పని చేసినారో లేక నిన్నటిదనము ఏపారమును చదివినారో అది కొందరికి ఆలోచించిన గోచరపడును నిండా మందబుద్ధులకు మాత్రము జ్ఞాపకము లేకుండపోవచ్చును అలాగున మొన్నటిరోజునున్ను లేక రెండు మూడు రోజులు ఎక్కువకాని పై కార్యములను కొందరు తెలిసికొనగలరు కొందఱికి జ్ఞాపకము లేకుండపోవచ్చును కారణమేమన? బుద్ధి యొక్క సూక్ష్మాసూక్ష్మముల బట్టియుండును కొందరు మాఘ స్నానమును చేయువారు ఆ నెల యంతయు ప్రతిదినము యేమి దానముజేసిరో యేమేమిభుజించిరో అది యంతయు జ్ఞాపకముతో చెప్పగలరు మఱికొందఱు చాతుర్మాస్య వ్రతముగలవారు ఆ నాలుగు మాసములున్ను ప్రతిదినమున్ను ఎంతజపమొనర్చిరో, యేమేమి భుజించిరో, యేమేమి చేసిరో చెప్పగలరు కారణమేమన బుద్ధియొక్క సూక్ష్మతయే త్రికాలజ్ఞానమున్ను ఈలాగున నుండును ఇది ఆత్మశుద్ధివల్ల గలుగవలసినదే కాని మన ఆలోచనచే గలుగునది కాదు బ్రహ్మవిజ్ఞానమున్ను ఈలాగుననే గలుగవలసినదే కాని అది వేషము చేతగాని, భాషచేతగాని గలుగునది కాదు ఈసత్యమెఱింగిన

చక్కని అనుష్ఠానముచేతనే ఆత్మశుద్ధియు, త్రికాలజ్ఞానమున్ను, ఆత్మసాక్షాత్కారమున్ను గలుగవలసియున్నదని జనులు ఎఱుంగగలరు

725 మీలో చాలమందిన్ని కంపాస్ యంత్రమును చూచి యుందురు ఇది యే ప్రక్కకు త్రిప్పియుంచినను క్రమముగా దానియొక్క ముల్లు తిరిగి తిరిగి ఉత్తరదిక్కునే చూపునట్లు మీరు సత్యధర్మములతో ఏకార్యమైనను ప్రారంభించిన దానికి విఘ్నములు వచ్చినను కట్టకడకు అది సరిగానే నెరవేఱేలాగున ఈశ్వరుండు గలుగజేయును కంపాస్ అనగా గడియారము వంటి ఒక యంత్రము ఇది ఉత్తరదిక్కునే యెల్లప్పుడున్ను చూపును అనగా ఆ ముల్లు ఉత్తరదిశలోనే నిలిచిపోవును దీని సహాయము వలననే నావికులు సముద్రయానము చేయుచుందురు

726 ఒక మహాపురుషునకు ఒక భక్తుడగు శిష్యుడుండెను గురువుగారు చాల వైరాగ్యము గలవారు ఒకరోజు రాత్రి శిష్యుడు వట్టి చాపలో నిద్రపోవునపుడు మీకు తలక్రిందికి దిండు కావలయునా యని అడిగెను అయితే మీశిరస్సును దిండు రాత్రులలో భరించుచుండిన, మీ సంచారములో పగలంతయు మీశిరస్సు ఆదిండును మోయవలసి యుండునుసుమా? దీనిని జ్ఞాపకము చేసుకొనుము ఇదేరీతిగ నీవు ఎన్నెన్ని బాహ్యసుఖములను కోరుచున్నావో ఆ భారములన్నియు నీవు మరల మోయవలసి యుండునని మరువక యుండిన మీకు ప్రపంచ భారమేమియు నుండదు విరక్తులగు సన్యాసులు దృశ్యసుఖము లన్నిటిని త్యజించి నిత్యసుఖమును పొందుటకు కారణమిదియే యని తెలుసుకొనుమా! యని యుపదేశించెను

727 కర్మయోగము గృహస్థులదనియు, అది అంత ముఖ్యము గాదనియు సామాన్యులు తలంతురు అట్లు తలంచుట చాల పొరపాటు నిష్కామకర్మము ననుష్ఠించువారు బ్రహ్మచారులైనను, వానప్రస్థులైనను, సన్యాసులైనను కర్మయోగపరులనియే అర్థమగుచుండును కర్మయోగి సూర్యచంద్రాది గ్రహములవలెనుండ వలయును ఇది భక్తి, యోగ,

జ్ఞానములనెడు మూడంతస్థులు గల సౌధమునకు పునాది వంటిదగును ఇది స్థిరము లేనిచో తక్కిన మూడంతస్థులెట్లు నిలువజాలవో ఆలాగున తక్కినమూడు యోగములున్ను నిష్కామకర్మయోగ దృఢత్వము లేనిచో సుస్థిరముగ నిలువజాలవు ఇది ఉత్తమగురుకులమునుండి నేర్చుకొనవలయును సూర్యాది గ్రహములు ఏలాగున విఘడియ మొదలు అనగా త్రుటి, కలా, కాష్ఠా మొదలగు కాలము నుండి మహాకల్పము వరకు గలకాలమును తప్పక అనుసరించుచువచ్చుచున్నవో కర్మయోగియు నాలాగున వర్తించిన మాత్రమే కార్యములన్నియు చక్కగ జరుగునని మరువకూడదు ఇదియే కర్మయోగము యొక్క రహస్యము

728 శాస్త్రమర్యాద యొకటి గలదు అది తెలియని వారే శాస్త్రములో గల వాక్యములైనను ఎచ్చటెచ్చట ఏవాక్యములు చెప్పవచ్చునో ఎచ్చట నే వాక్యములు చెప్పకూడదో అది గ్రహించజాలక నేను చెప్పనది సత్యము నేను చెప్పనది ధర్మము, దానికి రహస్యమేమి యని వచించుచుందురు అది యెటువంటిదనగా దంపతులు ధర్మబద్ధముగా వివాహితులైనను, సత్యముగా ప్రవర్తించువారైనను, దంపతులు కలియుట యనునది ధర్మబద్ధ మైనదైనను, సత్యముతో కూడినదైనను, దానికి నేలాగున ప్రత్యేక రహస్యప్రదేశమేర్పడి యున్నదో ఆలాగున శాస్త్రములలో కొన్ని వాక్యములు ప్రత్యేకముగా మననము చేయవలసినవిగాను, ప్రత్యేకముగా చెప్పవలసినవిగా నుంటున్నవని ఆ శాస్త్రమర్యాద తెలియక శాస్త్రములో నుండునదిగదా! చెప్పచున్నాననిగాని, సత్యధర్మములతో కూడినది గదా! చెప్పచున్నాననిగాని, కాలసమయములు తెలియక చెప్పవారు శాస్త్రమర్యాద యెఱుగనివారలని తెలియదగినది అది యెట్టిదనగా పురుషులకు వైరాగ్యము గలుగుటకొరకు శాస్త్రములలో కొన్ని స్థలములలో స్త్రీ నిందగలదు కాని అది విరక్తులు స్వయముగా తెలుసుకొనవలసినదే గాని స్త్రీలుండు సభలలో నుపన్యసించరాదు ఆలాగున రాజులకున్ను మంత్రులకున్ను కొన్ని రాజకీయ రహస్యములు గలవు అదిన్ని ప్రత్యేకముగా చెప్పవలసినదే గాని విచ్చలవిడిగా

చెప్పవలసినది గాదు ఆలాగున దంపతులకు కొన్ని రహస్యములు కలవు అవియును ప్రత్యేకముగా చెప్పవలసియున్నవి అదేరీతిగా గురుశిష్యులకున్న కొన్ని ధర్మరహస్యములు గలవు అవియును ప్రత్యేకముగా చెప్పవలయును ఇదియే శాస్త్ర మర్యాద యగును

729 వృత్తులకు అనగా గుణములకు ఆత్మ సాక్షిగా నుండుటచే వృత్తులు (గుణములు) గలిగియుండినను, మోక్షమునకు హాని యేమియు లేదని చెప్పట యెటువంటిదనగా, హోమము చేయునపుడు అగ్నిలో నవధాన్యములు పడి దహింపకపోయినను అగ్నికి ఏలాటి హానిలేదు గదా అని చెప్పినట్లుండును అయితే ఆసంగతి యెప్పుడు తెలుసుననగా హోమమైన తరువాత ఆ భస్మము బయటపార వేసిన పిమ్మట వానకాలము వచ్చునపుడు దహించని బీజములన్నియు మొలకెత్తునపుడు గోచరమగును ఆలాగున జ్ఞానాగ్నిలో వృత్తులు (గుణములు) భస్మము కానిచో మరణానంతరము మరల పునర్జన్మమెత్తునపుడు ఈతత్త్వము గోచరము గాగలుగును వృత్తులు, సంస్కారములు, గుణములు నుండువరకు జన్మరాహిత్యము గాజాలదు

730 భక్తివిషయములోను, జ్ఞానవిషయములోను కొందరు చెప్పనపుడు సర్వభారములున్న సర్వేశ్వరునియందు ఉంచుట సులభ మార్గమనియు, అంతయు ఆత్మ భావమునే జేయుట భారమనియు దెలుపుదురు ఈ భారాభారములు సులభ, కఠినములంతయు వారివారి హృదయము ననుసరించి చెప్పదురేగాని, ఇతరుల మనోభావము ననుసరించి చెప్పనది గాదు ఎట్లన సామాన్య మనుజునకు తన శరీరమునకన్న ఏనుగు శరీరము భారముగా కనిపించుట సహజమే కాని యేనుగు దేహము దానికి భారముగా నుండదు ఎట్లన మన కాయము మనకు ఏలాగున భారముగా నుండదో, గజరాజమునకున్న తనకాయము తనకు భారముగా నుండదు గదా! ఆలాగున చిన్నదగు గృహభరణమైనను అంగము లన్నియు సరిగా లేనిచో నది భారముగానే యుండును కాని రాజ్యమును పాలించెడు భూపాలునకు అంగములన్నియు సరిగా నుండిన

ఆ రాజ్యపాలనము భారముగా కాన్పించదు అట్లే చక్రవర్తిభరణమైన సర్వాంగములున్ను సరిగా నుండిన యేలాటి రాజ్యభారమున్ను రాజ్యపాలనమునం దుండదు ఇదే భక్తి మార్గముయొక్కయు, జ్ఞానమార్గము యొక్కయు స్థితి యని గ్రహించుకొనవలయును కావున ఈలాటి భారా భారములను గురించి చెప్పనపుడు తన స్థితికి ఈలాగున నుండునని చెప్పవలసినదే కాని, లోకముయొక్క స్థితిని గురించి చెప్పటకు తనకేలాటి యధికారము లేదని బోధకులు తెలిసికొనుట మంచిది అప్పడు శాంతి గలుగును

731 నామసంకీర్తన పరులు, భజనపరులు ముఖ్యముగా నీసంగతి జ్ఞాపక ముంచుకొనవలయును ధ్యానపరులుగూడ ఇది తెలిసికొనదగినదే అదేమన కారణమగు సముద్ర జలమునుండి యేర్పడిన కార్యరూపమగు ఉప్పగడ్డ యేలాగున కారణ సముద్రముతో తగులునపుడు ఉప్ప కరిగి సాగర జలమై పోవుచున్నదో ఆలాగున జలమునుండి యేర్పడిన ఐసు అనగా మంచుగడ్డ మరల నీటితో తగులునపుడు ఎట్లు నీరై మారుచుండునో ఆలాగున కారణరూపుడగు సర్వేశ్వరునినుండి యేర్పడిన జీవాత్మ గూడ నామస్మరణ, భజన, సంకీర్తనాదులు చేయునపుడు సర్వేశ్వరునియందు తగిలిన మనస్సైనచో భగవన్మయమై మారవలయును అదియే దానికి గురుతు

732. పుస్తకములు చదువుటతోనే తృప్తినొందక మస్తకమును (హృదయమును) గూడ చదువవలయును లేనిచో సౌఖ్యము గలుగదు

733 ఆధ్యాత్మికబోధక సభలోనుండు వారెట్లుండవలయునో అది తెలియదగినది సమారాధన మొదలగు అన్నదాన సమయమున భుజించువారలు దైవభావముతోను, శాంతముతోను భుజించుటయు, ఏ పదార్థము పారవేయక భోజనము చేయుచుండిన వడ్డించువారికి ఎంత సంతోషముండునో అట్టి భోక్తలకు ఏ యే పదార్థము కావలయునని అడిగి పెట్టుచుందురో ఆలాగున దైవధర్మములను, దైవజ్ఞానములను బోధించు

వారుకూడ సభలోగల జనుల యేకాగ్రతను, విశ్వాసమును, శ్రద్దను చూచుకొనియే బోధించుటకు ప్రీతి గలిగియుందురు, అట్లుగాక భోజనము చేయువారు అన్నాది వస్తువులను అచ్చటికచ్చటికి పారవేయుచు శ్రద్ధగా భుజించనిచో వడ్డించేవారికెంత యతృప్తి గలుగునో, ఏలాగున సరిగా అన్ని వస్తువులను వడ్డించరో ధర్మబోధకుల స్థితియు నీలాగున నుండునని గ్రహించవలయును

734 12-5-47 లో చిత్తూరుజిల్లా చెంబేడు గ్రామమున శ్రీ సద్గురుస్వాముల వారిచ్చిన యుపన్యాససారము - ఇప్పటికి 20 సంవత్సరములకు పూర్వ మీ గ్రామమునకు వచ్చియుండుకాలమున జనుల దేహమును బాదించుచుండు రోగముయొక్క నివృత్తికిని, శరీరమును బాదించుచుండు దయ్యముల నివృత్తికిన్ని ఎక్కువ ప్రవర్తించుచుండు సమయమైనది ఇప్పడాలాగున గాక మనుజుల ఆత్మను బాదించుచుండు భవరోగమగు అజ్ఞాన నివారణమునకున్ను, జీవాత్మనావరించియుండు యవిద్యా (మాయ) నివారణమునకున్ను ఎక్కువ ప్రవర్తించెడు సమయమగుచున్నది ఏలన ఒకవేళ దేహారోగ్యము గలిగి జీవించినను ఒకప్పడు దీనిని వీడిపోవలసినవారై యున్నారు భవరోగమున్ను, అవిద్యయున్ను నివారణము గానిచో మరల జన్మమెత్తి జననమరణ దుఃఖములనొంద వలసి యున్నారు కావున అజ్ఞానవ్యాధి నివృత్తించిన మరల యిట్టి భవరోగము నొందవలసిన పనిలేదు మఱియు జీవించియున్నప్పటికిన్ని అవిద్యారోగనివృత్తి కానిచో బ్రతికియుండియు ఆత్మ శాంతి గలుగదు ఈ భవరోగము శాంతించిన జీవించి యున్నప్పడున్ను మరణానంతర మున్ను, శాశ్వత దైవసుఖము గలుగుచుండును మఱల ఏ కాలమందైనను ఆదైవసుఖమునకు మార్పు గలుగదు కావున ఈలాగున చేయుడమైనది దానికి ప్రారంభదశయందు గొప్పసాధన లేమియు చేయనక్కర లేదు హృదయభూమియందు దైవస్మరణ, దైవజపము, దైవధ్యానము కొంతసేపు చేయుచుండిన చాలును. అదేప్రకారము సర్వజీవరాసులయందు కరుణ యను జలముతో ఆ దైవబీజమును పోషించుకొనిన చాలును

అదేప్రకారము చేసిన ఆ బీజమంకురించి జ్ఞానవృక్షమై పరిణమించును అప్పుడిదివరలో బీజములో గల వృక్షము కనపడక యుండినను, ఏలాగున అంకురమేర్పడునో ఆలాగున జీవరూపముగానుండు ఆత్మలోనుండి దైవరూపమగు జ్ఞాన మావిర్భవించును మఱియు శ్రీ కృష్ణభగవానుడు గీతలో నిట్లుపదేశించెను ఇది ప్రతిదినమున్ను ధ్యానము చేయువారియొక్కయు, చేయనివారియొక్కయు, హృదయమున గలిగెడు మార్పుగా నుండును మీరు ప్రతిదినమున్ను మీలైటుయొక్క చిమ్నీని శుద్ధముగా తుడుచుచుండిన యేలాగున శుద్ధముగా వెలుగుచుండునో, ఆలాగున మీరు చూచుచుండు దర్పణమును నిత్యమును తుడుచుచుండిన మీముఖ మేలాగున స్పష్టముగా కనుపించునో, ఆలాగున హృదయములో వెలుగుచుండు ఆత్మయు మీకు గోచరించును ఆలాగున గ్రుడ్డులోపలనుండు పక్షి యేలాగున పరిపక్వమై గ్రుడ్డు పగులునప్పుడు గోచరమగునో అదే విధముగా హృదయములో గల యావరణము తొలగునపుడు మీయాత్మయు దర్శనమగును

ధూమేనాద్రియతే వహ్ని ర్యథాఽఽదర్శో మలేన చ ।
యథోల్బేనావృతో గర్భ స్తథా తేనేదమావృతమ్ ॥

దీని యర్థము పైన చెప్పినదే

మఱియు ఆత్మ, లేక యీశ్వరుడుండిన యేల కనుపించుట లేదని చెప్పువారిని గురించి యుపనిషత్తు ఈలాగున సుందరమ గుదృష్టాంతముతో నుపదేశించుచున్నది నువ్వులలో నూనె యుండినప్పటికిన్ని గానుగలో వేసి ఆడుటచే ఎట్లు కనుపించుచున్నదో, క్షీరములో ఘృతముండినను తఱచనిచో యేలాగున గోచరించుట లేదో, ఆలాగున భూమిలో జలమున్నప్పటికి నూయి త్రవ్వనిచో ఎట్లు నీరు దొరకుట లేదో, అదేరీతిగా అరణియందు అగ్ని గూఢమైయుండినను మథించనిచో ఎట్లు లభించుట లేదో, ఆలాగున ఈ దేహమందే ఆత్మ(ఈశ్వరుడు) ఉండినను చేయవలసిన, సత్య, ధ్యాన, తపము లొనర్చనివారికి కనుపించుట లేదు ఇదియే దీనియొక్క రహస్యము

తిలేషు తైలం దధినీవ సర్పి రాపస్స్రోతస్స్వరణీషు చాగ్నిః ।
ఏవమాత్మని గృహ్యతే-సౌ సత్యేనైనం తపసా యో-నుపశ్యతి ॥

దీని తాత్పర్యమే పైనుదాహరించబడినది

735 మీలో చాలమందిన్ని ఫోటో తీసెడు కెమేరా చూచియే యుందురు దానియొక్క పురోభాగమున నొక అద్దముండును అది మూసి వేసియే జనులను సర్దుపాటు చేయుదురు ఆ మూత తీసిన వెంటనే పురోభాగములో గల వస్తువులన్నియును, జనులు ఏరీతిగానుందురో వారిరూపములున్ను, కెమేరా లోపలగల ఛాయాకర్షణ దర్పణము ఆకర్షించును అలాగున మన మనస్సను కెమేరా యంత్రమునకు నేత్రములు పురోభాగమందుండు అద్దమువంటివి అది మూసివేసిన దృశ్యమేమియు మనస్సులోనికి ఆకర్షించదు అలాగున సామాన్యముగా దైవధ్యానము చేయువారు బహిఃప్రదేశమునగాని, అంతఃప్రదేశమునగాని కూర్చుండి ధ్యానము చేయునపుడు కనులు మూసికొని ధ్యానము చేయుటయే మంచిది లేనిచో దృశ్యవస్తువు లన్నియు హృదయమున ప్రతిఫలించునేగాని, దైవభావము మనస్సులో ప్రతిఫలించజాలదు అనగా మనస్సులో దైవభావము నిలువజాలక కన్నులో కనుపించెడు మనుష్యులో లేక వస్తువులో మాత్రమే కనుపించును ఇంద్రియములన్నిటిలోను నేత్రములకు మాత్రమే అవసరమగునపుడు మూసుకొనుటకున్ను, తెరచుటకును యీశ్వరుడు పొరను ఏర్పరచెను అయితే నేత్రములను తెరచియుండికూడ ధ్యేయాకార స్వరూపములో నిలుచుటకున్ను, దృశ్యములగు నామరూపములు కనుపడనిస్థితి కలుగునపుడున్ను అందరిలో గల ఆత్మ గోచరమగునపుడు మాత్రమే కన్నులు తెరచియుండి ధ్యానము చేయవచ్చును అంతవరకు కన్నులు మూసికొని ధ్యానముచేయుటయే మంచిది ముఖ్యముగా సభలలో ఈకార్యములో శ్రద్ధ తీసికొనుట శ్రేయస్కరము, కానిచో, వారెవరు వీరెవరు అని నామరూపములపై మనస్సు పరుగెత్తుచుండును కావుననే ఏ శాస్త్రము చదువని వారుగూడ ఏదైన దేవాలయమునకు వెళ్లి నిలుచుకొనియైన

దేవుని ధ్యానించునపుడు ఆ క్షణము నేపైన నేత్రములు మూసికొని యుండుట సృష్టిలోనే ఏర్పడినదని గ్రహించుకొన తగినది

736 ఆగష్టు 15 వ తేదికి మనకు స్వరాజ్యము రాబోవుచున్నది సుమారు 200 సంవత్సరములనుండి పరాధీనముగా నుండిన భారతదేశము స్వతన్త్రదేశ మగుచున్నది పరాధీనులై బానిసలై యుండిన భారతీయులను గురించి శ్రీ వివేకానందస్వాములవారు, శ్రీ రామతీర్థులు పలుమార్లు మనోవిచారములతో గూడిన దుఃఖభాష్పముల జడివానవలె కురిపించిరి వారేగాక భారతీయ దేశాభిమానులందరున్ను ఆలాగుననే క్లేశపడియుండిరి ఆ క్లేశావస్థ మనకు ఆగష్టు 15 వ తేదినుండి తొలగి పోవుచున్నది అయితే దీనివల్ల స్వతంత్రుల మయితిమని గర్వించవలదు హృదయ దేశములోగల ప్రకృతి గుణములనుండి, ప్రాకృత విషయములనుండి, మనోవికారములనుండి విముక్తి నొందినపుడు మాత్రమే నిజముగా స్వతంత్రులము గాగలము అంతవఱకు పరాధీనులమే భారత స్వరాజ్యమునకు కాంగ్రెస్సులో చేరిన అనేక వీరవనితలున్ను, శూర పురుషులున్ను ప్రాణధనములను కోల్పోయిరి అనేక కష్టనష్టములకు లోబడియే ఈరాజ్యమును సంపాదించగల్గిరి అట్టి వారందఱికి మనము కృతజ్ఞులై యుండవలయును అదిన్నిగాక భారతీయులగు మనము మన ఆర్యులయొక్క జీవితమును, ఉదారత్వమును ధీరత్వమును, శూరత్వమును మరువు గలుగనీయక వర్తించుటయు, పూర్వీక ఋషివర్యులను జ్ఞాపకములో నుంచి జీవించుటయు కర్తవ్యము

**లోకములన్నియున్ గడియలోన జయించినవాడ వింద్రియా**
**నీకము జిత్తమున్ గెలువనేరవు, నిన్ను నిబద్ధుజేయు నీ**
**భీకర శత్రులార్వుర బ్రభిన్నుల జేసిన బ్రాణికోటిలో**
**నీకు విరోధి లేడొకడు నేర్పువజూడుము దాన వేశ్వరా ॥**

(శ్రీమద్భాగవతము)

737 ఒకరోజు శ్రీసద్గురుస్వాములవారు విద్యావంతుడున్ను,

బుద్ధిమంతుడున్ను, విరక్తుడున్ను అగు ఒక బ్రహ్మచారిని పిలిచి "నాయనా! అద్వైత వేదాంతము మిక్కిలి జాగ్రత్త గలవానికే లభించును దానియొక్క పరమ కాష్ఠయందు గురువు, దైవముగూడ మిథ్య యని కొన్ని సల్థములలో చెప్పియుండినను అది భావనలో మాత్రమే వుండవలయును సాకారస్వరూపుడగు గురుదేవునియందున్ను, ఈశ్వరుని యందున్ను గల భక్తివిశ్వాసముల మాత్రము విడువకూడదు అలాగున తన అనుష్ఠానమునకు ఏలాటి పతనమున్ను గలుగనీయక చూచుటలోను మిక్కిలి జాగ్రత్తగల్గి యుండవలయును గురుదేవునివల్లను, ఈశ్వరుని వల్లను తనకు గలిగిన మేలు తెలియని వానికి పైజెప్పిన యిరువర్లయందును భక్తి విశ్వాసములు గలుగక వుండును అలాగున తన పవిత్ర నిష్ఠయొక్క గొప్పతనము నెరుంగనివాడున్ను ఆత్మవిశ్వాసము గలుగక యుండును నేను నిజముగ ఈమూడు కార్యముల వల్లనే యిప్పుడుండు స్థితికి రాగల్గితిని ఈ మూడువిషయములలోను నేను ఇప్పుడుకూడ ఎంతో విశ్వాసము గల్గి యుంటున్నాను" అని చెప్పిరి

738 ఒక కూరగాని, క్షీరాన్నముగాని, యితర పదార్థముగాని దానికి దగిన వస్తువులన్నియు నుండి అది చేయుటలో మంచి అనుభవము గలవాడు చక్కగ చేసిన ఎంత హృద్యమైయుండునో అలాగున సకల సుగుణ సంపన్నుడై చక్కని గురుదేవునిచే తయారుచేయబడిన శిష్యుడుండును అట్లుగాక సామగ్రి లేక వంటకార్యము లెస్సగ తెలియనివానివల్ల జేయబడిన పదార్థమేలాగున రుచికరముగ నుండదో, జను లేలాగున హర్షించరో అలాగున సుగుణములు సరిగా లేనివాడై చక్కని ఆచార్యునిచే తయారుచేయని శిష్యునియొక్క స్థితియు నుండునని తలంచదగినది

739 గత నెల 15 వ తేదీన స్వరాజ్యము వచ్చినందుకు భారతదేశమంతయు ఆబాలవృద్ధసహితముగాను, స్త్రీపురుషులున్ను అగ్రజాతినుండి అంత్యజాతివరకుగల జనులందరు మహదానందముగ ఉత్సవము, ఉపన్యాసములు, దానధర్మములు జరిపినారు వార్తాపత్రికల

ద్వారా, కరపత్రములద్వారా, పొత్తములద్వారా, ధర్మబోధలద్వారా భారతదేశము స్వాతంత్ర్య మొందినందుకున్ను, భావికాలమున, దేశమును సంరక్షించు విషయమైయిన్ని, ప్రజ్ఞావంతులనేకు లుపన్యసించిరి ఇవన్నియు మంచి శుభసూచనములే, ఒక్కడు రోగపీడితుడై యుండునపుడు రోగవిమోచనము గలిగి, విముక్తి గలిగించినవారిని గురించియు ఎంత మహదానందమును పొందుదురో అలాగున మాత్రమే జరిగినది అయితే దేనివలన రోగము గలిగినదో అకీలకమును తెలుసుకొని వర్తించిన మాత్రమే మరల ఆరోగ్యహాని గలుగకుండును ఇదే దీనిలోగల రహస్యము అనేకులు వ్రాసిన వ్యాసాదులలోను, ఉపన్యాసములలోను ఈగూఢ తత్త్వమును నిరూపించునది యరుదుగా నుంటున్నది అలాగున సకల విధ సంపత్తులతో తులతూగుచుండిన యీ భారత దేశము దేనివల్ల పరాధీనమైనదో ఆ సత్యమునే భావికాల శ్రేయః కాంక్ష గలవారికిన్ని ముఖ్యముగా యువకులకున్ను, యువతులకున్ను, అతిముఖ్యముగా బాలబాలికలన్ను తెలుపవలసిన ధర్మసూత్రమైయున్నది భారతీయులకు, భారత రాజ్యరాజులకు ఐకమత్యము లేనందుచేతనే పతనము సంభవించినదని కొందరు కొన్ని వాక్యముల తెలిపినను అది చాలదు ఇది చాలా విశాలముగా ప్రతిభారతీయుని హృదయములో నాటునట్లుగా నుపదేశింప వలయును మరియొక్క ముఖ్యకారణము గూడ కలదు అది వర్ణాశ్రధర్మములను ఆధారముచేసుకొని కొన్ని జాతులకు మాత్రమే శాస్త్రపరనమునకున్ను, అస్త్రశస్త్రములు ధరించి యుద్ధము చేయుటకును అధికారము కల్పించియుండుట శారీరకమానసిక ప్రజ్ఞల ననుసరించి సర్వజనులకును అనుగుణ కార్యములో ప్రవేశ మేర్పడవలెను అప్పుడే భారతమాతను బాధించిన పిశాచము వదలిపోవును దానితో సహా సర్వరాజులు ఒక ప్రభుత్వము క్రిందికి చేరవయును లేనిచో పూర్వమువలె బాధను మరల భారత దేశ మనుభవించవలసియున్నది సుమారు 200 సంవత్సరములనుండి యింగ్లీషువారు భారతదేశమును జయించి పాలించినదేగాక మహమ్మదుగజనీ పుణ్యభూమియగు భారతదేశమున క్రీస్తు సం 997న అడుగిడెను ఇప్పటికి 950 సం॥ల నుండి

భారతదేశము బాధపడుచునే యుండెను చిన్న చిన్న రాజులు ఒక్కొక్కరు కలహము పెంచుకొని స్వతంత్రులై యుండినందుచేతనే విదేశీయులు క్రమక్రమముగా ఒక్కొక్కరిని జయించి పాదాక్రాంతులుగా చేయగలిగిరి హిందూదేశ చరిత్రము చదివిన వారందరికిన్ని యిది విదితము స్వపరిపాలన ప్రభువులై యుండదలంచువారికి ఇది యెంతో విచారణీయాంశము

740 భక్తులారా! మీలో చాలామందిన్ని శ్రీ తిరుపతి శ్రీవేంకేశ్వర్లు వారి దర్శనంచేసియుందురు దానికి ఏడుకొండలు దాటి పోవలయును ఆ ఏడుకొండలలో ఒకటిగాని, రెడుగాని, మూడుగాని, 4,5,6 గాని దాటినను చాలదు సంపూర్ణముగా నేడుకొండలు దాటవలెను లేనిచో అరణ్యములో బడిపోయెదరు అడవిలో నెవరున్ను సహాయముండరు కట్టకడకు 6 కొండలవరకు వెళ్లినను అచట ఆగిపోయిన రాత్రులలో పులులు మొదలగు జంతువులు చంపివేయును ఏడుకొండలున్ను దాటిపోయిన మాత్రమే దేవుని దర్శనము లభించును ఆలాగున (1) శుభేచ్ఛ (2) విచారణ, (3) తనుమానస, (4) సత్త్వాపత్తి, (5) అసంసక్తి, (6) పదార్థాభావన, (7) తుర్యగ, అవల తుర్యాతీతము అను ఏడు భూమికలను దాటవలెను అదేరీతిగ యోగమార్గమునగూడ, (1) యమ, (2) నియమ, (3) ఆసన, (4) ప్రాణామాయ, (5) ప్రత్యాహార, (6) ధారణ, (7) ధ్యాన (8) సమాధులవరకు వెళ్లవలెను మధ్యయెచట నిలిచినను వియోగము గలుగును అనగా పడిపోయెదరు ఇది బాగుగా ముముక్షువులు జ్ఞాపకములో నుంచుకొని అనుష్ఠానము పూర్తిగా చేసికొనవలెను వీనిలో జ్ఞానమార్గమున సత్త్వాపత్తి వరకు గల 4 భూమికలు బహిరంగములు, ఆలాగున యోగమార్గమున ప్రాణామాయమ వరకు గల 4 అంగములున్ను బహిరంగములు, బాహ్యభూమికలు ఈ నాలుగున్ను దాటువరకు సాధకులు మంచి ప్రయత్నము గలవారై యుండవలెను అచటనుడి జారుటకు అనేక మార్గములు గలవు ఈనాలుగున్ను దాటిన అంత ప్రయాసముండదు బహుశా పతనమున్ను గూడ గలగదు ఏలన అచ్చోటనుండి బ్రహ్మానందసుఖము కొంత కొంత అనుభవమునకు వచ్చును

741 జనులారా! దైవకార్యములోను, ధర్మకార్యములోను ఎప్పుడున్ను అశ్రద్ధ గలిగి యుండవలదు మీకేదైన ఆపత్తు వచ్చినపుడు మీకు బంధువులుండిన ఏలాగున సహాయ మొనర్చెదరో, ఆలాగున మీకేదైన కష్టము గలిగిన దైవమున్ను, ధర్మమున్ను మీకు సహాయము చేయగలవు అయితే బంధువులకు తెలిపినను లేక వారు తెలిసికొనినను మాత్రమే వచ్చి సహాయము చేయగలరు దానికి కొంత ఆలస్యము కలుగవచ్చును ఇది అటువంటిది కాదు మీరు తలంచిన వెంటనే యెట్టి నిస్సహాయ ప్రదేశమందైనను తత్క్షణమే మీకు సహాయము చేయగలుగును అంతగాదు ఒకవేళ మీరు సహాయము కావలయునని తలంచక పోయినను సహాయము కలుగును ఏలనన దైవము చరాచర ప్రాణికోట్లలో నెల్లపుడున్ను చూచుచుండేవాడు ఇదే జనుల సహాయమునకన్న దైవసహాయమున్ను, ధర్మసహాయమున్ను శ్రేష్ఠమై యుండునని మరువకుడు మీరు ఒకవేళ మరచినను దైవమునకు మఱుపు అనునది లేదు దైవము మిమ్ములను మఱువడు

742 రాత్రికాలములో చీకటి దగ్గఱకు చేరకయుండవలసి యుండినను, మార్గముచక్కగ కనపడవలసి యుండినను, అన్నివస్తువులు గోచరించవలసి యుండినను, దీప మేలాగున వెలుగుచుండవలయునో ఆలాగున మానవునకు ముక్తిపదము లెస్సగ మఱువు గలుగక ప్రకాశించుచుండవలసినను, అవిద్య దగ్గఱికిచేరక యుండవలసినను, ఆత్మానాత్మ వస్తువు ఎల్లపుడు గోచరముగ నుండవలసినను సత్యదీపము తనలో ఎల్లప్పడు వెలుగుచుండవలెను దుఃఖముయొక్క లేశమైనను అత్మను సోకనీక వుండవలసిన సత్యమునుండి యేమాత్రమున్ను జారక ఉండవలయును ఇంత ప్రయాసమైన కార్యము సృష్టిలో మఱియొకటి లేదు జపము, యోగము, ధ్యానము, తపస్సు, అధ్యయనము ఇవి అన్నియు ఉండినను సత్యమొక్కటి లేనిచో సర్వావయవములున్ను, సుందరాకారమున్ను గల మనుజుడైనను ప్రాణములేని వానిగతియే సంభవించును ఇది ప్రతినిమిషమున్ను మనకు అడ్డు తగులుచునే యుండును ఈ సత్యము

సత్యవ్రతమవలంబించునప్పుడే గోచరించును కావుననే వెయ్యి అశ్వమేధముల ఫలమున్ను, సత్యమున్ను ఋషులు త్రాసులో పెట్టి చూచినప్పుడు సత్యమునకే అధిక ఫలమని చెప్పబడినది

**అశ్వమేధసహస్రం చ సత్యం చ తులయా ధృతమ్ ।**
**అశ్వమేధసహస్రాద్ధి సత్యమేవ విశిష్యతే ॥**

అని భారతము మఱియు కఠశ్రుతి చెప్పినది చూడుడు

**భయాదస్యాగ్నిస్తపతి భయాత్తపతి సూర్యః ।**
**భయాదింద్రశ్చ వాయుశ్చ మృత్యుర్ధావతి పంచమః ॥**

ఈ సత్య స్వరూపుడగు పరమేశ్వరునియొక్క భయమువలన అగ్నిహోత్రుడు దహించుచున్నాడు ఈ సత్యస్వరూపుడగు పరమేశ్వరుని యొక్క భయమువల్లనే సూర్యుడు ప్రకాశించుచున్నాడు ఇంద్రుడున్నూ, వాయువున్నూ, ఐదవవాడగు మృత్యువున్ను ఈ సత్యరూపుడగు పరమేశ్వరునియొక్క భయమువల్లనే సర్వమున్ను స్వవ్యాపార నిర్వహణమునందు నియతముగ ప్రవర్తించుచున్నది అనగా పై చెప్పిన ఐదున్నుగాక నవగ్రహములు తమతమ మార్గములను విడువక ఒక క్షణకాలమైనను ఆగక నడచుచున్నవి భూమియున్ను, చంద్రుడును, స్వస్థానములో తిరుగుటకున్ను సత్యమే ఆధారపడి యున్నది ఉపాసనలయందున్ను, స్వాధ్యాయ తపస్సుల యందున్ను, అహింసావ్రతాదు యందున్ను, అన్ని మతములలోను భేదాభిప్రాయముండినను, బౌద్ధ,జైన, క్రైస్తవ, మహమ్మదాది మతములన్నియు సత్యము ఒక్కదానిలో ఏవిధమైన మార్పులేక అందురున్ను ఒకేవిధముగానే వుంటున్నారు కావున నిర్భయత్వము గలిగి, దుఃఖముయొక్క లేశమును ఆత్మను స్పర్శింపక యుండవలసియుండిన సత్యమునుండి జారనీయక చూడవలయును దీనివల్ల మీకు భయము గలుగునని తలంచనక్కర లేదు ఈశ్వరుండు సత్యస్వరూపుడగుటవల్ల సత్యాత్ములను తప్పక రక్షించును

సత్యేన లభ్యస్తపసా హ్యేష ఆత్మా
సమ్యక్ జ్ఞానేన బ్రహ్మచర్యేణ నిత్యమ్।
అంతఃశరీరే జ్యోతిర్మయో హి శుభ్రో
యం పశ్యన్తి యతయః క్షీణదోషాః॥

ఆత్మ సత్యముచేతనే లభించును మఱియు ఈ ఆత్మ తపస్సుచేతనే సిద్ధించును మఱియు బ్రహ్మచర్యము చేతను, సమ్యక్ జ్ఞానముచేతను ఈ ఆత్మ లభ్యపడును ఈ ఆత్మ శరీరాంతర్భాగమున జ్యోతిర్మయమై ప్రకాశించుచున్నది ఈ ఆత్మ మాయాది దోషరహితమైనది రాగద్వేషములు లేని సన్యాసులు అట్టి ఆత్మను తనలో దర్శించుచున్నారు

సత్యమేవజయతి నానృతం
సత్యేన పన్థా వితతో దేవయానః।
యేనాక్రమంతి ఋషయో హ్యాప్తకామాః
యత్ర తత్ సత్యస్య పరమం నిధానమ్॥

సత్యమే జయించును అసత్యమునకు జయము లేదు సత్యముచేతనే దైవమార్గము విస్తరింపబడియున్నది ఋషులు సత్యముచేతనే దైవప్రాప్తిని పొందిరి, ఆసత్యస్వరూపస్థానమే పరమాత్మ ప్రాప్తిస్థానము సత్యమే దైవము, దైవమే సత్యము అనిముండక శ్రుతి

743 సామాన్యముగా కొందఱు ఈలాగున చెప్పదురు అదేమన "మనస్సే ప్రధానము ఎట్లు కూర్చుండిననేమి? ఇంద్రియములెట్లు ప్రవర్తించిననేమి? మనస్సు మాత్రము సరిగా నుండిన చాలును" అది సరిగాదు మనస్సు సరిగా నుండవలసిన దేహమున్ను, ఇంద్రియములున్ను సరిగా నుండవలయును అంతట ప్రతిబింబించెడు సూర్యుడు, జలమునుంచిన పాత్రలో ప్రతిబింబించవలసియుండినచో పాత్రము కదలుచుండినను దానిలో గల నీరు మలినముగా నుండినను సూర్యుడెట్లు అట్టిపాత్రలో ప్రతిబింబింప గలుగును? పాత్రలో సూర్యప్రతిబింబము స్పష్టముగా కనుపడవలసియుండిన పాత్రము చలింపకయు, జలము

నిర్మలముగా నుండిన మాత్రమే ప్రతిబింబము కనుపడును ఆలాగున నిశ్చలముగా దేహమున్ను ఇంద్రియములు చలింపకయు మనస్సు శుద్దముగా నుండినమాత్రనే అందరిలో వెలుగుచుండు ఆత్మ, లేక యీశ్వరుడు తనలోను గోచరించును అయితే పాత్రలు మాత్రము ఏ లోహముతో కూడినవైనను విరోధము లేదు చలనముమాత్రము లేక యుండిన చాలును ఆలాగున ఏ ఆకృతిగాని, యే వర్ణముగాని, పాత్రలుండిన ఏ విరోదము లేదు అదేరీతిగా మీరు ఏ జాతివారైనను, స్త్రీలైనను, ఏ ఆశ్రమమునందుండు వారైనను బాధకరమేమియు లేదు ఇంతేగాని తక్కిన విషయములలో నందరున్ను నిర్మలముగాను, నిశ్చలముగాను నుండవలయును

744 పూర్వీక ఋషులు జనులను రెండు భాగములుగా చేసియున్నారు వీరిని ప్రవృత్తి మార్గస్థులనియు, నివృత్తిమార్గస్థులనియు చెప్పదురు ప్రవృత్తి మార్గస్థులకు దేవాలయములున్ను, నివృత్తి మార్గస్థులకు ఆశ్రమములున్ను ఏర్పఱిచిరి ప్రవృత్తిమార్గ జనులు ఇంద్రియవిషయములలో రమించువారు నివృత్తిమార్గస్థులో యింద్రియాతీతమగు నాత్మలో (దైవములో) రమించువారు దేవాలయములు, భజనమందిరములు, గ్రామములోను, గ్రామసమీపములోను ఏర్పాటు చేయుటకున్ను, ఆశ్రమములు గ్రామమునకు దూరములో ఏర్పడుటకున్ను కారణమిదే ప్రాకృతులు శబ్దాది పంచేంద్రియములలో నానందించెడి వారగుటచే దేవాలయాదులలో కర్ణేంద్రియ విషయమగు మేళతాళాదులున్ను, స్పర్శేంద్రియ సుఖమగు చందన పన్నీరాదులున్ను, నేత్రేంద్రియానందమగు విగ్రహములు, పుష్పాద్యలంకారములు, ఆభరణాదులున్ను, దీపాదులున్ను ఏర్పరచుదురు రసనేంద్రియానంద కరమగు నైవేద్యాది ఫలాహారాదులున్ను, ఘ్రాణేంద్రి యానందమును గలుగజేయు ధూపాదిసుగంధాదులున్ను ఏర్పడుటకు కారణమైనది ఇచట వాక్కుతో భజనకీర్తనాదులున్ను, చేతులతో తాళాదులున్ను, పాదములతో నర్తనాదులున్ను జరుగును నివృత్తిమార్గస్థులు ఇంద్రియములనుండి యుపరతిని పొందిన వారగుటచే తమను, ఇంద్రియాతీతమగు జ్ఞేయబ్రహ్మములో రమించువారగుటచే అచ్చోట

నిశ్శబ్దమున్ను, నిశ్చలత్వమున్ను ఉండవలయునని చెప్పెడు రహస్యము కావున ఆశ్రమవాసులు పంచేంద్రియ విషయములగు శబ్ద, స్పర్శ, రూప, రస గ్రంథములలో ఏ విషయములున్ను తమ ఆశ్రమములలోగాని, మఠములలోగాని చేర్చకూడదు అప్పడే ఆశ్రమాదులు శోభించును కావుననే యచ్చోట శబ్దము చేయు పిల్లలు మొదలైనవారుండగూడదని చెప్పెడు రహస్యము అశుద్ధవిషయములనుండి శుద్ధ విషయములలోనికి జనులను నడుపుటకొరకే దేవాలయాదులున్ను, అంతఃకరణము శుద్ధమైన వారిని విశుద్ధస్థితిలోనికి తీసికొనిపోవుట కొఱకే ఆశ్రమములున్ను ఏర్పడినవను తత్త్వమును నివృత్తిమార్గస్థులు మరువకూడదు విషయప్రమత్తులగు నీచ మనస్సుగలవారిని ఆ దర్మమార్గములోనికి, దైవమార్గములోనికికూడ తీసికొని వెళ్ళవలయునను ఉద్దేశ్యముతోనే కొన్ని దేవాలయములలో వేశ్యాస్త్రీల గానన్పత్యములు కూడ ఏర్పరచిరి అయితే ఈ కాలమునకది మంచిది కాదు అదిమాత్రము అన్ని దేవాలయములలో మాత్రమే గాక ఉత్సవాదులలోగాక వివాహాది మొదలగు నన్నిటిలోను వర్జింపదగినదే అది మానవుల హృదయమును పవిత్రభావమునుండి పాడుచేయునదగుటచే ఏమాత్రమున్ను, ఎచ్చోటనున్న పనికిరాదు

**యే హి సంస్పర్శజా భోగా దుఃఖయోనయ ఏవ తే ।**
**ఆద్యన్తవన్తః కౌన్తేయ న తేషు రమతే బుధః ॥**

ఏ సుఖమైతే యింద్రియముల సంబంధముతో గలుగుచుండునో అది స్వల్పకాలముండి మఱల నశించునదియేగాక అనేక దుః ఖములనుకూడ గలుగ జేయునది కావున బుద్ధిమంతులెవరున్ను అట్టి నశ్వరమున్ను, దుఃఖ హేతువునగు దానియందు ప్రవర్తింపరు ఇదియే నిజమైన బుద్ధి శుద్ధమైన వారికి గురుతు అని శ్రీకృష్ణభగవానులు గీతయందుపదేశించిరి

## 48 వ నూతనసంవత్సరమున

## శ్రీ సద్గురుమలయాళస్వాములవారి సందేశము

745 దైవభక్తియు జీవకారుణ్యమున్ను గలిగియుండుము ఇది దైవసన్నిధికి చల్లని మార్గమని మరువకుము మనోనాశనము, వాసనాక్షయము, ఆత్మజ్ఞానోదయము గలుగువరకు మీ పని పూర్తియైనదని తలంపకుము విద్యయున్ను, తపమున్ను మానవునికి మిక్కిలి మేలు గలుగజేయును ఆత్మతో ఎంత సంబంధము గలదో అంత దేహముతోను, దైవముతో ఎంత సబందము గలదో లోకముతోను అంత సంబంధము గలదని మరువకుము ప్రతిదినమున్ను ఏదైనా యొక పుణ్యకార్యమును జేయుము ఏమియు కనుపించనిచో దారిలో గల ఒక రాతినిగాని, ముల్లునుగాని తీసివేయుము అట్టిదానిని ఒక వ్రతముగా నిత్యమున్ను తలంచుకొనుము ఏ దినము మీవల్ల ఒక ప్రాణికి మేలు గలిగెనో, ఆ దినము నీవు దైవకృపకు పాత్రుడవైనట్లు తలంచి సంతసింపుము ఏదినమైతే నీవల్ల ఒకప్రాణికి కీడు గలిగెనో, ఆ దినము దైవాజ్ఞ నతిక్రమించి ప్రవర్తించినట్లు తలంచి పశ్చాత్తాపపడుము సృష్టిలో గల ఏ మానవుడు ఎంత యున్నతగతిని పొందెనో, నిన్నును అలాగున పొందేలాగుననే యీశ్వరుండు సృష్టించినట్లు దృఢముగా నమ్ముము దైవత్వము బొందువరకు మీపని పూర్తి కాలేదని తలంచి ప్రయత్నపరుడవై యుండుము

746 వైరాగ్యముచేగాని, యోగధారణచేగాని, తపస్సుచేగాని, నిర్జనప్రదేశ నివాసముచేగాని, శరీరకృశత్వము చేసికొనినను ఆత్మజ్ఞానవిచారణచే సర్వజీవరాసులలోగల ఆత్మయు తన ఆత్మయు ఒకటే యనిగాని, లేక యంతయు యీశ్వరమయమని గాని తెలిసికొననప్పుడు పై జెప్పిన వైరాగ్యాదులన్నియు నెట్లుండుననగా? త్రాసుపాముయొక్క శిరస్సును పట్కారుచేత పట్టుకొనినట్లు మాత్రమే యుండును పట్టుకొని యుండువరకు మాత్రమే యీ విషజంతువు కరవక యుండును ఎపుడైన పట్టు వదలి పోయిన వెంటనే కాటువేయును దానియొక్క కోరలను తీసివేసిన మరల

దానిని పట్టుకొన నక్కరలేదు శరీరమంతయు ప్రాకుచుండినను అది కరవదు కావున ఆత్మజ్ఞానామృతముచే నిర్విషయము నొందిన యోగికి మఱల ప్రాపంచిక విషయ సర్పముచే భయము లేదు తక్కినవారికి వైరాగ్యము ఏకాంతవానము గల్గియుండువరకు మాత్రమేం నిర్విషయత్వముండును ఈ విషయమై గీతలో శ్రీకృష్ణభగవానుడు గూడ నిట్లే తెలిపెను

విషయా వినివర్తన్తే నిరాహారస్య దేహినః ।
రసవర్జం రసోఽప్యస్య పరం దృష్ట్వా నివర్తతే ॥

దీని యర్థము పై జెప్పినదే

747 మనుజుడు పరమార్థ విషయమునందైనను లేక ప్రాకృత విషమునందైనను ప్రవర్తించి నిర్మలముగాను, నిశ్చింతగాను, సుఖముగాను కాలము గడుపవలసియుండిన ఒక నియమములోపల, ఒక వ్రతము లోపల, ఒక నిశ్చయములోపల మనస్సు నుంచుకొనవలయును అట్లు కానిచో ఎప్పటికిని ధర్మముతో శాంతితో కాలము గడుపజాలడు ఎట్లన దీపము చలింపక యుండవలసినచో, గాలి లేని స్థలములో పెట్టవలయును అట్లు గాక నాలుగు ప్రక్కలనుండి గాలి వచ్చెడు ఇంటిలో పెట్టిన దీపమేలాగున చలింపక యుండును? కావున మనుజుడు ఒక హద్దులోపల నుండులాగున తన్ను నియమించుకొనవలయును లేనిచో ఇహములోను, పరములోను సుఖమును పొందజాలడు ఇది ధనమే ప్రధానమని తలంచువారికి సాధ్యపడదు కాని ధర్మమే ప్రధానమని తలంచు వారికిసులభ సాధ్యము మానవునికి కావలసినదేమి? ధనమున్ను, సుఖమున్ను, ఇది ధర్మముచే మాత్రమే గలుగును గాని ధనాసక్తితో ధర్మమును విడుచువానికి ఎప్పుడును కలుగదు

748 సామాన్యముగా మరణకాలమున ఆ జీవు డేగతిని పొందగల్గునో, చూచిన తెలిసికొనవచ్చును దుఃఖముతో దేహము వదలిన జీవి సామాన్యముగా నరకమునే పొందును సంతోషముతో దేహము వీడిన

స్వర్గలోకమును పొందును భగవన్నామస్మరణతోను, అమితసంతోషముతోను వెళ్లెడు జీవి ఉపాస్య దేవుడగు శివ విష్ణ్వాది దేవతల లోకమును పొందును ప్రసన్నతతోను, జ్ఞేయైకస్థితిలో బ్రహ్మభావముతో నుండిన జీవబ్రహ్మైక్యమును పొందును బ్రహ్మభావము గల్గును ఇదంతయు సామాన్యస్థితి యని గ్రహించుకొనవలయును జీవించి యుండు నప్పుడెట్టి స్థితి గల్గి యుండునో, దాని ననుసరించిన అవస్థ గలుగుటయే సత్యమగును తక్కిన దానిలో కొంత మార్పు గలుగవచ్చును

749 మనోనిగ్రహమునకు, లేక మనోజయమునకు ఒక యుపాయమును తెలిపెద మీలో ఎవరైనను ఒక గొప్ప పుస్తకమును చదువుచుండిన యీ పేజీలన్నియు ఎప్పుడు చదివి పూర్తి యగును? అనిగాని లేక ఇదంతయు చదువగలమా యని గాని మొదట సందేహము గల్గును అయితే ఎడతెగక చదువుచుండిన ఏలాగున ఒక్కొక్క పేజీని చదువుచు వచ్చిన గ్రంథమధ్యస్థమైన తర్వాత చదివిన భాగము అధికముగాను, చదువవలసిభాగము తక్కువగాను అగుచున్నప్పుడు సంతోషమెటుల గలుగుచుండునో, ఆలాగున మనోజయమునకు లేక మనస్సు శమించుటకు మొదట ప్రయాసముగా తోచినను అనుష్ఠానము చేయుచు ఒక్కొక్క దృశ్యవృత్తిని విడుచుచు రాగా రాగా అది తగ్గి తగ్గి పోవుచున్నప్పుడు సంతోషమధికరించును మరల కొంతపోయిన ఈ వృత్తిరాహిత్యము ప్రయాసము కాదని ధైర్యము గలుగును చదువుచుండువాడు గ్రంథమును పూర్తి గావించి ఆనందించునటుల నిరన్తరము పరిశ్రమము జేయువాడు మనోరాహిత్యమును, నిరతిశయానంద బ్రహ్మసుఖమును పొందగల్గును

750 ఆత్మ ద్వంద్వముల కతీతమనియు , అచలమనియు, చలనాది క్రియలన్నియు దేహేన్ద్రియ మనస్సుల స్వభావములనియు తెలిసికొనుటకు ఒక్క సులభోపాయమును తెలిపెద మీరెవ రైనను రాత్రిలో కారుచీకటిలో ఎత్తైన కిటికీ గల ఒక గదిలో నుండి ఒక లైటును చిన్నగా ఊగించుచుండిన

బైటనుండి చూచిన ఆకిటికీల కమ్ములు కర్రలు ఊగుచున్నట్లు గోచరించును అపుడాలోచించుకొనిన దీపచలనముచే నిశ్చలముగా నుండు కిటికీ కమ్ములు, కర్రలు చలించుచున్నట్లు తోచుచుండునేగాని, అవి నిశ్చలముగా నున్నట్లు ఎఱుంగగలరు మనస్సు యొక్క చలనముచే ఆత్మ చలించునటుల తోచుచున్నదే గాని ఆలాగున మనఃకల్పిత గుణములన్నియు, వృత్తులన్నియు ఆత్మలో లేవు ఆత్మనిర్వికారము, శాంతము,ఆనందము, అమృతమని సత్యము నెరుంగగలరు ఈ మనఃకల్పితములగు వృత్తిలోనికి జారక చూచుకొనడమే ప్రజ్ఞావంతులగు ఆత్మనిష్ఠుల కర్తవ్యమని మరువ కూడదు

751 సన్యాసులున్ను గృహస్థులున్ను పరస్పరబంధువులే, అన్యోన్యమిత్రులే ఇది సరిగా నుండవలసిన గృహస్థులు విరక్తులగు మానవుల దేహపోషణ చేయువలయును సన్యాసులో గృహస్థుల ఆత్మను పోషించవలయును గృహస్థులు వేదశాస్త్రములను పోషింపవలయును సన్యాసులు వేదాంతమును పోషింపవలయును గృహస్థులు స్వరాజ్యమును సంపాదించ వలయును సన్యాసులు స్వారాజ్యమును సంపాదింప వలయును గృహస్థులు ధన ధాన్యములను సంపాదింపవలయును సన్యాసులు ధ్యాన సమాధులను సంపాదించవలయును అప్పుడు సరిపోవును అత్తరి ఉభయులున్ను ధన్యజీవు లగుదురు అట్టి తరుణమున ఈలోక పరలోకములు రెండున్ను పుణ్యతమము లగును

752 ప్రాజ్ఞులారా! మీరు గొప్పదగు ఒక యింజనును చూచుకొనిన, అది చక్కగా పనిచేయవలసియుండిన దానికి స్థూలములగు గొప్పచక్రము లెన్ని గలవో, చిన్నచిన్న ఉపచక్రము లెన్నిగలవో, ఆలాగున చిన్న చిన్న గొట్టము లెన్నిగలవో, పెద్ద పెద్ద గొట్టములెన్ని గలవో, అదేరీతిగ నెన్నియో చిన్న చిన్న పెద్ద పెద్ద యంత్రావయవయుల గలిగియున్నవో, మఱియు నీరున్ను నిప్పున్ను ఏలాగున సరిగా నుంటున్నవో, యివన్నియు, మంచిస్థితిలో నుండిన మాత్రమే ఆ మిషన్ సరిగా పనిచేయు సంగతి తెలుసుకొనవచ్చును అంతేగాక అదిపెద్ద యంత్రాలయమైనచో దానిలో నెంత యంత్రసామగ్రి గల్గియుండ

వలయునో అట్టిన మాత్రమేగదా! నిర్విఘ్నముగ సకాలమున పనులు జరుగుచుండును అదేరీతిగ మీరొక గొప్ప సంస్థను నడపవలసియుండిన దానికి గల సర్వాంగములున్ను ఉండేలాగున చూచుకొనవలయును లేనిచో అట్టి కార్యములు సకాలమున చక్కగ జరుగవని గ్రహించుకొనేది అట్లు మీకు అనుకూలముగా లేని విషయమున ఊరకయుండి భగవద్ధ్యానము చేసికొని కాలము గడుపుటయే మంచిది కార్యములో ప్రవేశించి చక్కగ జరుగక క్లేశము పొందుటకన్న ముందుగానే ఊరకుండుట మంచిది గదా! ఏమియు చేయనివారు ఎన్నియో కబురులు చెప్పచుండవచ్చును కార్యము నిర్వహించువారి మాటలు మాత్రము గ్రహించుకొనిన చాలును ఆత్మశాంతికి భంగకరమగు కార్యములో ప్రవేశించి సాధకులు మనః క్లేశములను పొందకూడదు సాధ్యమైన కార్యములు చేయకయును ఉండరాదు మహనీయులందరున్ను ఈలాగుననే కాలము గడిపిరి

753 మహాశయులారా! మీ శరీరము చక్కని స్థితిలో నుండవలసియుండిన శరీరములోగల అన్ని యవయవములును ఏలాగున చక్కని స్థితిలో నుండవలయునో యోచించుకొనుడు దేహములో నెన్ని అవయవములుగలవో వాటిలో కొన్నింటినైనా లెక్కపెట్టు కొనుడు ఎన్ని పెద్ద ప్రేగులు గలవో, యెన్ని చిన్న ప్రేగులుగలవో, యెన్ని పెద్ద యెముకలు గలవో, యెన్ని చిన్న చిన్న యెముకలు గలవో యని అన్నింటిని చూచుకొనుడు ఆలాగున జలనాడులు, రక్తనాళములు, శుక్లనాడులు, శ్వాసకోశములు, నరములు, నాడులు, జ్ఞానేంద్రియములు, కర్మేంద్రియములు, పంచప్రాణములు, ఆహారనాళములు, విసర్జననాళములు, జీర్ణకోశములు, జాగ్రత్స్వప్నసుషుప్తులకు కారణములు, ఇవన్నియు చేరి 96 తత్త్వములని పంచీకరణశాస్త్రము తెల్పుచున్నది ఇదిన్ని గాక సూక్ష్మనరములు నాడులు అన్నియు చేరి 72 వేలని సాంఖ్యశాస్త్ర ముపదేశించుచున్నది ఇంకను అనేక సూక్ష్మాతిసూక్ష్మ అవయవములు గలవు ఇవన్నియు మంచి స్థితిలో నుండిన మాత్రమే శరీరకార్యములన్నియు సరిగా నడచుచుండును వీటిలో దేనికైన నొకదానికి న్యూనాధిక్యము గల్గినచో శరీరయంత్రము పని చేయజాలదు

అలాగున మీరు లోకోపకారము కొఱకుగాని, మరియొక దానికి గాని ప్రారంభించునపుడు మీశక్తియంత విశ్వాసముతో పూనుకొనువారెందరు? కాలపరిస్థితి ఏలాగున నుంటున్నది? అదంతయు జాగత్తతో పలుమారు ఆలోచించుకొనవలయును ఆత్మవిశ్వాసము గల మిత్రులతోను సంప్రతించుకొనవలయును తరువాత అన్నియు అనుకూలమని తోచినమాత్రమే యే కార్యమందైనను ప్రవేశించవలయును దానికి పెద్దవారు కొందరున్ను, సామాన్యులు కొందరున్ను, పనివార్లు కొందరున్ను అధికార్లు కొందరున్ను ఉండవలయును దేహమునకు పై చెప్పిన చిన్న పెద్దఎముకలు ఎటువంటివో యీ కార్యములకున్ను ఆలాగున చిన్న పెద్దలు కూడ నుండవయును శరీరమునకు పై చెప్పిన వన్నియు యుండినను, మూత్రద్వార, మలద్వారాల పనులు సరిగా జరుగనిచో శరీర పరిస్థితి ఎంత యపాయకరమో ఆలాగున స్థలపరిశుభ్రతయు, దానికి తగినవారున్ను ముఖ్యముగ నుండవలయును ఈ యన్నింటిలోను ఇది ప్రధానవిషయమని మరువకూడదు

754 మనస్సుకు ఏకాగ్రత లేనిచో, స్వరూప స్థితిలో నిలవకపోయినచో, ఆత్మవిస్మృతి కల్గును ఒక్క సమయమున ఆశ్రమమున ప్రార్థనామన్దిర ములో ప్రార్థనానంతరము వరుసగా కొన్ని దైవపటములకు కర్పూరహారతి యిచ్చుచుండునొక సాధువు ప్రతిదినమున్ను అన్ని పటములకున్న హారతి యిచ్చు వాడైనను, ఆదినము హారతి యిచ్చి వెంటనే మఱియొక కార్యముకొఱకు పోవలసియుండు సంకల్పము బలమై యుండినందుచే ముఖ్యమైన ఒకపటమునకు హారతి యివ్వకనే మఱియొకపటమునకు హారతి యిచ్చునది చూచి యడుగగా మఱచిపోయితినని చెప్పెను మరపు కల్గుటకు కారణమేమియై యుండునని యడుగగా, మరియొక పనిపై మనస్సు పోయినదని చెప్పెను ఈ రీతిగా మఱియొకడు భజనభక్తులకు ప్రసాదము పెట్టుచుండగా మధ్యలో నొక్కరిద్దరికి పెట్టక తక్కిన వారికి పెట్టుచుండగా ఏల మధ్యనున్న యిరువురకు పెట్టలేదని విచారించగా మఱచిపోయితినని బదులు చెప్పెను మఱుపేల

గల్గవలయునని యడుగగా తొందరతో ఇది పూర్తి చేసుకొని మఱియొక కార్యముకొఱకు వెళ్ళ వలసియుండుటచే మనస్సు దానిపైననే యుంటున్నదని బదులు చెప్పెను ఈలాగున దానిని గుఱించి వేదాంతములో "స్వకణ్ఠాభరణ విస్మృత్తి" అని చెప్పదురు ఈలాగున చాలమందికి గల్గుచుంచును కావున ఆత్మవిస్మృతి గలుగజేయు విస్తారపు పనిలో బ్రహ్మనిష్ఠులు ప్రవేశించగూడదు ఆలాటి ప్రతిబన్ధము లేని కార్యములో మాత్రమే ప్రవర్తించ వలయును ఈలాగున కొందరు స్నానానంతరము గడియారము జేబులో పెట్టియు అచ్చటచ్చట వెదకుదురు అట్లే విభూతి డబ్బియు, జపమాలయు స్నానానంతరము తనలో నుంచుకొనియు విస్మృతిగల్గి వెదకువారున్నారు కావుననే పతంజలి మహర్షి యోగ సూత్రములో ఇట్లు వచించెను "వృత్తి సారూప్యమితరత్ర" మనస్సు దృశ్యవృత్తిగ పరిణమించిన అదే రూపమై మారిపోవును అది సంసారములో పడుటని యర్థము అదే యాత్మమరుపు గల్గి దేహబుద్ధి గల్గుటకు కారణము

755 వ్యవసాయము జేయువారుగాని, పాఠశాలలో చదువువారుగాని, కాయకష్టము జేసి కృషి చేయకయు, శ్రమ నోర్చి విద్యార్థిచదువకయు, వ్యవసాయము జేయువారివలెను బాగుగా చదువువారివలె నటించుచుండిన దానియొక్క ఫలము పైరుకోత యందును, పరీక్షాకాల మందును తెలుసుకొనగలరు అదేరీతిగ కొందరు ధర్మసంస్థల యందును, గురుకులమందును జేరి శ్రమకోర్చి కార్యము సరిగా చేయక బాగుగా జేసిన వారివలె నటించుచుండిన ముక్తివిషయములో లేక అంత్యకాలములో దానియొక్క ప్రయోజనము తెలుసుకొనగలరు కావున సోమరితనమును, డాంబికమును దగ్గర జేరనీయక పారద్రోలి నిష్కపటులై చేయవలసిన కార్యము సరిగా జేసేలాగున నేర్చుకొనవలయును అట్టి వారి జీవితము ధన్యము

756 ఓ జనుడా! మీ కన్నులను దట్టముగా కట్టివేసిన నీవు చేయుపని ఎంత సుందరముగా చేయుగలవో ఆలాగున మీయాత్మను మరుగుపరచి

చేయు కార్యములున్ను ఆలాగుననే యుండునని మరువకుడు కన్ను కనపడనివాడు చిత్రించు చిత్తరువులను చూచువారు ఇతడు నేత్రములు గలవాడా? కాడా? యని గ్రహించుకొనక పోరని నీవు బాగుగ ఆలోచించుకొనుము ఈ సత్యమును ఎవ్వడు మానవుడు గ్రహించుకొనునో, అప్పటినుండియే సత్యములో జీవించగలుగును నీయంతరాత్మసాక్షిగా జాగ్రత్స్వప్న సుషుప్తులను గూడ చూచుచుండగా ఆపరమ పురుషుని కన్నులను నీవేలాగున కట్టగలవు? నిజముగ మీకర్మలన్నిటికిన్ని అతడే ఫలప్రదుడని అనుకొనుమా! అప్పడు మీకు అంతటను అన్నిటిలోను దైవదర్శనము గా గలదు అంతేగాదు మీలో సహ దైవమును దర్శింపగలరు మరువకుము దీనికి మించిన సత్యము మరియొకటి లేదని గ్రహించుకొనుము

757 కొందరికి కొన్ని రోగములకు ఇంజక్షన్ చేయుదురు ఆ ఇంజక్షన్ మందు శరీరములో నుండువరకు శరీరమందు పూర్వముండిన రోగము రాజాలదు ఆ ఇంజక్షన్‌ను గూడ కొందరికి 3 మాసములు, మరికొందరికి 6 మాసములు, ఇకకొందరికి 1 సంవత్సరము, వేరుకొందరికి 3 సంవత్సరములు ఆలాగున ఇతరులకైదు సంవత్సరముల వరకు దేహమున నిలిచియుండును అది నశించిన మరల పూర్వపు వ్యాది కనుపించును భవరోగము గూడ ఈ లాగుననే యుండును దానిని రహితమొనర్చు మీ యనుష్ఠానము ఎంతవరకు గలిగియుండునో, అంతవరకు ఆ సంసారవ్యాది తలయెత్తదు దానియొక్క లక్షణమేమన? ప్రాకృత గుణములు సంకల్పములు మీయందు జనింపవు కావుననే కొందరు అనుష్ఠానములో అజాగ్రత్త పడుటయే భవరోగమగు అవిద్య మరల పొడముటకు కారణమని మరువకుడు పూర్వవ్యాధి మరల కనుపించిన వెంటనే ఇంజక్షన్ చేసికొనేలాగున, ఎవ్వడైతే భవరోగచిహ్నమగు ప్రకృతిగుణము హృదయములో అంకురించునో, వెంటనే గురుదేవుని దగ్గరకు వెళ్లి మరల బోధనల వినుచు, అనుష్ఠానము చెప్పించుకొనుచు నుండవలయును ఇది అనుష్ఠానము యొక్క దానికి మాత్రము గాదు అధ్యయనము మొదలగు

కార్యములన్నిటిలోను ఉండునని తెలిసికొనవలయును అట్లుగానిచో గ్రుడ్డివాడు నేత్రములుగల వానివలె వీధులలో నడవ ప్రారంభించిన అపుడు కన్నుగల వాడా?కాడా? అనియైన జనులు గ్రహింపజాలక పోవుదురా? సత్య మీలాగున ప్రకాశించుచుండగా దానిని మరుగుపరపజూచుట మీలో గల అందత్వమని మరువకుడు

758 సర్వజనులలోను తనలోను గల ఆత్మ యొక్కటియే యను జ్ఞానము గలవారికిన్ని, అట్లు సర్వాత్మజ్ఞానము గలుగనివారికిన్ని గల భేదమేమన సర్వాత్మజ్ఞానము గలిగిన తన సర్వావయవములున్న తన శరీరముగా తలంచి యే యవయవములకున్న హానికలుగ జేయనట్లు అందరిని యాదరించును అట్టి జ్ఞానము గలుగనిచో బిన్న బుద్ధి గలిగి వర్తించును ద్వేషము, వాదము గలిగియుండును అదే దానికి గురుతు మఱియు భేదబుద్ధి గలిగిన వారియొక్కయు, భేదము నశించినవారి యొక్కయు, మనస్సులో ఇట్టిభావము గలిగి యుండును ఎట్లన ఒక రూపవతియు, యువతియు, అభరణములతో కూడినదియు, పాతివ్రత్య సంరక్షణ గల స్త్రీ క్రూరులున్న, దుష్టులున్న, చోరులున్న, జారులున్న గల జనమద్యమున రాత్రికాలము నివసించ వలసివచ్చినచో ఏలాగున మనశ్శాంతిని బొందక,నిద్రపట్టక వ్యాకులముతో సమయము గడుపవలసియుండునో, పై జెప్పిన సుగుణ సంపున్నురాలగు నారీమణి పవిత్రులున్న, ధర్మాత్ములున్న, సోదరులున్న నగు జనుల మద్యనుండిన ఏలాగున నిర్భయమున్న, మనశ్శాంతియున్న గలిగి సుఖముగా నిద్రించుచో, ఆలాగున ఎల్లప్పడున్న ఉండునవి గ్రహించుకొనుడు ఈ దర్మము వేదాంతులైనను, గృహస్థులైనను అందరకున్న సమానముగనే యుండును

759 సాధకులారా! సాధువులారా! మీకు దైవసందేశము కావలయునా? దానికొక రహస్యము చెప్పెద విపత్కాలములోగాని, ముఖ్యసమయములో గాని లోకములో జరుగుచుండు విషయము

గ్రహింపవలసి యుండిన రేడియో యంత్రము నేలాగున తెఱచిపెట్టి యుండెదరో ఆలాగున మీరు దైవాశయము తెలుసుకొనవలసి యుండిన మీ మనస్సను రేడియో యంత్రమును బాగుగా తెఱచి దైవముఖముగా త్రిప్పి పెట్టుడు అయితే మీ యంత్రము దైవముఖముగా తిరుగజేయునపుడు మీమనోయంత్రము చెడిపోవక యుంటున్నదా యదిన్ని మీరు బాగుగా చూచుకొనవలయును లేనిచో రేడియోయంత్రము త్రుప్పపట్టిన దైనచో అది యేలాగున శబ్దగ్రహణము చేయజాలదో ఆలాగున మీ హృదయము శుద్ధముగాను, ఏకాగ్రముగాను లేనిచో దైవాశయము మీమనోవీథులలో గూడ పోవుచున్నప్పటికిన్ని మీరు దానిని తెలుసుకొనజాలరు ఇదిన్ని జ్ఞాపకములో నుంచుకొనవలసినది

760 సోమరితనము దేహసౌఖ్యమునే సదా చూచుచుండును ఇట్టిది సోఽహం పరత్వమునకు చాలా దూరము చేయునని మరువకూడదు ఇది ప్రకాశాంధకారముల వలెనే యుండును అందకార మెప్పటికైన ప్రకాశము దగ్గరకు చేరగలదా? దీనిని బాగుగా జ్ఞాపకములో నుంచుకొనుడు

ఏపనియైనను కనీసము మూడుసారులైన చేసికొని చూడవలయును అట్లుగాక నిలుపకూడదు దానినుండి విరమింప కూడదు కావుననే మూడు సార్లు శాన్తిమంత్రము చెప్పదురు అదిన్ని గాక మూడు సార్లు దేవాలయములో తీర్థమిచ్చుటకున్ను, మూడుసార్లు నమస్కారము చేయుటకున్ను ఇదే కారణమని గ్రహించేది అట్లుగాక ఒక సారిగాని రెండుసార్లు గాని చేసికొని సరిగాకపోయినను, యే సాదనగాని ఒక సారి లేక రెండుసార్లుగాని చేసికొని కృతార్థత చెందకపోయినను విడువరాదు మూడు సార్లుతోను కొందరు విడువజాలరు వీరే ధీరులు అయితే సామాన్యముగ మూడుసార్లు తప్పక ప్రయత్నము చేయవలయును

761 నిర్మలముగాను, నిశ్చలముగాను నుండు జలపాత్రమున మాత్రమే చంద్రబింబము కనబడునేగాని, కొంచెమైన చలనముగాని,

మాలిన్యముగాని యుండిన ఎట్లు చంద్రబింబము గోచరము గాదో, ఆలాగున, మనస్సు అతి నిర్మలముగాను, ఇతర చింత లేమియు లేని స్థితిలోనున్న మాత్రమే ఆత్మభావన ఆత్మదర్శనము గలుగును, కావున ఆత్మనిష్ఠాపరులకు ఇతర చింతల కవకాశము ఏమియు నుండేలాగున నుండకూడదు జలము కొంచెమైన కదలిన ఎట్లు చంద్రబింబము బాగుగా కానుపించదో, ఆలాగున మనస్సులో కొంచెమైన చలనము కలిగిన ఆత్మభావము నిలువదు

762 బాణము చేయువాడు ఏలాగున కొంచెమైనను వంకర లేక మరిమరి చూచికొని ఋజుత్వముగా చేయుచుండునో, ఒక రేఖమాత్ర వంకరయుండిన దానిని కొలిమిలో కాల్చి వంపులేక చేయునో ఒక వెంట్రుకమాత్రమైనను దానికి వంకరయుండిన దూరము పోవగాపోవగ లక్ష్యమునుండి గజము దూరముగాను, లేక అధిక దూరముగాను అది యెట్లు పడిపోవునో, ఆలాగున సత్యమునుండి ఒక రోమమాత్రమైనను, ఋజుత్వము తప్పియుండిన మీధ్యానము లన్నియు, యోగములన్నియు, జపములన్నియు ఈశ్వర లక్ష్యములోనికి చేరక ప్రకృతిలోనికి పోయి చేరుచుండును అనగా సత్యమందు ఏకాగ్రత నిష్ఠలేనివారి చింతనము దైవదర్శనమును గాని, దైవప్రాప్తినిగాని పొందజాలదు సాధకులు ఈ విషయమున ఎంతో జాగ్రత్తవహించవలసి యున్నారు మొదటనే ఒక వెంట్రుకంత అసత్యదోషముండిన క్రమముగా అది పైకి పోగా పోగా చాల లావగును అట్టి వానిగతి లక్ష్యము తప్పిన బాణము వంటిదే యని జ్ఞాపకములో నుంచుకొనవలయును

763 జీవితమును సార్థక మొనర్చ తలంచు వాడు సమయమును (కాలమును) ఎట్లు వినియోగ పరచవలయునో, అది క్రింద తెలిపెద ఎట్లన వర్షము లేక పైర్లన్నియు మాడిపడిపోయిన సమయమున మంచి వర్షము గురిసిన జలమును కర్షకులు ఏలాగున ఒక బొట్టైన పోనీయక భద్రపరచియుంచి, పైరుకుపయోగపరచుదురో, ఆలాగున తాపత్రయముతో

తపించు జీవుడు దానినుండి విముక్తికొరకు పై చెప్పిన కృషీవలులవలె భగవంతుడొసగిన జీవితకాలమును ఒక్కక్షణమైనను వ్యర్థపరచక జాగ్రత్త గలిగి యుపయోగపరచుచుండిన మాత్రమే ఈజన్మములోనే తరించి ఆత్మశాంతిని, దైవప్రాప్తిని పొంద గలుగును ఇదే వైరాగ్యము యొక్క గుర్తుగాని సంసారమును విడచుట, సన్న్యసించుట మాత్రము కాదని సదా జ్ఞప్తిలో నుంచుకొనవలయును

764 వ్యవసాయము, తోటలు పెట్టువారు ముందుగా జలాధారమును జూచుకొని యెటుల ప్రారంభింతురో, ఆలాగుననే, భక్తులు ఏదైన మహత్తరమగు కార్యము నారంభించునప్పుడు తనపై గల దైవబలమును బాగుగా చూచుకొనియే మొదలిడవలయును అట్లు తనదైవబలమును చూడక ఆరంభించిరేని, జలానుకూల్యత చూడక పెట్టిన పైరు వలెను, తోటలవలెను నుండునని మరువకూడదు దైవానుకూల్య ముండిన తక్కిన అనుకూలములన్నియు గలుగును అదియే దీనిగుర్తు అట్లు కానిచో జలానుకూలత లేని కృషీవలునివలె సంకటపడవలసి యుందురు

765 బ్రహ్మనిష్ఠులు తమపై ఇతరులు ఏవిదమైన హీనపుమాటలు చెప్పనటుల మిక్కిలి జాగరూకతతోనే అన్ని విషయములలోను ప్రవర్తించవలయును `ఒకరు ఇద్దఱు నిర్లక్ష్యముగా చెప్ప ప్రారంబించిన మరల తమపై జనులకు గౌరవముండదని తెలిసికొనవలయును అది ముఖ్యముగా మాటలలోను, రెండవది ప్రవృత్తులలోను గలుగును ఒకవేళ కలిగినచో ఆ దోషము తనదే యని గ్రహించిన వెంటనే ఇతర పక్షమువారితో సమాధానము చేసుకొనవలయును లేనిచో మీకు గౌరవహాని గలుగునదేగాక మనో వేదనకూడ అధికరించును ఈ విషయములో తప్పిదము తమదే యని చెప్పచూ సంధిచేసుకొను విషయములో గౌరవహాని యని తలంచవలదు మరల ఆలాటి కార్యములలో దిగనీయకయు చూచుకొనుచుండవలయును కాలిలో ముల్లు గ్రుచ్చుకొనిన తీసివేయని వారెవరైన నుందురా? మరల ఆలాటి ముళ్ల

మార్గమున వెళ్ళకుండ చూచుకొనవలయును ఇదియే ప్రజ్ఞావంతుల లక్షణము అట్లు చేయకయుండువారు గ్రుచ్చుకొనిన ముల్లును తీసివేయకయు, మరల ఆలాటి ముళ్ళ మార్గమున నడుచువారివలెను ఉందురు

766 చేదుగల పదార్థము భృత్యులకు గాని, శిష్యులకుగాని, పనివర్లాకుగాని పెట్టినచో ఒకటి రెండుసార్లు సహించుకొని భుజించెదరు ఎల్లప్పడును ఆలాటి కడుంగడు చేదుగల వస్తువులనే పెట్టుచుండిన ఎట్టివారైనను సహించి తినగలరా? సంతుష్టులై యుందురా? మీలో మీరే యోచించుకొనుడు మదురపదార్థమైన ఎంత ఆనందముతో భుజించి సంతుష్టులగుదురో, ఆలాగున మీమాటలలో మాదుర్యమున్నదా, మృదుత్వమున్నదా అని మీరే యోచించుకొనవలయును ఎల్లప్పడున్ను మీరు కోపముతో కఠినముగా మాట్లాడుచుండిన శిష్యులుగాని, భృత్యులుగాని, పనివార్లుగాని సహింప జాలరని గ్రహించుకొనవలయును మాధుర్య మృదుత్వములతో మాట్లాడ నేర్చుకొనుట, గొప్పజ్ఞానులకు సహా ప్రయాసమగు కార్యము దీనియందు ఎంత జాగ్రత్త వహించినను చాలకనే పోవుచున్నది ఈ విషయములలో యోగులు గూడ అనేక సార్లు పొరబాటు గలవారగుచున్నారు మీకు ఎంత కాలమువరకు వాఙ్మాధుర్యము గలుగలేదో అంతకాలము వరకు మనశ్శాంతి, మనః ప్రసన్నత గలుగదని గ్రహించుకొనవలయును

767 శుద్ధ సువర్ణములో ఏదైన రాగి, యిత్తడి మొదలగు మలినలోహము కలిపి అమ్మచూచిన అప్పడు గాని, తరువాత గాని, యెట్లు బయటబడి బంగారముయొక్క విలువను పోగొట్టునో, ఆలాగున జనుడా! నీవు ఏలాటి లాభము నుద్దేశించియైనను లేక మరియొక్క విషయమును ఉద్దేశించియైనను సత్యములో అసత్యమునుగాని మరియొక కల్పితమునుగాని కలిపి చెప్పం జూచినను, చేయంజూచినను అది అసలు కార్యమునకే హాని కలుగజేయునని మరువకుము పై జెప్పిన కృత్యములు

ఎక్కువైనచో అది తామ్రమునకు బంగారు గిల్టు వేసినట్లే యుండునని బాగుగా తెలుసుకొనుట మరింత మంచిది గిల్టు బైటపడుటకు ఎంత కాలము పట్టునో, దీనియొక్క నిజము బయటపడుటకున్ను అంతే కాలము పట్టునని మరువకుడు

768 మానవుని బుద్ధి ముఖ్యముగా మూడు విషయములలో సదా పనిచేయుచుండును (1) స్వార్థము (స్వలాభము) స్వేన్ద్రియసుఖము ఇది కనిష్ఠమానవుని లక్షణము (2) తానాచరించి వచ్చిన దానము దేవాలయాదికార్యము సత్రము, ధర్మపారశాల, వైద్యాలయము, మొదలగునవి (3) తానెన్ని ధర్మకార్యముల నాచరించినను అవి చక్కగా జరుగుచుండినను ఆత్మశాంతి, నిర్విషయము, ఉపరతి, ప్రకృతి రహితమగు దైవసాక్షాత్కారము గలుగనిచో దానికొఱకు పరితపించుట, మొదటివాడు కనిష్ఠుడు, రెండవవాడు మధ్యముడు, మూడవవాడు ఉత్తముడు, మొదటివాడు బద్ధుడు, ఇతడు ఎన్ని ధర్మకార్యములలో ప్రవర్తించినను వాని మనస్సు మాత్రము స్వలాభ స్వసుఖములపైననే సదా పని చేయుచుండును రెండవవాడు ఎన్ని స్వంతకార్యములనుగాని, దైవకార్యములనుగాని చేయుచుండినను మనస్సు పైవానిలో స్థిరత్వము నొందక తాను ఆచరించుచు వచ్చిన ధర్మకార్యములు చక్కగా జరుగుచున్నవా యనియే మనస్సు పనిచేయుచుండును ఇతడు బ్రహ్మవిచారము గాని, తపస్సు గాని చేయువాడైనను, ధర్మకార్యములలో గల శ్రద్ధ వీనియందుండదు మూడవవాడు స్వంతకార్యములనుగాని, ధానధర్మకార్యములనుగాని చేయుచుండినను, ప్రకృతిరహితమగు శాంతినే సర్వదా కోరుచుండును దానికన్న మించిన దీత్రైలోక్యమునందు మరియొకటి లేదనియే ఆ పుణ్యాత్ముడు తలంచును ఈమూడింటిలో మీ మనస్సు ఆత్మసాక్షిగా దేనియందు పనిచేయుచున్నదో అది తెలిసికొనిన మీ ఆత్మయొక్క స్థితి తెలిసికొనవచ్చును మొదటివాడు బద్ధదశలోను, రెండవాడు ముముక్షుదశలోను, మూడవవాడు ముక్తదశలోను ఉండువారలని గ్రహించనగును ఇక నికృష్టదశ యొకటిన్ని, జీవన్ముక్త దశ మరియొకటిన్ని గలదు ఇది శాస్త్రాతీతము కావున ఆ విషయమై శాస్త్రము ఆలోచించలేదు

769 మంచి కోడెదూడ అయినను నందికేశ్వరునివలె సుందరమును, సౌష్ఠవమున్ను గల ఎద్దయినను దానిని మడకకు గాని, బండికి గాని మరుపవలసియుండిన ఏలాగున తయారైన మఱియొక ఎద్దుతో జతపఱచి మనుజుడు దారము పట్టుకొని నడిపి శిలించవలసియుండునో, ఇంకను స్వాధీనపడని కోడె అయిన ముక్కుదారము వేసికొని పట్టి నేర్పవలయునో, ఆలాగున మంచి వంశములో జన్మించినను, మంచిసుబుద్ధి గల్గియుండినను, విద్యావంతుడయినను, ఉత్తమ బ్రహ్మనిష్ఠుడగు గురువుచే సంస్కరింపబడనిచో సాధువృత్తి అలవడుటగాని, మనోనియమము గల్గి ప్రవర్తించుటగాని, కరచరణాది ఇంద్రియముల నిగ్రహముగల్గి ఋజుప్రవర్తనము గల్గుటగాని సాధ్యము కాదు కావుననే అనాదినుండి బ్రహ్మవిద్య గురుముఖమునుండి ప్రవర్తమానమై వచ్చుచున్నది కావుననే శ్రుతి యీలాగున తెలుపుచున్నది -

**యో బ్రహ్మాణం విదధాతి పూర్వం**
**యో వై వేదాంశ్చ ప్రహిణోతి తస్మై ।**
**తంహ దేవమాత్మబుద్ధిప్రకాశం**
**ముముక్షుర్వై శరణమహం ప్రపద్యే॥**

ఏ పరమాత్మ మొట్టమొదట బ్రహ్మదేవుని సృజించి వానికి వేదముల నుపదేశించెనో, అట్టిదేవుడగు ఆత్మను, బుద్ధిని ప్రకాశింపజేయునట్టి పర బ్రహ్మమును ముముక్షువగు నేను శరణుపొందుచున్నాను ఇందువల్ల గురుపరంపరగానే ఈ బ్రహ్మవిద్య వచ్చినదని తెలియందగినది ఈలాగున స్మృతియగు గీతలోను తెల్పడమైనది

**యచ్ఛ్రేయస్స్యాన్నిశ్చితం బ్రూహి తన్మే**
**శిష్యస్తేఽహం శాధి మాం త్వాం ప్రపన్నమ్ ॥**

అర్జునుడు శ్రీకృష్ణపరమాత్మను ఇట్లు ప్రార్థించెను నాకు ఏది శ్రేయస్సు గలుగజేయునో దానిని నిశ్చయించుకొని తెల్పుము నేను నీకు శిష్యుడను, శరణుపొందినవాడను కావున నన్ను సంస్కరించి కృతార్థునిగా జేయుము

ఇదే ప్రకారము ముండకోపనిషత్తునందుగూడ గలదు వెయ్యేల, శ్రుతిస్మృతులన్నియు ఈలాగుననే యుపదేశించుచున్నవి

**తద్విజ్ఞానార్థం సగురుమేవాభిగచ్ఛేత్**
**సమిత్పాణిః శ్రోత్రియం బ్రహ్మనిష్ఠమ్ ॥**

బ్రహ్మజ్ఞానమును సంపాదింప తలంపుగల జిజ్ఞాసువు సమిత్పాణియై బ్రహ్మనిష్ఠుడును, శ్రుతిసార మెఱింగినవాడును నగు గురుదేవుని గురించి వెళ్లవలయును అని తాత్పర్యము అట్లుగానిచో జాగ్రత్తయు, శ్రద్ధయు,కార్యనిర్వహణ శక్తియు, సాధువృత్తియు అలవడవు ఒక దీపస్తంభము దేవతార్చన యందుగాని, పారాయణ సభయందుగాని చందనపుష్పాక్షతాదులచే పూజింపబడి ప్రకాశించుటకు కారణమేమని తెలుసునా? అది రాతిలో మట్టిలో లోహరూపముగా నుండినది దానిని కఱిగించి మట్టి మొదలగు దానిని తొలగించి అచ్చులో పోసి తరిమెణ పెట్టిన తర్వాత దానికంత పూజ్యత గల్గినది సభలో తేజోవంతమై యుండెడు యోగ్యత గల్గెను అట్లు సంస్కారమును పొందనిచో దానికంత యోగ్యత గల్గదు అది మొదటిరూపముగా మృత్తికయందుగాని, శిలయందుగాని, లోహరూపమున గాని యుండిన పవిత్ర పూజ్యస్థలములో నుండనీయక బైట పారవేయుదురు కావున సరియగు బ్రహ్మనిష్ఠులచే సంస్కరింపబడని వానికిని, సంస్కారము పొందిన వానికిని గలిగెడు భేదమిట్లుండునని ప్రతిముముక్షువున్ను జ్ఞాపకములో నుంచుకొనిన మాత్రమే పావనులున్ను, సభాయోగ్యులున్ను గాగలరని జ్ఞప్తిలో నుంచవలయును

770 వరివిత్తనములు మొదలగునవి నారు వేసిన తరువాత కాలపక్వమనుసరించి యేలాగున నచ్చోటుననుండి తీసి దూరముగ నాటుదురో, అట్లు నాటకపోయిన యే వృక్షములున్ను పైర్లున్ను బాగుగా పెరిగి పూర్ణఫలము నివ్వజాలవో, మొదట నారు వేసిన స్థలములోనే యుండినచో ఎట్లు కృశించి పూర్ణముగా పెరిగి సంపూర్ణ ఫలమును ఇవ్వజాలవో, ఆలాగున ఎవడు గృహస్థాశ్రమములో నందరితోను గూడి మొట్టమొదట నుండినను

వైరాగ్య తరుణకాలము వచ్చునప్పుడు ఏకాంత స్థలములోనుండి బ్రహ్మనిష్ఠచేయగనిచో హృదయము వికసించి పూర్ణప్రబోధము గలిగి బ్రహ్మానందామృత ముక్తిఫలమును పొందజాలడు ఇది మొదట కొబ్బరి, నిమ్మ మొదలగు విత్తనములున్ను, వరిపైరు మొదలగు విత్తనములున్ను నారు వేయువారికి బాగుగా తెలిసిన విషయమే

771 మీలో చాలామందిన్ని పుస్తకములోగల శుద్ధాశుద్ధ అనగా తప్పొప్పుల పట్టి చూచియుందురు మొదట అశుద్ధాక్షరములను చూపిన పిమ్మటనే శుద్ధపదములను చూపుదురు దీనివల్ల నేమి తేలుచున్నదన, గురువులు శిష్యులకు మొదట తమలో గల దోషములను చూపి వానిని తొలగించేలాగున చేసినపిమ్మటనే శుద్ధానుష్ఠానములను ఉపదేశించవలయును అట్లుగాక కొందరు గురువులు శిష్యులలో గల లోపములను సవరణ చేయకనే యుపదేశము చేయుదురు ఈ పద్ధతి మంచిది కాదు ఇందువల్లనే కొన్ని సంప్రదాయములలో నున్నవారికి లోపములు గలుగుచున్నవి అట్టివారు అక్షరదోషములు గల గ్రంథములవలెనే యుందురు

772. అంతర్దృష్టియొక్కయు, బాహ్యదృష్టి యొక్కయు ప్రయోజనము త్వరలో తెలుసుకొనవచ్చును మీ రెవరైనను ఒకదారమును గాని, తీగను గాని కత్తియొక్క ముఖమగు వాడిగల భాగము చేతకోయునప్పుడున్ను, కత్తియొక్క మడిమభాగముచే కోయునప్పుడున్ను, తెగుటకున్ను, తెగకుండుటకున్ను అది ఎట్లు కారణమగుచున్నదో ఆలాగున విషయవిరక్తి గలిగి మనస్సు అంతర్ముఖము (ఉపరతి) అగునప్పుడున్ను, బహిర్ముఖముగా నుండునప్పుడున్ను గలిగెడు భేదమని తెలుసుకొన్న చాలును విరక్తియగు వాడియు, అంతర్ముఖత్వమున్ను చిత్తమున కెంత కాలమువరకు గలుగలేదో అంతవరకు హృదయములోగల సంకల్పములను, వృత్తులనెడు విషయమయమగు విషవల్లీ సమూహమును కోయజాలము

గృహస్థాశ్రమములో నుండి బంధనములో తగులుకొనక విముక్తులై

యుండవలసిన, సృష్టియొక్క రహస్యము తెలుసుకొన్న చాలును అట్టిన యీషణత్రయములో బంధమును పొందక యుండవచ్చును అదెట్లన ఆవులుగాని, కుక్కలుగాని, కోతులుగాని, కోళ్లుగాని, తమసంతానములు స్వయముగా పోషణ చేసుకొను శక్తి గలుగువరకు మాత్రమే ఆసంతతులను సంరక్షణ చేయుచుండును తరువాత సంతానముల జోలికి పోవు మానవుడు ఈ ప్రకృతి సృష్టి రహస్యము తెలుసుకొనక పోవుటవల్లనే యీ షణత్రయముచే బద్ధుడగుచున్నాడు

773 ధ్యేయాకారములో, ఈశ్వరభావములో, దైవధ్యానములో మనసు నిలకడ పొందగోరు వారికి మనోనిశ్చలత్వము గలుగుటకొర కొక్క యుపాయము తెలిపెద ఏటవాలుగా పాచిపట్టియుండు బండమీద నడుచునప్పుడు ఒక్కవేళ జారిపడిన, ఏదైన ఒక తీగనుగాని, వేరునుగాని పట్టుకొనిన యేలాగున జారపడక యుండవచ్చునో, ఆలాగున ధ్యానమునుండి మనస్సు దృశ్యవిషయములోనికి జారిపోవుచుండిన జ్ఞేయస్థితిలో నిలుచుశక్తి లేకపోయిన, సాకారమగు ఇష్టదైవరూపమునుగాని, లేక బ్రహ్మనిష్ఠుడగు గురుదేవుని యందుగాని, లేక భవసాగరము దాటిన మరియొక్కరిని గాని భావన జేసినచో మనోనిగ్రహము గలుగును ఇదేప్రకారము పిల్లవాడు ఆడుకొనుచుండు పడవలు ప్రవాహములో పడికొట్టుకొని పోవుచుండిన వాడేడ్చుచున్నప్పుడు నదీతీరములో నుండి పెద్దవారొక త్రాడును పడవలోనికి విసరివేసి యేలాగున దానిని పట్టుకొని లాగుచు నదీతీరమును చేర్చుచుందురో, అదిన్ని పై జెప్పిన విధముగా నుండును దీనికొరకే కొన్ని కొండలు ఎక్కిపోవుచుండు ప్రదేశములలో ఇనపగొలుసులు గూడ వేసి యుందురు

774 మీలో ఎవరైన కొన్ని సంస్థలుగాని, సమాజములుగాని నడుపుచున్నప్పుడు చక్కగ నడవకపోయిన మనస్సున నశాంతి గలుగునప్పుడెల్ల గొప్ప గొప్ప స్థాపనములు నడిపిన మహాపురుషులను, అనగా శ్రీ యేసుక్రీస్తు, శ్రీ మహమ్మదునబీ, శ్రీబుద్ధదేవుడు, వర్తమానకాలపు

శ్రీగాంధీగారు మొదలైనవారినిన్నీ జ్ఞాపకముచేసుకొనిన త్వరలోనే మనస్సు శాంతినొంది నిర్వహణశక్తి గలిగినదగును పై జెప్పినవారు ఎంతో సహనము కలిగి అట్టి గొప్ప కార్యము నిర్వహించినప్పుడు ఇంత చిన్న కార్యము చేయ శక్తిలేని మనము ఇక ప్రపంచములో నేమి గొప్ప కార్యము చేయగలమని భావనజేసిన జాలును మనస్సు వెంటనే స్వాధీన మగును పూర్వాధికముగా కార్యనిర్వహణశక్తి గలుగును

775 మనస్సులో జాలి గలవారు, లేక భక్తిపరవశమై మనస్సు కరిగిపోవు సమయము వచ్చునపుడు ఇదిన్నీ మనస్సుయొక్క పరిణామమే గాని ఆత్మపరిణామము గాదని, ఆత్మ నిర్వికారమైనదని భావించి జ్ఞేయములో నిలుచుటగాని, లేక కఠిన హృదయులగు ఔరంగజేబును, టిప్పుసుల్తానునుగాని, లేక ధీరుడగు శివాజీనిగాని, లేక శూరుడగు మహమ్మదు నబినిగాని భావన జేసిన మనసు దృఢత్వము నొందును శూరత్వమున్ను నిలుచును అదేరీతిగా మనస్సు ఏ కార్యమైనను జేయునప్పడు కఠినత్వము గలిగి నిర్దయత్వము నొందినప్పడు శ్రీయేసుక్రీస్తు, శ్రీ బుద్ధుడు, శ్రీనానక్ మొదలగు దయార్ద్రహృదయము గలవారిని భావన జేసిన వెంటనే మనసుయొక్క కఠిన స్వభావము పోయి దయయు, ప్రేమయు గల్గును

776 కొద్దిగ మండుచుండు పొయ్యిలో కొన్ని యెండుకట్టెలు వేసిన యేలాగున బాగుగ ప్రజ్వలించునో, అట్లుగాక కొంచెముగా వెలుగుచుండు పొయ్యిలో కొన్ని పచ్చికట్టెలు వేసిన వుండే నిప్పగూడ ఏలాగున నారిపోవునో, యాలాగున కొద్ది జ్ఞానము గలవారు మంచివిరక్తియు, బ్రహ్మనిష్ఠయు గలవారి సహవాసము జేసిన జ్ఞానము మిక్కిలి ప్రకాశించును అట్లుగాక విషయాసక్తులగు వారి మధ్యనుండిన ఇదివరలో నుండిన జ్ఞానము గూడ లోపించిపోవును

777 సంకల్పములు నశించుట లేదని చాలా మంది ముముక్షువులున్ను చెప్పచుందురు ఇట్టి సంకల్పరాహిత్యము స్వయముగా

జేసుకొనవలసినదే గాని మరెవరిచేతను సాధ్యమైన పనిగాదు దాని కొక్క యుపాయము గలదు మీలో నెవరైనను విరక్తి నవలంబించి యేకాంత ప్రదేశమందుండినచో ఎవరైనను మాట్లాడుటకు వచ్చిన, వారితో కలిసి మాట్లాడిన వారు అప్పుడప్పుడు వచ్చుచుందురు మొదటనే మాట్లాడక మౌనముగా నుండిన, లేక వారు మరియొకసారి వచ్చినను మాట్లాడక పోయిన మఱల వారుగాని, మరెవరు గాని రారు ఒకవేళ వచ్చినను పలకరింపక చూచి వెళ్లిపోవుదురు అదేరీతిగా మీరు ధ్యానములో నుండునప్పుడుగాని, యితర సమయములోగాని, యేదైన సంకల్పములు వచ్చినపుడు దానివైపు మనస్సును పోనీయక యామనస్సును ధ్యేయములోకాని, భగవత్స్మరణయందుగాని ప్రవేశపెట్టవలయును అట్టి ధ్యేయాకారమగు ధ్యానమందుగాని, దైవస్మరణయందుగాని మనసు ఎక్కువ సమయము నిలుపడము ప్రయాసము అట్టిన యితరపనుల యందుగాని, శాస్త్ర విచారణయందుగాని, భాగవత గోష్ఠియందుగాని మనసును ప్రవేశపెట్టవలయును ఇట్టి మనశ్శాంతి మీరు స్వయముగా గలుగజేసుకొనవలసినదేగాని మరి యేయుపాయమున్ను లేదు అయితే మీజప, ధ్యాన, తపస్సులచే క్రమముగా మనస్సున అట్టి యేకాగ్రతయు, నిర్మలతయు, శక్తియున్ను గలుగును

778 సృష్టిలో గల మధురములగు అరటి, సపోట, చీని, మామిడి మొదలగు ఫలము లన్నియు లేప్రాయమున చేదుగాను వగరుగానే యుండును కాని పరిపక్వస్థితిలోనికి వచ్చునప్పుడు ఎట్లు తియ్యగా మారుచుండునో, అలాగున అమృతము నొసంగెడు మోక్షముయొక్క స్థితి యుండును అనుష్ఠానకాలమున కొంత విషమస్థితి కనుపించినను కట్టకడకు అత్యధిక ఆనందముగా నుండును లేప్రాయములో ఎవరున్ను పై జెప్పిన ఫలములను భుజించరు అయినను పక్వస్థితిలోనికి వచ్చునప్పుడు ఎల్లరును కడునానందముతో భుజింతురు పై జెప్పబడిన కాయలు లేప్రాయములో నోటిలో పెట్టిన యుమ్మివేయుదురు పండినప్పుడు నోటిలో నుంచిన చాలసేపు దానియొక్క రసమును ఆస్వాదించుచునే యుందురు

పరమ ప్రీతితో భుజింతురు ఆలాగుననే మీయొక్క అనుష్ఠానకాలములో సామాన్యజనులకు మీపై ఆదరణ లేక పోయినను మీయనుష్ఠానము పూర్ణమగు నప్పడు, అమృతమయములగు మీనామములను పలుసార్లు ఎడతెగక ఉచ్చరించుచునే యుందురు అంతేగాదు, ఆ నామమును ఒక దివ్యమంత్రమునువలె జనులు సదా జపముగూడ చేయుదురు తర్వాత దానిని హృదయములో నుంచి దైవరూపముగా ధ్యానింతురు

779 ఓ సోదరుడా! నీప్రజ్ఞాశక్తిచేతను, యుక్తి సామర్థ్యముచేతను, అమాయకులను మోసము చేయతలంచినను, ధర్మకార్యములలో తప్పలెక్కలను వ్రాయజూచినను, యథార్థముగా నీయాత్మనే నీవు మోసముచేయుచుండు సంగతిని మాయామహిమచే తెలిసికొనక పోవుచున్నావు ఇది దిగ్భ్రమచే ఉత్తరదిక్కునకు పోవలసినవాడు దక్షిణదిక్కునకు వెళ్ళుచున్నట్లుండును మీమనస్సుయొక్క మార్గమున ప్రయాణము చేయుచుండుటచే మీకు కట్టకడకు దుఃఖమే గల్గును మొదట నీవు తెలుసుకొనకపోయినను, తర్వాత ఈ రహస్యమును తప్పక ఎఱుంగ గలవు అప్పడు నీకెవరును సహాయము చేయువారుండరు దీనిని జ్ఞాపక ముంచుకొనుము ఇచ్చట మాత్రము దుఃఖముగాదు, పరమందుకూడ శాంతి గలుగదు మీ దుఃఖరోదనమును గాంచిన యెట్టి కరుణ గలవారికి గూడ మీకు సహాయము జేయ తలంపు గలుగదు కర్మయొక్క రహస్యమీలాగుననే యుండును ఇక నీకు పశ్చాత్తాపము గల్గి కరుణామయుండగు సర్వేశ్వరుని ప్రార్థించుట ఒక్కటియే శరణ్యము

780 తీవ్రనిష్ఠ గలవారికి మోక్షము దగ్గరలోనే యున్నది మీలో ఎవరైన అతివేగముగ పోవుచుండు విమానములోనుండి చూచిన గొప్ప గొప్ప నదులు దాటిపోవునపుడు ఆ మహానదులుగూడ చిన్న చిన్న కాలువలవలె కానుపించును అంతేకాదు, సముద్రములు కూడ చిన్న చిన్న నదులవలె గోచరించును సామాన్యమైన పడవలో పోవుచుండిన ఆ నదులే విశాలమైనవిగాను, సముద్రములే అపారపారావారములైనవిగాను తోచును

ఆలాగున విషయవిరక్తిగల్గి తీవ్రనిష్ఠగలారికి ఈ సంసార ప్రవాహములు గాని, కట్టకడకు సంసార మాయాసాగరముగాని అతి స్వల్పముగానే కనుపించును విరక్తిలేని వారికిన్ని , తీవ్రనిష్ఠలేని వారికిన్ని ఈ సంసారము మహాసాగరము వలెనే కనుపించడమే గాక దీనిని దాటగలమా యని కూడ తోచును అయితే విమానములో ప్రయాణము చేయువారు అరుదుగా నుందురు అతివేగముగ వెళ్లెడు మోటారు కారులోగాని, ఎక్స్‌ప్రెస్ మెయిలు లోగాని వెళ్ళువారికి మైలురాళ్ళు దగ్గరదగ్గరగనే యున్నట్లు కనుపించును జబ్బుగలవాడు, నడవశక్తిలేనివాడు, ఎండలో ప్రయాణము చేయుచుండిన ఒక్కొక్క ఫర్లాంగు రాయికూడ ఎన్నియో మైళ్ళదూరమున నున్నట్లు తోచును మోక్షమార్గ ప్రయాణమున్ను ఈలాగుననే వైరాగ్యము గలవారికిని, లేనివారికిని ఉండునని తెలుసుకొనదగినది

## 1949వ నూతన సంవత్సర సందేశము.

781 సత్యాన్వేషణ స్వభావముగల జిజ్ఞాసువొకడు శ్రీసద్గురు మలయాళస్వాములవారిని నూతన సంవత్సర సందేశము నడిగెను

1 ప్రశ్న॥ స్వామీ! తమకు ఈ ప్రపంచములో ప్రీతి గలుగజేయున దెద్ది?

ఉత్తరము॥ ఆత్మకన్యమయినది మఱియొకటుండిన గదా ప్రీతి గలుగుటకున్ను ద్వేషించుటకున్ను ఉండును అయినను విద్యాతపస్సుల యందు ఎక్కువ ప్రీతి గలదు

2 ప్రశ్న॥ మీ జీవితములో మీరు ఏమి చేసినందుచే ఎక్కువ సంతోషించుచున్నారు?

ఉత్తరము॥ నాకు కొద్ది విద్యగాని, తపస్సుగాని, ఈశ్వరవిశ్వాసముగాని వాటిచే గలిగెడు జ్ఞానముగాని గొప్పసంగతి కాదు, ఈశ్వరుడొసంగిన జీవితములో కొంచెము కాలమైనను వ్యర్థముచేయకయు, ఆలాగున ఈశ్వరుడిచ్చిన డబ్బునుంచి ఒక పైసాయైనను వ్యర్థఖర్చు చేయకయు,

అలాగుననే సర్వేశ్వరుడనుగ్రహించిన భోజన పదార్థములను జీవించుటకన్న అధికముగా తినకయు, కాలము దైవవిషయములోను, దైవమును జనులు పొందెడు మార్గమును బోధించుటలోను, గడుపుచుండుటవలన కలిగెడు సంతోషమే నన్ను ఎల్లప్పుడును ఆనందభరితునిగా జేయుచున్నది

3 ప్రశ్న॥ జనులెటుల వర్తించిన మీకు ప్రీతి గలుగును?

ఉత్తరము॥ జనులు విద్యను చదివినను, తపస్సు జేసినను, భక్తిగలిగి యుండినను, జ్ఞానముండినను ఇవి యేమియు గొప్పగా తోచవు నిష్కళంక హృదయులై యుండుటకంటె గొప్పదిగా నాకు ఎద్దియు కనుపించుట లేదు ఇదొకటి మాత్రమే వారిని నిర్వాణపదములోనికి, నిరతిశయ సుఖములోనికి, మోక్షములోనికి గొనిపోవును

782 ఆత్మశుద్ధమైన దానికి గురుతు తెలిపెద సత్యధర్మములయందు ప్రవర్తించిన, దానివలన గలిగెడు కష్టములన్నియు సుఖముగా ఎప్పడు తోచునో అట్లే అసత్యాధర్మములచే గలిగెడు సుఖములన్నియు దుఃఖములుగా నెప్పడు ఆత్మలో బాధను గలుగజేయునో, అప్పడే నీవు శుద్ధాత్ముడైనట్లు తెలిసికొనుము ఈలాటి సంఘటనలో హరిశ్చంద్రునియొక్కయు, యేసుక్రీస్తు యొక్కయు జీవితములోనికి మనస్సును త్రిప్పిచూడుము ఆలాగున దుర్యోధన ధర్మరాజాదులయొక్కయు జీవితమును గురించి ఆలోచించుకొనుము అప్పడు నీకు పరమ శాంతియు, అమితానందమున్ను గల్గును

783 ప్రపంచదృష్టికిన్ని జ్ఞానదృష్టికిన్ని అంధకార ప్రకాశములకువలె భేదము గలదు ప్రాపంచికులకు బాహ్యేంద్రియ సౌఖ్యములే పరమసౌఖ్యములుగా తోచును అయితే జ్ఞానదృష్టిగలవారికి ఇంద్రియాతీత ఆత్మసుఖమునకు మించినది లేదను అనుభవము గలిగియుండును జ్ఞాని యెల్లప్పడును ఆత్మసుఖమునే కోరుచుండును అజ్ఞాని నిరంతరము ఇంద్రియసౌఖ్యముకొరకే పనిచేయుచుండును

784 సంస్కృత విద్యనభ్యసించుచుండు సోదరులారా! మీరు విద్యావిద్యలను రెడు ప్రవాహముల మధ్యనుండు అతిసూక్ష్మ మయిన యొక కట్టమీద పోవుచున్నారు అనగా మురికి నీటియొక్కయు, శుద్ధజలముయొక్కయు నడుమనుండు సన్నని గట్టుమీద ప్రయాణము జేయువారివలె నుంటున్నారు దీనినే వామదక్షిణమార్గములని శాస్త్రములలో పేర్కొని యున్నారు వామమార్గమునకైన లేక దక్షిణమార్గమునకైనా జారిపడిపోవచ్చును అది విద్యామార్గమయినచో అమృతత్వమును, అవిద్యా మార్గమయినచో మృత్యువునున్ను పొందగలరు "విద్యయాఽ మృత మశ్నుతే" అని వచించుటకు కారణమిదే

785 సంస్కృతమనగా సంస్కరింపబడినదని యర్థము ఆలాగున సంస్కృతము చదువువారందరును తమ యాత్మను సంస్కరించుకొన వలయును అప్పడే సంస్కృతము చదివిన వారగుదురు అనగా ఆత్మలోనుండి ప్రకృతిని వేరువరచి ఆత్మను ప్రకృతిరహితముగా జేసికొనవలయును ఇది సంస్కృత మొక్కదానికి మాత్రము గాదు విద్యాభ్యానము చేయువారందఱును అవిద్యను రహితమొనర్చు కొనవలయును అట్టిది విద్య యనబడును లేనిచో అవిద్యయే యగును ఆలాగున తపస్సు జేయువారుగూడ జ్ఞాపకము నుంచుకొనక పోయిన తపస్సు తమస్సే యగును అదే తీరున యోగవరులున్ను యోచించు కొనవలయును లేకపోయిన యోగము వియోగమునే పొందునని మరువకూడదు అట్లే జ్ఞానులున్ను భక్తులున్ను ఉందురని మరువకూడదు జ్ఞానము అజ్ఞానము గాను, భక్తి భుక్తి కొఱకు మాత్రము మారుచుండునని గ్రహించుకొనుడు

786 పుణ్యకర్మలు గూడ జ్ఞానప్రాప్తికి ప్రతిబంధకమని కొందఱు తెలుపుదురు సకామమయినచో యొక వేళ ఆలాగున నుండవచ్చును గాని నిష్కామమయినచో గాలిచే అగ్ని ప్రజ్వలించునటుల కర్మరాశి నంతటిని భస్మమొనరించును మొట్టమొదట పుణ్యకర్మప్రభావముచేతనే జ్ఞానమా

విధ్వంసించును పాపకర్మ మాత్రము జలము అగ్నిని చల్లార్చునట్లు జ్ఞానమును నశింపజేయును

787 సర్వత్ర సర్వమును మానవుడు చూడజాలడు గ్రుడ్డివానిని కన్ను గలవాడు అపాయము లేక తీసుకొని వెళ్ళును సర్వకాలములలోను, సర్వావస్థలలోను సర్వము నెరుంగువాడు సర్వేశ్వరుండు అట్టివానిని ఆధారముగా చేసికొనిన మాత్రమే మనుజుడు నిరపాయముగా ముక్తిని పొందగల్గును ఆ ప్రభువు భూతభవిష్యద్వర్తమానకాలములను గూడ ఎఱుంగ గల్గును

788 పవిత్రవర్తనముయొక్కయు, అపవిత్రవర్తనముయొక్కయు స్థితిగతులను గురించి తెలిపెద ఉత్తమ కుటుంబమునకు జెందిన నారీమణి ధర్మబద్ధముగా గర్భవతి యైన ఆ మహిళామణికి ఎంతో సంతోషము గల్గును బంధువు లందఱున్ను ఎంతో గౌరవభావమును జూపుదురు ఎందరో ఎన్నియో విధములగు సత్కారము లొనర్చెదరు పై విధముగా గాక జారత్వ వృత్తిచే గర్భిణియైనచో ఆ నారీమణి యెంత భయముతో గూడియుండును? ఇంటిలోపల నుండి బయటికి వచ్చుటకే వెరచునుగదా! బంధువు లెవరున్ను గౌరవముతో జూడరుగదా! అట్టి జీవితము ఎంత దుఃఖరూపమైనదో యోచింతురుగాక! ఆలాగున బ్రహ్మనిష్ఠ చేయువారు గూడ మంచి వర్తనము గల్గియుండిన యెల్లప్పుడును అమితానందము గల్గియుందురు అందరును ఎంతో గౌరవముతో జూతురు ఎల్లప్పుడున్ను ఆనందపరవశులై యుందురు అట్లుగాక నికృష్టగుణము గల్గి వర్తించెదరేని తనకున్ను, ఎల్లప్పుడున్ను మనోభయము గలుగుచుండును లోకములో ఎవరిని చూచుటకున్ను భీతి గలుగును అట్టివారిని యెవరును గౌరవించరు అదియునుగాక యెవరును దగ్గఱకు రారు గుణాగుణముల యొక్కస్థితి దీనివలన తెలిసికొనవచ్చును

889 మానవులారా! మానవజీవితము ఒక పుష్పహారము వంటిది మీలో చాలమందిన్ని మల్లెపూల రోజాపుష్పముల మాలను జూచియే ఉన్నారు

అట్టిమాల నొకరికి వేయునప్పుడు అది సంతోషకరముగా నుండును కాని అది కొంతసేపు పోవునప్పటికి వాడిపోవును ఇంక కొంతసేపు పోయిన ఎండిపోవును అప్పుడది వికారమై పోవడమే గాక ధరించుట కసహ్యమైపోవును గదా! అలాగున మీయొక్క సుందర సుకుమారమైన యీ దేహము గూడ యౌవనకాలమున నతిమనోహరముగా తోచినను వార్ధక్యదశ వచ్చునప్పుడెంతో వికారమై హేయమై పోవునో యోచించుకొనుడు ముఖ్యముగా రూపవతులున్ను, యువతులున్ను అగు స్త్రీలు దీనిని యోచింపవలయును అయితే మీరు దీనివల్ల విచారపడ నక్కఱలేదు ఏదారముతో ఆ మాలకట్టిబడినచో ఆదారము మాత్రమెల్లప్పుడు నొకే విధముగానే యుండును దానికి మార్పు గలుగదు అలాగున దేహేంద్రియములకు మాత్రమే మార్పు గలుగును కాని అంతర్యామి యైయుండు ఏ సూత్రాత్మగలదో దానిలో మనస్సునుంచిన లేక అదే తనయాత్మ యని యెఱింగిన మరల మీకు మార్పు గలుగదు ఎల్లప్పుడును సుందరముగాను, ఆనందముగాను నుండును జ్ఞానులట్టి యాత్మలో రమింతురు కనుక వారికి దుఃఖము లేదు అజ్ఞానులు దేహేన్ద్రియాదులలో ఆనందించువా రగుటచే దానికి మార్పు గలుగునప్పుడు దుఃఖితు లగుచున్నారు

790 సాధారణముగా కొందఱు ముముక్షువులు భక్తులు సాధకులు ఈలాగుననే తలంతురు అదేమనగా వారు సంఘములో, సమాజములో సమష్టి ప్రార్థన కీర్తన పారాయణములలో పాల్గొనరు అదేమని అడిగిన మాకు గీతలు, ఉపనిషత్తులు, కీర్తనలు వచ్చును మరల ఎందుకు ప్రతిరోజు సంఘములో, పారాయణాదులలో పాల్గొన వలయునని చెప్పదురు ఒకవేళ ప్రతిదినమున్ను సమయమునకు పారాయణ ప్రార్థనలకు వెళ్లక స్వయముగా వారు చేయుచుండిన విరోధము లేదు గాని, అట్లు చేయనిచో మంచిది కాదు ఒకవేళ వారికి గీత కంఠస్థముగా నుండవచ్చును అలాగున కొన్ని యుపనిషత్తులుగూడ హృదయస్థముగా నుండవచ్చును అదేరీతిగా దివ్యమంత్రములను అక్షరలక్షగాగాని, కోట్ల కొలదిగా గాని జపము

చేసియుండవచ్చును అందువలన వారు సర్వము ఎరింగిన వారమైతిమని తలంచుట పొరబాటు గీతలో, ఉపనిషత్తులో గూడ ఒకశ్లోకములో గల ఒకపదము యొక్క అర్థముగూడ ఆచరణలో నుంటున్న దా యని వారు ఆలోచించునపుడు దాని యర్థము బోధపడును అదియున్ను గాక అనంతమయిన ఆత్మశక్తిని, ఆత్మగుణమును, ఆత్మమహిమను ఎవడు పూర్తిగా ఎరుంగ గలుగును? పారాయణ చేయుచు రాగారాగా, దివ్యమంత్రజపము చేయుచు రాగారాగా వాని యందుగల నిగూఢార్థము కొంచెము కొంచెముగా గోచరమగుచుండును ఇప్పటికిని ఎవరైనను భూగర్భాన్తర్భాగములో పలాని స్థలములో పలానివస్తువులు గలవని నిర్ణయించజాలకనే యుంటున్నారు అలాగున సముద్రాన్తర్భాగములో పలాని పలాని వస్తువులు గలవని నిశ్చయింపజాలక యున్నారు పరిశోధించి రాగా రాగా భూగర్భములోను, సముద్రాన్తర్భాగములోను నూతనములగు అనేక ధాతువులు, ఖనిజములు బయలుపడుచున్నవని తెలుపుచున్నారు అలాగున ఆకాశములో ఇప్పటికిని గోచరము గాని దివ్యశక్తులు నక్షత్రగమనములు వానిచే గలిగెడు ప్రపంచములో గల శుభాశుభములు అనంతములు గానున్నట్లు ఖగోళశాస్త్రజ్ఞులు తెలుపుచున్నారు అలాగున పారాయణాదులు, జపములు, ప్రార్థనలు చేయుచు రాగారాగా అన్తఃకరణశుద్ధి గల్గి రాగా రాగా అనేక దివ్యశక్తులు, దైవము యొక్క మహిమలు మనకు గోచర మగుచుండును కట్టకడకు ఆదైవవే తనయొక్క ఆత్మయను దివ్యజ్ఞానముగూడ గలుగవలసినవారై యున్నారు అట్టి దైవత్వమును పొందేవారే దైవగుణమును, దైవమహిమను లోకమున బోధించుచుందురు "అనన్తా వై వేదాః" అని శ్రుతియు 'నాన్తోఽస్తి మమ దివ్యానాం విభూతీనాం పరంతప' అని గీతయు తెలుపుచున్నవి మఱియు శిష్టుల యొక్క ఆచరణము ఇతర జనులకు ఆచరించుటకు కారణ మగుచున్నదిగా వీరు గ్రహించుకొనవలయును "యద్యదాచరతి శ్రేష్ఠః" అని గీతలో గల శ్రీకృష్ణభగవానుని ఆశయముగూడ వీరు మరువక యుందురుగాక!

791 జీవన్ముక్తి పొందదగిన జన్మముగల వారికి నలుగురు

తల్లిదండ్రులు గలరు వీరిని విధిప్రకారము సేవించువారు ఈజన్మములోనే బ్రహ్మపదమును పొందగలరు

(1) ఈమానవ జన్మమునకు కారణభూతులైన మాతాపితరులు

(2) గురుకులమున గాయత్రి తల్లి, ఆచార్యుండు తండ్రి

(3) వానప్రస్థాశ్రమములో ఉపనిషత్తు తల్లి, ఓంకారము తండ్రి

(4) సన్యాసాశ్రమములో ప్రతిఇంటిలో గల అమ్మలందరును తల్లులే సోఽహంభావనమే తండ్రి యని గ్రహించుకొనవలయును ఒకవేళ గృహస్థాశ్రమము తటస్థించిన దయయే తల్లి, ధర్మమే తండ్రియని గ్రహించుకొనవలయును

792 సోమరులయొక్కయు, సోఽహంపరుల యొక్కయు స్వభావము ఈ క్రింది విధముగా గనందగును సోమరులు ఒక్కరు చేయందగిన పనిని నలుగురు గుమికూడి చేయుదురు దానినిన్ని విసుగుతోనే చేయుదురు అంతేగాక ఒక్కరోజులో పూర్తిచేయందగిన పనిని నాలుగురోజులలో గూడ పూర్తిచేయక కొంచమైనను మిగిలింతురు అదియున్ను శుద్ధముగా చేయక మరల యితరులచే సంస్కరింపబడవలసి యుండును అట్లు పామరులు కానివారును, సుధీరులును అగువారు నలుగురి పనిని ఒకరే సంతోషముతో చేయగలరు ఆలాగున నాలుగు రోజులలో పూర్తియగు పనిని ఒక్క రోజులో పూర్తి చేసేలాగున తలంతురు ఆలాగున చెప్పి చేయు యత్నమునుగూడ నవలంబింతురు అదియును చూచువారందరు ఆశ్చర్యము పడేలాగున శుద్ధముగా చేయుదురు ఈ యొక్క దానివలననే జీవుల గుణాగుణములను తెలిసికొనవచ్చును

793 దక్షిణదిక్కునకు గురిపెట్టి విడువ బడిన బాణము ఉత్తరదిక్కు లక్ష్యమును ఎటుల భేదింపజాలదో, ఆలాగున దృశ్యవిషయసుఖమునకు పరుగిడు మనస్సు, దృక్కగు ఆత్మలో చేరి లయమునొంది శాశ్వత బ్రహ్మసుఖము నొంది సుఖింపజాలదు

794 ఏ స్థలమున విద్యార్థులు ఆసక్తితో చేరి చదువుచుందురో అచ్చట చదువు చెప్పెడు ఉపాధ్యాయుడు మీకు కనుపించక పోయినను లేక మౌనముగా నుండువాడైనను బాగుగా చదువు చెప్పచున్నటులనే గ్రహించుకొనవలయును అట్లు కానిచో మేధాసంపత్తిగల విద్యార్థులు అచ్చట నుండగలరా? అనగా కొన్ని స్థలములలో నుండు మహనీయులు మౌనముగా నుందురు కొన్ని స్థలములలో ఎల్లప్పడును కనపడకనే యుందురు మౌనముగా నుండువారు భావములచేతను, కనుపడక యుండువారు మానసిక సంకల్పముతోను భక్తులను అనుగ్రహింతురు ఇది కొన్ని స్థలములలో సమాధిలో నుండువారి సన్నిధిలోను, కొన్ని స్థలములలో పరమ సమాధిని పొందియుండు స్థలములలోను జరుగును కొన్ని దివ్య దేవస్థలములలోను పై జెప్పిన రీతిగా జరుగుచుండును కావున అలాటి స్థలములలో నుండు సాధకులను వ్యర్థులని తలంచరాదు దేహమునకే దూర సమీపములు గలవు మనస్సుకు దూరసమీపములు లేవు దేహమునకే కనుపించుట, కనబడకుండుట అను ధర్మములు గలవు మనస్సుకు లేవు ఆత్మలో ఈలాటి భేదముకూడ తటస్థించదు అది ఎల్లప్పడు ఏకరూపముగానే, నిరావరణముగానే యుండును కావున స్థూలదృష్టిని మాత్రము ఆధారము చేసికొని మహనీయాత్ముల గురించి చెప్పరాదు వీనిలో ఒకటి మీనవృత్తి యనియు, రెండవది కూర్మవృత్తి యనియు గ్రహించు కొనవలయును అయితే ఇది సామాన్యులకు సంబంధించినది మాత్రము కాదని జ్ఞాప్తిలోనుంచు కొనవలయును దీనికి వైర్లెస్సు, రేడియో వర్తమాన యుగమున తార్కాణము

795 తనయందు ఆత్మ యొకటి యుండిన ఏల కనుపించుట లేదు? ఆలాగున ఈశ్వరుడు అన్నింటిలోను ఉండునది నిజమైన యెందుకు గనుపడుట లేదు? అని కొందఱు తలంతురు ఉదకములో ఎన్నియో సూక్ష్మజీవులు గలవు ఆలాగున రక్తములో అనేకజీవాణువులు గలవు అదేరీతిగ, వాయువులోను మిక్కిలి సూక్ష్మ జీవులుంటున్నవి అట్లుండునది నిజమైనచో ఏల కనుపడుట లేదని అడిగిన వారికి మీనేత్రమునకు

స్థూలవస్తువుల కనుగొనే శక్తియే గలదని చెప్పవలయును దుర్భిణి యంత్రముద్వారా మీరు చూచిన నీటిలోను నెత్తురులోను, వాయువులోను సూక్ష్మ జీవాణువులు గలవని నమ్మకము గలుగును ఇట్టి సూక్ష్మజీవులలోను అంతర్యామియై యుండు ఈశ్వరుని చూడవలసియుండిన హృదయము ఎంత నిర్మలముగా నుండవలయునో, బుద్ధి ఎంత సూక్ష్మముగా నుండవలయునో అర్థమగును కావుననే గీతలో "సూక్ష్మత్వాత్తదవిజ్ఞేయం దూరస్థం చాన్తికే చ తత్" అనగా బ్రహ్మము మిక్కిలి సూక్ష్మమగుటచే అందరికిన్ని గోచరించుట లేదు అంతఃకరణ శుద్ధియు, సంస్కారమున్ను గలవారికి మిక్కిలి దగ్గర గాను, అట్లుగానివారికి ఆ బ్రహ్మము చాలా దూరముగాను ఉండునని దెల్లడమైనది ఆలాగున కఠశ్రుతియున్ను చెప్పుచున్నది

ఏష సర్వేషు భూతేషుగూఢోఽఽత్మా న ప్రకాశతే ।
దృశ్యతే త్వగ్ర్యయా బుద్ధ్యా సూక్ష్మయా సూక్ష్మదర్శిభిః॥

దీని యర్థమున్ను పై జెప్పిన విధముగానే యుంటున్నది

796 ఇనుము, రాగి, వెండి, బంగారముల లోహములు ఒకదాని కొకటి విలువగలదిగాను అందువల్ల గౌరవమున్ను భద్రతయు ఎట్లు గల్గియున్నవో, ఆలాగున బ్రహ్మచర్య, గృహస్థ, వాన ప్రస్థ, సన్న్యాసములున్ను ఒక దానికన్న నొకటి అధిక మాహాత్మ్యమున్ను, భద్రతయు, విలువయు గల్గియుండునని మఱువకూడదు నాల్గవదగు సువర్ణ మెంత శుద్ధమో, విలువయో, మిక్కిలి భద్రతతోను జూచుచుందురో ఆలాగున జ్ఞానమున్ను విలువ గలిగియున్న దని మరువకూడదు ఈలాగున శూద్ర, వైశ్య, క్షత్రియ, బ్రాహ్మణులనుగూడ గ్రహించుకొనవలయును అనగా ఒక్కొక్క వర్ణముకన్న ఇతర వర్ణముల వారు ఆచారములోను, పవిత్రతలోను, భూతదయలోను, సత్యములోను ఆధిక్యత యుండేలాగున జూడవలయును కట్టకడపటిదగు సన్న్యాసమున్ను బ్రాహ్మణత్వమున్ను, సంపూర్ణ పరిశుద్ధతయు, భూతదయయు జ్ఞానమున్ను గలిగియుండే లాగున చూచుచుండ వలయును అట్లుగాక బ్రాహ్మణత్వమును, సన్న్యాసత్వమును నిర్లక్ష్యము చేయువారును సరియైన

ఆచరణయు, విరక్తియు, భద్రతయు లేనివారు, తమయొక్క పవిత్రతను దెలియని వారలనియే గ్రహించుకొనవలయును ఏలన యినుమువలె సువర్ణమును గూడ నిర్లక్ష్యము చేయువారు సువర్ణము యొక్క విలువను దెలియనివారుగదా! ఇందువల్లనే సామాన్య బ్రాహ్మణులపై గాని సన్యాసులుపైగాని జనులకు విశ్వాసము లేక పోవుచున్నదని తెలిసికొనిన చాలును అప్పడు ఎందువల్ల జనులు తమను గౌరవించుట లేదనే సత్యము బయలుపడగలదు

ఈ రెండింటిలో సన్యాసము మఱింత పావనమైనది ఏలన బ్రాహ్మణులు చాలా మందిన్ని గృహస్థులై యుందురు సన్యాసులో గృహస్థులకన్న ఎంతో దూరముగా నుండువారు గృహస్థమునకు దూరులైన దాని గురుతేమన, ప్రకృతి సంబంధమైన యేవిధమగు దోషమున్ను, వారిలో నుండరాదు సువర్ణ మేలాగున ఏవిదమైన చిలుముతోను కూడియుండదో, ఆలాగున సన్యాసియు ఏవిధమైన ప్రాకృతగుణమున్ను గలిగియుండరాదు అపుడు సువర్ణమున కెంత విలువ యేకాలమందును గలిగియుంటున్నదో ఆలాగున నెప్పడున్ను, ఎచ్చోటనున్ను, సన్యాసులకు విలువ గలిగియుండును అట్లు లేక తమ్ము జనులు గౌరవించుట లేదని చెప్పకొనిన ప్రయోజనమేమి?

797 ఒకరు ఆర్జించిన ధనము పాపసంబంధము గలదైనను దానిని వినియోగపరిచెడు వాడు పుణ్యాత్ముడైన, అది పుణ్యపుసొమ్ము వంటిద ేయగును మరియొకడు పుణ్యకర్మచే సంపాదించిన ధనమైనను, పాపస్వభావము గలవాడు ధర్మకార్యములలో వినియోగపరచిన దానివలన పుణ్యము గలుగదు అది పాపపుసొమ్ము వంటిదే యగును

798 వస్తువు సామాన్యమైనదైనను శుద్ధాత్మునివలన వచ్చిన అది పావన వస్తువగును ఆలాగున వస్తువు శుద్ధమైనను, అశుద్ధాత్ముని ద్వారా వచ్చిన అది అపవిత్రమే యగును ఈ సత్యమును వివేకవంతులు జ్ఞాపకములో నుంచవలయును ఎట్లన మామూలు కాలువ నీరైనను గంగానదితో చేరునప్పడు ఏలాగున పుణ్యతీర్థమగుచుండునో, వర్షజలము

శుద్ధమైనను అశుద్ధ ధాతువులతో వచ్చిన, అది యేలాగున నికృష్టమగునో ఆలాగున మూలధనమునకున్ను, వస్తువుకున్ను ఈలాటి మార్పు గలుగుచుండును

799 గర్భములో గల శిశువు ప్రసవకాలము సమీపించునప్పుడు అనగా నవమాసములు వచ్చిన కదలుచుండుననియు, అప్పుడు సర్వేశ్వరుని గుఱించి గర్భదుఃఖమునుండి, గర్భనరకమునుండి విముక్తికొఱకు, సర్వేశ్వరుని ప్రార్థన చేయుచుండుననియు గర్భోపనిషత్తు మొదలగు శాస్త్రములు చెప్పుచున్నవి ఆలాగున సంసార బంధముల నుండి విముక్తి జెంది మోక్షము కలుగుట కొఱకు పరితపించు ముముక్షువు దైవప్రార్థన చేయుచు బ్రహ్మవేత్తల కొఱకు తిరుగుచుండిన ఈ సంసార దుఃఖమునుండి విముక్తిజెంది మోక్షము గలుగుటకు కాలము సమీపించినదని గ్రహించుకొనవలయును ఇదియే దీనికి గురుతు

800 అనాత్మవస్తువులగు దేహేంద్రియముల నుండి ఆత్మను ఎట్లు వేరుపరచి చూడవలయునో, ఆత్మయెట్లు సూక్ష్మమైనదో యీ క్రింద తెలిపెద మీలో చాలామందిన్ని బంగారుపని చేయు వారిస్థానమును చూచియుందురు వారు స్వర్ణమును కరుగజేయు పాత్రలోగల బూడిదయు, సమీపప్రదేశములలో ఊడ్చిన మట్టి, దుమ్ము మొదలైనవియు ఒక్కస్థలమున భద్రపరచెదరు దానిని కొనేవారువచ్చి కొనెదరు దానిని కొనేవారు కొన్నిసార్లు గాలించి గాలించి అడుగున పేరుకొనుచుండు సువర్ణాణువులను వేరుపరచి కరుగజేసెదరు దానిని శుద్ధబంగారునుగా తయారు చేయుదురు ఆలాగున అనాత్మ స్వరూపమగు దేహేంద్రియములకు సాక్షియయిన ఆత్మను ధ్యాన జ్ఞానములచే వేరుపరచి గ్రహింపనగును

801 ఆత్మజ్ఞాన ప్రకాశము గలుగనివారు ఎల్లప్పుడు ఏకాంతస్థలములో నుండువారు తమ్ము గొప్పవారినిగా తలంచి యీలాగున చెప్పుదురు దృశ్యవిషయములను చూచుట చేతను, దృశ్యగుణముల గురించి వినుటచేతను, దృశ్యవాసన తగులుటచేతను, మనస్సు

ఆయాకారమును పొందుటచేతను, వికారమగుట చేతను ఆలాటి దోషములు లేని ఏకాంతమున ప్రపంచమునకు దూరముగా నుంటున్నామని వచింతురు ఇదొక విధముగా సాధకులకు గలుగవచ్చును బోధైకజ్ఞానులు అట్లు చెప్పరు ఒక యింటిలో దీపము వెలుగుచుండిన ఏ కిటికీల ద్వారాగాని, తలుపుల ద్వారాగాని, కారుచీకటి కాలములో నైనను ఆతమస్సు ఏలాగున ఇంటి లో ఏభాగమునకు ప్రవేశింపజాలదో ఆలాగున చక్షుశ్రవణాది ఏయిన్ద్రియముల ద్వారమున నైనను ఆత్మజ్ఞానజ్యోతి వెలుగుచుండు మహనీయాత్ముని హృదయములోనికి ప్రకృతి గుణములు ప్రవేశింపజాలవు ఇదే దానికి గురుతు అయితే అభ్యాసికిన్ని సాధకునకున్ను ఇది సాధ్యము కాదు అరూఢునికి మాత్రమే సాధ్యము

802 సత్త్వాది మూడుగుణములు గలవారి ఆత్మయొక్క స్థితినిగురించి తెలిపెద మేఘము నుండి వర్షించెడి జలము శుద్ధమైన భూమిలో పడినచో దానిని పానముజేయువారు ఎంత ఆరోగ్యవంతులై యుందురో, ఊషరక్షేత్రములో పడిన ఉదకమును పానము జేయువారు ఏలాగున దాహపరులై అశాంతి గల్గియుందురో, దుర్వాసనగల ప్రదేశములో పడిన నీరును త్రాగువారు ఏలాగున రోగులుగా నుందురో ఆలాగున సత్త్వగుణ హృదయము గలవారు ఎల్లప్పుడును ప్రసన్నులుగాను, ప్రశాంతులుగా నుందురు రజోగుణము గలవారు వ్యాకులస్వభావము గలవారుగా నుందురు తమోగుణముగలవారు రోగులుగాను, దుఃఖులుగాను ఉందురు ఈమూడింటికి అవల విశుద్ధగుణముతో నుండువారు జ్ఞానులుగాను, నిరంతరానంద స్వరూపులుగాను ఉందురు వీరు భూమిలో పడని వర్షజలమును మంచి గ్లాసులో పెట్టుకొని యుపయోగపరచెడు వారివలె నుందురు ఈఉదకము ఎంత ఆరోగ్యకరమో, ఆనందకరమో తెలిసికొనదగినది కావుననే గొప్ప గొప్ప ఆస్పత్రులలో భూమిలో పడకనే పెద్ద పెద్ద గ్లాసులలో వర్షజలమును భద్రపరచి కొన్ని రోగములు గలవారికి ఉపయోగపరచెడు రహస్యము

803 అనుష్ఠానపరులారా! మీయనుష్ఠానము పరిపక్వస్థితిలోనికి వచ్చునప్పడు కొన్ని దివ్యమహిమలు (సిద్ధులు) గలుగవచ్చును అప్పడు జాగ్రత్త పడనిచో పతనము గల్గును మిక్కిలి జాగ్రత్త వహించినచో, బీదవాడు ఏదో యొక కారణముచే శ్రీమంతుడైనను, లేక పేదరికములో నుండువాడు గొప్ప అధికారములోగల యుద్యోగియైనను తన పూర్వస్థితిని మరువనీయక మిక్కిలి మెలకువ గలిగి యుండినచో, శ్రేయస్సును పొందగల్గును ఈ విషయములో ఎంతో మెలకువతో నుండవలయును సామాన్యముగానిది యోగమార్గము నందే గల్గను భక్తిమార్గము నందుగాని, జ్ఞానమార్గమునందుగాని యిట్టి యాపత్తు గలుగదు

804 చిన్నపిల్లలకు బాహ్యములగు ఎంత ఆత్మానందమును గలుగజేయు వస్తువులుండినను తమతల్లుల ఒడిలో చేరి స్తన్యపానము జేయునప్పడు గల్గుసుఖము వారికి మరి దేనియందుండదు కారణమేమన, తమ తల్లిలోనుండి పుట్టిన వారగుటచేతనే, అచ్చట లయము నొందుటకు హేతువు అలాగున, ఆత్మనుండి మనస్సు పుట్టిన దగుటచేతనే, బాహ్యములగు అన్నివిధములగు సౌఖ్యము లుండినను, మనస్సు ఆత్మలో లయమొందుటకు కోరుచుండును ఎప్పడైనా ఇట్టి స్థితి జీవులకు గలుగవలయును వైరాగ్యము గలిగి దృశ్యవిషయానందమును విచారణ జేయుచు రాగారాగా, కట్టకడకు ఈ ఆత్మసుఖమే నిజమని తోచును కావుననే శ్రీ కృష్ణభగవానుడు "ఆత్మన్యేవ వశం నయేత్" అని యుపదేశించెను కావుననే యోగులు మనోలయ సమాధియే మోక్షమనియు, జ్ఞానులు అమనస్కమే ముక్తి యనియు చెప్పదురు భగవంతునియందు ఐక్యము గావలయునని భక్తులుగూడ వచించుటకు కారణమిదియే మీలో నెవరైనను భగవత్సాకార సన్నిధిలోగాని, మానసిక ధ్యానములోగాని, మనస్సును లయము చేయునప్పడు, నేత్రములు మూసుకొని ప్రపంచ సంకల్పముల రహితముజేసి మీ యాత్మలోనే, మనోలయము గల్గునటుల కనుగొనవచ్చును

805 1 ఉపదేశమనియు, 2 ఉపనయనమనియు, 3

ఉపవాసమనియు ఈలాగున గల పేర్లన్నిటికిన్ని చాల నిగూఢమగు అంతరార్థము గలదు ఇట్టి భావము తెలిసికొనుటకొరకే ఋషులు ఇట్టి సూక్ష్మపదములను ప్రయోగించిరి "ఉప" అను శబ్దమునకు సంస్కృతమున సమీపము అని అర్థము అప్పడు ఉపదేశమన సమీపదేశమున చేర్చుటయని అర్థము గురుదేవుడు శిష్యుని బ్రహ్మప్రదేశమునకు చేర్చుట, లేక భగవత్సన్నిధిలోనికి చేర్చుట,లేక మోక్షపదములోనికి చేర్చుటనియు దానియొక్క సారము

2. పైన జెప్పిన ప్రకారము "ఉప" సమీపము "నయనమ్" నేత్రము, అప్పడు ఈశ్వరుని లేక వేదార్థమును లేక ఆత్మను చూపించుట యని భావము, లేక పై చెప్పిన మూడింటిని తెలుసుకొనుటకు తగిన దివ్యదృష్టిని కలుగజేయుట అనిగూఢ అర్థము గలదు

3. ఉపవాసము "ఉప" సమీపము "వాసః" నివాసము అని తాత్పర్యము ఈశ్వరుని సమీపమున నివసించుట అని అర్థమగును ఇతర విషయ ఈలలలో నుండు మనస్సును వానినుండి మరలించి దైవధ్యానములో నిలుపుటయని భావము అలాగున మనస్సు దైవధ్యానమునందు నిశ్చలముగా నిలువవలసి యుండిన దానికి ఆసమయమున ప్రపంచ కార్యములు లేని స్థితియున్ను కొంత యేకాంత స్థలమున్ను ఉండవలయును ఈ భావమును హృదయములో నుంచియే ఏకాదశీ ప్రదోష సోమవారాది వ్రతములను ఋషులు ఏర్పరచిరి అట్టి వ్రత దినమొక్కటి లేనిచో సామాన్యముగా సంసారములో నుండువారికి పుణ్యక్షేత్రము, పుణ్యతీర్థము, పుణ్యాశ్రమాదులకు వెళ్ళుటకు సమయము దొరకక జీవితమంతయు మాయా లోకములోబడి వ్యర్థమై పోవును గదా! ఈ అర్థమునే శ్రీకృష్ణభగవానుడు అర్జునునకు ఉపదేశించెను "దివ్యందదామి తే చక్షుః పశ్య మే యోగమైశ్వరం" ఓ అర్జునా! నీకు దివ్యనేత్రమును ఇచ్చుచున్నాను దానివల్లనే ఈశ్వరసంబంధమైన యోగశక్తిని తెలుసుకొనగలవు "ఉప" సమీపే యో వాసో జీవాత్మ పరమాత్మోనోః ఉపవాస స్స విజ్ఞేయః

806 కార్యనిర్వహణ స్వభావము గలవారికి స్తుతినిందలలో సహనమున్ను, కాలము నిరీక్షించెడు ఓర్పున్ను గలిగియుండవలయును అట్టైన మాత్రమే ఆకార్యము సాంగముగా నిర్విఘ్నముగా జేయగలుగును అట్లుగాక తొందరగల్గి, కాలనిరీక్షణ సహనము లేక పోయిన శుభలగ్నముకొఱకు నిరీక్షించెడు శక్తిలేనివాడు స్వేచ్ఛగా జేసెడు స్థాపనము లేలాగున ఏదుర్ముహూర్తమందుగాని ఏరాహుకాలమందుకాని ప్రారంభించిన పనివలె కొనసాగక యుండునని మరువకూడదు అదిన్ని గాక అట్టివాడు ఏ ఘనకార్యమున్ను చేయజాలడు తొందరగలవాడు సహనము లేనివాడు దీనిని బాగుగా నాలోచించుకొనవలయును

సహనశక్తి గలిగి సమయమువఱకు నిరీక్షించియుండి చేయు కార్యములన్నియు, శుభముహూర్తమున చేయు కార్యములుగాని, స్థాపనలు గాని ఏలాగున ఏ ప్రయాసము గలుగక నిర్విఘ్నముగ సాంగముగా, సుందరముగా, ఆనందముగా జరుగునో, ఇతడు ప్రారంభించిన పనులన్నియు నాలాగున నుండుననియు మరువకూడదు సత్త్వగుణమున్ను, మనఃసంయమ శక్తియున్ను, దైవమందును, శాస్త్రమందును విశ్వాసముగలవారికి ఇట్టి సహనస్వభావము గలిగియుండును ఇతడు దూరాలోచన గలవాడు రజోగుణము గలవాడు తొందరగలవాడుగా నుండును అతనికి సహనము శూన్యము దీర్ఘాలోచన అతనికి యుండదు తమోగుణము గలవాడు వివేకశూన్యుడు ఏకాలమున ఏకార్యము ఏలాగున చేయువలయునో, అతనికి తెలియదు కావున ఒక్కొక్క పనిచేయుచు సరిపడక పోవుటచే దానిచే కలిగెడు దుఃఖముతో కాలము గడుపును మొదటివాడు దూరాలోచన పరుడు, రెండవవాడు దురాలోచన గలవాడు, మూడవవాడు ఆలోచనా శూన్యుడు నుండును ఇదే సత్త్వగుణ రజోగుణ తమోగుణ స్వభావముగలవారి లక్షణమని యెఱుంగునది

807 ఆహారనియమములేని సాధకుల స్థితి యెట్లుండుననన, పొలములో ఎరువు అధికరించి మిక్కిలి పెరిగిన, అనగా మదించిన పైరున్ను,

ఆలాగున ఎక్కువ సత్తువచే పెరిగిన కూరగాయలచెట్లున్ను, ఎట్లు సరిగా వండక పోవునో, దీనిని చూచుకొనిన చాలును ఆలాగున ఆహారనియమములేని సాధువులయొక్క స్థితి యుండునని గ్రహించేది ఇట్టి వారికి ఇన్ద్రియనిగ్రహముగాని, చిత్తైకాగ్రతగాని యుండనందుచే, ఆత్మజ్ఞానము గూడ తరిగిపోవును కావున ఆహారనియమములలో మిక్కిలి జాగ్రత్త గలిగి యుండుట క్షేమకరము పైరున్ను కూరగాయల చెట్లున్ను, బాగుగా బలిసియున్నట్లు వీరి దేహేన్ద్రియాదులు మంచి సౌష్ఠవమును గలిగియుండునే గాని జ్ఞానఫలము సరిగా నుండదు

అయితే మితముగా ఎరువున్ను, నీళ్ళున్ను, ఎండయు గల సస్యములు బాగుగా పండునట్లు ఇట్టి నియమముగల బ్రహ్మనిష్ఠులకు ఇన్ద్రియనిగ్రహము, మనశ్శాన్తియు, సదా ప్రసన్నతయు, ఆవరణము గలుగని జ్ఞానమున్ను, ఎల్లప్పుడునుండును

808 ఒకడు గృహస్థాశ్రమము నేర్పరచుకొని, ధర్మప్రవర్తన గలిగి అతిథి అభ్యాగతులను ఆదరించి సుఖముగా నుండవలసిన తగిన దనము గల్గి, లేక ధనము నార్జించియుండినచో గృహస్థాశ్రమము సౌఖ్యముగా నుండును అట్లుగాక బీదరికమున వివాహము చేసికొనిన గార్హస్థ్యమెంత దుఃఖకరమో ఆలాగున ఏదైన నొక ధర్మస్థాపనముగాని, ఆశ్రమముగాని స్థాపించతలంచువారు మొట్టమొదటనే యేదైననొక దైవశక్తిగాని, విజ్ఞానముగాని సంపాదించుకొనవలయును అట్లైన శాంతి గలుగును ఆలాగున చేయక ఆశ్రమముగాని, మఠముగాని, ఇతర ధర్మసంస్థలుగాని చేయబూనిన పైజెప్పిన బీదగృహస్థులవలె శ్రమపడవలసియుండునని మరువకుడు బీదగృహస్థుడగుట మాత్రమేగాక యిక నతనికి ఋణముగూడ గల్గియుండిన మరలా కష్టముగూర్చి చెప్పవలెనా? ఆలాగున ఆత్మజ్ఞానశక్తి లేక పోవుటయేగాక చెడుగుణములు గూడ నుండిన అట్టి యాశ్రమాది స్థాపకులకు దుఃఖమే మిగులును

809 ఒక సమయమున ఈ యువిాధి పగలు సుమారు పదిఘంటల

సమయమున ఒకచెట్టు పడమట భాగమున నీడనుగాంచి కూర్చుండెను అత్తఱి ఆ వృక్షముయొక్క తూర్పుభాగమున ఎండయుండెను కాని కొంతసేపునకు నీడయుండిన భాగమున ఎండ రాసాగెను తూర్పుభాగమున నీడవచ్చుట కారంభించెను కాలముయొక్క స్థితిగతులు ఈలాగున నుండునని తెలిసికొనడమైనది కావున నిమ్నోన్నతములు ప్రకృతియొక్క స్వభావమని గ్రహించుకొనవలెను అయితే ఒక కుటీరములో నుండు వారికి యిట్టి మార్పు గలుగదు కాలమునకు లోబడినవారికి మాత్రమే ఇట్టి హెచ్చుతగ్గులు కలుగును కాలమును దాటి తురీయకుటీరములో నుండువారికి ఎట్టి మార్పున్ను గలుగదు వారు కట్టడములోపల నుండువారివలె సదా యేకరూపముగానే యుందురు

ఈ ధర్మరహస్యమే ఉత్తరాయణ దక్షిణాయనములున్ను, గ్రీష్మవర్ష ఋతువులున్ను మన కుపదేశించుచున్నవి అలాగున శుక్ల పక్ష చంద్రుడు వృద్ధినొందుటయు, కృష్ణపక్షచంద్రుడు క్షయము నొందుటయు మనము చూచుచున్నాము అయితే ఇవి అన్నియు కాలమునకు లోబడి ఉండుటచేతనే ఇట్టి ఉచ్చనీచావస్థలను పొందుచున్నవి సృష్టికి లోబడి యుండువారి గతులన్నియు ఈలాగున నుండునని ప్రకృతి మనకు చూపుచున్నది వీటికన్నిటికి ఆధారభూతమై ఆకాశ మెల్లప్పడున్ను ఒకేరీతిగా ఉంటున్నది అలాగున ప్రకృతి కధిష్ఠానభూతమగు పరమాత్మ స్థితియందుండు ముక్తాత్ముడగు మహాత్మునకు ఏలాటి మార్పున్ను గలుగుట లేదు

810 ప్రకృతి సృష్టిలోనే దైవరహస్య మంతయు నిగూఢమై యున్నది మీలో చాలామందిన్ని విత్తనముకొఱకు పెట్టిపెట్టెడు బూడిద గుమ్మడి, సొర, బీర, దోస, మొదలుగునవి చూచియే యున్నారు విత్తనమునకు పెట్టుకొన తలంచిన కాయలు చెట్టులో ముదిరి ముదిరి, పండి పండి పరిపక్వమైనప్పడు మాత్రమే కోయుదురు గదా! అట్టి ఒక్కొక్క కాయనుండియు ఎన్నియో విత్తనము లేర్పడి మఱల చెట్టులగుచుండి ఫలముల నిచ్చుచుండును అది స్వంతవారికేగాక ప్రక్కఇంటివారికిన్ని, ప్రక్కవూరివారికిన్ని మాత్రమే గాక

దూరదూర దేశములకుగూడ తీసుకొని వెళ్ళుదురు వారున్ను అచ్చోటనే పెంచి ఫలింపజేయుదురు అట్లు ముదరని కాయలు కోసి కూరలు వండుదురు వాటినుండి యొక్కవిత్తనమైనను చెట్టున కుపయోగపడదు వాటి నామరూపములే లేకుండపోవును చెట్టులో కాయ పరిపక్వము వరకుండక ఏదైనదోషముచే మధ్య చెడిపోయినను ఆకాయ పనికిరాదు ఆలాగున మీరు తపస్సులోను, జ్ఞానములోనూ మంచి పరిపక్వస్థితిలోనికి వచ్చినమాత్రమే మీవలన బ్రహ్మసంతతి ఏర్పడగలదు పరిపక్వ కాయలోనుండి యెన్ని విత్తనములు చెట్లుగా నేర్పడుచుండునో, ఆలాగున మీయందుండి గూడ అనేకభక్తులు, యోగులు, జ్ఞానులు, శిష్యులు ఏర్పడి లోకమంతటను బ్రహ్మజ్ఞ లేర్పడగలరు అట్టి పరిపక్వస్థితి యేర్పడక ముందు మీరు జనుల కుపదేశించినను, ప్రచారము చేసినను లేత కాయ బీజమువలె ఉపయోగపడదని మరువక యుందురుగాక! దీనికన్న ఇక పరమ సత్యమేది గలదు?

811 నిత్యాభ్యాసముచే విద్యము, జ్ఞానమున్ను ఎట్లు వృద్ధి నొందుచుండునో అనభ్యాసముచే పైచెప్పిన రెండున్ను ఎట్లు క్షయించి పోవుచుండునో చూచుకొనుడు అగ్నిహోత్రుడేలాగున సమిదలచేతను, ఘృతముచేతను, అపారముగా వృద్ధి యగుచుండునో ఆలాగున పుల్లలున్ను నెయ్యున్ని వేయకపోయిన యెంత యభివృద్ధిలోనికి వచ్చిన అగ్నియైనను ఏలాగున చల్లారిపోవునో, అదేవిధముగా మీనిత్యాభ్యాసముయొక్క అనాభ్యాసము యొక్కయు స్థితి యని గ్రహించుకొనుడు

812 మీలో చాలామందికిన్ని సంస్కృత శ్లోకములు శుద్ధముగ నుచ్చరించుటకు రాకపోవచ్చును అయితే మీరు సిగ్గుపడి చిన్నగ చిన్నగ ఎంత కాలముచ్చరించినను ఆదోషము పోజాలదు నిర్జనస్థలములలో ఉచ్చస్వరముతో ఉచ్చరించి నేర్చుకొనవలయును ఎట్లన ఒక కాలువ నీరు స్వల్పముగ పారుచుండిన దాని యందుగల పాచి బురద మొదలగు కల్మషము లెట్లు పోజాలవో, జలము వడిగా నిండుగ ప్రవహించుచుండిన

అన్ని మాలిన్యములును ఎట్లు కొట్టుకొనిపోవుచుండునో, ఉచ్చారణము యొక్క స్వభావమున్ను ఈలాగుననే యుండును ఉచ్చస్వరము లో నుచ్చరించుచుండిన నాడి నరములకు గలిగియుండు ఆటంకములు తొలగిపోవును ఉపవాసవ్రతముగాని, కొంచెము ప్రాణాయామయము గాని గలిగియుండిన మరింత మంచిది దానితో సహా బ్రహ్మచర్యముండిన ఎక్కువ ఫలమును కలుగచేయును

813 మీలో చాలామందిన్ని రంగుల రాట్నమును చూచియే యుందురు అది చాలా పెద్దది వందలాది జనులు కూరుచుండుటకు తగిన యేర్పాటు గూడ గలదిగానున్నది అనేక జీవరాసుల బొమ్మలు దానియందు గలవు ఎవరికి దేనిపై కూరుచుండుటకు ఇష్టము గలదో అట్టివారు దాని పై కూరుచుండవచ్చును ఇకను అనేకములగు సుందరములయిన ఆసనములుగూడ అమర్చబడియుండును అది అధికవేగముగా తిరుగుచుండును దానిలో అమర్చియుండు మధ్యస్థితస్తంభము అనగా ఇరుసు ఒకటున్నది అది మాత్రము తిరగదు సుస్థిరముగా నుండును మధ్యనుండుస్తంభముపై దీప మొకటి యుండును అదియు పరిభ్రమణము నొందుట లేదు నిశ్చలముగా నుంటున్నది అసనములగు జంతువుల బొమ్మలను ప్రకాశింపజేయుచున్నది తాను స్వప్రకాశమై నిలుచుచున్నది అలాగున మూడు దేహములకు సాక్షియగు తురీయాత్మ నిశ్చలముగా స్వప్రకాశముగానుండి దేహేన్ద్రియముల నన్నిటిని ప్రకాశింపజేయుచున్నది తాను స్వప్రకాశముగా నుంటున్నది ఈ స్థితిలో నిలకడగలిగిన మీకు నిశ్చలత్వమున్ను దేహేన్ద్రియాదులకు సాక్షిత్వమున్ను గలుగును అప్పడు మనస్సు జేయుచుండు కృత్యములన్నిటిని మీరెరుంగుట వల్ల మనస్సు మొదలగు ఇంద్రియముల కన్నిటిని మీరు సాక్షిభూతులను తత్త్వము గోచరము గాగలుగును అప్పడు మనస్సుగూడ దృశ్యమనియు, మీరు దృక్కనియు బోధ యుదయమగును ఇట్టి స్థితి గలిగిన మనోనిగహము త్వరలో సిద్ధించును

814 సోదరా! సృష్టియొక్క విచిత్రము అతీతమహిమతో కూడినది ఒక్కరిని నీవు ఆదరించిన నిన్ను అనేకులు ఆదరించగలరు ఒక్కరిని నీవు దగ్గరకుచేర్చిన నిన్ను అనేకులు దగ్గరకు చేర్చుదరు నీవు ఒకరిపై కరుణ చూపిన నీపై అనేకులు దయ చూపగలరు ఈలాగున ఆచరించుచు వచ్చినచో కట్టకడకు దైవముగూడ నిన్ను దగ్గరకు చేర్చును, ఆదరించును, కరుణించును ఏలన నీ మతి యెంతయో గతియున్నూ అంతే యని మరువకుము

815 మీలో చాలామందిన్ని అరటిగెలల గుట్టలను మాగవేయుట చూచియే యుందురు పెద్ద పెద్ద అరటిపండ్ల వ్యాపారస్థులు అరటిగెలలను ఒకే కుప్పగా వేసి గాలి తగులనీయక బాగుగా కప్పివేసి పొగ వేయుదురు అట్లైన రెండుమూడు రోజులకు అన్నియు ఒకేసారిగా మగ్గును అనగా పండును అయితే ఎచట పొగ బాగుగా తగలదో, ఎచ్చట బయటనుండి గాలి ప్రవేశించునో అచ్చట కాయలు మగ్గవు అట్లు మాగ వేయనిచో గెలపై భాగమునుండి క్రిందికి క్రమముగా పండుటకు ఒకవారంరోజులు పట్టును అదిగాక కుప్పగా పొగ వేసి మాగపెట్టిన బాగుగా ముదరని కాయలు గూడ ఒకసారి మగ్గిపోవును లేనిచో బాగుగా ముదిరిన కాయలు ఒక్కొక్క అస్తము నింపాదిగా మాగవలయును సముష్టిభజనకున్నూ వ్యష్టిభజనకున్నూ, ప్రార్థనకున్ను నామస్మరణకున్నూ ఇంత భేదము గలదు సమష్టి భజనమధ్యానాదులు అరటి గెలలను కుప్పవేసి పొగవేసి నట్లుండును వ్యష్టిభజన స్మరణకీర్తనాదులు గుట్టవేసి పొగ బెట్టని అరటి గెలలవలె నుండును వ్యష్టిభాగములలో పరిపక్వజీవులు క్రమముగా ముక్తులగుదురు సమష్టి భాగములో బాగుగా పరిపక్వము గాని జీవులు గూడ త్వరలో పరిపక్వ స్థితిలోనికి వచ్చి మోక్షమును పొందుదురు అయితే సమష్టిలో అందరున్నూ దైవభావము, ఆత్మభావము తమలో పట్టించు కోవలయును ఇదే దీనిలో గల రహస్యము

816 మీలో చాలామందిన్ని కుమ్మరివారు కుండలను కాల్చెడు

ఆమును చూచియుందురని అనుకొనెదను పచ్చికుండలన్నియు ఆములో కూర్చి నిప్పసెగ బయటికి పోనీయక కప్పియుందురు ఎచటెచట నిప్ప తగులునో ఆకుండలన్నియు కాలును నిప్ప బాగుగా తగలని స్థలములలో గల భాండములు కాలవు అవి నీటిచే తడిసినను వానలో నానినను కరిగి మట్టియై పోవును కాలిన పాత్రలు ఎంతకాలము నీటిలో నుండినను, వానలో తడిసినను కరుగవు కాలని భాజనములు నీటిలో కరిగి మట్టియై పోవుట వలన కుమ్మరివాడు మరల తొక్కి కుండలు చేయును ఆలాగున మీధ్యానములో, తపస్సులో, జ్ఞానములో దేహమనెడు ఆములో ఇంద్రియములనెడు పాత్రలన్నియు జ్ఞానాగ్ని యందు బాగుగా కాలే లాగున చూచుకొనవలెను కాలినచో విషయవాసనచే నీమనస్సు మొదలగు ఇంద్రియములు వికారస్థితిని పొందవు ద్వంద్వముచే పరిణామము చెందవు అదే దానికి గురుతు వికారము గలిగినచో ప్రకృతి మరల మిమ్ములను పునర్జన్మము గలుగ జేసేలాగున జేయును లేనిచో కరిగిన మట్టిని చక్రము పై కెక్కించి కుండను జేయునట్లు సంసారమను కాలచక్రములో మిమ్ముల నెక్కించి జననమరణ భ్రమణములో ప్రకృతి తప్పక త్రిప్పును కావున ధ్యానకాలములో దేహేంద్రియాదులన్నియు దైవభావముగాను, జ్ఞానభావముగాను జేసుకొనవలయును అట్లయిన మీకు నిర్వికారస్థితి గలిగియుండును ఇది చూచుకొనిన చాలును

817 స్వంత దుకాణాదారులకు వ్యాపారస్థులు ఎంత కెంతకు వచ్చినను సంతోష మధికరించునే గాని విసుగు గలుగదు కాని పూర్తి విశ్వాసము లేని గుమాస్తాలకు వ్యాపారస్థులు ఎక్కువ వచ్చిన విసుగు గలుగుచుండును ఆలాగున నిజముగా ఆత్మసుద్ధి గలిగి లోక సేవయందుగాని, పరోపకారమందుగాని, దానధర్మాదులయందుగాని ప్రీతి గలిగిన వారికి లోకసేవ గాని పరోపకారముగాని, పుణ్యకర్మగాని, దానధర్మములను గురించిగాని యెంతమంది వచ్చినను ఎంతపని గలిగినను విసుగు గలుగదు అట్లుగాక నిజముగా ఆత్మశుద్ధిలేక గాని, పేరు ప్రతిష్ఠలకొరకుగాని, లేక యితరుల ప్రేరణచేతగాని ఎవరైతే పరోపకారముగాని,

లోకసేవగాని, పుణ్యకర్మలుగాని, నిష్కామ కర్మయోగముగాని చేయుదురో వారిలో జనులు ఎక్కువ వచ్చినపుడు విసుగున్నూ నిరాదరణయు కానిపించును చేయవలసిన పని సరిగా చేయక పోయెడు స్వభావమున్నూ గలుగును వీరికి ఆత్మశుద్ధియు, ప్రాణికోట్లలో దయయున్ను, నిష్కామకర్మయోగ ప్రభావమున్ను ఇంకను పూర్తిగా కలుగలేదని గ్రహించుకొనవచ్చును ఆత్మశుద్ధియు, ప్రాణికోట్లలో నిజమైన ప్రేమయు గలిగినవారైనచో పై జెప్పిన పవిత్ర కార్యములలో అంతకంతకు సంతోష మధికరించును ఇదే దానికి గురుతు

818 ముముక్షువులు తమ యాత్మలో విచారణచేసి తెలుసుకొన దగిన విషయము తామిప్పడు తమోగుణములతో గూడియున్నామా, రజోగుణముతో గూడియుంటున్నామా, సత్త్వగుణముతో గూడియున్నామా, లేక విశుద్ధతత్త్వముతో గూడియుంటున్నామా అనునది (1) పాపస్వభావము నశించిన తమోగుణము క్షయించినదనియు, (2) విషయానక్తి, భోగపరత్వము క్షీణించున రజోగుణము నశించినదనియు, (3) సుకుమారత్వము, సుందరత్వము, ఆశలేనిచో నత్త్వగుణము గూడ విలయమైనదనియు తెలుసుకొనవచ్చును నిరబిమానము, నిరాడంబరము, ఇంద్రియ నిగ్రహము, లభించినదానితో తృప్తియు గలిగినచో విశుద్ధతత్త్వము గలిగినదని నిశ్చయించుకొనవచ్చును జీవన్ముక్తులకు, ఆత్మజ్ఞానులకు, ఈవిశుద్ధతత్వము మాత్రమే మిగిలియుండును నత్త్వగుణము దేహేంద్రియసుకుమారత్వముచే బంధించును రజోగుణము కామ్యకర్మకలావముచే జీవుని బంధించును తమోగుణము సోమరితనముచే ఆత్మను బంధించును

819 మానవునియొక్క సహనశక్తిని, ఇంద్రియములయొక్క నిగ్రహమును, మనోనిశ్చలత్వము ననుసరించి అతని యొక్క యాత్మబలమును హృదయ వైశాల్యమునుచూచి తెలుసుకొనవచ్చును సామాన్యముగా వర్షజలము కాల్వలద్వారా వచ్చునపుడు చిన్నగుంటలు,

చెరువులు నిండి పొంగిపోవును కాని గొప్పవెల్లువలు వచ్చునపుడు మాత్రమే నదులు కట్టదాటి ప్రహించును అయినను ఆలాటి నదులు ఎన్నియో పొంగి ప్రవహించినను సముద్రము ఆ జలమంతటిని తనలో నిమిడించుకొనును చెరువు కొద్ది స్థలమగుటచే ఎక్కువ నీరును తనలో నిలుప శక్తిలేక పోయెను చెరువుకన్న నది వైశాల్యమగుటవల్ల ఎక్కున నీటి ప్రవాహమును తనలో నిలుపశక్తి గల్గెను సముద్రము అపారమగుటవల్ల ఎన్నియో నదులద్వారా నీరు వచ్చినను తన కడుపు లోనే నిలుపశక్తి గలిగెను ఇదే మానవులయొక్క విశలభావమునకు గురుతు అనంతాత్మభావములోనికి వెళ్ళునప్పడు ఈలోకమంతయు తనలో ఇమిడిపోవును కావుననే శ్రీ కృష్ణభగవానుడు స్థితప్రజ్ఞలక్షణము చెప్పనపుడు సముద్రము నుదాహరణముగ తెలిపిరి

820 మానవునియొక్క జాగ్రత్తయు, అజాగ్రత్తయు, జన్మయొక్క మహిమయు వారు చేయు కార్యములలోనే తెలునుకొనవచ్చును రాళ్ళుకొట్టుట లేక రాతిపని చేయునపుడెన్నియో పలుకులు పోవుచుండును ఆకాశిరాతిపనివారు దానిని అంత గొప్పగాతలంచరు కాని రత్నములు కోయువారు ఎంత జాగ్రత్తతో ఒక్కపొడిగూడ బోనీయక జూచుదురో ఆలాగున మోటు మనుష్యులు సమయముయొక్క విలువ తెలుసుకొనరు విజ్ఞులు సమయముయొక్క విలువ తెలిసిన వారగుటచే చదువునప్పడుగాని, వ్రాయునప్పడుగాని, ఇతరపనులు జేయునప్పడుగాని యొక్క క్షణకాలమైన సమయమును వ్యర్థపరచరు దీనివల్లనే వారియొక్క జీవితపు విలువను కనుగొనవచ్చును వట్టి రాయియు, రత్నమున్ను శిలావర్గములో జేరినవే ఆలాగున విజ్ఞులున్ను, అజ్ఞులున్ను మనుష్యవర్గములో చేరినవారైనను వారికి రత్నమునకున్ను, వట్టిరాతికిన్ని గల తారతమ్యము గలదు

820 బోధకులగు గురువులు గ్రహించవలసిన ధర్మరహస్య మొకటి గలదు అదేమన తమను దర్శించుటకువచ్చు వారున్ను, తమదగ్గఱ నుండువారున్ను, శాంతికొఱకు, ప్రసన్నత కొఱకు వచ్చుచున్నారనియు, వచ్చియున్నారనియు మరువగూడదు అట్లుండగా తమకే శాంతియు,

ప్రసన్నతయు లేనిచో వచ్చేవారున్ను, ఉండేవారున్ను ఎట్లు దన్యాత్ములు గాగలరని సదా జ్ఞాపకములో నుంచవలయును ప్రపంచములో గల వృక్షముల పువ్వులు వాడుచుండును, ఎండుచుండును దేవలోకములో గల కల్పవృక్షముల పుష్పములు వాడవు, ఎండవు అదిన్ని గాక అట్టి కల్పతరువులనుండి అమృతము స్రవించుచుండును అలాగున మానవత్వమునుండి దేవత్వము పొందిన మహనీయాత్ములు గూడ ఎల్లప్పుడు ప్రసన్నులై, ప్రశాంతులై నిరతిశయానంద అమృతస్వరూపులై యుండవలయును అట్లుగాక వికారము, అతృప్తిగలవారు ఇంకను దైవత్వములోనికి రాలేదని గ్రహించుకొనవలయును అట్టివారు నాటు చెట్టుల పూవులవలెనే యుందురు

822 ప్రభుత్వమునకు ప్రీతికరమగు కార్యములను చేయుటలో ప్రభువునకును, ఉద్యోగస్థులకున్ను ఏలాగున ప్రీతి గలిగి అన్నివిదములుగా ధన, జన, సహాయములనొసర్చెదరో, అలాగున దైవప్రీతికర కార్యమును చేయువారికి దైవమున్ను, దైవజ్ఞానము గల ఋషులున్ను తప్పక సహాయము చేయుదురు ప్రభుత్వమున కనుకూలము చేయుటలో ప్రజలకు గదా సౌఖ్యము గలుగును అలాగున దైవప్రీతికరము చేయువారు ప్రజోపయోగమును గూడ చూడవలయును అయితే ప్రభుత్వ ప్రీతికరమగు పనులను చేయుచున్నానని చెప్పచు స్వార్థముకొరకై చేసినచో ఎట్లు శిక్షింపడునో, అలాగున దైవ ప్రీతికరమగు పనియని చెప్పచు స్వార్థము కొరకైనచో దైవముచే శిక్షితు డగునని మరువకూడదు ఇదియున్ను దైవకార్యము జేయువారు తప్పక మనస్సులో నుంచదగినది

823 ప్రయాగలో, యమునా సరస్వతీనదులు, గంగలోకలిసి త్రివేణిరూపముగా బొంది ఆ గంగ యేలాగున ఈశ్వరునిస్థానమగు కాశిక్షేత్రమును స్పర్శించి లెస్సగా వెళ్ళినదై తూర్పునసముద్రములో నైక్యమొందుచున్నదో, అలాగున భక్తివైరాగ్యములు ఆత్మజ్ఞానములో గలసి, ఈశ్వరసుఖమును బొంది, చిన్నగా జ్ఞానరూపమైన జ్ఞానానందసాగరమగు

పరమాత్మలో నేకమై బ్రహ్మాకారస్థితిని బొందుచుండును వైరాగ్యమన్నను, యోగమన్నను, నొకేయర్థమును దెలుపుచుండును ఎన్ని సాధనలుండినను, అవి జ్ఞానములో ఏకాకారమును బొంది ముక్తిని గలుగజేయుచుండును

824 విశ్వాసము మానవుని ఊర్ధ్వలోకమునకున్నూ, అవిశ్వాసము అధోలోకమునకున్నూ గొనిపోవును

825 ధైర్యము మనుజుని పైలోకమునకున్ను, అధైర్యము క్రిందిలో కానికిన్నీ లాగుచుండును

826 శ్రద్ధ మనుజుని ఉన్నత లోకమునకున్నూ, అశ్రద్ధ నిమ్న లోకమునకున్నూ ఆకర్షించును

827 సోమరితనము మర్త్యుని నీచస్థితిలోనికిన్నీ సోఽహంపరత్వము ఉచ్చస్థానములోనికిన్నీ ప్రవేశపెట్టును

828 ఓ సాధువులారా! కాలగతి నిమిష నిమిషమునకు మారుచున్నది పూర్వకాలము సమయమునంత జాగ్రత్తపరచి చెప్పటకు అంత యనుకూల పరిస్థితిలో లోకముండినది కాదు ఏలన అప్పడు గడియారము మొదలగు యంత్రము లుండినవి కావు ఇప్పడో నిమిషముకాదు, సెకండు కాలమును గూడ గుర్తుపెట్టి చెప్పేకాలము వచ్చినది కావున కాలముయొక్క విలువను కనిపెట్టి జాగ్రత్తవహింపనిచో, సాదులోకము ఉద్ధరింపబడజాలదు అనగా కాలాతీతమగు బ్రహ్మమును పొందజాలము కాలమునకు లోబడిపోవడమే కాలునికి (మృత్యువునకు) లోబడిపోవటమని మరువకుడు

829 తాను జన్మించిన కుల (దేహ) ఆశ్రమధర్మమును మాత్రము ఆధారము చేసుకొని వర్తించువాడు రాగినాణెముల విలువను పొందును జీవధర్మమగు అంతఃకరణము ననుసరించి ప్రవర్తించువాడు వెండినాణెముల గౌరవమును పొందును జీవ స్వభావము లెస్సగా నెరిగి ప్రవర్తించువాడు సువర్ణ నాణెముల గొప్పతనము నొందును జీవాత్మయందు పరమాత్మావస్థను

గలిగినవాని మహిమ, విలువ వర్ణనాతీతము అనగా అనంతము

830 నీటిపైన వ్రాసిన అక్షరములకున్ను, పలకపైన వ్రాసిన అక్షరములకున్ను, రాతిలో చెక్కిన అక్షరములకున్ను ఎంత తారతమ్యము గలదో అనగా నీటిపై వ్రాసిన అక్షరములు వెంటనే మాయమైపోవును పలకపై వ్రాసిన కొన్ని రోజులవరకు నిలుచును రాతిపై చెక్కిన అక్షరములు ఎల్లప్పుడు నుండును ఆలాగున బోధకులు ముముక్షువులకు గీత, ఉపనిషత్తు, సూత్రభాష్యము మొదలగు శాస్త్రములను బోధించునప్పుడు ఆయా శాస్త్రములను పఠనము చేయకపోయిన నీటిపై వ్రాసిన అక్షరముల వలె మరచిపోవుదురు సామాన్యముగా శ్లోకములను చక్కగా చదువనేర్చిన వారయినచో కొద్ది రోజుల వరకు పలకలో వ్రాసినదివలె జ్ఞాపకముండును శ్లోకసూత్రాదులను బాగుగా కంఠస్థము చేసిన వారయినచో యావజ్జీవితము వరకు రాతిలో చెక్కిన అక్షరములవలె జ్ఞాపకముండును శాస్త్రపఠనముచే గలిగెడు ప్రయోజనము ఇటువంటిదని తెలియందగినది

831 మనో బుద్ధీంద్రియముల కందని జీవబ్రహ్మల యేకత్వమగు పరమాద్వైత నిర్గుణ బ్రహ్మమును చింతించుటకు శక్తి లేనివారు బుద్ధికి సాక్షిగా నుండు ఆత్మను, లేక కరుణా స్వరూపుడును, జ్ఞానస్వరూపుడునగు ఈశ్వరుని ధ్యానించుట, భజించుట, స్మరించుట, జపించుట మొదలగు కార్యములు చేయుటయే మేలైనది ఏలన నోటికి అందని వస్తువు మహారుచికరమైనదిన్నీ, దివ్యరసమైనదిన్నీ అయినను ఏమి ప్రయోజనము! ఆకలిబాధచే దుఃఖపడవలసినదిగదా! అట్లు క్లేశపడుటకన్న నోటికి దొరికిన సామాన్యవస్తువులు భుజించి సుఖించుట మంచిదిగదా! ఇట్టి యనుష్ఠానము చేయుచు రాగా రాగా మరల యంతఃకరణ శుద్ధి గలిగి రాగా రాగా అతీంద్రియ బ్రహ్మమును భావన చేయుటకు అంతఃకరణమునకు శుద్ధియు, యోగ్యతయు గలుగును అప్పుడు ఇంద్రియాతీతమగు నిరాకారనిర్గుణ బ్రహ్మోపాసన చేయవచ్చును

832 సామాన్యమనుజుల జీవితము కోతికి దొరికిన టెంకాయ

వంటిదే యగును దానిని పగలుగొట్టి దానియందుగల కొబ్బరిగాని, నీరుగాని భుజించుటకు దానికి సాధ్యము గాదు ఆ పీచుతో గూడిన కొబ్బరికాయ ఒకమానవునికి దొరికినచో, పగులగొట్టి దానిలో గల కొబ్బరియు నీరును భుజించునట్లుండును వివేకము గల వాడు తనకు లభించిన మానుష జన్మముయొక్క అంతరమున వెలుగుచుండు అమృతత్వమును భుజించి ఆత్మతృప్తిని బొందగలుగును ముక్తి సుఖము నొందును

833 మహాసముద్రములో ప్రయాణము జేయు నావికుడు అప్పుడప్పుడు ఓడ దారి తప్పక పోవుచున్నదా? సముద్రాగాధ భాగములోగల పర్వతములకుగాని మంచుగడ్డగట్టిన అయిసు పర్వతములకుగాని ఎదురుగా పోవుచున్నదా? ఏదైన నపాయకరములుగాని, ఇతర యోడలుగా అడ్డుగా వచ్చుచున్నవా యని దూరదర్శిని యను యంత్రముచే నెట్లు జూచుచుండునో ఆలాగున సంసారసాగరమును దాటదలంచిన సాధకుడున్నూ తన గమ్యస్థానమున కేదైన అడ్డులు గలుగుచున్నవా! విషయవృత్తులు అడ్డు వచ్చుచున్నవా! మనసు దైవభావమునుండి దృశ్యములపై దారిదప్పి పోవుచున్నదా! సత్యమునుండి ధర్మానుష్ఠానమునుండి, మాయ తన్ను దూరముగా తీసికొని వెళ్ళుచున్నదా యని సూక్ష్మదృష్టితో జూచుచుండవలయును లేనిచో నజాగ్రత్త గల నావికునివలె ప్రమాదములో బడిపోవును

834 సామాన్యముగా స్వల్పానుష్ఠానము గలవారు ఈలాగున జెప్పుదురు సంసార కార్యములు చూచుకొని ఏల జ్ఞానమును బొందగూడదు! ప్రారంభములో కొంతవరకు, అలాగుననే జేయవచ్చునుగాని, పూర్ణనిర్వాణస్థితి లోనికి వెళ్లునప్పుడు వారు జెప్పునట్లు సాధ్యము గాదు ఏలన ఒకే పాత్రలో నొకే సమయమున రెండువిధములైన వంటకములు ఎవరు జేయగలరు?

835 మానవులారా! కర్మరహస్యము అతిసూక్ష్మమైనది ఇదివరలో చేసిన కృషికి అనుసరించిన ధాన్యములను ఇప్పుడు భుజించుచున్నాము ఇప్పుడు చేసెడు వ్యవసాయము ననుసరించెడు ధాన్యములను ఇంక మీద

భుజించగలము ఆలాగున భూతకాలమునచేసిన కర్మఫలమును ఇప్పడనుభవించు చున్నాము ఇప్పడు చేయు కర్మఫలమును భావికాలమున తప్పనిసరిగా ననుభవించవలసియున్నాము ఉత్తరక్షణమునకు జరిగిన కాలము భూతకాలముతోను, ఈక్షణమునకు ముందు జరగబోవు కాలము భావికాలముతోను చేరుచుండును కావున వర్తమాన సుఖమునకుగాని, దుఃఖమునకుగాని, భూతకాలకర్మమే కారణమగుచున్నది వర్తమానకర్మయే భావిసుఖమునకు గాని, దుఃఖమునకుగాని హేతువని మరువకుడు ఈ దినము వర్తమానకాలము నిన్నటిదినము భూతకాలము రేపటిదినము భావికాలమగును ఇది గ్రహించి భావిశ్రేయస్సును గలుగజేసుకొనవచ్చును దీనిని గ్రహించుకొనక జరిగిన జన్మలకర్మ భూత కాలమనియు, జరుగచున్నది వర్తమాన కాలమనియు, రాబోవు జన్మకర్మఫలమే భావికాలము అనుభవించ వలసి యున్నదనియు, గ్రహించుకొనిన చాలును అట్లయిన మందమతులు జరిగిన జన్మము ఎవరు చూచిరి? జరుగనున్న జన్మమెవరు చూడగలరు? కావున ప్రస్తుతము జరిగేలాగున చూచెదము అని తలంతురు ఇదే మాయామహిమయొక్క రహస్యము

836 ముముక్షువులారా! జిజ్ఞాసువులారా! వినుడి, పక్షిపిల్లలు బాగుగా రెక్కలు వచ్చువరకు గూటిలోనే యుండును ఏదో ఒకటి యెప్పడైన రెక్కలు లెస్సగా వచ్చిరాని సమయమున చెట్టుకొమ్మలపై తిరుగుటకు ప్రారంభించును లేక యెగురదొడంగును అప్పడు క్రింద పడిపోవగలదు వెంటనే పిల్లులుగాని కుక్కలుగాని, దానిని చంపివేయును బాగుగా రెక్కలు వచ్చిన పక్షులు ఎగిరినను క్రింద పడిపోవు ఆలాగుననే కొంతవరకు సాధన గలిగి సాధ్యస్థితిలోనికి రానివారున్ను వైరాగ్యబోధలు బాగుగా కలుగనివారు లోక వ్యవహారాదులలో ప్రవేశించినను లేక ప్రకృతి గుణముగల స్త్రీలతోగాని, ధనముతోగాని వ్యవహరించిన ప్రకృతియనెడు పిల్లిగాని కుక్కగాని, మ్రింగివేయునని మరువకూడదు

837 నియమనిష్ఠతో జీవితము గడుపుటలో మిక్కిలి జాగరూకత

గలిగి యుండవలసియుండును కొందరు ఇతరులను స్తుతిజేసియు, మరికొందరు ఇతరులకు అండగను నుండేలాగున నుండియు తమ జీవితావసరములను పొందుచుందురు ఈతరగతులలో చేరినవారిలో సాధువులు కొందరున్ను, భక్తులు కొందరున్ను గలరు ఇది వారి బుద్ధి నైపుణ్యముచే జరుగుచున్నట్లు తలంతురు యథార్థముగ విచారించిన ఇదిన్ని యొక్క విధమగు ఆత్మ వంచకమే లేక మరియొక విధమగు ఆత్మమోసకృత్యమే యగును దీని యందు సంపూర్ణ సత్యముగాని, నిష్కామ మనోవృత్తిగాని, లేనందుచే అది నిష్కామకర్మ యోగమందు చేరదు అదిన్ని గాక అపరిగ్రహవ్రతమునకు చాలా దూరమైనది ఇట్టివారికి ఆత్మశుద్ధిగాని, విషయవిరక్తి గాని గలుగవు అయితే తమపైగల విశ్వాసముతో ప్రీతితో ఎవరైనను ఇచ్చినచో తీసికొనవచ్చును అదిన్ని అత్యవసరముకొఱకు మాత్రమే యుండవలయును లేనిచో తన పుణ్యము క్షయించును

838 ఓనాయనా! నీవు లక్ష్యములో చేరినచో అయ్య అగుదువు లేనిచో కొయ్య అగుదువు లక్ష్యములో చేరినవాడు లక్ష్మయ్య అగును లక్ష్మయ్య అనగా లక్ష్మియొక్క అయ్య అనగా శ్రీవిష్ణువగును లేక విష్ణుపదమును పొందగలుగును లేనిచో కొయ్య యగును కొయ్య యనగా కర్ర యని భావము కట్టెలని అర్థం అనగా శ్మశాన భూమిలో చేరగలడని భావము

839 జీవులకు నాలుగు విదములగు సంస్కారములు సమకూడు జన్మమునందే మోక్షము గలుగును 1 పుణ్యసంస్కారము ఇది సరిగా లేనిచో జీవనోపాయము అనుకూలముగా సమకూడదు 2 శ్రీసద్గురుని యనుగ్రహము ఇది లేనిచో వైరాగ్యము స్థిరముగా నుండదు 3 ఈశ్వరానుగ్రహము ఇది కలుగనిచో ప్రకృతిదోషము నశించదు అనగా ప్రకృతి తొలగదు 4 మహర్షుల యనుగ్రహము ఇది లేనిచో బ్రహ్మ విద్యలో ప్రవేశముండదు ఈనాలుగున్ను పూర్వపుణ్యవిశేషముచేతనే జీవులకు సిద్ధించును ఈనాలుగింటిలో నేది లోపించినను మోక్షమార్గమునకు అడ్డు

గలుగును కావుననే అనుభూతి ప్రకాశమం దిటుల తెలుపబడినది

నైవ జన్మని సర్వస్మిన్ విద్యాఽసా సులభాఽపితు ।
శిష్యలక్షణ సంపూర్ణ జన్మన్యేవ హి లక్ష్యతే ॥

అన్ని జన్మముల యందీవిద్య సులభము కాదు శిష్యలక్షణములు సంపూర్ణముగా నున్న జన్మమునందే కనబడుచున్నది మరియు బ్రహ్మాను గ్రహము లేనిచో వేదవిద్యయందును, విష్ణ్వనుగ్రహము లేనిచో పోషణయందును, ఈశ్వరానుగ్రహము లేనిచో వైరాగ్యమందును, ఋషుల యనుగ్రహము లేనిచో వేదాంతమందును జీవులకు ప్రవృత్తి కలుగదు అని పెద్దలు చెప్పుదురు

840 సంసారవాసనలో నుండి విరక్తులై ముక్తిమార్గములోనికి వచ్చువారికిన్ని, సంసారవాసన తగులక బ్రహ్మచర్యమునుండి మోక్షమార్గమునకు వచ్చువారికిన్ని కొంత వ్యత్యాసము గలదు మట్టిదుత్తలో నేయిపోసియుండిన దానికిన్ని, జాడీలో నెయ్యిపోసిన దానికిన్ని తారతమ్యముంటున్నది మట్టిపాత్ర యయినచో దాని పెంకులో నెయ్యి కలిసియుండి అనెయ్యి తీసివైచినను పెంకులో గల చమురు వాసన మిగిలియే యుండును జాడీ యయినచో నెయ్యి యంటియుండదు మట్టిపాత్రయు, జాడీయు మట్టితో జేయబడినవయ్యును మట్టిపాత్రయొక్క మట్టి అంత మంచిది కాదు అదియును గాక ఆపాత్ర మిషన్ లో తయారై కాలినది కాదు జాడియో! గట్టిరకము మట్టియేగాక మిషనులో తయారైనదిన్ని, మిషన్‌లో కాలిన దగుటవల్లను చమురు అంటుకొనుట లేదు అయితే మట్టికుండ గతి యింతేనా అని సంశయింప పనిలేదు దానిని నిప్పులో కాల్చిన చమురంతయు కాలిపోవును అలాగున సంసారవాసన తగిలియుండినవారు మరింత తపోధ్యానాదులను చేయవలెను అప్పుడు అట్టివారియందుగూడ సంసార వాసన యుండదు మరియు, ఊరగాయ వేసిన మట్టిపాత్రమున కున్ను అలాగుననే ఊరగాయ వేసిన జాడీకిన్ని ఎంత తారతమ్యము గలదో, అలాగున బ్రహ్మచర్య వ్రతానుష్ఠానము లేనివారి

దేహమునకున్ను, కలవారి దేహమునకున్న భేదముండును

841 వేలకొలది సంఖ్యల పుటలుగల ఒక మహాగ్రంథము చదువుచున్నప్పుడు ఇది యెంత కాలమునకు పూర్తియగునని భయము గలుగవచ్చును కాని క్రమముగా సగమువరకు వచ్చునపుడు కొంత సమాధానము మనస్సులో గలుగును మరల ప్రతిరోజు చదువుచూ వచ్చునప్పుడు మరింత మనఃశాంతియు సుఖావిర్భావము ఉదయమగు నప్పుడు ఇక ప్రయాసము లేదనియు, త్వరలో పూర్తి చేయవచ్చుననియు సంకల్పము దృఢమగును అధ్యాత్మనిష్ఠలోను పైవిధముగా మొదట తోచును అనుష్ఠానము చేయుచు రాగరాగ మనశ్శాంతియు, ఆనందావిర్భావమున్ను గలుగునపుడు ఈజన్మములోనే తాను తరించవచ్చుననియు, ఈ ధ్యానములో అనంతానందము గలిగియుండుననియు విశ్వాసమేర్పడును

2. ఓ సాధువులారా! మీరు ధ్యానము కొఱకు ఏకాంత గదిలోనికి వెళ్ళునప్పుడు మరెవరున్నూ రాకుండుటకొఱకు తలుపులను వేసికొనెదరు ఆలాగున చేయుట, బాహ్యక్రియలన్నియు అంతరంగ రహస్యమును తెలిసికొనుటకొఱ కేర్పడినవి కావున గదియొక్క కవాటమును మూయునట్లు మీ హృదయముయొక్క దర్వాజనుగూడ మూయు చుండవలయును అనగా ఏసంకల్పమును గలుగనీయక చుచుకొనవలయును

842 ఒకడు సోమరియా, లేక సోమరితనము లేనివాడా యని గ్రహించుటకు గురుతు గలదు ఒకనిని ఏదైన నొకపనికొఱకు పిలిచిన నిదానముగా ఆపని కొంతవఱకు అయిన తరువాతనే వచ్చును మరల ఆపని పూర్తి యగుటకు ముందుగా వెళ్ళిపోవును సోఽహం పరుడైనచో ఆకార్యమునకు ముందుగా వచ్చును ఆకార్యము శుద్ధముగా పూర్తియైన పిమ్మటనే వెళ్ళిపోవును దానియొక్క గురుతిదియే

843 ఓ సాధువులారా! భక్తులారా! జీవులు మోక్షము నొందుటకు నొకసూక్ష్మమైన రహస్యము గలదు దానినెల్లప్పుడున్నూ అనుష్ఠానములో నుంచిన చాలును అదేమన మీరు ఇతరులకు ఏధర్మము

నుపదేశించుచున్నారో, ఆలాగున మీరు నడచుచున్నారా యని చూచుకొనిన చాలును ఇట్టి స్థితిలోనికి మీయాత్మ ప్రవేశించనిచో మీయోగముగాని, తపస్సుగాని, జ్ఞానముగాని మీకేలాటి యుపయోగమునున్నూ గలుగజేయజాలవు

844 నిర్మల హృదయముతో దైవభావన చేయువారు ప్రాపంచిక విషయములలో ఎక్కువ ప్రవృత్తి గలిగియుండరాదు వారి హృదయము ఎల్లప్పడును ప్రశాంతముగాను, ఏలాటి భారము లేనిదిగా నుండవలయును అట్టిన మాత్రమే వారు దైవలోకములో (ఆత్మలోకములో) పనిచేయుటకుగాని, దైవధర్మములను కనుగొని లోకమునకు తెలుపుటకు గాని శక్తిగల వారగుదురు సుసూక్ష్మవిషయములను కనిపెట్టెడు యంత్రములలో భారమైన బరువును పెట్టినచో ఏలాగున ఆ యంత్రము పనిచేయజాలదో, లేక చెడిపోవునో, ఆలాగున సూక్ష్మమైన దైవరహస్యమును కనుగొనుటకు ప్రశాంత ప్రసన్న హృదయము గలిగియుండవలయును ఇది వారివారి హృదయానుభవము చేతనే తెలుసుకొనందగును దీనివల్ల సోమరులై యేకార్యమున్ను చేయక యుండవలెనని యర్థము కాదు సోమరులను సోత్సాహంపరులను సమానముగా చూచువారు గాఢసుషుప్తిలో నుండువారిని, నిర్వికల్పసమాధిలో నుండువారిని ఒకే విధముగా చూచువారివలె నుందురు

845 ఎంత ప్రజ్ఞావంతుడైనను, ఎంత చదువరియైనను, తాను కాగితముపై వ్రాయునపుడు అడుగుభాగము గరుకుగా నుండినచో అక్షరములు ఏలాగున శుద్ధముగా వ్రాయజాలడో, అడుగున సమముగా నుండిన మాత్రమే స్పష్టముగా అక్షరముల లిఖింప గలుగునో ఆలాగున హృదయము ప్రసన్నముగాను, ప్రశాంతముగాను, సర్వసమముగాను లేనివాడు ఎంత విద్యావంతుడైనను, ధ్యాననిష్ఠజేయువాడైనను శాంతిని, పరమానందమును పొందజాలడు

846 భవరోగవ్రణము నశించునప్పడు అజ్ఞానమనియెడు

ఆవరణము స్వయముగానే వదలిపోవును దానికి ముందుగా నిష్కామ కర్మయోగానుష్ఠానమును విడిచినచో, గృహత్యాగమునుగాని జేసినచో భవరోగముచే బాధపడవలసి యుండును ఎటులనగా దేహములో వ్రణము లేచినచో మందులను వాడుటచే దానిపైగల పొక్కు (చర్మము) స్వయముగానే యెండి వదలిపోవును అట్లు స్వయముగా పొక్కు రాలక ముందుగా పట్టి లాగినచో రక్తము కారును పుండు మానక వృద్ధి యగును కురుపు ఆరి మానవలసియుండిన ఔషధపథ్యముల సేవించవలయును ఇదియే ఆత్మయొక్క ఆవరణము నశించెడు ఉపాయము

847 కర్మ ప్రధానమా? లేక మనస్సు ప్రధానమా? అను విషయములో మనస్సే ప్రధానమని చెప్పెడు భాగమొకటి గలదు. అది అందఱికిని సాధ్యమైనది గాదు కర్మయే ప్రదాన మనుభాగము సర్వులకును సులభ మార్గము ఏ విధమనగా క్షుత్పిపాసాదులను మనోనిగ్రహముచే నివర్తింపజేయుశక్తి గలవారుండిన అట్టివారికి మనస్సే ప్రధానము అట్టివారెంతమంది యున్నారో, ఆలోచించుకొనుడు అట్లు గాక ఆహార ఔషదాదులచే క్షుత్పిపాసాదులను నివర్తింపజేయు టెంత సులభముగా నుండునో కర్మను మార్పుజేయుటంత సులభము గానుండును

848 ఇంకను వినుడు కంటకాదివిషవృక్షములచే నిబిడమయిన అరణ్యమును సంకల్పముచే నివర్తించి మంచివి యగు పుష్పఫలాదియుక్త వృక్షములుగా జేయ శక్తిగలవారు ఎంతమంది యుందురు? అట్లుగాక కంటక కషాయాది వృక్షములను నరికి వేరులతో సహా తీసిపైచి మంచి పుష్ప మధురవృక్షాదులను నాటి సంరక్షించుటకు ఎట్టివారి కెంత సులభ మార్గమో ఆలాగున కర్మలను మార్పు జేసికొనియెడు వారికి అంత సులభమై యుంటున్నది

849 ఒకరి మనస్సు మంచిదగుటకును, చెడ్డది అగుటకును కారణమేమని అడిగిన పూర్వపుణ్యకర్మ, పాపకర్మల ఫలమేయని శాస్త్రవాక్యమున్ను, జనవాక్యమున్ను చెప్పనట్టి ప్రమాణము చాలదా!

850 సంసారుల హృదయమునకున్నూ, అసలు సాధువుల హృదయమునకున్నూ, నిప్పుకున్నూ నీటికిన్నీ గల భేదము గలదు సంసారుల హృదయ మెల్లప్పుడున్నూ దృశ్యసంబంధమైన దన ధాన్యగృహారామ దృశ్యాలంకారాదులయందే రమించును నిజమైన సాధువులయొక్క హృదయమో! ఎల్లప్పడున్నూ, దృక్కైన యాత్మయందే, ఉపరతియందే, దైవమందే రమించును అట్టి నిజమైన సాధువులకు ఆత్మరతికన్న మించినది త్రిలోకములయందు కొంచెమైనను గనుపించదు అట్టివారికి ఆత్మరతికన్న మించిన ఘనకార్యము దృష్టిలో గోచరించదు అజ్ఞానికి కానిపించు దృశ్యాలంకారాదులన్నియు నశ్వరములనియు, దుఃఖకారణము లనియు వారు ఎరింగియుందురు అజ్ఞాని పాపము ఆత్మశుద్ధిలేనివాడగుటచే మొదట శాశ్వతమని తలంచినది నశించునప్పడున్నూ, సుఖముగా దలంచినది దుఃఖముగా పరిణమించునప్పడున్నూ దీనియొక్క యనిత్యత్వమును దెలిసికొనుచున్నాడు అపుడు దుఃఖించిన ప్రయోజనమేమి? సాధువైనవానికి తన ఆత్మశుద్ధికన్న, ఆత్మశాంతికన్న మించిన గొప్పకార్యమేమియు, పుణ్యకార్యమేమియు గనబడదు నిప్పలో నీళ్ళున్నూ నీటిలో నిప్పన్నూ, కలియని రీతిగా సన్న్యాసి, సంసారి హృదయములకు మార్పుగలదు నిప్పలో నిప్పన్నూ, నీటిలో నీరున్నూ కలియురీతిగ ఉభయులయొక్క స్థితియు గలిగియుండును ఇది వారి వారి యనుభవములచే తెలిసికొనవలసినదే గాని వేరు మార్గము లేదు

851 తన ఆచరణలో లేని గొప్ప భావములు లోకమునకు చెప్పిన అనుష్ఠించునని భ్రమపడకుము అది లోపల గింజలేని విత్తనములను విత్తినట్లుండునని మరువకుము

852. సాధకుడు తనసాధనకాలములో అన్న మంత ధ్యానమున్ను, కూరయంత శాస్త్రపఠనమున్ను గలిగియుండవలెను ధ్యానారూఢస్థితి కలిగిన పిమ్మట కూరయంత ధ్యానమున్ను, అన్నమంత వేదాంతశాస్త్ర విచారణయు గలిగియుండవలయును

853 గొప్ప స్టీమరులో వేలాదిజనులను, వేలాదిటన్నుల బరువుగల సామానులను తీసికొనిపోవునది చూచి చిన్నపడవలు గలవారు పై విదముగా ఎక్కించిన సముద్రములో మునిగిపోవును ఆలాగున మహా ప్రవక్తలవంటి వారుచేయు గొప్ప కార్యములను చూచి అట్టి శక్తిలేనివారు ప్రర్తించిన గలిగెడు స్థితియు నుండునని మనస్సులో నుంచి ప్రవర్తించవలెను

854 ఆకాశము తన స్వభావమగు శబ్దమును, వాయువు తనస్వభావమగు చలనమును, అగ్ని అనగా సూర్యుడు తన స్వభావమగు ప్రకాశమును, జలము తనస్వభావమగు శైత్యమును విడిచి యేలాగున నుండుట లేదో ఆలాగున ఆత్మజ్ఞానియు తనస్వభావమగు దైవత్వమును మరచి యుండుట లేదు

855 సత్త్వగుణ స్వభావముగలవాడు శత్రువును సహ మిత్రునిగా చేయుటకు యత్నించును రజోగుణస్వభావముగలవాడు శత్రువును శత్రువుగా, మిత్రుని మిత్రునిగాను చూచుచుండును తమోగుణము గలవాడు తనకు గావలసియుండిన మిత్రునిసహా శత్రువుగా చేసే స్వభావము గలిగి యుండును ఈ మూడు గుణములనాలోచించిన తన స్వభావమెట్టిదో కనుగొనవచ్చును

856 ముముక్షువులారా! మీరు ఎంతద్యానముగాని, జపముగాని, యోగసాధనలుగాని అభ్యసించుచుండినను వేదాంత విద్యాపరనమును మాత్రము చేయుచుండవలయును అది లేనిచో బుద్ధి వికసించదు విశాల భావమున్ను గలుగదు ఆత్మస్వరూప నిర్ణయమును సిద్ధించదు ఋషులమార్గమున్ను గోచరించదు ఏలన ధ్యానములోగాని, జపములోగాని, ఆసన ప్రాణాయామాదులయందుగాని, కీర్తనాదుల యందుగాని, బుద్ధికి పని యేమియు కలుగదు ఆత్మ విచారణ శాస్త్రచింతనయందు మాత్రమే బుద్ధికి పని తగులుచుండును అపుడు బుద్ధి జాగ్రదవస్థలోనికి వచ్చును పై చెప్పిన జప యోగాదులన్నియు అపుడు

బుద్ధియొక్క ఏకాగ్రతకున్ను, నిర్మలత్వమునకున్ను, జాగ్రతకున్ను ఉపయోగపడును అత్తరి నిద్రలో నుండు మహాపండితునివలె బుద్ధి జడావస్థను పొందియుండును ఆత్మవిద్యావిచారణ జ్ఞానములచే నిద్రనుండి మేల్కొనిన విద్వాంసునివలెను, సార్వభౌమునివలెను ఆత్మస్వరూపజ్ఞానము కలుగును నిద్రలో నుండువరకు పై నుదాహరించిన పండిత చక్రవర్తులకు తమ మహిమ తెలియనట్లుండుననియు, నిద్రనుండి మేల్కొనిన వెంటనే తన మహిమాతిశయములను తెలిసికొని నట్లుండుననియు మఱువకుడు మెదడు పరిశీలకులు గూడ అనేక సంవిత్తు అణువులు మెదడులో నిద్రావస్థలో నున్నవనియు, అందువలననే ప్రజ్ఞామాంద్యము గలుగుటకు కారణమనియు, తపఃస్వాధ్యాయ యోగాదులచే నవి జాగ్రదవస్థలోనికి వచ్చుననియు, అందువలననే యోగులకున్ను, తాపసులకున్ను అతీంద్రియ జ్ఞానము కలుగుచున్నదనియు తెలుపుచున్నారు మరియు బంగారు పనివారున్ను, ఇనుపపనివారున్ను బొగ్గులో కొంచెము నిప్పవేసి వూదునపుడు ఆనల్ల బొగ్గలన్నియు నిప్పగా ఎట్లు మారునో ఇదిన్ని అటువంటిదని గ్రహించుకొనుడు

857 మానవులు ఇహములోను, పరములోను, పూజ్యతను పొందవలసి యుండిన ఇహమునకు నియమశీలనమున్ను, పరమునకు జ్ఞానము లేక భక్తియున్ను గలిగియుండవలయును నియమము మాత్రము గలిగియుండిన ఇహమునకే పనికివచ్చును జ్ఞానము లేక భక్తిగలిగియుండిన మాత్రమే పరమున కుపయోగపడును రెండును గలిగియుండుటయే మహాపురుషుల లక్షణమగును ఎట్లన, భుజించు ఆహారము చూచినప్పుడు శుద్ధముగాను, భుజించిన సారవంతము అనగా బలమును గలుగజేయునదిగాను ఉండవలయును చూచుటకు, రమ్యముగా నుండినను, సత్తువ లేని యాహారము నిస్సారముగదా! ఈ రెండును గలిగినదే శుద్ధాహారమనియు, సాత్త్వికాహారమనియు చెప్పబడును

858 సోదరా! పగలు 12 ఘంటలను మూడు భాగములుచేసిన,

ఉదయం 6 ఘంటల నుండి 10 ఘంటలవరకు 4 ఘంటలలో సూర్యప్రకాశమున్ను, వేడిమియు సామాన్యముగా నుండును 10 ఘంటల నుండి 2 ఘంటలవరకు 4ఘంటల సమయము ప్రకాశమున్ను, వేడిమియు విశేషముగా నుండును 2 ఘంటలనుండి 6 ఘంటలవరకు 4 ఘంటలు కనీసము అనగా కనిష్ఠముగానుండును, అట్లే మానవునికి 20 సంవత్సరముల వరకు ప్రజ్ఞయు, శక్తియు సామాన్యముగా పెరుగుచుండును 20 నుండి 40 సంవత్సరములవరకు విశేషముగా మనశ్శక్తియు, ప్రజ్ఞయు, శరీర బలమున్ను వృద్ధినొందుచుండును 40 నుండి 60 సంవత్సరముల వరకు కనీసముగా అనగా కనిష్ఠముగా నుండును కలియుగమున సామాన్యముగా 60 సంవత్సరములుగా మానవజీవితమును నిర్ణయించిరి కావుననే 60 సంవత్సరములు వచ్చినపుడు షష్టిపూర్తి విధించడమైనది అవల జీవించినను గొప్పకార్యమేదియును చేయజాలరు అందువలన 20 సంవత్సరములనుండి 40 సంవత్సరములవరకు బహుజాగ్రత్తతో చూచుకొనవలయును విద్యయందుగాని, జ్ఞానమందుగాని, తపస్సు నందుగాని ఈకాలములోనే ప్రవర్తించవలయును ఏ మహనీయుల చరిత్రము చూచినను ఈ యవస్థలోనే విద్యగాని, జ్ఞానముగాని, తపస్సుగాని, యోగముగాని సంపాదించినట్లు కానుపించును అయితే వయస్సు గడచినవారు ఇప్పడు ఆరంభించిన వ్యర్థమని తలంచవలదు ఒకవేళ ఈ జన్మములో పూర్తిగాక పోయినను మరుజన్మములో నది తప్పక యుపయోగపడును స్త్రీలకు 15 సం॥ల నుండి 35 సంవత్సరములవరకు తగినకాలమని మరువకూడదు

859 ప్రశ్న - మహాత్ము లైనవారు సర్వులను సమానముగా చూడవలయునుగదా? అనగా అందరి అభివృద్ధిని గూర్చి యత్నించవలసిన వారుగా నుండేవారు ఒకేజాతి అభివృద్ధిని గూర్చి యత్నించుట యెట్లు బాగుండును? వారెట్లు మహాత్ములగుదురు?

ఉత్తరము - ఒక తల్లిదండ్రులకు కొందఱు బిడ్డలుండిన బాగుగా చదివి ఉద్యోగులై యుండేవారిని గురించి బాగుపఱచపని లేదు వారలలో ఎవరు

విద్యావిహీనులై దనార్జనవిషయము తెలియక దీనావస్థలో నుందురో అట్టివారిని బాగుచేయ యత్నించుటలో పక్షపాత మేమున్నది? ఆలాగున ఒక వైద్యునకు కొందఱు బిడ్డలు గలరని తలంచుడు ఆరోగ్యవంతులై యుండేవారిని బాగుచేయుటకు చూచిన లేక రోగగ్రస్తులయి యుండేవారిని చక్కవఱచుటకు యత్నించిన యిదిన్నిఆలాగుననే యుండును ఒకరి శరీరమందు ఏయేఁ అవయవము వ్యాధి పీడితమైయుండునో, అట్టి అంగమునకు చికిత్స చేయుటలో పక్షపాత మేదైన గలదా? ఇదిన్ని ఆలాగున నని గ్రహించుడు

860 మానవులారా! దైవతార్చన చేయువారును, మరికొందఱును ప్రతిరోజును పూజాపాత్రలను చెంబులను బూడిదచేతగాని, మట్టిచేతగాని తోమి శుద్ధవఱచుట చూచుట లేదా? ఆలాగున భక్తులలో కొందఱు విభూతులను, నామములను స్నానానంతరము లలాటమున హృదయమున ధరించుచున్నారు దీనిలోగల రహస్యమేమన, బూడిదచే మట్టిచే పాత్రముల శుద్ధపఱచినట్లు, బుద్ధికి స్థానమగు భ్రూమధ్యమునను, మనస్సునకు స్థానమగు హృదయమునను మీరు ప్రతిరోజు మాలిన్యము కలుగక యుంచవలయుననియే కావున విభూతి తిలకాదులు దరించువారు ఈనత్యమును ప్రతిరోజును హృదయమునందుంచి విచారణ సలుపవలయును

861 జనులారా! ఒకడు ఒక అరణ్యప్రదేశమున మంచి ఫలవృక్షములను పెట్టదలంచునప్పుడు దానియందుగల కంటకాది వృక్షములను సమూలముగా తీసివేసి మంచిఫలవృక్షములను పెట్టును ఇది ఒక పక్షము మరియొకడు ఆటంకములైన కొన్ని వృక్షములను తొలగించి ఫలవృక్షములను పెట్టిన పిమ్మట క్రమముగా పాతకంటకాది వృక్షములను వ్రేళ్లతో సహా తొలగించును ఈలాగున ఒకడు గురూపదేశము బొంద తలంచునప్పడే పురాతన గుణములు గల పూర్వముండు వానిని తొలగించి ఉపదేశము పొందును లేక సన్యసించును ఇది ఉత్తమ పక్షమైనను

అందరికిన్ని సాధ్యమైనది కాదు కారణపురుషునకు మాత్రమే సాధ్యపడును తక్కిన వారందరు రెండవపక్ష మవలబించుటయే ఉచితము ఆధ్యాత్మజ్ఞానమునకు ఆటంకములైన ముఖ్య ప్రకృతి గుణములను కొంత తొలగించి గురూపదేశము పొందవచ్చును లేక సన్న్యసించవచ్చును అయితే ఫలవృక్షాదులను పెట్టిన రెండవవానివలె క్రమముగా హృదయారణ్యములో గల సమస్త ప్రకృతి గుణములను తొలగించేలాగున చూడవలయును లేనిచో సత్ఫలము పొందజాలరు కావున సన్న్యాసములో విద్వత్సన్న్యాస మనియు, వివిదిషా సన్న్యాసమనియు రెండు మార్గములు ఏర్పడుటకు కారణమైనది రెండవాడు నూతనముగా పెట్టిన ఫలవృక్షములను పోషించుచు, పాత కంటకాది వృక్షములను రహితమొనర్చునట్లు అధ్యాత్మ జ్ఞానవృక్షములను వృద్ధినొందించుచు పాతసంస్కార గుణములను రహిత మొనర్చేలాగున చూడవలయును

862. జనులారా! పక్షి వర్గముగాని, మృగవర్గముగాని వాటియొక్క శబ్దమును వినిన వెంటనే అవి యేవర్గమునకు చేరినవని ఎట్లు మనము తెలుసుకొనుచున్నామో, అనగా కోయిల, కాకి, ఆవు, గాడిద మొదలగువాని శబ్దములచేతనే పలానిజాతి యని యెఱుంగు చున్నామో అట్లే మానవులలోగూడ వారి వాక్యములను వినినవెంటనే వారు ఏజాతికి చేరినవారో తెలుసుకొనవచ్చును అనగా వారు చేప్పే వాక్యములలో సత్యము, శాంతము, కరుణ గల వాక్యములైనచో ఉత్తమజాతిగాను, పుణ్యజీవిగాను గ్రహించవచ్చును అసత్యము, అశాంతము, కఠినముగా నుండిన పుణ్యజీవియు ఉత్తమజాతియు కానట్లు తెలుసుకొనవచ్చును

863 సోదరా! నీవు విద్యావిషయమ్మైగాని, మరి యేవిషయమ్మైగాని ఇతరులనాశ్రయించునపుడు వారు చెప్పునది యెంత చిన్నవిషయమ్మై యున్నప్పటికిన్ని దానిని గొప్పగా గౌరవించవలయును నీయొక్క గొప్పతనమును కొంచమైనను అచ్చట చూపకూడదు అయితే నీయొక్క ధర్మసూత్రమునకు, అనుష్ఠానమూలమునకు భంగము కలుగనీయక

చూచుచుండవలయును, అట్లుగాక నీయొక్క మూలసూత్రమునకు, వ్రతనిష్ఠకు భంగకరమని తోచిన ఆస్థలమును వెంటనే విడువలయును ఏలన "ధర్మో రక్షతి రక్షితః" ధర్మమును రక్షించువానిని, అధర్మము రక్షించును ధర్మమందు, దైవమందు విశ్వాసము గలిగినవారిని ఈస్థలమున గాకపోయినను మరియొక స్థలమునందైనను రక్షించును పతివ్రతాధర్మమును పాలించెడు స్త్రీ విద్యావిషయమైగాని, ఆరోగ్య విషయమైగాని, ఉద్యోగ విషయమైగాని ఎచ్చటికి వెళ్ళినను తన పాతివ్రత్యమునకు భంగము కలుగనీయక చూచుకొనుచుండును మరియు అట్టిపావనవ్రతమునకు భంగము గలుగునని తోచిన ఎటువంటి స్థలమైనను వెంటనే త్యజించును ఇట్టి స్వభావముగల జీవులే ధన్యజీవులు వీరిని భగవానుడు తప్పక రక్షించును ఇట్టి వారికి తనజీవితము గొప్పదను తలంపు గలుగదు తన ధర్మమే గొప్పదను బుద్ధి సదా గలిగియుండును

864 దేవాలయములు మొదలగు స్థలములలో భేరీ, ఘంటా, బ్యాండు మొదలైన వాద్యముల మధ్య సూక్ష్మమగు వీణానాదము ఏలాగున వినజాలమో ఆలాగున హృదయమున ఏదైన సంకల్పములున్నప్పడు కకసోఽహంభావముగాని, దైవభావముగాని గోచరము కాజాలదు కావున ఏకాంతమున్ను, ప్రశాంత ప్రసన్నహృదయమున్నూ బ్రహ్మనిష్ఠలు గలిగియుండేలాగున చూడవలయును అంతేకాదు, అగాధమైన అప్రాకృత దైవభావమును చింతించుటకున్నూ, ప్రాయుటకున్నూ నిశ్చల నిర్మలహృదయము అత్యవసరము

865 జనులకు దారిచూపువాడు ముందుగా నడవవలయును గాని వెనుక నడచే విధానమెట్లు లేదో ఆలాగున లోకములో మార్గదర్శులై ఉండవలసినవారు ప్రతి కార్యములోను తామనుష్ఠించి చూపవలసిన వారుగా నుందురని మరువకూడదు అట్లుచేయువారు అరుదైనందుచేతనే జ్ఞానములోను, ధర్మములోను లోకము వెనుక పడిపోవుటకు కారణమైనది ముఖ్యముగ గురువులై ఉండవలయునని తలంచువారు ఈ సత్యమును

ఎల్లప్పుడు జ్ఞప్తిలో నుంచతగినది

866 మనుజుడు అన్నిటిలోను శుద్ధాత్ముడు, నిర్దోషిగా నుండవలసియుండిన అనేక సంస్కారములు అనేక పరిణామములు పొందవలసియుండును ఒకానొకప్పుడు ఒక కూలిపని వానితో కొంత ఉద్రేకముగ మాట్లాడినప్పుడు అతడున్నూ కొంత కోపముతోనే సమాధానము చెప్ప ప్రారంభించెను ఇదివరలో అతడు ఎంతో భయభక్తితో మాట్లాడేవాడు దీనిని గ్రహించి అతనియందు గల లోపము తనదేయని గ్రహించుకొనడమైనది ఇదే మోస్తరుగా మరియొక కాలమున ఇంకొకడును ఆలాగే చేసెను తరువాత వారు ఎంతో పశ్చాత్తాపము గలిగి దీన భావము నొంది దుఃఖాక్రాంతులైరి దీనివల్ల వారికి ఉద్రేకము కలుగుటకు తానే కారణభూతమని తలంచి తన స్వభావమును మార్చుకొనుటకు ప్రయత్నించడమైనది ఇది గొప్పవిజ్ఞులైన వారికికూడ అప్పడప్పుడు గలుగుచుండెడి స్వభావము కావున గౌరవనీయులై ఉండ తలంచువారు తన గౌరవమును తాను నిలపెట్టుకొనేలాగన చూడవలయును లేనిచో అగౌరవము కలుగుట నిక్కము విషామృతములు రెండున్నూ మానవుని నాలికయందున్నవి ప్రతిధ్వని గలిగెడు స్థలములో తానేది మాట్లాడునో అదే మరల తాను వినేలాగున ప్రతిధ్వనించును ఈసత్యమెరింగిన చాలును ఈఉపాధికిన్నీ యీలాగున ఒకటి రెండు సార్లు సంభవించెను

867 సత్త్వగుణము తీపి, రజోగుణము పులుపు, తమోగుణము చేదు ఎవరైనను చదువునప్పుడు, మాట్లాడునప్పుడు, ఉపన్యసించునప్పుడు జనులకు శాంతియు ప్రీతియు గలుగుచున్నదా? లేక అశాంతియు, ఉద్రేకము ఏర్పడుచున్నదా? అట్లుగాక క్రూరత్వమున్నూ, కోపమున్నూ జన్మించు చున్నదా? అని చూచుకొని తనవాక్యమును భావమును మార్చుకొన వలయును సత్త్వగుణము గలవారి వాక్యము మధురమున్నూ, రజోగుణముగలవారి వాక్యము ఉద్రేకమున్ను, తమోగుణముగల వారి వాక్యము విరోధమున్ను, శత్రుత్వమున్ను గలుగజేయును కావున

స్వభావమును మార్చుకొనుట చాలా ప్రయాసముచేతనే సాధ్యపడును అప్పుడప్పుడు తనకు తెలియకనే స్వభావము ఆవిర్భవించును తానే కనిపెట్టి రజోగుణ తమోగుణములను బయటికి రానీయక అణచిపెట్టుచుండ వలయును

868 ప్రపంచములో రెండు విధములగు దొంగలు కలరు ఒకడు తెలియక అపహరించువాడు, రెండవవాడు తెలిసి అపహరించువాడు తెలియక అపహరించువాడు మామూలు దొంగ, తెలిసి అపహరించువాడో స్తోత్రములు చేసి లేనిపోని వర్ణనలుచేసి జనులను ఉప్పొంగించి అపహరించువాడు కావున సత్యబుద్ధిగలవాడు, ధర్మనిరతుడు, సంయమశీలుడు లేని పోని స్తోత్రములు చేయువానికి ఎప్పుడున్నూ లోపడకూడదు బట్టరాజులు, కొందరు కవులు ఈలాగుననే జనులను వశపరచుకొనెదరు కావున సంయమశీలుడు ఈ విషయములో ఎల్లప్పుడున్ను మిక్కిలి జాగ్రత్త గలిగి యుండవలయును

869 సంచిత, అగామి, ప్రారబ్ధములని కర్మలు ముత్విదములు పూర్వజన్మకర్మలో నుండి వర్తమానజన్మమున అనుభవించుటకు ఏర్పడిన దానిని ప్రారబ్ధమనియు, పూర్వజన్మలో నిల్వయుండు కర్మమునకు సంచితమనియు, వర్తమానమున చేయు కర్మఫలము ఆగామి యనియు చెప్పదురు ఒకడు విషముగాని, అమృతముగాని భుజించిన తరువాత దానిచే కలిగెడు సుఖదుఃఖములు మార్పుచేయుటకు సాధ్యము గాదు ఇటువంటిదే ప్రారబ్ధమనంబడును అనేక జన్మములలోనుండి నిలుచుచుండు కర్మకు సంచిత మనిపేరు నోటిలో నుంచుకొనియుండు పదార్థమునకు ఆగామియని పేరు మ్రింగిన అమృతముగాని విషముగాని ఉదరములో మనకు మార్పు చేయుటకు శక్తిలేనట్లు ప్రారబ్ధముండును తత్త్వజ్ఞానమ్హృదయమై కర్తృత్వము నశించునపుడు సంచితము వదలిపోవును ఆగామికర్మ మన హస్తగతముగ స్వాధీనమందున్నది అది నోటిలో పెట్టియుండు పదార్థమువంటిది తనయిష్టానుసారముగ మ్రింగవచ్చును

లేక ఊసివేయవచ్చును  అలాగున కర్మఫలాసక్తి ఉండిన మాత్రమే ఆగామి కర్మ ఫలించును  కర్మఫలాసక్తి లేక నిష్కామబుద్ధితో చేయు కర్మ ఆగామి ఫలమును గలుగచేయదు  అట్లుగాక బ్రహ్మజ్ఞానాగ్ని ప్రజ్వలించినచో వేగిన విత్తనమువలె  ఆగామికర్మ ఫలమును కలుగచేయదు  ఇట్టి జ్ఞానాగ్ని వెలుగువరకు కర్మబీజము ఫలమును కలుగచేయును

870  సోదరులారా! సోదరీమణులారా! మీరు దేహమును మాత్రము ఆశ్రమములో మఠములలో నుంచి, మనస్సును మాత్రము సంసారములో గృహములో నుంచేలాగున యత్నించవలదు  హృదయమును మఠములోను, దేహమును గృహములోను నుంచేలాగున చూడుడు  అలాగుననుండిన శాంతి నొందగలరు  లేనిచో అశాంతినే అనుభవింపగల్గుదురు  అలాగున దేహమును సన్న్యాసచిహ్నములగు కాషాయాదులచే అలంకరింప జూడకుడు  హృదయము మాత్రము సన్న్యాసిఅనుష్ఠానములకలదిగా చేయుటకు యత్నింపుడు  అట్టిన పరమ నిర్వాణమును పొందుదురు  లేనిచో క్లేశమునే పొందుదురు  అలాగున దేహమును మాత్రము ఏకాంతమున కూర్చుండబెట్ట తొందరపడవద్దు  ఏకాంతమున నుండియు అనేక సంకల్పములు కలిగియుండుటకన్న గ్రామములోనుండి మనస్సును ఏకాగ్రత పరచినచో పరమశాంతిని పొందగలరు  దీనివల్ల మఠనివాసముగాని, సన్న్యాస ఆశ్రమముగాని, ఏకాంతవాసము గాని అవసరము లేదని భావించకూడదు  దానికి తగిన హృదయపరివర్తన ముండినచో శ్రేయస్సును కల్గచేయును  జనకుడు దేహమును గృహస్థాశ్రమములో నుంచినను హృదయమును సన్న్యాస నిలయము చేసినందుచే విదేహకైవల్యమును పొందెను  భరతమహారాజు శరీరమును వనమున ఏకాంతముననుంచియు హృదయమును ప్రపంచవిషయమగు జింకను చేసినందుచే మరల లేడిజన్మము పొందవలసివచ్చెను  శుద్ధాత్ములు కాతలంచువారికి దీనికన్న గొప్ప ఉపదేశము అక్కరలేదు  దేహము భూమివంటి దనియు, హృదయసంస్కారము బీజము వంటిదనియు, భూమి యిచట అప్రధానము గాను, సంస్కారము విత్తనము

వంటిదిగాను ఉండుననియు మరువకుడు ఈ వాక్యమును పై జెప్పిన మూడింటికిని సమన్వయపరచు కొనవలయును

871 ప్రపంచములో రెండువిధములగు మిత్రులు గలరు వారిలో ఒకడు బాహ్యమున మిత్రుడుగాను, అంతరంగమున శత్రువుగా నుండును రెండవవాడు బాహ్యమున శత్రువుగాను అంతరంగమున మిత్రుడుగా నుండును తన మిత్రుడు చేయు దుష్కృత్యములను చూచి ఆమోదించి యుండువాడు బాహ్యమిత్రుడు అంతరంగమిత్రుడనువాడు తనమిత్రుడు చేయు దుష్కృత్యములనుచూచి సహింపజాలక సవరణచేయుటకు యత్నించును ఏలన మిత్రుడు చేయు దుష్కృత్యములచేత భావికాలమున అతడు తప్పక పతితుడగును కర్మఫలము అనివార్యమను దర్మబుద్ధిగల వాడగుటచేత మిత్రునికి అపాయము కలుగకూడదని తలంచి యత్నించువాడుగా నుండును నిక్కముగ ఇతడే యథార్థమైన మిత్రుడుగా నుండును తక్కిన వాడు శత్రువే యగును ఈ విషయమై రావణాసురుని చరిత్ర తార్కాణము రావణునియొక్క దుష్టకృత్యములు చూచి విభీషణుడు తన అన్నకు రాబోవు అపాయమును గ్రహించి జాలిగలిగి యెంతో ధర్మమును చెప్పెను కాని రావణాసురుడు విబీషణుని శత్రువుగా దలంచెను కుంభకర్ణ నుషేణులు రావణాసురుని దుష్టకృత్యముల చూచి ఆమోదించి సంతోషమును వెలిబుచ్చిరి రావణేశ్వరుడు ఈ ఉభయులను మహామిత్రులుగా తలంచెను కట్టకడకు గలిగినఫల మేమియో తెలుసుకొన్న చాలును కావున తన మిత్రుని దుష్కృత్యమునుండి ఉద్ధరించుటకు తలంచువాడే యథార్థముగ మిత్రుడగును తక్కిన వానిని నిజముగ మిత్రరూపముగా నుండు శత్రువుగా నెరుంగవలయును

872 ప్రపంచములో మలినబుద్ధిగలవారనియు, శుద్ధబుద్ధి గలవారనియు ఇరుతెగల మానవులు గలరు వీరలను బాలురుగాను, వయసుస్సులోనుండువారుగాను గ్రహించుకొనవచ్చును రోగముతో నుండువానికి వైద్యుడు చేదుమందున్ను, కఠినపథ్యమున్ను పెట్టునపుడు

మలినబుద్ధిగలవాడు లేక బాలుడుగానుండువాడు వైద్యునిపై అనిష్టబుద్ధి గలిగియుండును వానికి హితమైన పెరుగువడ, అలువ మొదలగునని పెట్టువానిపై నిష్టము గలగియుండును అలాగున ఒక్కని యందుగల దుర్వ్యసనములను తొలగించుటకు యత్నించువారిపై విరోధమున్ను, అట్టి దుర్వ్యసనములను ప్రోత్సహించువారిపై ప్రీతియున్ను గలవాడు మలిన హృదయుడనియు, పిల్లవానివంటివాడనియు గ్రహించుకొనవలయును తనలో గల దుర్వృత్తులను తొలగించుటకు యత్నించువానిని, మంచి పథ్యము ఏర్పరచి రోగతీవ్రతను అణచుటకు తీక్ష్ణ ఔషధముల నిచ్చెడు వైద్యుని వంటివానిగా తలంచువాడు, నిర్మలహృదయుడున్ను, మంచి వయస్సుగలవాడుగను దూరాలోచన గలవాడుగను ఉండునని తెలుసుకొనవలయును పథ్యముపెట్టు వైద్యుడు తన భావిశ్రేయస్సును కోరువాడుగను, జిహ్వాచాపల్యము కొఱకు పైచెప్పిన పదార్థములు పెట్టువాడు తన శ్రేయస్సు కోరని వాడుగను, నాశమును తలంచు వాడుగను నుండునని గ్రహించు కొనేవారే విజ్ఞులు తక్కినవారిని అజ్ఞులుగా గ్రహించు కొనవలయును

## ఉత్తమవిద్యార్థి లక్షణములు

873 1 పాఠశాల తెఱచుటకు ముందుగా వెళ్ళుటయు, పాఠశాల మూసిన తరువాత వచ్చుట గలిగియుండవలయును

2 పాఠశాలనుండి వచ్చిన తరువాతను, పాఠశాలను వెళ్ళుటకు ముందుగాను పాఠములను స్వయముగ చదువుట గలిగియుండవలెను

3 నిరాడంబరముగాను, శుద్ధముగానుండు వస్త్రధారణ గలిగి యేలాటి శృంగార చిహ్నములుగాని దుర్వ్యసనములుగాని లేకుండా నుండవలయును

4 సాధ్యమైనంతవఱకు నియమిత ఆహారము నియమిత కాలమున నియమముగా భుజించు స్వభావము గలిగి యుండవలయును

5 తనకన్న నెక్కు శ్రద్ధయు, గుణయోగ్యతయు గలవారి సహవాసము మాత్రమే చేయవలయును

6 వినోదనాటకాదులు చూచుటకు వెళ్లకూడదు

7 బ్రహ్మచర్యమున కేలాటి పతనము గలుగని స్థలములో మాత్రమే నివసించవలయును

8 చిన్నస్థితిలోనుండి పరిశ్రమచేత నున్నతస్థితిబొందిన వారి చరిత్రమును చదువవలయును

9 తనజీవిత మేదో యొక యున్నతాశయమును సాధించుట కీశ్వరుడిచ్చినట్లు సదా భావన కలిగి యుండవలయును

10 సోమరుల, తిండిపోతుల, సమయమును వ్యర్థముగా వ్యయపఱచు వారలసహవాసము ఎప్పుడును చేయరాదను వ్రతమును బుని యుండవలయును అట్టివారిని చూచిన తన ఆత్మోన్నతికి పరమశత్రువులుగా తలంచవలయును బీదవిద్యార్థియైనను, సాధ్యమైనంతవఱకు పరవస్తుపరిగ్రహమును వర్జించవలయును పరిగ్రహముచేత పుణ్యము క్షయించును ఈదశగుణములు పాలించువాడు దశ దిక్కులలోను యశస్సును, శాంతిని, పూజ్యతను పొందగలుగును దశదిక్కులలో భూమియు ఆకాశము గలిసి యున్నవి కావున ఇహమందును పరమందును అతడు పూజ్యుడు కాగలడు

## ఉత్తమ విద్యార్థి కానివాని లక్షణము

874 1 పాఠశాల తెఱచిన పిమ్మట ఆలస్యముగా వెళ్ళుటయు, పాఠశాల మూయుటకు ముందుగా వచ్చుటయును స్వభావముగా గలిగి యుండును

2. పాఠశాలకు వెళ్ళుటకు ముందుగాని, పాఠశాలనుండి వచ్చిన పిమ్మటగాని పాఠ్యగ్రంథముల సంచి విప్పనే విప్పడు

3 శృంగారములగు వస్త్రములను దరించుచు దుర్వ్యసనములను కూడియుండును

4 ఆహారాది నియమములను పాటింపడు

5 తనకన్న తక్కువస్థితిలోనుండు సోమరుల సహవాసము సదా కోరుచుండును అది వానికి పరమానందముగా తోచును

6 వినోదనాటక సినిమాదులకును, కాఫీహోటలుకును వెళ్ళుటకు మిత్రులకు డబ్బుసహాయము చేసియైనను తీసికొనిపోవును

7 బ్రహ్మచర్య సంరక్షణ విషయమై యేలాటి శ్రద్ధయును వహించడు

8 లోకోద్ధారకులగు మహాపురుషుల జీవితచరిత్రము చదువక, శృంగారమైన నవలలను చదువుచుండును

9 జీవితముయొక్క యుద్దేశ్య మేదియో కొంచమైనను విచారము జేయడు

10 సోమరులను, తిండిపోతులను, సమయము వ్యర్థము చేయువారిని చూచిన పరమమిత్రులుగా తలంచును ఈదుష్టలక్షణములు గలవారు ఇహములోను, పరములోను దుఃఖమును పొందుదురు వారిజీవితము వారికే మహాభారముగా తోచును మాతాపితరులకు సైతము సదా క్లేశమునే కలుగజేయుదురు పరీక్షలో తప్పిపోవుటచేత దేశాంతరము పారిపోవుటయో కట్టకడకు ఆత్మహత్య చేసికొనుటయో జరుగుచున్నది

875 ఒకడు విద్యుచ్ఛక్తి దీపములను వెలిగించుటకొరకు గొప్పసమాజములో అనేక రకములైన సుందరమైన బల్బులను ఒనర్చినాడు అయితే విద్యుచ్ఛక్తితీగతో జాయింటు చేయలేదు ఏమి ప్రయోజనము? దీపము వెలుగలేదు అంధకారమయము ఆలాగున ఒకరు అనేక శాస్త్రములు చదివినను, బ్రాహ్మణవంశములో జన్మించినను, యత్యాశ్రమము స్వీకరించినను, మంచిపేరు రూపము గల్గియుండినను ఎవరిని మనస్సు

దివ్యశక్తి స్వరూపమగు పరమాత్మలో ఐక్యము కాలేదో అతని హృదయము అంధకారమయమై వుండును ఇచటనే అనేకులు మోసపోవుచున్నారు

876 కారుచీకటిలో నడుచువానిముందట ఒక మంచిలైటును పట్టుకొని ఒకరు వెళ్ళుచుండిన లేక తనచేతిలో ఒకమంచి దీపముండిన చీకటి ఏలాగున తొలగిపోవునో, మార్గము కనిపించునో, ఏవిధమైన ప్రమాదము లేకను, మార్గము తప్పక గమ్యస్థానమును చేరగల్గునో ఆలాగున మాయాందకారమగు ఈప్రపంచములో అపాయము లేక గమ్యస్థానము చేరవలసియుండిన ఈశ్వర కరుణయను దీపము పట్టుకొని వెళ్ళేవాడు కాని లేక తనయొక్క స్వప్రకాశ జ్ఞానోదయముగాని కల్గినవాడు మాత్రమే ఋజుమార్గమున ప్రమాదము నొందక మోక్షపదమును చేరగల్గును దీపములేనిచో పండితుడైనా ఏమి, బ్రాహ్మణుడనా ఏమి, సంన్యాసియైనా ఏమి అపాయము నొందక గమ్యస్థానమును చేరగల్గునా? దీపముండిన విద్యలేనివాడైనను, తక్కువ జాతిలో పుట్టినవాడైనను, స్త్రీయైనను నిరపాయముగా గమ్యస్థానమును చేరినట్లుండును

877 స్కూలులో నియమానుసారముగా వెళ్లి నియమప్రకారము చదువువాడు క్రమముగ పరీక్షలో నుత్తీర్ణుడై మాస్టరుస్థానమును పొందగల్గును అట్టి వాడు ఉపాధ్యాయుడైనను పూర్వము తానను సరించుచూ వచ్చిన పద్ధతినెట్లు ఆచరణములో నుంచునో, అట్టిన మాత్రమే విద్యార్థులు తనవలెనే గాగలరని తలంచి ప్రవర్తించునో ఆలాగున ముముక్షువైనవాడు గురుకులమున గురుదేవునివద్ద సాధనలు నేర్చుకొనిన పిమ్మట గురుస్థానములో అచ్చటగాని మఱియొక స్థానములోగాని యుండుట కర్తవ్యత గలుగును అత్తరి తాను అభ్యాసకాలమున నెట్లుండెనో, అది జ్ఞప్తిలోనుంచి ప్రవర్తించిన మాత్రమే తన భక్తులు, శిష్యులు తనవలెనే గాగలరని తలంచి ప్రవర్తించును ఇదియే ఋషిపారంపర్యధర్మము అట్లుగాక కొందరు విద్యార్థులు పరీక్షలో నుత్తీర్ణులైనను ఉపాధ్యాయవృత్తిని అవలంబింపక యుండువారు పూర్వము తాను విద్యాభ్యాస

కాలముననుండిన నియమమును పాటింపక వర్తింతురు ఇట్టివారు ఉపాధ్యాయపదవికి అర్హులు కానేరరు ఆలాగున కొందరు ముముక్షువులు గురువుల నాశ్రయించి ముక్తులైనను ముముక్షావస్థలో నుండిన నియమములను పాలింపక పోయినచో గురుస్థానమున కర్హులు గారు ఈ సత్యమును ముక్తులై గురుస్థానములోనున్నవారు మరువకూడదు అదియునుగాక నియమములేని యుపాధ్యాయుల వద్ద ఎట్లు విద్యార్థులు చేరరో, ఆలాగున అనుష్ఠానము సరిగా లేనివారు ముక్తులైనను ఉత్తమశిష్యులెవ్వరు వారిని చేరరు మంచి నియమ నిష్ఠగల ఉపాధ్యాయుని దగ్గర శ్రేష్ఠగుణములు గల విద్యార్థులెట్లు చేరెదరో ఆలాగున మంచి ఆచరణగల గురువుద్ధగరకే ఉత్కృష్ట గుణములు గల ముముక్షువులు చేరెదరు ఈ సత్యమును గురువులైనవారు మరువకుందురుగాక!

**ఉపదేశామృతము-సమాప్తము**

**ఓమ్ తత్ సత్ ఓమ్**

